| కృతి కర్త | కృతి భర్త |
| --- | --- |
| ప్రొ॥ డా॥ పి తిరుమలరావు | రాష్ట్రపతి ఆర్ వెంకటరామన్ |

పద్మ భూషణ్ ప్రధానము

| గ్రంధ కర్త | భారత రాష్ట్రపతి |
| --- | --- |

# భావ తరంగాలు

# మా తరం కథ

పద్మభూషణ్

ప్రొ॥ డాక్టర్ పి. తిరుమలరావు



ప్రచురణ

Cultural Renaissance Society of India
International

కల్చరల్ రినైసాన్స్ సొసైటీ ఆఫ్ ఇండియా
ఇంటర్‌నేషనల్

హైదరాబాద్ - 500 038 (A.P)

మా తరం కథ
పద్మభూషణ్
ప్రొ॥ డాక్టర్ పి. తిరుమలరావు



వెల
రూ.150/-

డి.టి.పి. టైప్ సెట్టింగ్
ప్రోసెస్ & ప్రోసెస్, హైదరాబాద్

ముద్రణ
మనోరూప ప్రోసెస్
రామకోఠి, హైదరాబాద్

ప్రచురణ
కల్చరల్ రినైసాన్స్ సొసైటీ ఆఫ్ ఇండియా
ఇంటర్నేషనల్
263/3RT, సంజీవరెడ్డి నగర్
హైదరాబాదు - 500 038.
Tel · 260263

ప్రతులకు
విశాలాంధ్ర బుక్ హౌస్
బ్యాంకు స్ట్రీట్
హైదరాబాద్ - 500 001.

# UNIVERSITY OF HYDERABAD

**Prof. Bh.Krishnamurti**
B A Honors (Andhra), A M , Ph D (Pennsylvania
Vice-Chancellor
Central University P O
Hyderabad - 500 134

## గ్రంథ పరిచయం

ఇరవయ్యో శతాబ్ది పూర్వార్ధం మనదేశ చరిత్రలోను, జాతి జీవన పరిణామంలోను ప్రధానమైంది. బ్రిటిషు పాలన ఒకవైపు స్థిరపడుతున్నది, మరోవైపు జాతీయ భావవాయువులు ఆసేతు శీతాచలం వీస్తున్నాయి. రెండు ప్రపంచ యుద్ధాలు వాటి దుష్ఫలితాలు పరోక్షంగా మనదేశంమీద పడ్డాయి. 1915లో గాంధీగారి ప్రవేశంతో మొదలైన జాతీయోద్యమం మరి మూడు దశాబ్దుల్లో విజయోన్ముఖమైన జాతీయ సంగ్రామంగా పరిణమించింది. వీరేశలింగంగారి ప్రయత్నంతో సంఘ సంస్కరణోద్యమాలు ఆంధ్ర రాష్ట్రంలో వ్యాపిస్తున్నాయి. గ్రాంథిక వ్యావహారిక భాషోద్యమాల్లో గ్రాంధికానికి మొదటి గెలుపు వచ్చినా రచయితలు వాడుక భాషలోనే రాయటం మొదలుపెట్టారు. హెడ్మాస్టరు నుంచి గవర్నర్ దాకా అధికార పదవులన్నీ ఇంగ్లీషు వాళ్ళ చేతుల్లోనే ఉండేవి. అవి క్రమంగా భారతీయులకు సంక్రమించటం ఈకాలంలోనే ఆరంభమైంది. దేశ భాషల్లో విద్యాబోధన 1920 ప్రాంతంలో మొదలైంది. జమీందారీలు నడుస్తున్నా విజ్ఞుల్లో సంస్కరణ భావాలు రేకెత్తుతున్నాయి. చరిత్ర మారుతున్న ఈ సంధికాలంలో మన రాష్ట్రంలో ఒక ప్రాంతానికి, కొన్ని కుటుంబాలకూ పరిమితమైన సామాజిక చరిత్ర 'మా తరం [illegible] ప్రధాన వస్తువు

'మా తరం కథ' డా॥ తిరుమలరావుగారి స్వీయచరిత్ర గాదు, మరొకరి జీవిత చరిత్ర గూడా కాదు, వారి కుటుంబ వ్యవహారాలతో మేళవించిన ఆకాలపు ప్రజా జీవితం. విషయం పరిమితమైనా విశ్లేషణ విస్తృతమై – కొండను అద్దంలో చూపించినట్టు – అందరికీ విజ్ఞానం, ఆహ్లాదం కలిగేట్టు ఈ పుస్తకాన్ని రచించారు డా॥ తిరుమలరావుగారు. ఇలాటి రచనలు తెలుగులో అరుదు.

డా॥ తిరుమలరావుగారు రాజమండ్రిలో 1915లో జన్మించారు. వారు సాంప్రదాయికమైన సంపన్న కుటుంబంలో పుట్టినా మొదటి నుంచి అభ్యుదయ భావాలుగల వ్యక్తిగా పెరిగారు. వారి బాల్యావస్థ తప్ప, ఇతర జీవిత విశేషాలు ఈ పుస్తకంలో కనిపించవు. పూలలో దారంలాగా స్వీయజీవిత విశేషాలను మరుగున ఉంచి సన్నివేశాలకు, అనుభవాలకు, తనను ప్రభావితం చేసిన ఇతర వ్యక్తుల జీవిత విశేషాలకు ఈ రచనలో ప్రాధాన్యం ఇచ్చినట్టు కనిపిస్తుంది.

కోస్తా ప్రాంతంలో ఉన్న పల్లెల, పట్టణాల జనజీవితం (ముఖ్యంగా బ్రాహ్మణ కుటుంబాల్లో) మనకు కళ్ళకు కట్టినట్టు కనిపిస్తుంది. ఆనాటి ఉమ్మడి కుటుంబ వ్యవస్థ, పెళ్ళిళ్ళు, పేరంటాలు, మూఢవిశ్వాసాలు, బంధు ప్రేమ, భూస్వాములకూ రైతులకూ మధ్య జరిగే లావాదేవీలు, రాకపోకల వసరులు, డాక్టర్లు, రోగాలు, మందులు, ఆనాటి చదువులు – ఒకటేమిటి ఆనాటి సమాజ పరిస్థితి చదువుతోంటే ఇప్పటివాళ్ళకి అద్భుతాన్ని, ఔత్సుక్యాన్ని, జ్ఞానాన్ని కలిగిస్తుంది. నేను డాక్టరుగారి తరం చివరి భాగంలో పుట్టిన వాణ్ని అయినా నాకేంత చదువుతుంటే ఎంతో ఆహ్లాదం కలిగింది. పల్లెటూళ్ళ జీవితం, పొలాలు బొట్రలు ఉన్నవాళ్ళ సమస్యలు నాకు అపరిచితాలు. అయినా ఇది చదివినప్పుడు నా బాల్యావస్థకు తిరిగి, మజిలీ చేసినట్టు అనిపించింది.

డా॥ తిరుమలరావుగారి భాష చాలా సుగమంగా, సరళంగా మాట్లాడుతున్న తీరులో ఉంటుంది, నుడికారాలు సామెతలు కుప్ప

తిప్పలు, తెలుగు భాషాసాహిత్యాల మీద వీరికున్న అధికారం, చారిత్రక విశ్లేషణలో వీరికున్న చొరవ, ఈ రచనలో స్పష్టంగా కనిపిస్తాయి.

నా చిన్నప్పుడు 'ఎమ్‌డన్' అనేమాట శ్రేష్ఠతావాచకంగా వాడేవాళ్ళు, అంటే 'తిరుగులేని' అని, ఉదా. వాడు 'ఎమ్‌డెన్ గుండు', 'నీపని ఎమ్డన్‌గా ఉంది'. ఈ పుస్తకం చదువుతుంటే ఈ మాటకు అర్థం ఎలావచ్చిందో తెలిసింది.

"జర్మనీవాళ్ళు 'ఎమ్‌డెన్' (Emden) అనే సబ్‌మెరైన్ ద్వారా మద్రాసువరకూ వచ్చి యథేచ్ఛగా మద్రాసు నగరంమీద మరఫిరంగి గుండ్లు విచ్చలవిడిగా కురిపించి వెళ్ళిపోయారు. అందులో ఒక గుండు మద్రాసు హైకోర్టు భవనానికి తగిలి ఒక గోడకూలిపోయింది... (దీనికి) ఆనవాలుగా ఒకరాతిఫలకం ఆగోడకు తాపడం చేశారు" (పుట 10)

ఈ సంగతి మొదటి ప్రపంచయుద్ధం చివరి రోజుల్లో జరిగిందట. అప్పటినుంచి ఆమాటకు అర్థపరిణామం వచ్చి కోస్తా జిల్లా వాడుకలోకి పాకింది.

'కన్యాశుల్కం' నాటకం చదివినా చూసినా 19వ శతాబ్దపు ద్వితీయార్ధంలో పూర్వాంధ్రంలో ఉన్న జనజీవితం మనకు తెలుస్తుంది కాని, గురజాడవారి పాత్రలు కల్పితాలు. ఆనాటి వ్యక్తులకు అవి ప్రలబా 'మా తరం కథం' ఈ శతాబ్ది మొదటి నలభై ఏళ్ళ ప్రజా జీవితానికి ప్రతీక. దీంట్లోని పాత్రలు నిజమైన వ్యక్తులు.

ఈ తరం వాళ్ళంతా 'మా తరం కథ' తప్పక చదవాలని నా మనవి.

అక్టోబరు 18, 1991

బూదరాజు రాధాకృష్ణ

# PREFACE

Dr Prof. P Tirumala Rao's latest literary venture is 'MAATARAM KATHA' (The Story of My Generation) which is an engaging story with literary flavour, historical in its frame-work and autobiographical in treatment. Milton's definition of a book as "the precious life blood of the master's spirit" is specially applicable to this book in which every Chapter is suffused with the author's pleasing personality. In literature as in social life, what the author is, speaks louder than what he 'says' This being so, we should know something about the author before we proceed to analyse and evaluate the book

Dr. Tirumala Rao is a multi-dimensional man - a well-known freedom fighter, a popular medical practitioner, a prolific writer, the editor of a periodical, a poet, a musical composer and a self-less social worker. Besides, he is a public speaker of good standing His writings as well as his speeches are characterised by subtle wit and sparkling humour which will enliven even a dry-as-dust topic.

Essentially, Dr Rao is a humanist and a man of culture Under Mahatma Gandhi's leadership, he gave up a lucrative medical practice to join the freedom movement and court inprisonment. Even as a student of the Stanley Medical College at Madras he distinguished himself as a student leader, who did constructive work for the cause of education and welfare of the society besides participating in the national movement. However, when India attained independence he devoted his time and energy for medical practice and humanitarian work, while his contemporaries preferred to earn easy money or to worship the fickle goddess of political power.

As a pioneer in Pediatrics, Dr Rao was the first Professor in King George Hospital at Visakhapatnam with a proud, track record in the profession Most of the super specialists in that field today are his old students. Long before the Government of India conferred upon him 'Padma Bhushan', the public enthroned him in their hearts as **'Balabandhu'**. Likewise the title of "KALA SARASWATHY' was conferred upon him by his admirers in recognition of his contribution to the cause of Fine Arts Although he has passed the Psalmist's age of three score and ten, there is a spring in his gait and sparkle in his eyes

In this book 'Maa Taram Katha' (The Story of my Generararation), the author draws a picture of contemporary life (the present generation) which is a striking contrast to the by-gone days of the past. While presenting a

candid Camera-shot of the older generation with its high principles, noble values and splendid unselfishness, he points out the steep decline in the ethical standards of the contemporary society What has taken shape is a way of life which desensitizes and coarsens people, turns them towards temptation to make a fast buck and hijacks their social awareness to a consumer carnival of conspicuous spending

The Five-Star-Hotel culture and the cult of violence have become the modern shrines of worship.

When Gandhiji spread the message of contentment, thrift and selfless, service, the later-day leadership has proceeded in the reverse gear In his gentle and inoffensive manner, the author deplores the new generation trends of modern materialism and the observations of the so-called **'market economy'.** Wealth is concentrated in the hands of a handful of businessmen and industrialists It is not without a basis that Galbraith, the well-known economist, has said "In India the industry is sick but the industrialists are affluent". There is a parallel economy of black money furnishing with its nexus with political leaders Work and wealth of the nation are not within the reach of many who live below the poverty-line Newspapers are full of investigative or uninvestigated economic offences of business magnates, the flight of capital form the country and the secret accounts in Swiss Banks Power brokers and pampered musclemen rule the roost Howfar and fast we have retreated from Gandhism!

In two or three chapters Dr. Tirumala Rao, while discussing the politics and education of the by-gone generation, identifies plug points through which he injects moral standards and culture. In no unequivocal terms he condemns moral degradation and widespread corruption in politics, the rise of fundamentalism in religion and continuous mis education of our youth by our teachers and educational administrators. Politics has become a business and education has become an industry A new class of aristocracy has come to the fore as if from no where. A restratification of property has taken place The mixture bottle of society is shaken up till the sediment has floated to the top. We should emulate the example of pre-independence political leaders like Gandhi, C.R Das, Prakasam, Motilal Nehru, Tilak, Lajpatrai and the teachers who lived honest and dignified lives with a paltry salary of Rs. 30/-. There is urgent need to arrest the steady decline and eventual extension of these values which are now on the vanishing list.

Of Edmund Burke, the liberal British statesman, it was said "He gave to the party what was due to the country". We cannot level such a charge against Dr. Tirumala Rao Although he is a staunch Congressman

and an awardee of 'Padma Bhushan' (a coveted honour) from the Government, he does not look at the contemporary political scene, wearing tinted glasses or partisan blinkers. His patriotism and concern for the commonman makes him" speak the truth, the whole truth, and nothing but the truth". For example. he says, "Plans and democracy are not implemented in our country, in earnestness" He draws the reasons as attention to "Deceptive slogans, election manifestoes and "adulteration" (of goods and services).

Chapters with the following headings merit special mention·

'The Advantage of Educated Youth Settling in Villages'

'Titbits of My Childhood Days' I and II

'Medical Facilities 60 years Ago'

'Living, Became a problem '

'Teacher's Life'

'Is Gongura Synonymous with Andhras?

'The Then Farmers'

'The White Revolution'

'Education Then and Now'.

Dr. Tirumala Rao, being a reputed Physician provides not only 'diagnosis' of our social and political ills but also a 'prescription'. He recommends a synthesis of the traditional values with modern science and technology. But, he wants technology to be 'adapted' but not 'adopted' He sets his face firmly against excessive mechanisation and urbanisation. Without prejudice against any medical system, he recommends support to Ayurveda, Unani, Homeopathy and Allopathy. In the chapter on 'Hereditary-Diseases' and elsewhere he gives valuable advice for health care, sanitation, nutrition. He expresses his considered opinion that 'religion' and 'science' are not irreconcilable. His description of rural life with its closeness to nature and unsophisticated ways is refreshing to read.

There are heart-warming as well as mind-tickling episodes narrated at strategic points. In support of the integrity and honesty of the rural folk, we find, the touching example of the widow, a curd seller, who conscientiously repaid a 20-year old debt of her deceased husband'. This reminds us of Mahatma Gandhi's refusal to admit a certain person who tried to evade repayment of a long-standing debt taking shelter behind the Debt Relief Act'. The moral Law (Dharma) is greater than the statutes of the State.

We find experience - based on precepts like 'One should not lose his mother, when young and his wife, when old', 'Mother is the best teacher-like Gorky's Mother' which combine poignancy with pragmatism. In addition to any such autobiographical touches, the dacoit Kotappa's use of

the grand-father's horse, his father's nuptial rituals, his mother's coffee habit, the wedding, banquet in familiar style, Vallur Rajah's Kennel of dogs, the barber's, Madras hair dressing, his uncle sitting cross legged on the sofa at the marriage reception.

All things considered, the book is eminently readable, written in chaste, conversational Telugu, each Chapter carrying, a box containing an outline in English. The author has a style of his own flavoured with literary quotations. It is a piece of experimental writing in bi-lingual form. I am sure it will find favour with discerning readers.

I V. CHALAPATHI RAO
Formerly Registrar,
Central Institute of English
and Foreign Languages,
Hyderabad - 500 007.
Andhra Pradesh.

Dated 2-10-1991

# నా మాట

మా తరం కథ, నా జీవన ప్రవంతిలో ఒక తరంగం. ఈ భావ తరంగాన్ని 1971లో వర్ణించటం మొదలు పెట్టి, నేను పయనించిన, దారులలోని దృశ్యాలు, జీవన విధానాల వర్ణన మా తరం కథగా రూపొందింది. మా తరం వారు భారత స్వాతంత్ర్యానికి పూర్వం, తరువాత, జరిగిన ఎన్నో మార్పులను, అనుభవించిన తరువాత మాతరం వారి కథ ఈ తరంవారికి అందించాలనే కుతూహలమే నా కలంలోని బలం. ఈ వర్ణనకు ఒక వరుస, క్రమం లేవు కాని పూర్తిగా లేదనటానికీ వీలులేదు. 1915వ సంవత్సరంలో నేను జన్మించిన నాటి నుండి, నేటి వరకూ దాదాపు ఏడున్నర దశాబ్దాల జీవితంలో ఎన్నో మలుపులు తిరిగిన జీవితానుభవాలు, నాటి, నేటి, ఆర్థిక, సాంఘిక, కుటుంబ పరిస్థితులకు మాత్రమే పరిమితం చేశాను. రాజకీయాలను ఈ గ్రంథంలో తొంగిచూడనియ్యలేదు. స్వాతంత్ర్యం తరువాత వచ్చిన మార్పులు, మన దేశం ఎంత ప్రగతి పథంలో నడిచిందో, నడుస్తోందో మా తరానికి కళ్ళకు కొట్టొచ్చినట్లు కనిపిస్తూనే వుంది. అయితే ఈ ప్రగతి ఫలాలను ఇంకా, ముప్పది, నలుబది కోట్ల బీద ప్రజానీకానికి అందించాలనేదే మాతరం వారి ఆవేదన, అధికారంలో ఏ పార్టీ వారు వున్నా ఈ తరం వారి బాధ్యత అని మా నమ్మకం.

శ్రీ వెన్నెలకంటి సుబ్బారావుగారి జీవయాత్రా చరిత్రను ఇటీవల నేను చదివిన తరువాతనే ఇటు వంటి మా ఈ తరం కథల, ఉపయోగం చాలా అవసరమనిపించింది. శ్రీ సుబ్బారావుగారు 1784–1839 సంవత్సరాల మధ్య జీవించిన వారు. అంటే ఆనాడు ఈస్ట్ ఇండియా కంపెనీ వారి పాలన అన్నమాట. ఆ కాలం నాటి భారతదేశ పరిస్థితులను, ఆ గ్రంథం తెలుపుతుంది . ఆ పరిస్థితులు వినోదకరంగా ఈ నాడు కనిపిస్తాయి. వారు నెల్లూరు వాస్తవ్యులు. బ్రాహ్మణ వంశీకులు, వారు తమ జీవితయాత్రను ఇంగ్లీషులో వ్రాశారు. తెలుగు వారు స్వీయచరిత్ర రాయటానికి, అందులో

ఆంగ్లభాషలో వ్రాయటానికి ఆంధ్రజాతి రచయితలలోనే ప్రథమ తాంబూలం అందుకున్నారు. ఈ ఉద్గ్రంథాన్ని, తెలుగులోకి తర్జుమా చేసిన డాక్టర్. అక్కిరాజు రమాపతిరావుగారు మన భాషకే ఎంతో సేవ చేసిన వారయినారు.

శ్రీ సుబ్బారావు గారి తరంలో భారతదేశంలో సామాన్యులు అందరూ కాశీయాత్రలతో సహా పూర్తిగా నడకమీద సాగించవలసినదే. నెల్లూరు నుండి, మద్రాసు పోవుటకు, అయిదురోజులట! మద్రాసు నుండి రామేశ్వరం నెలరోజులట! అదా అనాటి ప్రయాణ సౌకర్యాల వివరణ – మరి ఈ నాటి సౌకర్యాల గూర్చి వేరే చెప్పనక్కర్లేదు – మధ్య రకంగా వుండేవి మాతరం ప్రయాణసౌకర్యాలు. కాశీ రామేశ్వర యాత్రలు నడిచి చేయటం వలన, అనేక రాష్ట్రప్రజలతో ముఖ పరిచయం, స్నేహం ఏర్పడి, మన జాతి ఐక్యతకు దోహదం చేస్తుంది. శ్రీ సుబ్బారావు నాలుగు వివాహాలు చేసుకున్నారు. బాల్య వివాహాలు, స్త్రీల అకాల మరణాలు, వాటికి కారణాలు. ఆయన ఆరోగ్య పరిస్థితులు అంతంత మాత్రమే – ఈ విధంగా వారి గ్రంధం ద్వారా వివరాలు తెలుసుకొన్న మీదట నా ప్రచురణ గురించి మరింత ఉత్సాహం నాలో కలిగింది.

ఒక భాషలోనే వ్రాస్తే తెలుగువారికే పరిమితమవుతుందని. ప్రతి ప్రకరణానికి ముందర ఇంగ్లీషులో సారాంశాన్ని ఇచ్చాను. ఈద్విభాషా ప్రచురణ ఒక నూతన ప్రయోగంగా భావిస్తున్నా.

విదేశాలలో వచ్చినట్లు 'గ్రంథప్రచురణ –నాగరికత' మనదేశంలోను, అందులో ఆంధ్రదేశంలోను, మంచి వ్యాపార సంస్థలుగా రూపొందక పోవటం చేత, అనేక మంచి గ్రంధాలు వెలుగు చూడలేకపోతున్నాయి. ఇంకా మన ప్రచురణకర్తాలు, కథలు, నవలలు, అందులో యువతరం వారిని ఆకర్షించే చవుకబారు ప్రచురణలకే పరిమితమై వుండటం చేత, ఎన్నో వ్యయప్రయాసాలకు లోనయి, గ్రంధకర్తలు ప్రచురణలు చేయవలసి వున్నది. ఈ ప్రచురణకూడా అలాంటి ప్రయత్నమే.

మా తరం వారి జీవన యాత్రలలోని ఒడుదుడుకులను ఈతరం వారు చదివి, ఈ తరంలో తమ అనుభవాలను తరిచి చూచుకుని, ఆనందింతురు గాక. సౌఖ్యం వున్నా శాంతిలేని తరంగా తాము భావించ వచ్చు. అయినా ప్రపంచశాంతి, నిరాయుధాకరణ ద్వారా, ఈతరం మంచి పునాదుల మీదనే ప్రారంభమయినదని చెప్పుకోవచ్చు, గాంధీజీ తర్ఫీదు ఇచ్చిన సత్యాగ్రహం, నిష్కామయోగం, అహింసామార్గం. అనుసరించిన, స్వాతంత్ర్య సమరయోధుల తరం మాది. భూతకాలం, వర్తమానానికి, వర్తమానం భవిష్యత్తుకు, పునాది. ఈతరం వారు బాధ్యతతో మాతరం కథ విని, వర్తమానాన్ని ప్రగతి పథంలో నడిపి, భవిష్యత్తులో శాంతి పర్వాన్ని స్థాపించి 'సర్వేజనాః సుఖినో భవంతు' అనే ఆశయానికి తమ జీవితాలను అంకితంచేయగలరని ఆశిస్తూ, ఆశీర్వదిస్తున్నాం, ఈ కథ ద్వారా !

ప్రొ॥ డా. పి. తిరుమలరావు.

# MAA TARAM KATHA
## The Story of My Generation

The experiences of my life were running like a Cinema reel in my mind for more than two decades. Our generation has passed through various phases of our nation's pre-independent and post-independent eras. The changes that have taken place practically in this 20th Century in the field of socio-economic, political and many other fields are by contrast dissimilar and ever changing in their pattern Better living with less mental peace, has been a feature during this period. This is also true in India in these two important pre-independent and post - independent periods.

A generation means a period of about 30 years. In a life of about 75 years, almost there would be two and half generations through which any one would pass through. It has been, my desire to present the life styles, mainly before and after independence. The expectations, ambitions and ideals have their own changes The life patterns in the rural parts and in the urban parts have constantly maintained their differences concentrating all the wealth in the towns and cities and leaving poverty to the villages and in the slums of the towns and the cities. It is due to the migration of the people to cities in search of a better living and in most cases for living itself. The ratio of population that lived in the villages and towns, remained almost 80: 20 constantly. The migration of population to cities continued, while there has been no honest effort to reverse this process even after Gandhiji carried the movement for self-sufficiency and economic liberation of th rural areas, involving the masses to make it effective.

I have presented the experiences of my life of this period as a story in the form of "Maa Taram Katha" (The Story of My Generation). The villages of my early childhood were without any system of communication. Lack of proper agricultural production, poverty striken massess were common features in all villages. People attributed all these to the foreign rule of the British, which was not even a century old by then. No one could disturb the traditional and cultural living styles basically in a society that was divided for many centuries into five castes, and many more big and small communities, though living in apparent harmony, as embodied in the philosphy of *"Sarve Janaa Sukhino Bhavanthu"* (let all people live in happiness), which has been a traditional expression in our prayers. During this century many social reformers, like Veeresalingam Pantulu and Brahmo Samaj attempted to eradicate the existing social evils like early child marriages, "Sati", caste distinctions etc.,

Gandhiji stepped in as a political leader of the nation in the year 1915 and liberated us by the year 1947. While we had spent the years in active struggle against British Rule, Gandhiji also concentrated, as part of his constructive programme, on the Khadi Movement (wearing Khadi and producing Khadi) which deprived the Biritish of Rs 60 ( sixty) crores of the exports of textiles from England to India. Gandhiji devoted to achieve Harijan uplift, liberation of women and various other constructive programmes, which included prohibition. Prohibition was later incorporated in the preamble of our Constitution, but in implementation, by-passed completely

Considerable and somewhat phenomenal or unprecedented progress has taken place in our Nation. We are self-sufficient in food, clothing and indistrial resources, to meet the minimum needs of the people. In the post-independent era, residential colonies in the towns and cities have increased. People are better clothed, communications ahve been established even to some of the remotest villages with nationalised transportation, through railways and road-ways, besides the air services linking the main cities of our nation

From a time when we had to see an aeroplane only as an exhibit, by paying a fee of 4 annas (25 paise), we have come to a stage of flying from city to city paying thousands of rupees. All these, landed our country in a 'Five Star Hotel' civilization confining the wealth to the first 10 to 20% of the population. All this affluence that is visible, on the surface only before our eyes, makes us feel rich. A good number of owner-driven automobiles represent a change from bullock-cart civilisation to a scooter and to oil civilisation. But, all this must percolate to the people who are below povery line who constitute nearly 31 percent or 315 millons out of the total 840 million people.

Without digressing into political problems, I tried to bring the social situations and changes that have taken place before our eyes, so as to benefit the present generation.

I presented the whole story in various villages, towns and cities, portrayed the systems of education, and the liberation movement. I have gone through, as a fredom fighter, with some inspiration. The visions of the pre-independent generation, who are freedom fighters, are yet to be realised. The present generation has to discharge ,its duties of administering the nation in a manner to beexemplary. We are to build a civilised society with improved economic and social changes of which, we,

as Indians, can be proud of. That is the main aim of this volume.

Hope the readers will refer this with interest as a novel and a long story, though it is neither a story nor a novel but a record of social changes that can form the basis to any number of stories and novels.

The social situations discussed in this book may be unbelievable even to-day, to the younger generation, specially to those living in comfortable urban situation. What would this situation be after fifty years? Hence, the need to write about the life styles of my generation!

Prof. Dr P. Tirumala Rao

## THANKS

A publication of of the kind of *'Maa Taram Katha'* by an individual is not only an effort but an enterprise! It needed help in many ways, academic, technical, financial and many other resources to publish a book of this kind with all the colours my heart desired

At the outset I must thank Dr Akkiraju Ramapathi Rao of Telugu Akademi, a scholar who critically researched into several famous bio-graphies and whetted the manuscript and brought the chapters into a presentable order

To Prof Dr Bhadriraju Krishna Murti, the Vice-Chancellor of Hyderabad Central University and Prof I V Chalapathi Rao, formerly Registrar of the Central Institute of English and Foreign Languages for their introduction and prefaces respectively Their kind appreciation gave me an academic and emotional satisfaction to my mind

Mr B. Subbarayan, former Secretary of A P Balala Academy, gave me full guidance and help in the intricacies involved in pre-press and press production of "Off-set printing" which is yet to take organised roots in the city of Hyderabad I thank him for his help in costing and execution of this publication

Mr Hari Adiseshu a veteran critic and scholar for his constant attention in the correction of press proofs and the patient proof reading but for whose help many printers' devils would have been dancing before the reader's eyes

To my wellwishers and friends who helped me financially, Mr Goli Eswarayya and Sons, Mrs. Leela Jyothi, Mr Paramanand Sanghi and a host of other friends who added generously to the needed funding

Mr. G N Bhushan, the creative-photographer who took innumerable photographs of me to help the selection of one thoughtful pose by the artist to decorate the cover page

Mr Goli Sivaram the Artist who did the imaginative design

for the cover page which added elegance to the volume

I bless my eldest daughter Mrs. K.V S Swarajyalaxmi who inspired me to bring this volume to light, seeing the manuscript lying untouched for two decades after the initial write up in the year 1971 itself

Mr Viju Kakatiya of Approach took the full co-ordinating responsibility of this publication and relieved me of both physical and emotional strain involved in any publication

The Printers have a big and skilled job to do. Mr A Sekhar of Process & Process and Ms B Amala the executive assistant in his office did the strenuous job of D T P Laser type setting

Mr Nagabhushanam of Manoroopa Process who did the processing and printing job

To my friends in Andhra Paper Mills Ltd , who made the paper available to me at a reasonable price

Many other friends who read the manuscript and encouraged me with their appreciation of the contents as of some historical value in presenting the social situations of my own generation to the posterity

# I

# మా తరం అంటే

# WHAT A GENERATION MEANS

A generation means about 30 years. But this is the story of practically the 20th Century as I have crossed 75 years being born in 1915 Many great men left their foot-prints on the sands of time Past is the foundation for the present and the present for the future. Hence, this attempt to portray the "STORY OF MY GENERATION".

ఒక తరం అంటే ముప్పై సంవత్సరాలు. అలాటి రెండున్నర తరాల వయసు దాటుతూ ఉన్న సమయంలో, నా జీవిత యాత్రలో జరిగిన ఘట్టాలను వర్ణించుకుంటూ, పాతకాలపు అనుభవాలను నెమరు వేసుకోవటంలో కొంత ఆనందం ఉంది. అందుకే ఈ సంకల్పం. ఇదీ *మా తరం కథ.*

కలికాలంలో మానవుని ఆయుః ప్రమాణం క్రీస్తువారి బైబిలు ప్రకారం'త్రీ స్కోర్ అండ్ టెన్' అంటే 20 × 3 = 60 + 10 = 70 సంవత్సరాలేనని ఆదేశించారు. అయితే ఈ కాలంలో శాస్త్రీయ జీవనవిధానం ద్వారా అభివృద్ధి చెందిన అన్ని దేశాలలోనూ 70, 75 సంవత్సరాలు సగటు ఆయుః ప్రమాణాన్ని మానవుడు సాధించాడు. మన పురాణ కాలపు యుగాల ప్రకారం త్రేతాయుగంలో అటు తర్వాత ద్వాపరయుగంలో కూడా అవతార పురుషులూ వారి సంబంధీకులూ కూడా దాదాపు కొన్ని వేల సంవత్సరాలు జీవించినట్లు ఆయా పురాణగాథలు చెపుతున్నాయి. ఇప్పుడు మనం ఉంటున్నది కలియుగం కదా! ఈ కలియుగంలో ఆ వేలు లేకపోయినా పై సున్నాలు కొట్టేసి నూరు సంవత్సరాలకు పరిమితంచేసి పెద్దలు చిన్నలను 'శతమానం భవతి శతాయుః' అని దీవిస్తారు. నూరేళ్ళు చల్లగా వర్థిల్లటమే ఈ యుగపు సగటు జీవన ప్రమాణం.

అంటే ఇందువల్ల ఏం తెలుస్తున్నది? నియమ బద్ధజీవితాన్ని పాటిస్తే గరిష్ఠ ఆయుః ప్రమాణాన్ని ఆరోగ్యంగా ఆనందంగా అలవోకగా అందుకోవచ్చునన్న మాట. అయితే 'జాతస్య మరణం ధ్రువం' అనేది అందరికీ తెలిసిన విషయమే. కాబట్టి అనివార్యమైన ఆ 'మరణాన్ని' కూడా సంతోషంగా స్వీకరించే మనస్తత్వాన్ని పెంపొందించుకోవడం మంచిదని మన వేదాంతం బోధిస్తున్నది. వేదాంత సారం ఇదే. అందుచేత ప్రస్తుతానికి మనం నూరు సంవత్సరాలు ఢోకా లేకుండా జీవిస్తాము, జీవిద్దాము అని ఆశ పడటం సముచితమే. ఈ ఆశతో ఈ తరం వాళ్ళం మనుగడ సాగిద్దాం. అందువల్ల ఇప్పటికి మనం రుచిచూసిన 75 సంవత్సరాల కాలమాన పరిస్థితులను ఆ కాలవ్యవధిలో వచ్చినమార్పులను సమీక్షించుకుంటూ రేపటి మార్పులకు ఎదురుచూద్దాం.

మన దేశంలో కూడా స్వాతంత్ర్యం వచ్చేనాటికి జాతీయ జీవన ప్రమాణం 31 సంవత్సరాలు మాత్రమే ఉండేది. అయితే స్వాతంత్ర్య సముపార్జన తర్వాత ఈ 44 సంవత్సరాల కాల ప్రవాహంలో సగటు ఆయుః ప్రమాణాన్ని 51 సంవత్సరాల వరకు వృద్ధి చేసుకున్నాం. అంటే ఈ లెక్క ప్రకారం కూడా ప్రస్తుతం శాస్త్ర సాంకేతిక విజ్ఞానప్రగతి మనకు సహకరిస్తుండగా మూడు పాదాలు గడచిన వయసంటే పండిన పండు అనుకున్నా ఇంకా తొడిమ

విడిచే స్థితి మాత్రం అదికాదనీ, పండిన పరువాన్ని ప్రకటించే స్థితిలో వున్న పండువంటి దశలోనే ఉన్నట్లుగానే భావించవచ్చు. ఇంకా పరిపక్వస్థితికి చేరుకుని చెట్టు ఆసరా విడిచి రాలిపోవటానికి మరో కొంతకాలం వేచి ఉండవచ్చునని శాస్త్రవేత్తలు ధైర్యం చెపుతున్నారు. అంతేకాక ఇప్పుడిప్పుడు నూరేండ్లు నిండిన వారి సంఖ్య కూడా పెరిగిందని వార్త లందుతున్నాయి. దీనితో మాతరం వారికి ఇంకా కొంత ఉత్సాహం పెరగటం సహజమేకదా! ఈ ఆసక్తితోనే "మా తరం కథ" ను సింహావలోకనం చేసుకుందామని నేను ప్రారంభించాను.

మా తరం కథలో ఒక పాత్రనైన నేను గొప్పవాడినని చెప్పుకోవటానికి కాదు ఆ ఆత్మావలోకనం. నేను గొప్పవాడిని కాకపోయినా గొప్పవారి పరిచయ భాగ్యం స్మరించుకోవటం ఒక రకంగా సంతోష ప్రదమైన విషయం. చరిత్ర సృష్టించిన వారి అడుగుజాడలలో నడవడం గొప్ప అదృష్టం. అటువంటి వ్యక్తి ఎంత సామాన్యుడైనా అతడి జీవితంలోంచి కూడా మనం గుర్తించవలసిన విషయాలు కొన్ని తప్పక ఉంటాయి అనే ఉద్దేశమే ఈ కథ రచనకు ప్రేరణ.

ఎందుకయ్యా ఈ రచన అని ఎవరైనా అంటే 'స్వీయ తృప్తి కోసం' అన్నదే వెంటనే నా దగ్గర లభించే సమాధానం. అంతేకాదు. ప్రతి తరం వారూ తరవాత తరంవారికి అందించవలసిన, నిర్దేశించవలసిన, ఆదేశించవలసిన సంగతులు, కర్తవ్యాలు, బాధ్యతలు కొన్ని ఉంటాయి. వీటిని భావితరాల వారికి అందజేయటం వర్తమానతరంలోని వారి బాధ్యత అయితే అందిపుచ్చుకోవలసిన బాధ్యత అటుతర్వాతి తరం వారిది. ఒక్క బాధ్యతే కాదు ఆత్రుత కూడా వాళ్ళు ప్రకటించాలి. ఈ ఆలోచన ఈ రచనకు శ్రీకారం. ఈ గుర్తింపు ఈ రచనకు ప్రేరకం. ఇది ఒకరకంగా సాహసమైతే ఆ సాహసానికి ఉత్తేజకర నేపథ్యం. గతం భవిష్యత్తుకు పునాది. ఇది అనాది.

# II

# మహోదయం

## MAHODAYAM -THE GREAT DAWN !

My birth in 1915 - the situation in Madras - 1st World War - Effect on Madras and other places. I was born on Sept 20, 1915 in Rajahmundry. It is a great cultural centre of Andhra - The year of Gandhiji's return to India from South Africa.

**1915** వ సంవత్సరం భారతజాతి చరిత్రలోనూ ఆ మాటకు వస్తే ప్రపంచ చరిత్రలోనూ చాలా ముఖ్యమైన సంవత్సరమనే చెప్పాలి. ఆ సంవత్సరంలో రవి అస్తమించని బ్రిటిష్ సామ్రాజ్యానికీ, జర్మనీ దేశానికీ మధ్య మొదటి ప్రపంచయుద్ధం ప్రచండంగా సాగుతున్నది. వలస రాజ్య విస్తరణ కాంక్షే ఈ యుద్ధానికి మూలకారణం.

ఇదే సంవత్సరంలో మన జాతిపిత మహాత్మాగాంధీ దాదాపు 21 సంవత్సరాలు దక్షిణాఫ్రికా ప్రభుత్వం చూపుతూ వచ్చిన జాతి వివక్షత సిద్ధాంతాన్ని

(అపార్థిట్) ప్రతిఘటించి అక్కడి భారతీయుల కృతజ్ఞతకు పాత్రుడై స్వదేశానికి తిరిగి వచ్చాడు.

ఆ ఉద్యమ సందర్భంగా గాంధీజీ ప్రపంచ చరిత్రలోనే పరపీడనను ఎదుర్కొనే ఒక గొప్ప ఆయుధాన్ని రూపొందించాడు. దానిపేరే సత్యాగ్రహం. ఆ తర్వాత మన దేశంలో స్వాతంత్ర్యోద్యమానికి నాయకత్వం వహించినప్పుడు గాంధీజీ దక్షిణాఫ్రికాలో అవలంబించిన సత్యాగ్రహాన్నే ఇక్కడ కూడా ప్రవేశపెట్టాడు. దక్షిణాఫ్రికాలో గాంధీజీ సాగించిన పోరాట గాథలు ఇక్కడ భారతదేశంలో కూడా ఆనాటి నాయకులను, ప్రజలను ఆకర్షించాయి. ఉత్తేజపరిచాయి. ఆయన సాధించిన సత్ఫలితాలను గూర్చి విని గాంధీజీని భారతీయులు గౌరవభావంతో చూశారు. అందువల్ల ఆయన 1915లో బొంబాయిలో దిగినపుడు ఆనాటి భారత జాతీయ కాంగ్రెస్ ఉద్యమ నేతలు గోపాలకృష్ణ గోఖలే, దాదాభాయినౌరోజీ వంటి వారు ఆయనకు స్వాగతం పలికారు. గాంధీజీ భారతదేశంలో ఆయా ముఖ్యనగరాలు సందర్శించినప్పుడు ప్రజలంతా ఆయనను చూడాలని ఉత్సుకులైనారు. గాంధీజీ అటు తర్వాత భారతదేశ ఆధునిక చరిత్రలో సత్యాగ్రహోద్యమ స్ఫూర్తిని నేల నాలుగు చరగులా వ్యాపింప చేశాడు. సహాయనిరాకరణం, త్రివిధ బహిష్కారం మొదలైనవన్నీ ఆయన మహోద్యమంలోని అంతర్భాగాలే. ప్రపంచ ప్రసిద్ధిని పొందిన భారత జాతీయ స్వాతంత్ర్యపోరాటానికి అంకురార్పణం జరిగి గాంధీజీ భారతీయ రాజకీయ రంగప్రవేశం చేసిన ఆ సంవత్సరం నేను జన్మించడం నాకు గర్వకారణము, హర్షదాయకమూ కూడాదా

1915వ సంవత్సరం సెప్టెంబర్ 20వ తేది రాజ మహేంద్రవరంలో నేను జన్మించానుట. మా నాన్నగారి పేరు ప్రాతూరి వెంకటసుబ్బారావుగారు. మా అమ్మ పేరు వెంకట లక్ష్మమ్మ. కాని మా అమ్మను అందరూ లక్ష్మడు అని ముద్దుగా పిలిచేవారు. మా నాన్నగారిని బంధుబలగం వారంతా సుబ్బయ్య అని వ్యవహరించేవారు. అయితే ప్రాతూరి వారి అన్నదమ్ముల ఉమ్మడి కుటుంబంలో ఇంకొక సుబ్బారావుకూడా ఉండడం వల్లా, అందులో మా నాన్నగారు ఈ ఇద్దరిలో పెద్దవారు కావడం వల్లా, కుటుంబంలోని వారు పెద సుబ్బయ్య అని, బయట వారు పెద సుబ్బయ్యగారనీ పిలుస్తూ ఉండేవారు. మా బాబాయి

సుబ్బారావుని 'చినసుబ్బయ్య' అని 'చినసుబ్బయ్య' గారనీ ఇంటా బయటా వ్యవహరించడం జరిగేది.

ఈ సుబ్బయ్య, లక్ష్మమ్మల సుపుత్రుణ్ణే నేను. అయితే మా కుటుంబంలో నేను చిన తిరుమలరావును. ఎందుకంటే మా పెదనాన్నగారి పెద్ద కొడుకు పేరు కూడా తిరుమలరావే కాబట్టి. ఆయనను మా కుటుంబంలోని వారంతా 'పెదతిరుమలరావు' అని పిలిచేవారు. అయితే చనువుగా పిలిచే వారు మా ఇద్దర్నీ 'చినతిరుమల' 'పెద తిరుమల' అని సంబోధించేవారు. దీని కంతకూ ఇంకో కార్యకారణసంబంధం కూడా ఉంది. అదేమంటే మా తాతగారి పేరు తిరుమలరాయుడుగారు. ఆ రోజులలో, ముఖ్యంగా పల్లె ప్రాంతాలలో సర్వసాధారణంగా కుటుంబాలలోని తాతగారి పేర్లు మనవలకి పెట్టే ఆచారం ఉండేది. అందువల్ల మగపిల్లవాడు పుట్టాడా ఈరోజుల్లాగా పేరు కోసం వెతుక్కొనే అక్కర ఉండేది కాదు. తరతరాల అంతరాల మార్పులలో ఈ నామకరణం విషయంలో వచ్చిన మార్పు కూడా ఒకటనుకోవాలి.

## నా జాతకం

సమయం సందర్భం వచ్చింది కాబట్టి ఇప్పుడే నా జాతకాన్ని గురించి కూడా కొంచెం ప్రస్తావిస్తే బాగుంటుందనుకుంటాను. అసలు ఈ జాతకాన్ని గురించి నాకెందుకు ఆసక్తి, అవసరమూ కలిగాయంటే ఏవేళ పుట్టానో తెలుసుకొందా మనిపించి జాతకం తిరగవేశాను. 20-9-1915 తేదీన, ఆ రోజు సోమవారమైంది ఉదయం 7 గంటల నలభైనిముషాలకు రాజరాజనరేంద్రుడి వల్ల ప్రసిద్ధి పొందిన రాజమహేంద్రవరంలో మా అమ్మగారి మేనమామగారి ఇంట్లో నేను జన్మించాను. తెలుగు పంచాంగం పరిభాషలో చెప్పాలంటే స్వస్తి శ్రీ చాంద్రమాన శ్రీ రాక్షసనామ సంవత్సర భాద్రపద శుద్ధ ౧౨ ద్వాదశీ సోమవారం ఉదయం గం॥ 8 ని॥52లకు అంటే సూర్యోదయాది ఘ॥7 ॥ విఘ ॥ 40 నా జననకాల దశా విశేషం అవుతుందన్నమాట.

జన్మించానుట అని ఎందుకన్నానంటే ఈ జాతకాలు గుణించటంలోనే ఇప్పుడు (1991) అంటే నా 75వ ఏడు జరుగుతుండగా నా జాతకాన్ని విపులంగా పరిశీలించాను. ఎందుకంటే ఎప్పుడు పుట్టానో తెలుసుకోడానికి. ఈ

జాతకంలో పుట్టిన కాలంలో తేడాలేదుగాని మొదటవేసినవారు తులా లగ్నమనే ఇంతకాలం నమ్మించినా ఇపుడు మరో పండితుడు 'కన్యాలగ్నమని' వ్రాశారు. నక్షత్రం మాత్రం 'శ్రవణ'మనే అందరూ వ్రాశారు. ఒక పండితుడెవరో మాత్రం 'ధనిష్ఠా నక్షత్రం' ఆఖరి పాదమన్నారు. మిగతా వారంతా శ్రవణా నక్షత్రం మొదటి పాదమన్నారు. మరి ఈ కాలం తేడాల్లో వారి జోశ్యం కూడా మారుతుంది కదా!

అయితే ఒక సంగతి ఇక్కడ స్పష్టంగా చెప్పాలి. నేను జాతకం చూసుకుంటూ ఏ పనీ చేయలేదు. నమ్మకమున్నదా లేదా అనే ప్రశ్నకు సూటిగా సమాధానం చెప్పటం కష్టం. జాతకం చూడటంకూడా ఒక శాస్త్రమే. సాముద్రికంలాగా దానిని కూడా ఒక కళకిందే భావిస్తాను నేను. తెలిసిన మిత్రులతో కాలక్షేపానికి బాగానే ఉంటుంది. అంతవరకే నా అంగీకారం.

మనదేశంలో జాతకాలు చూసుకోవాలన్న అభిలాష ఎక్కువే. జాతకానికి సంబంధించిన వ్యక్తి స్వభావమూ గ్రహబలమూ సమన్వయిస్తాయో లేదో తెలియదు. ఫలితాలు అనేకమంది చెపుతారు. అందులో గడచిన కాలానికి సంబంధించి చెప్పిన ఫలితాలు నిజమైన సందర్భాలు ఎన్నో ఉన్నాయి. అట్లా అని జాతకం కాగితాలు పట్టుకొని వీరా వారా అని తిరగటం చాదస్తంగా భావిస్తాను. నా మిత్రులలో జాతకాల పిచ్చి ఉన్నవారు ఎంతో మంది ఉన్నా, నేనెప్పుడూ జాతకంపై ఆధారపడి ఏ పనీచేయలేదు. నా వివాహవిషయంలో కూడా మా మేనమామలు వధూవరణంలో జాతకాలు చూడాలంటే అప్పటికే పిల్లను చూసి ఒప్పు కోవటమైంది. ఇప్పుడు జాతకాలు వద్దు గీతకాలు వద్దు అని నా చిన్నతనంలోనే తోసి పుచ్చాను. మా ముగ్గురు పిల్లల పెండ్లి విషయంలో కూడా నేను జాతకాలు చూపించలేదు. ఒక సంబంధం వారు మాత్రం జాతకం కావాలన్నారు. సరేనని ఇచ్చాను. చూసుకొని జాతకం కలవటం లేదని ముందు చెప్పి తరవాత మాకు మీ సంబంధం ఇష్టమేనన్నారు. కాని ఒకసారి జాతకం సరిగా లేదని అనుకున్న తరువాత ఎందుకులెండి? అని మేము ఆ సంబంధానికి పోలేదు. ఈ విధంగా జాతకాల గురించి తర్క వితర్కాలు చేయవచ్చు. తమాషాగా కొన్ని విషయాలు తెలుసుకోవచ్చు. అందులో జాతక ఫలితాలు కూడా సాముద్రిక ఫలితాల వంటివేనని నా నమ్మకం. జాతకాల గురించి పెద్ద ప్రవేశం లేకపోయినా చిన్నప్పటినుంచీ సాముద్రికం అంటే నాకు ఒక సరదా (హాబీ) అని చెప్పగలను.

అందుచేత ఇప్పటికిది చాలుననుకుంటాను. అయితే ఒక సంగతిమాత్రం చెప్పాలి. నాకు జీవితంలో ఎదురుకాబోయే మంచి చెడుగులు ఎవరూ చెప్పలేదు. వాటంతట అవి జీవితస్రవంతిలో సమకూడిన శుభాశుభాలే స్వీకరించాను. అయితే అన్ని మనమంచికే అన్నదే నా విశ్వాసం. అభిమతం, వేదాంతం.

మరొక సంగతి. మా అమ్మకు జాతకాలలో నమ్మకం ఉండేది. అందుచేత, మా ఇద్దరి అన్నదమ్ముల జాతకాలు వ్రాయించి నన్ను, డాక్టర్ని, మా తమ్ముడిని ఇంజనీరును చేయించింది. నా పెళ్ళి విషయంలో చాలా ఆదుర్దా పడ్డది. నేను డాక్టరీ చదువు (మెడిసిన్) పూర్తి అయితేగాని పెళ్ళి చేసుకోననే అభిప్రాయంలో ఉండటంచేత మా అమ్మ చాలా వ్యాకులానికి గురి అయింది. ఆవిడ కెవరో జాతకం చూసి చెప్పారట. 'నీవు ఇద్దరిపిల్లల వివాహాలు చూడకుండానే చనిపోతావని'. అది నాకు తెలియదు.

నేను మెడిసిన్ ఆఖరు సంవత్సరం చదువుతుండగా మా అమ్మకు నేను వివాహం చేసుకుంటానని చెప్పడానికి ఏదో గుబులు పుట్టి మా అమ్మను చూడాలని కూడా వెళ్ళాను. అయితే ఏం జరిగింది? అప్పటికప్పుడే నేను ఏనాడూ విద్యార్థిగా గానీ అటు తరవాత వైద్యవృత్తిలో ప్రాక్టీసు చేస్తున్న కాలంలోగానీ ఎప్పుడూ చూడనంత తీవ్రతతో, విషమపరిస్థితులలో (కాంప్లికేషన్స్) ఆమె టైఫాయిడ్ జ్వరానికి గురి అయి ఉంది. ఆ జ్వరం జ్వరం 15 రోజులు ఆమెను బాధించింది. 15 వ రోజున ఆమె చనిపోయింది. ఆ పదిహేనురోజులు ఆమెకు సేవచేసి మాతృ ఋణం మాత్రం కొంత తీర్చుకున్నాననే చెప్పాలి. ఆ తృప్తి మాత్రం ఏదో కొంత నేను పొందగలిగానే తప్ప ఆమె అంతరాంతరాలలోని కోరిక తీర్చలేకపోయాను. నాకు జాతకాలపట్ల నమ్మకమున్నా లేకపోయినా ఈ విషయం అంటే మా అన్నదమ్ముల పెళ్ళి చూడకుండానే ఆమె వెళ్ళిపోతుంది అనే విషయం ఆమెకు ఎవరో చెప్పినట్లు నాకు తరవాత తెలిసింది. అయితే ఈ విధంగా జాతక ఫలితాల నిజానిజాలు నిర్ధారించడం చాలా కష్టం. ఇటువంటి ఎన్నో దృష్టాంతాలు చూపవచ్చు సమర్థించేవారు. కాని చిన్నప్పటి నుంచి నా దృక్పథం హేతువాదం వైపు మొగ్గింది. అందువల్ల నా మనస్తత్వంలో కొంత మార్పు కలిగి ఉండవచ్చు. హేతువాద సిద్ధాంతాలకు సామ్యవాద సిద్ధాంతాలకు ప్రభావశీలమైన

వయస్సులో ఆకర్షితుణ్ణి కావడం వల్ల దేనినైనా ప్రత్యక్ష రుజావుంటే తప్ప నమ్మలేనితనం నాలో ప్రవేశించింది. అందువల్ల జ్యోతిష్యాన్ని ఒక కళగా భావించటానికి నాకు అభ్యంతరంలేదు. గుడ్డిగా నమ్మాలంటే చిక్కులొస్తాయి. అట్లా ప్రశ్నించకుండా నమ్మటం తప్పని నా భావన. ఇక్కడకిది చాలు. నేను జన్మించిన వేళా విశేషం తెలుసుకోవడానికే జాతకాలను గురించి ఇంత ప్రస్తావన తీసుకొనిరావల్సి వచ్చింది.

నేను 1915వ సంవత్సరం సెప్టెంబర్ 20వ తేదిన రాజమహేంద్రవరంలో పుట్టాననీ మా తల్లిదండ్రులు ప్రాతూరి వేంకట సుబ్బారావుగారూ లక్ష్మమ్మగారలనీ చెప్పాను కదా! మా తమ్ముడు శ్రీకృష్ణశర్మ మరో మూడు సంవత్సరాలకు పుట్టాడు. మా తల్లి గర్భవాసాన మేమిద్దరమే సుపుత్రులం. మా తల్లిదండ్రులకు ఆడపిల్లలు లేరు. ఇంకో మూడు సంవత్సరాలకు మరో తమ్ముడు పుట్టాడు కాని ఆ పిల్లవాడికి ఆరునెలలు రాగానే పెద్ద జ్వరం వచ్చి అందులో సంధి, లేదా గుణం, అంటారు అది వచ్చి చనిపోయినాడు. అప్పటినుంచి మా అమ్మకు ఏదైనా బరువైన సంఘటన తాకినప్పుడు, అటువంటి సంగతులు తెలిసినప్పుడు మూర్ఛలాంటిది వచ్చి తెలివితప్పి పడిపోయేది. పూర్వకాలం వాళ్ళు దీనినే "హిస్టీరియా" అనే వాళ్ళు. ఇలాటిది జరిగినప్పుడు మా అమ్మ మళ్ళీ తనంతటతనే కొద్ది నిముషాలకో లేదా అరగంటకో లేచేది. ఈ లోపల ముఖం మీద నీళ్ళు చల్లటం, లేదా ఘాటైన వాసన (స్మెల్లింగ్ సాల్ట్ వంటిది)ఇచ్చే పదార్థాన్ని దేన్నో ముక్కు దగ్గర చూపటం చేయల్సి వచ్చేది. ఇపుడెవరూ ఇటువంటి పరిస్థితులలో అటువంటి ఘాటు పదార్థాలు వాసన చూపటంలేదు. అయితే ఆ రోజుల్లో ఇటువంటి వ్యాధికి ఘాటుగా ఉండే మందును వాసన చూపించేవారు. అప్పుడా వ్యక్తి కాస్సేపటికి స్పృహలోకి వచ్చేవారు.

మా అన్నదమ్ముల పరిచయం యిది. ఆడపిల్లలు లేకపోవటం చేత మా అమ్మ తన చెల్లెలి ఆడపిల్లలిద్దరిని మణి, కస్తూరి అనే ఇద్దరినీ దగ్గరకు తీసి పెంచుతూ ఆ ముద్దు ముచ్చట్లు తీర్చుకుంటూ ఉండేది. అప్పటి కాలంలోనే మా కుటుంబంలో సంతాన నియంత్రణ సహజ పద్ధతులలోనే కొనసాగిందనే చెప్పాలి. ప్రకృతి సహజంగా కూడా ఆ జాగ్రత్తలు తీసుకోవచ్చు. అదంతా వేరే కథ లేదా పురాణం. చిన్న ఉపోద్ఘాతంతో పరి సమాప్తమయ్యేది కాదు.

నేను పుట్టేటప్పటికి మా అమ్మగారి వయసు 15 సంవత్సరాలు. మా నాన్నగారు అమ్మకన్న మరో 5 సంవత్సరాలు పెద్ద. అందువల్ల మా నాన్నగారి జనన సంవత్సరం 1895 అని అనుకోవచ్చు. ఈ విధంగా ఆలోచనలను వెనక్కు తీసుకొని వెళుతుంటే చాలా తమాషాగా ఉంటుంది. మా నాన్నగారు పుట్టటానికి పది సంవత్సరాల ముందే భారత జాతీయ కాంగ్రెసు పుట్టింది.

మళ్ళీ నా పుట్టుక దగ్గరకు వస్తే అప్పటికి మొదటి ప్రపంచ యుద్ధం యూరోపులో బ్రిటిషు సామ్రాజ్య వాదులకు, జర్మను రాజరికవ్యవస్థకు మధ్య ప్రచండంగా సాగుతున్నది. 1914లోనే ఈ యుద్ధం ప్రారంభమైంది. కాబట్టి యుద్ధం జరుగుతూ ఉండటం అది రెండో సంవత్సరం. 1918 వరకు ఆ యుద్ధం భీకరంగా సాగింది. చివరి రోజులలో జర్మనీ వాళ్ళు 'ఎమ్‌డన్' (Emden) అనే సబ్ మెరైన్ ద్వారా మద్రాసు వరకూ వచ్చి యథేచ్ఛగా మద్రాసు నగరం మీద మరఫిరంగి గుండ్లు విచ్చలవిడిగా కురిపించి వెళ్ళిపోయారు. అందులో ఒక గుండు మద్రాసు హైకోర్టు భవనానికి తగిలి ఒక గోడకూలి పోయింది. అక్కడ తిరిగి గోడకట్టి ఆ గోడమీద గుర్తించి ఇదుగో ఇక్కడే జర్మనీ వారి గుండు తగిలింది అని యుద్ధం ముగిసి తాము విజేతలైన తరువాత బ్రిటిషు వారు తమ గుండె ధైర్యానికి ఆనవాలుగా ఒక రాతిఫలకం ఆ గోడకు తాపడం చేశారు. మరికొన్ని మరఫిరంగి గుళ్ళు ఆ పట్టణంలో ఉన్న కిరసనాయిలు, పెట్రోలు విలువల టాంకులకు తగిలి పెద్ద మంటలు రేగి ఊరంతా అంటుకుంటుందేమోనని భయపడిపోయినారు. బానిసలుగా భావదాస్యంలో మగ్గుతున్న భారతీయులంగా తెల్ల దొరల గొప్పతనాన్ని కీర్తిస్తూ, ఆ తెల్లవారి చాకచాక్యమే, తెలివితేటలే ఆ మంటలను ఆర్పాలిగాని మనవల్ల ఏమవుతుంది? అని అనుకొనే రోజులవి. ఇందులో ధనికులు, బీదలు అనే తారతమ్యంలేదు. ఆబాల గోపాలం తెల్లవారి ప్రజ్ఞను మెచ్చుకొనే రోజులవి. ఎలాగైతేనేం ఆ మంటలు ఆర్పారు. మొదటి ప్రపంచయుద్ధకాలపు కొన్ని ఘట్టాలవి.

## రాజమండ్రి ఘనత

అట్లా ఘనతకెక్కిన మహాపట్టణంలో న్యాపతి సుబ్బారావు పంతులుగారి ఇంటి పక్కనే ఉండే బియ్యపు సుబ్బయ్యగారి కొట్లలో నేను పుట్టానని

తెలుసుకొని తరువాత వెతికి వాటిని పట్టుకొని ఆ కొట్లను ఫొటో తీసి తెచ్చుకున్నాను. ఆ భవనం అంటే ఏమిటనుకున్నారు? పెద్ద పెంకుటి వసారాతో ఉన్న కొట్లు అవి. చాలా పొడుగ్గా వీధంతా వ్యాపించినంత పొడుగ్గా ఉన్నాయి ఆ కొట్లు. ముందు, తరవాత గదులు, ఆపైన ఒక వరండా యీ మాదిరిగా బజారును ఆనుకొని అవి నిజంగా కొట్లలాగానే ఉన్నాయి. మా అమ్మ మేనమామగారూ తహసీల్దారుగారూ అయిన పోతరాజు వెంకయ్యగారు ఆ భవనం అంతా తమ వసతిగా ఆక్రమించుకొని ఉండేవారు. అందుచేత నేను ఫలాని ఈ గదిలో పుట్టానని పోల్చుకోలేక పోయాను. ఇపుడా సంగతి చెప్పేవాళ్ళు కూడా ఎవరూ లేరు. అయితే ఇప్పుడవన్నీ చిన్న చిన్న భాగాలుగా విభజించబడి అందరికీ తలో రెండు గదులూ దానికి సంబంధించిన ఒక వసారాగల వసతి గృహాలుగా రూపొందాయి. వీటిలో 7,8 సామాన్య కుటుంబాలు ఆవాసం చేస్తున్నాయి. వీరంతా 'బియ్యపు సుబ్బయ్య' గారి చుట్టాలో లేదా వాళ్ళ దగ్గర ఆ భాగాలు కొనుక్కొన్న వాళ్ళో అయి ఉంటారు. ఒక భాగంలో మాత్రం ఆ సుబ్బయ్యగారి మనవరాలో ఎవరో ఉన్నారు. మొత్తానికి ఆ 'బియ్యపు సుబ్బయ్య' గారి కొట్లుభవనం నా జన్మస్థలంగా వాసికెక్కింది. కావలసిన డబ్బుంటే కొనేసి ఉందును. లేదా చారిత్రక ప్రసిద్ధిగల 'మరొక గొప్ప వాణ్ణయి' ఉన్నా కథావశేషుణ్ణి అయిన తర్వాత సర్కారు వారైనా కొని భద్ర పరచే ప్రయత్నం చేసి ఉందురు కదా! మరి ఇటువంటి ఆ రెండు అదృష్టాలూ ఆ భవనానికి పట్టకపోవటం నా తప్పుకాదు. ఇందువల్ల ఆ పాతకాపురాల వారసత్వమున్న వాళ్ళే అందులో ఇప్పటికీ ఉండే భాగ్యం వాళ్ళకు కలిగింది. నేను ఈ నాడు కూడా ఏ మార్పు లేకుండా ఆ కిందటి తరాల ఇంటిని యథాతథంగా చూసేందుకు నోచుకున్నాను. సదరు భవనపు ఛాయాచిత్రం నా దగ్గర భద్ర పరచబడింది.

నేను పుట్టిన రాజమహేంద్రవరానికి తెలుగు వారి చరిత్రలో గొప్ప ప్రసిద్ధి ఉంది. వేంగీ చాళుక్య మహారాజు రాజరాజనరేంద్రుడి రాజధానిగా చరిత్రలో పేరుకెక్కింది. మాళవదేశపు చిత్రాంగికి సంబంధంలేకపోయినా చిత్రాంగి మేడ కూడా ఉంది రాజమహేంద్రవరంలో. చిత్రాంగి ఉన్నప్పుడు సారంగధరుడు కూడా ఉండడా? ఒక గుట్టను గుర్తించి దానిని సారంగధరుడి మెట్ట అన్నారు. ప్రకాశం పంతులుగారు చిన్నప్పుడు మొట్టమొదటి సారి రాజమండ్రిని చూసినపుడు ఇవన్నీ చూశాడట. స్వీయ చరిత్రలో రాసుకున్నాడు.

## గౌతమీ గ్రంథాలయం

నేను పుట్టిన పట్టణాన్ని తలచుకొంటూ ఉంటే ఆ నగరంలోని గౌతమి గ్రంథాలయం దాని ప్రఖ్యాతీ జ్ఞాపకానికి వస్తున్నాయి. రాజమహేంద్రవరం ఎంతో విస్తరించినా ఎన్నో రెట్లు పెరిగినా నవ నాగరక రూపురేఖలు దిద్దుకొన్నా సాహిత్య ప్రసిద్ధి ఆనాటి నుంచి ఈ నాటి వరకూ కొనసాగుతూనే ఉంది. రాజమహేంద్రవరాన్ని తలచుకొంటే నన్నయ, శ్రీనాథుడు మొదలైన ప్రాచీన మహాకవులు గుర్తుకు వస్తారు. భారత రచనా వాతావరణం ఇప్పటికీ అక్కడ తలపులోకి వస్తుంది. అయినా గౌతమీ గ్రంథాలయం మాత్రం ప్రాచీన చరిత్రకు చిహ్నంగా నేను ఎరిగిన తర్వాత చాలా కాలం వరకూ కనపడుతూనే వచ్చింది. జీర్ణోద్ధరణం చేయాలనే ఉదారమైన పుణ్యకార్య దృష్టికూడా చాలాకాలం ఎందువల్లో ఎవరికీ కలగలేదు. ఈ మధ్యనే ప్రభుత్వం వారు ఈ జీర్ణగ్రంథాలయానికి నవీనరూపురేఖలు సంతరించటానికి పూనుకోవటం ముదావహమైన విషయం .

అయితే ఈ గౌతమీ గ్రంథాలయానికీ నా జన్మవృత్తాంతానికీ ఏమిటి బాదరాయణ సంబంధం అంటారేమో! గొప్ప అనుబంధమే ఉంది. మా అమ్మగారు నేను కడుపులో ఉన్నప్పుడు గౌతమీ గ్రంథాలయంలోని పుస్తకాలన్నీ చదివేశానురా అని ఆయా సందర్భం వచ్చినప్పుడల్లా చెప్పేది. అది ఆమె పుస్తకపఠన తృష్ణకు గొప్ప నిదర్శనం. ఇదే విధంగా మా అమ్మ ఏ ఊళ్ళో ఉన్నా ఆ చుట్టుపక్కల ఉండే గ్రంథాలయాలలోని పుస్తకాలన్నీ చదివేసేది. ఈ విధంగానే కడుపులో ఉన్నప్పుడే మా అమ్మ నాకు సాహిత్య తృష్ణను, పుస్తకపఠనాభిలాషను కలిగించిందనుకోవాలి. నా సాహిత్య జీవితానికి అది పునాది అంటే వాస్తవం. రచనాభిలాషకు నాంది ప్రస్తావన అపుడే జరిగి ఉండవచ్చు. ప్రస్తుతం రాజమహేంద్ర పురవర్ణన ఆపుదాం.

## అభిమన్యుడి కథ

శిశువు తల్లికడుపులో ఉన్నపుడే ఆ శిశువు చుట్టూ ప్రసరించే వాతావరణం ఆ శిశువు భావిజీవిత ఆలోచనలను తప్పక ప్రభావితం చేస్తుందని నవీన శాస్త్రజ్ఞులు ఒప్పుకుంటున్నారు. అభిమన్యుడు పద్మవ్యూహ రచనను

గురించి తల్లి కడుపులో ఉన్నప్పుడే తెలుసుకున్నాడటకదా! కాబట్టి నాలో ఈ నాటి సాహిత్య తృష్ణకు, అభిలాషకు ఆ నాటి మా అమ్మ నిరంతర పఠనా వ్యాసంగమే పునాదిని వేసిందనుకుంటాను.

నేటి శాస్త్ర విజ్ఞానం ప్రకారం తల్లి గర్భవతిగా ఉన్నప్పుడు ఆమె పొందే అనుభవాలు, అనుభూతులు కడుపులోని శిశువును ప్రభావితం చేస్తాయని శాస్త్రజ్ఞులు కనుక్కొన్నారు. సంగీతం, ఉల్లాసకరమైన ఊహలు, మధురానుభూతులు అన్నీ కూడా తమ ప్రభావాన్ని బిడ్డ మీద చూపుతాయని నిరూపణగా తెలుసుకున్నారు. కాబట్టి మా అమ్మ సాహిత్య పఠనానికి నా సాహిత్యాభిరుచికీ సంబంధం ఉందనడం శాస్త్రీయమే.

అభిమన్యుడి కథ కూడా ఈ విషయమే తెలియ చేస్తున్నదేమోనను కుంటాను. తనతల్లి సుభద్ర కడుపులో ఉన్నప్పుడు అతడు పద్మవ్యూహంలోనికి ఏ విధంగా ప్రవేశిస్తారో విన్నాడుట. మరైతే పద్మవ్యూహం ఛేదించటం దగ్గరకు వచ్చేసరికి ఆ కథ పూర్తి కాకుండానే ఆగిపోయిందట:

తల్లి స్వీకరించే పోషకాహారంపైన కడుపులో ఉన్న శిశువు ఆరోగ్యం ఆధారపడి ఉంటుందని ఇవాళ అందరికీ తెలిసిన విషయమే. దీనికి తోడు తల్లి సంతోషకరమైన మానసిక పరిస్థితి ఉంటే బిడ్డ పెరుగుదల బాగా ఉంటుందని శాస్త్రజ్ఞులు నేడు చెపుతున్నారు. సంగీతం, శ్రవణానందకరమైన అనుభవాలు, ప్రశాంతత మధ్య తల్లి ఎక్కువ సేపు గడపగలిగితే గర్భధారణ కాలంలో అదెంతో సత్ఫలితాన్ని చేకూరుస్తుందని కాలిఫోర్నియాలోని వైద్యులు 'ప్రీనియోనేటాలజీ' (Preneonatology)అనే శాస్త్రాన్ని కూడా రూపొందించారు. శిశువు పుట్టేముందు గర్భంలో ఉన్న శిశువు ఎటువంటి అనుభవాలకు ఎటువంటి ఫలితాలుంటాయని ప్రయోగాత్మకమైన విజ్ఞానశాస్త్రాన్ని రూపొందిస్తున్నారు.

# III

# ఆనాటి రాజమండ్రి

# THE SHOPS OF 'BIYYAPU SUBBAYYA - PLACE OF MY BIRTH

It was in Rajahmundry that I was born in the sheds of "Biyyapu Subbayya", situated by the side of Sri Nyapathi Subbarao's House, an old Congressman, one of the Founders of 'The Hindu' a Madras daily. The greatness of Rajahmundry, in the then Andhra Pradesh - A great Cultural Centre - Kandukuri Veere-salingam Panthulu - Chilakamarti Laxminara - simham, etc . I am surprised that the row of sheds are still there.

నేను పుట్టిన ఊరు రాజమండ్రి కదా, ఇదెంతో, గోదావరి తీరాన వున్న, మహిమగల గడ్డ. రాజమండ్రిని గురించి మా మిత్రులు, శ్రీ పండ్రంగి

థాజేశ్వరరావుగారు తన "ప్రొఫైల్స్ ఆఫ్ ఎ పేట్రియాట్స్" (PROFILES OF A PATRIOTS) అనే గ్రంథంలో ఈ విధంగా వ్రాశాడు. న్యాపతి సుబ్బారావు పంతులుగారు 1880లో నాటికి ఆంధ్రదేశంలో న్యాయవాద వృత్తిరీత్యా రాజమండ్రిలో స్థిరవాసం ఏర్పరుచుకున్నారట. దానికి కారణం ఈ విధంగా చెప్పారు.

" ఆ రోజులలో అంటే 1880 నాటికి, ఆంధ్ర దేశంలో రాజమండ్రి ప్రసిద్ధి చెందిన పట్టణం. బెంగాలుకు కలకత్తా, మహారాష్ట్రకు బొంబాయి, బీహార్‌కు పాట్నా, ఉత్తరప్రదేశ్‌కు అలహాబాదు, గ్రీసు దేశానికి ఏథెన్సు లాగా ఆంధ్రదేశంలో రాజమండ్రి అంత ప్రసిద్ధి చెందిన పట్టణం. అందులో గోదావరి నదీ జలాలు మంచి రుచినిచ్చేవి. కోటిలింగాలుగా వెలిసిన శివస్వరూపాలు కూడా కొంత మహిమ ఆ స్థలానికి కలిగించియుండాలి. అదీకాక, ఆది కవి నన్నయ మహాభారతాన్ని తెలుగులోకి అనువదించడం అక్కడే జరిగింది. అందుచేత పుణ్యం, పురుషార్థం వున్న వూరు అవటంచేత, మేధావులు వృత్తిరీత్యా వచ్చి మంచి పేరు గణించిన వారు అక్కడ స్థిరవాసం ఏర్పరచుకున్నారనటానికి సందేహం లేదు.

ఆంధ్రకేసరి ప్రకాశం పంతులుగారుకూడా చిన్నప్పుడు, వారి నాటకాల గురువు గారయిన నాయుడుగారితో రాజమండ్రి వచ్చారు. తరువాత ప్రథమంగా తమ న్యాయవాద వృత్తి ఫస్టుగ్రేడు ప్లీడరుగా అక్కడే ప్రారంభించారు. తరువాత ఇంగ్లండు వెళ్ళి బారిష్టరయి, మద్రాసులో స్థిరపడి లాయరుగా ఎంతో పేరు ప్రతిష్ఠలు ఎంతో ఆస్తిని సంపాదించుకున్నారు. త్యాగమునకు దేశసేవకు దోహద పరిచే స్వాతంత్ర్య సమరంలో పాల్గొని "ఆంధ్రకేసరి" అయ్యారు.

అక్కడే కందుకూరి వీరేశలింగం పంతులుగారు, చిలకమర్తి లక్ష్మీనరసింహంగారు మొదలైన సంఘసంస్కర్తలు, సాహితీవేత్తలూ అయిన వారికి ఉనికిగావుండి రాజమండ్రి సుప్రసిద్ధమయి విరాజిల్లుతున్న రోజులవి. అలాంటి పుణ్యపురుషుల గడ్డ రాజమండ్రి. అక్కడే నేను కూడా జన్మించటం నా అదృష్టమేగా! పుట్టిన సమయంతో పాటు, పుట్టిన ఊరుకూడా నా జీవితస్రవంతికి గోదావరి జన్మించిన 'నాసిక్' పట్టణంగా భావించాలి. ఆ వూరిలో వున్న బియ్యపుసుబ్బయ్య కొట్లలోనే పుట్టా –

ఈ బియ్యపు సుబ్బయ్య కొట్ల ప్రాముఖ్యం ఏమంటారా? నేను ఆ కొట్లులో పుట్టాను కాబట్టి. రాజమహేంద్రవరంలో, ప్రస్తుతం న్యాపతి సుబ్బారావు పంతులుగారి వీధిలో వారి పెద్ద మేడ పక్కనే ఈ కొట్లు వరుసగా వున్నాయి. బజారుమీదకు కట్టివున్నాయి. అంతా పెంకుటి వసారాలే. అయితే గదులన్నీ పొడుగుగా కలిసి వున్నాయి. 1915 నాటికి మా అమ్మగారి మేనమామగారయిన పోతరాజు వెంకయ్యగారు అక్కడ తహశీల్ దారు – అబ్బో ఆరోజులలో తహశ్శీల్ దార్ అంటే ఎంతో పెద్ద హోదాగల వుద్యోగంగా వుండేది. ఆ కాలంలో "నా మొగుడు తహశ్శీల్ దార్" అనే సినిమాలు, పాటలు కూడా తమ గొప్ప చెప్పుకునే పాటలున్నాయి అంటే అదెంత పెద్ద ఉద్యోగమో చెప్పుకోండి.

సుబ్బయ్య కొట్లు వరుసగా ఒక ఆరుకొట్లున్నాయనుకుంటా. బియ్యపు సుబ్బయ్యవి. ఆయనకు బొడ్డుకోసి పెట్టినపేరు కాదు. బహుశా ఆ మొదటి ప్రపంచయుద్ధ కాలంలో బ్రిటిషువారు అన్నిటిమీద 'కంట్రోలు' పెట్టి సామాన్య ప్రజలకు నిత్యావసర వస్తువయిన బియ్యం సప్లయి చేసేవారు. బహుశా సుబ్బయ్య బియ్యపు కొట్టుతో ప్రసిద్ధి కెక్కటం వలన ఆయినకు బియ్యపు సుబ్బయ్యగారనే వాడుక నామమయిందని అనుకుంటా!

ఈ కొట్టు ఇన్నీసుపేటలో అప్పుడు ప్రసిద్ధ న్యాయవాది, జాతీయవాది, గాంధీ సహచరుడు అయిన న్యాపతి సుబ్బారావుగారి మేడ కూడా ఆ పక్కనే ఉన్నది. లేకపోతే వారి మేడ ఆ కొట్ల పక్కనే వున్నదనవచ్చు. అయితే ఏది ముందర వెలిసిందో తెలిస్తేగాని యీ హోదాను నిర్ణయించలేం!

పోతరాజు వెంకయ్యగారు తహశ్శీల్ దారవటంచేత ఆ కొట్లన్నీ అద్దెకు తీసుకుని వుండాలి. ఆనాడు బయట అంతా బంజరు బయిలుగా వుండి ఎక్కువ ఇళ్ళు లేకుండా ఈ "కొట్లే" ప్రాముఖ్యమయినవిగా వుండివుండాలి. ఇప్పుడు అరవయి సంవత్సరాలయిన తరువాత నేను చూడటానికెళ్ళేటప్పటికి నాకు ఒకందుకు సంతోషమయింది. ఎందుకంటే ఆ పెంకుటి కొట్టులు అలాగే వున్నాయి గనుక. మామూలుగా అయితే ఎవరో సంపన్నగృహస్థుడు ఆ స్థలం కోసం కొనుక్కుని వాటిని శిథిలం చేసి పెద్ద అంతస్థులు అద్దెలకోసంగాని, తాను వుండటానికి గాని కట్టివుంటే నాకు ఆ కొట్లను చూసే భాగ్యం వుండేది కాదు.

అయితే ఇపుడు ఆ కొట్లన్నీ భాగాలుగా చేసుకొని చిన్న కుటుంబాలున్నాయి. కొంతమంది సుబ్బయ్యగారి మనుమలు మునిమనుమలు కూడా అయివుండాలి. మిగతావారు బయటి వారు. ఈ వున్న సంతతిని బట్టి సుబ్బయ్యగారి తరువాతి సంతానం అంత సంపన్నంగా వున్నట్లు కనిపించలేదు. బండ్లు ఓడలౌను, ఓడలుబండ్లౌను అనే భాస్కరశతకం పద్యం జ్ఞాపకానికి వచ్చింది.

మరో సంగతి.ఆ బియ్యపు సుబ్బయ్య కొట్లు చూచిన తరువాత, బియ్యపుసుబ్బయ్య మంచి నిజాయితీ పరుడై వుండాలనుకున్నా. ఎందుకంటే యుద్ధకాలంలో కంట్రోలు వస్తువులు అమ్మువారు ఎంతైనా డబ్బు సంపాదించి కుటుంబీకులకు యిచ్చి వుండేవారని గ్రహించాను. ఇంకా అలాంటి చిన్న రెండు గదుల భాగంలో సుబ్బయ్యగారి ముని మనువరాలు వున్నదంటే అది వారి కుటుంబగౌరవాన్ని నిజాయితీని తెలియజేస్తోంది. అటువంటి సహృదయుల యింట్లో ఒక గదిలో నేను పుట్టానంటే అది ఒక భాగ్యంగానే భావిస్తున్నా!

అదే నేను జన్మించిన బియ్యపు సుబ్బయ్యగారి కొట్ల చరిత్ర.

రెండో ప్రపంచ యుద్ధంలో అంటే 1939 మొదలు 1944 వరకూ మద్రాసులో వుండి ఆ యుద్ధ కాలపు నాటి బియ్యపు కొరతను స్వయంగా రుచి చూచాం. అప్పుడు 'రేషన్ బియ్యం' అనేవారు. ప్రతి కుటుంబానికి తలసరి వారానికి ఇన్ని ఔన్సుల బియ్యం అని లెక్క గట్టి ఇచ్చేవారు. అందుచేత బీదసాదలకు భోజనానికి లోటువున్నా "కటకట" వుండేదికాదు.

రెండో యుద్ధకాలంలో అన్ని 'రేషన్లు' రుచి చూచాం. బియ్యానికి రేషన్, పెట్రోలుకు రేషన్ బియ్యం లేకపోవటంతో "ఇడ్లీహతః"! ఎన్ని 'రేషన్లు' ఉన్నా మనది వరి పండే రాష్ట్రం అవటం చేత ఎవరో ఒకరు దొంగచాటుగా తెచ్చి బియ్యం అమ్మేవారుండేవారు. ఇందులో కూడా అంతా దొంగచాటు వ్యాపారం అవటంచేత ఇదిగో ఆ సందు చివర బియ్యం వున్నాయని డబ్బు అడ్వాన్సు తీసుకుని ఉడాయించిన సమయాలు కూడా వున్నాయి.

## రాజుగారి రేషన్‌వాపసు

రెండో ప్రపంచ యుద్ధకాలంలో ఆహార పదార్థాలన్నా ఇంగ్లండు వారికి, మనలను పరిపాలించే తెల్లవారి దేశంలో అందరికీ మనలాగా రేషన్. వారు

ఎక్కువగా 'బ్రెడ్డు' (నేను రొట్టె అంటా)కోడిగుడ్లు తింటారు. మాంసం కూడా అంతా దిగుమతే. మన అన్నంలాగే వారు 'బ్రెడ్డు' తింటారు. అది 'రేషన్' గదా. రాజాగారి కయినా అంతే. అయితే ఒక సమయంలో దేశంలో 'బ్రెడ్డు' సరఫరా తగ్గింది. ముందుచూపుతో అధికారులు అదివరకు పంపిణీ చేసిన 'బ్రెడ్డు'లో కొంత భాగం తిరిగి ఇమ్మని ఆదేశించారు. అప్పుడు రాజాగారు కూడా తన వాటా ఎక్కువగా వచ్చిన 'బ్రెడ్డు'ను తిరిగిచ్చారుట! అంత **నిజాయితీగా వ్వదేశంలో వుండేవారు** గనుకనే వారు అన్ని సంవత్సరాలు మనమీద సవారీ చేయగలిగారు. ఇహ మన దేశంలోనూ ఆ రోజులలో నాకు బాగా గుర్తు. గొప్పవారు ఎలాగో అలా ఎక్కువ రేషన్ సంపాదించేవారు. ఇహ మాబోటి వాళ్ళ ఇళ్ళల్లో కూడ వచ్చీపోయే చుట్టాల తాకిడికి సంతర్పణలు జరుగుతూనే వుండేవి. అదీ నిజాయితీలో తేడా మనకూ ఆ ఇంగ్లండు దేశస్థులకూ. అందుకని వారు అందరినీ మించిన పతివ్రతలని చెప్పటంలా!

ఇలా వ్రాసుకుంటూ ఆనాటి రేషన్ పద్ధతులను కూర్చి వ్రాసినా ఒక చిన్న పుస్తకమవుతుంది. అందుచేత నేను పుట్టిన ఇంటి యజమాని బియ్యపు సుబ్బయ్య నిజాయితీని అభినందిస్తూ నేను జన్మించిన స్థలవర్ణన ఆవుదాం.

# IV
# జననీ జన్మభూమి
# JANANI JANMABHUMI

We salute our Mother and Motherland. There were revolutionary changes- Political, Economic and Social during the 19th and 20th centuries in the world. Many social reformers in various fields were born In the following chapters the description of my family members, the places I was educated and moved about with benefit is given.

" జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ" అనేది ఆర్యోక్తి. మానవజీవితంలో జననీ జనకుల తర్వాత జన్మభూమికున్న ప్రాధాన్యం మరిదేనికీ లేదనుకుంటాను. తాను పుట్టి పెరిగిన పరిసరాలపైనే మానవజీవితంలో వ్యక్తిత్వం రూపుదిద్దుకుంటుంది. పాలుపొంగి చల్లారిన తర్వాత మీగడ కట్టినట్లు జీవితకాలంలో గడచిన చిన్ననాటి అనుభవాలు,స్మృతులు,ఆలోచనలు,ఎంతో

ఉత్తేజకరంగా ఉంటాయి. ముఖ్యంగా నడివయసుకూడా మళ్ళి స్థిమితంగా సంతృప్తికరంగా వెనక్కు తిరిగి చూసుకున్నప్పుడు సింహావలోకనానికి ఉపక్రమించినప్పుడు అందమైన సంతోషప్రదమైన కలలాగా, ఉల్లాసాన్ని వినోదాన్ని కలిగించే పురాణ కాలక్షేపంలాగా, సినిమాలాగా ఆ గడచిపోయిన జీవిత ఘట్టాలు మనసుకు తుష్టినీ పుష్టినీ కలిగిస్తాయి. కష్టనష్టాలకు గురి అయినప్పటికీ కరుణ సన్నివేశాలనే గడచినప్పటికీ అవి గడచిపోయిన చాలా రోజుల తర్వాత వాటిని తలచుకోవడంలో కూడా ఒక మానసిక సంతృప్తే కలుగుతుందికాని ఆనాటి బాధలు, విషాదాలు పునరావృత్తం కావు. అటువంటి పరీక్ష సమయాలు, కష్టకాలాలు కూడా అధిగమించి ఈ నాటికి ఈ స్థితికి చేరుకోగలిగాముగదా అనే విబ్బరమూ సంఘంపట్ల, దేశంపట్ల సంఘందేశం గడచి వచ్చిన సన్నివేశాల పట్ల ఒక తాదాత్మ్యభావమూ, కృతజ్ఞతా భావమూ కలుగుతాయి.

భారతదేశ ఆధునిక చరిత్రలో పందొమ్మిది- ఇరవయ్యో శతాబ్దాలలో కలిగిన అపురూప పరిణామాలు అంతకు పూర్వంకాని ఇకముందుకాని సంభవిస్తాయో లేదో! మన సాంస్కృతిక రాజకీయ సాంఘిక రంగాలలో ఈ రెండు శతాబ్దాలలో భారతదేశంలో కలిగినంత చైతన్యం అంతకు పూర్వం వెయ్యేళ్ళ చరిత్రలో కలిగినట్లు తోచదు. మరి ముందు వెయ్యేళ్ళ సంగతి ఎవరు చెప్పగలుగుతారు?

భారతదేశంలో ఈ శతాబ్ది జాతీయోద్యమం, తద్వారా భారతీయులు సంపాదించుకున్న స్వాతంత్ర్యం, ప్రపంచ చరిత్రలోనే ప్రసిద్ధికెక్కాయి. ఏ రంగంలో చూసినా పందొమ్మిదో శతాబ్ది ఉత్తరార్ధంలో భారతదేశంలో అపూర్వమైన చైతన్యం వెల్లివిరిసింది. ఇందరు మహాపురుషులు, సంఘసంస్కర్తలు విద్యావేత్తలు మత ప్రవక్తలు, రాజకీయ నాయకులు, త్యాగధనులు ఇందరు ఒక్కసారిగా భారతదేశంలో గడచిన శతాబ్దాలలో ఏ ఒక్క శతాబ్దంలోనైనా పుట్టారో లేదో ననిపిస్తుంది. వేల సంవత్సరాల సంప్రదాయానికీ, పాశ్చాత్యదేశాల ప్రభావంవల్ల ఆధునిక నాగరక విలువలకూ ఘర్షణ లేకుండా ఒక సామరస్య సుహృద్భావ సంలీనలతో సమన్వయం జరిగింది జాతీయోద్యమ ప్రభావంతో. పాతకాలపు మంచినీ, సంప్రదాయాన్ని స్వీకరిస్తూనే నవీనావసరాలకు, స్వేచ్ఛతోకూడిన సమానత్వానికీ, మానవత్వపు విలువలకు,

ప్రజాస్వామ్య వ్యవస్థను పటిష్టంచేయడానికి భారతదేశంలో ఈ శతాబ్దిలో ఏన్నో ప్రబోధాలు జరిగాయి. వాటి ఫలితాలు ఇప్పుడిప్పుడే రూపుదిద్దు కుంటున్నాయి.

ఏ వ్యక్తి జీవితంలోనైనా తనకు జన్మనిచ్చిన తల్లిదండ్రులు, తాను పుట్టిపెరిగిన పరిసరాలు, తాను కలిసిమెలిసి జీవించిన ప్రాంతాలు, వ్యక్తులు, తనను ప్రభావితం చేసిన అధ్యాపకులు, తాను చేపట్టిన వృత్తి, ఆతడి వ్యక్తిత్వాన్ని దిద్ది తీర్చడం జరగుతుంది. గడచిన ఘట్టాలు, సంఘటనలు,ఒక దేశచరిత్రలో ఎంత ముఖ్యమో, తన చిన్ననాటి స్మృతులు, వాటి నేపథ్యం, ఒక వ్యక్తి జీవితంలోనూ అంత ప్రాధాన్యాన్నే సంతరించుకుంటాయి.

ఆంధ్రమాత కంఠహారంలో నాయకమణి అంటూ 'భూనరివిభవంబు బెజవాడపుర వరంబు' అని ఒక తెలుగు కవి ఈనాటి విజయవాడను వర్ణించాడు. ఈ విజయవాడకు, కూతవేటుదూరంలో ఉంది మా ప్రాతూరు. కృష్ణవేణీనదీతీరాన, తరతరాల తెలుగువారి అభ్యుదయాన్ని చూస్తూ తానూ కాలంతో దేశంతో మారుతూ వచ్చింది.

ఏ వ్యక్తి జీవితంలోనైనా తన ఊరే తల్లిఒడి. తొలి బడి. ఎప్పుడూ తలచుకోవలసిన గుడి. ఎవరిగురించైనా తెలుసుకోవాలంటే తల్లిదండ్రుల కన్నాముందే ఏ ఊరు అని వాకబు చేస్తాం. అది ఎందుకో తెలియదు. ఏ ఊరైతేనేం? కాని మన సంస్కృతిలో మన ఆలోచనా విధానంలో మన పసితనాన్ని బాల్యాన్ని యౌవ్వనం రాకపూర్వం తారుణ్యాన్నీ ప్రభావితం చేసిన ఊరికీ బంధుబలగానికీ అత్యంత ప్రాధాన్యం ఉంది. అందువల్ల ఈ మా తరం కథ లో ముందు ప్రకరణాలలో జననీ, జన్మభూమీ, పితృప్రపితామహులు, అమ్మ, అమ్మమ్మలు, మాతా మహులు, వాళ్ళ గుణగణాలు, వైశిష్ట్యాలు, మొదలైన విషయాలు చెప్పడం జరిగింది. మాతరం కథకుడిగా వీటిని ముందు వివరించడం సబబే ననుకుంటాను.

# V

# మీదే ఊరు?

# TO WHICH PLACE YOU BELONG

> Everyone is an Indian first! And, it is difficult to answer in my case specially! I was born in Rajahmundry - educated in Krishna, East Godavary and city of Madras too! Finally to-day they claim me as a Hyderabadee!

"మీ స్వగ్రామం ఏదని?" మనలను ఎందరో అడుగుతుంటారు. నా విషయంలో ఇది చెప్పిన పరిష్కారంకాని సమస్య అయికూచుంది. బహుప్రదేశ నివాసుడను కావటంచేత నాది ఏ ఊరో మీరే నిర్ణయించుకోవచ్చు.

మన ఊరు ఇది, అన్నప్పుడు ఆ ఊరులో మనకు ఆస్తిపాస్తులుండాలి. లేకపోతే అక్కడ మనం స్థిర నివాసం ఏర్పరచుకొని అయినా ఉండాలి. ఇతర దేశాలలో మనం నివాసార్థం వెళ్ళినప్పుడు అయిదు సంవత్సరాల పాటు అక్కడ

స్థిరంగా ఉంటే స్థానికంగా పౌర సత్వం కోసం దరఖాస్తు చేసుకోవచ్చు. అభివృద్ధి చెందిన పాశ్చాత్యదేశాలలో ఈ పౌర సత్వం పొందటానికి అనేక షరతు లుంటాయి. అయితే మనవంటి వర్ధమానదేశాలలో పేదరికం ఎక్కువగా ఉండడంచేత యీ దేశాలకు వలసవచ్చేవారు చాలా తక్కువ మంది ఉంటారు. పైకి ఇట్లా కనిపించినా ఎవరైనా పరదేశస్థుడు మనదేశపు పౌర సత్వం కోసం దరఖాస్తు పెడితే ఇక్కడ కూడా ఆ వ్యక్తి అనేక చిక్కులను ఎదుర్కోవలసి వస్తుంది.

నేనైతే భారతదేశంలోనే పుట్టానుగాబట్టి నాకు భారతీయుణ్ణి అనిపించుకొనే హక్కుంది. అయితే మన ఊరు ఏదో తెలుసుకొంటే, తెలియచెప్పుకొంటేగాని మనకొక వ్యక్తిత్వం రాదు. అందువల్లనే కాబోలు సంధ్యావందనంలో ప్రవర చెప్పుకున్నట్లు చెప్పుకుంటే తప్ప భగవంతుడి దగ్గరకూడా మన కార్యాకార్యాలు రికార్డు కావు. అందుకనే సంధ్యావందనలో జంబూద్వీపే భరతవర్షే, భరతఖండే ఇత్యాది ప్రకటన చేర్చి ఉంటారు. చివరకు ఉనికిని గూర్చి కూడా స్వగృహం అయితే "స్వగృహే' అనీ కాకపోతే "వసతిగృహే" అని కూడా చెప్పుకోవాలి. ఆ మాదిరిగానే ఈ ప్రపంచంలో ఏ ఊరో, ఏ జిల్లానో చెప్పుకోవాలి. మనం ఎవరినైనా కొత్త వారిని కలుసుకున్నప్పుడు ఒకే జిల్లావారమయితే అయితే మనది ఒకే జిల్లా అన్నమాట అని ఆత్మీయత కలుపుకుంటాం. ఇహ ఒకే ఊరివారయితే అందునా ఒక ఇంటిపేరువారైతే చుట్టరికం కూడా కలిసినట్లే. అందువల్ల మన ఊరు చెప్పుకోవడం ముఖ్యం. మీదే ఊరు?

మా మాతామహుల స్వగ్రామం కాకినాడ, తూర్పుగోదావరి జిల్లా. మా పితామహుల ఊరు ప్రాతూరు. అది గుంటూరు జిల్లా. మా ఇంటిపేరు కూడా ప్రాతూరు కావడంచేత మీదే ఊరంటే, ప్రాతూరనే చెప్పాలి. మా ఊరు తాడేపల్లి మండలం గుంటూరు జిల్లాలో ఉంది. పోస్టల్ పిన్ కోడ్ 522501. సరిగ్గా విజయవాడ గవర్నరుపేటకు ఎదురుగా కృష్ణానదికి అవతల ఒడ్డున ఉన్నది. వేసవి కాలంలో అయితే కృష్ణలో నీరు లేనప్పుడు నదికి అడ్డంగా నడచిపోతే ఒక మైలుదూర మన్నమాట. తరువాత ప్రాతూరును విజయవాడతో కలిపే రోడ్డు కూడా నిర్మించబడటంతో మా ఊరు ప్రాతూరు విజయవాడ నాగరకతలో

త్వరత్వరగా కలిసిపోయే అవకాశాలు ఏర్పడ్డాయి. ఈ విషయం ఎందుకు చెప్పవలసి వచ్చిందంటే మా ఊరు గుంటూరు జిల్లాలోనే ఉన్నా జీవనోపాధికి మా ఊరి వాళ్ళంతా కృష్ణాజిల్లాకు చెందిన విజయవాడమీదనే ఆధారపడ్డారు అని చెప్పటానికే. అందువల్ల మమ్మల్ని కృష్ణా జిల్లా వారికిందే పరిగణించవచ్చు. చదువు సంధ్యల విషయంలో మా నాన్నగారి తరంనుంచీ అంతా విజయవాడకే వెళుతూ వచ్చాం. ఇంకా మా మేనత్తలు విజయవాడనుంచి హైదరాబాదు వెళ్ళే రహదారిలోని కేతనకొండ గ్రామంలో ఉండేవారు. అక్కడే మేము మా చిన్నతనమంతా గడిపాము. మా పెదనాన్నగారు నందిగామలో రెవెన్యూ ఇన్‌స్పెక్టరుగా చాలా ఏళ్ళు పనిచేశారు. అప్పుడు మేము అక్కడ పెద్ద మర్రి చెట్టు దగ్గిరలో ఉన్న అయ్యదేవర కాళేశ్వరరావు గారింట్లో ఉండేవాళ్ళం. నా అక్షరాభ్యాసం ఆ ఊళ్ళోనే జరిగినట్లు లీలగా గుర్తు. మా పినతాతగారు అంటే మాతామహుల వైపునుంచి కలపటపు సుదర్శనరావుగారు. ఈయన మా మాతామహుడికి పినతండ్రికుమారుడు. నాకు అక్షరాభ్యాసం చేశారు.ఆయన అప్పట్లో కృష్ణాజిల్లాకు ఇంకా ఇతర జిల్లాలకు జిల్లా విద్యా శాఖాధికారిగా పనిచేశారు. ఆ రోజుల్లో జిల్లా విద్యా శాఖాధికారి అంటే ఎంతో పెద్ద హోదాగల ఉద్యోగం. ఆయన నాకు అక్షరాభ్యాసం చేసి 'ఒరేయ్, నా పేరు ఎలా నిలబెడతావో నీవు?' అని నన్ను ఆశీర్వదించారు. ఆయన కోరిక వృధా కాలేదనీ నేను ప్రొఫెసర్‌నుకూడా అయినానని తెలిస్తే ఆయన చచ్చి స్వర్గాన ఉన్నా సంతోషిస్తాడనే అనుకుంటాను.

ఇక కృష్ణా జిల్లాతో మాకుటుంబ సంబంధాన్ని చెప్తాను. కృష్ణా జిల్లా గన్నవరం తాలూకా ఎలకపాడులో మా నాన్నగారు మొదట ఎలిమెంటరీ స్కూలు ఉపాధ్యాయులుగా పనిచేశారు.తరువాత ఉంగుటూరు, పెద్ద అవటపల్లి, గన్నవరం, కానుమోలు, మొదలైన పల్లెటూళ్ళలో ఉపాధ్యాయులుగా పనిచేశారు. గన్నవరం స్కూలులోనే నేను స్కూలు ఫైనల్ పూర్తి చేశాను. అందువల్ల మేము కృష్ణాజిల్లా వాసులమని చెప్పినా, ఎన్ని ఊళ్ళు తిరిగినా మీదే ఊరంటే ప్రాతూరనే సమాధానం చెప్పాల్సి ఉంటుంది.

అయితే ఏ జిల్లా అని ఇదమిత్థంగా చెప్పమంటే నాకు కొన్ని ఇబ్బందులు ఎదురవుతాయి. నేను జైలుకు వెళ్ళిన మొదటి వారంలో ఒక సంఘటన జరిగింది. అక్కడ జైలులో డెటెన్యూలుగా ఉన్నప్పుడు కొన్ని జిల్లావారీగా

మేమంతా విభాగమై ఒక వారం రోజులు వంతుల వారీగా సాముదాయకంగా వంటలు చేసుకునే వాళ్ళం. అప్పుడొకరు మీదే జిల్లా అని అడిగారు నన్ను.

మా అమ్మగారిది కాకినాడ. తూర్పుగోదావరి జిల్లా. నేను పుట్టిన రాజమండ్రి కూడా తూర్పుగోదావరి జిల్లాయే. మా అత్తవారిది ఏలూరు. పశ్చిమగోదావరి జిల్లా. సరే ఇక కృష్ణా, గుంటూరు జిల్లాలతో ఉన్న సంబంధం మీకు తెలుసు. తరువాత వృత్తి విద్య, విద్యార్థిదశ, డాక్టరుగా ప్రాక్టీసు చేస్తూ 1935 నుంచి 55 వరకు మద్రాసులోనే ఉన్నాను. అంటే నా యౌవ్వనకాలం, వైద్యవృత్తి, రాజకీయ జీవితం, అంతా మద్రాసులోనే గడచింది. తరవాత క్విట్ ఇండియా ఉద్యమంలో మిత్రులందరితోపాటు మద్రాసు పట్టణంలోనే అరెస్టయి నెల్లూరు, తంజావూరు జైళ్ళలో మద్రాసు ముఠాగానే గడిపాను. మద్రాసునుంచి అరెస్టయిన మిత్రులం పదకొండుమందిమీ, మద్రాసు జిల్లాగా ఉండి, వంట బాధ్యత తీసుకున్నాము. మా బృందంలో ఆంధ్రులు, తమిళులు, మలయాళీలు, అంతా ఉన్నాము. అందుచేత జిల్లాలకతీతంగా జీవితం గడిపి నూతన వికసిత భావాలతో ఉన్నమాకు మాది మద్రాసుజిల్లా అని సమర్థించుకొని పనిచేయడానికి సంతోషం కలిగింది. ఇదీ నన్ను మీది ఏ జిల్లా అని అడిగితే సమాధానం చెప్పడంలోని కష్టం. జైల్లో ఎవరికీ లేని సమస్య ముఖ్యంగా నాకు ఎదురైంది.

ఏది ఏమైనా మాది ప్రాతూరు అనే చెపుతాను. జిల్లా ఏదంటే మీ నిర్ణయానికే వదలివేస్తున్నాను. అయినా మాది గుంటూరు జిల్లా అని గుంటూరు జిల్లా మిత్రులకు చెప్పే సావకాశం ఇప్పటికి కలిగింది. జీవితం ఎన్నో పరవళ్ళు, ఉరవళ్ళు చూసి ఆఖరకు హైదరాబాదు పట్టణంలో స్థిర నివాసం ఏర్పరచుకొన్నాను.

ఇప్పుడు తెలంగాణా మిత్రులంతా మా తిరుమలరావుగారిది హైదరాబాదు జిల్లా అంటే సంతోషంగా సగర్వంగా అవునంటున్నాను.

# VI

# మా ఊరు ప్రాతూరు

# MY NATIVE PLACE IS PRATURU

Praturu is a village with its usual inconveniences - lack of road communication - dry crops - poverty - thieves everywhere - Tadepalli CRIMINAL settlement for tribals - Kotappa the dacoit, - Andaman Returned!

మీది ఏ ఊరు అంటే "ప్రాతూరు"నే చెప్పుకోవాలి. మా ఊరు కృష్ణా నదికి దక్షిణం గట్టును ఆనుకుని విజయవాడలోని గవర్నరుపేటకు లంబకోణంలో సరిగ్గా అవతలి ఒడ్డున ఉంది. పూర్వం రోజులలో అయితే వేసవికాలంలో కృష్ణ ఎండిపోయినప్పుడు అడ్డంపడి అంతా ఒక మైలు వెడల్పు నడిస్తే మా ఊరునుంచి విజయవాడ చేరుకునేవారం. ఏరుబాగా వచ్చినప్పుడు చిన్న పడవలమీద మనుషులు, సరుకులూ ఇవతలనుంచి అవతలకు చేరవలసి ఉండేవి. ఇప్పుడు తాడేపల్లి వైపు "ప్రకాశంబారేజి" కట్టిన తర్వాత ఈ డింగీల

బాధ తగ్గింది. ఇప్పుడైతే ఇంకా కిందగా గవర్నరుపేటవైపే కనక దుర్గావారధి కట్టిన తరువాత మా ఊరు ప్రాతూరు, దాదాపు విజయవాడలో కలిసిపోయినట్లే. ఇప్పుడు బస్సు సర్వీసు కూడా సౌకర్యంగా ఏర్పడటం వల్ల చాలా అనుకూలంగా వుంది విజయవాడ చేరాలంటే. కొద్ది నిముషాలలోనే మా ఊరు నుంచి విజయవాడ చేరుకోగలుగుతున్నాము. ఈ విధంగా ఇప్పుడు స్వర్గానికి బెత్తెడు దూరంలోనే ఉన్నామన్నమాట. అప్పుడు ఎన్నో అసౌకర్యాలకు పుట్టినిల్లయిన మా ఊరు ఇప్పుడు పూర్తిగా మారిపోయింది. ఒకప్పుడు మా ఊరి గురించి మేము ఎటువంటి కలలు కన్నామో, మా ఊరిప్రజలంతా ఏం కోరుకునే వారో అవన్నీ ఇప్పుడు మా ఊరి విషయంలో యధార్థమైనాయి. మేం పెద్దవారమైన తర్వాత చేసిన కృషి ఫలించింది. ఆ సంతోషం మా ఊరి వారందరకీ ఉంది.

నాటికీ నేటికీ కూడా భారతదేశంలో నెలకొని ఉన్నది గ్రామీణ సామాజిక వ్యవస్థే అని చెప్పాలి. ముఖ్యంగా గ్రామాలే ఈ నాటికీ భారతదేశంలో వెన్నెముకగా ఉంటున్నాయి. నూటికి ఎనభయి శాతం జనాభా నేటికీ పల్లెల్లోనే నివసిస్తున్నారు. అంతేకాక స్థూలంగా చూస్తే భారతదేశంలో నూటికి 70 మంది వ్యవసాయ, తదితర అనుబంధ వృత్తుల్ని ఆధారం చేసుకొనే భారతదేశంలో జీవిస్తున్నట్లు తెలుస్తుంది. మన జనాభా లెక్కల ద్వారా సేకరించిన అంశం ఇది.

సంపన్న దేశాలలో అంటే పారిశ్రామికంగా అభివృద్ధి చెందిన దేశాలలో నూటికి 8 లేదా 10 మంది మాత్రివే వ్యవసాయాన్ని జీవిక వృత్తిగా చేసుకుంటారు. అంతేకాక వ్యవసాయాన్ని పారిశ్రామికంగా నిర్వహిస్తారు. ఆధునిక పద్ధతులలో దేశానికి కావలసినంత ఫలసాయాన్ని ఉత్పత్తి చేస్తారు. కాబట్టి మన దేశంలో అధిక సంఖ్యాక జనులు వ్యవసాయంపై ఆధారపడుతున్నారంటే అదే వారి జీవనోపాధి అయిందంటే ఏమన్నమాట? మనదేశంలో సంపద, ఉత్పత్తి కావటం లేదన్నమాట. ఇంకా దేశం దారిద్ర్య స్థితినే అనుభవిస్తున్న దన్నమాట. భారతదేశంలో సగటు ఆదాయం చాలా తక్కువ. అదే మన దుస్థితికి మూలకారణం. అయినప్పటికీ శ్రమకోర్చి కష్టనష్టాలను లెక్కలోకి తీసుకోకుండా మన రైతాంగం ఇప్పుడిప్పుడు ఆధునిక వ్యవసాయ పద్ధతులకు కూడా అలవడుతూ మన దేశానికి కావలసినంత ఆహారం ఉత్పత్తి చేస్తున్నందుకు వారిని నిజంగా అభినందించాలి. దేశానికి కావలసిన ఆహారపదార్థాలు ఉత్పత్తి

అవుతూనే ఉన్నా మన దేశ జనాభాలో ఇంకా నూటికి ముప్పైశాతం, అంటే దాదాపు 320 మిలియన్ల జనం రెండుపూటలా కడుపునిండా తిండికైనా నోచుకోవటంలేదు. అంటే లోపం ఎక్కడున్నదన్నమాట! పంపిణీ విధానంలో ఏవో అవకతవక లున్నాయన్నమాట. ఇంకొక సంగతి ఏమంటే జనసామాన్యం కొనుగోలుశక్తి కావలసిన స్థాయికి పెరగక పోవడమన్నమాట. ఈ విషయం మనరాజకీయ వ్యవస్థ సత్వరంగా గుర్తించాలి. ప్రజా సంక్షేమ కార్యక్రమాలు ఇప్పటికైనా ఇంకా చిత్తశుద్ధితో అమలు చేయగలగాలి. అప్పుడుగాని సాధించిన అభివృద్ధికి సరైన అర్థం చెప్పుకోలేము.

దేశానికి, రైతు వెన్నెముక అంటారుకాని ఆ రైతు సుఖంగా శాంతంగా జీవించటానికి సరిఅయిన పరిస్థితులున్నాయో లేవో పట్టించుకోరు. రైతుల జీవనస్థితిగతులు మెరుగు పడటం అనే విషయంలో తరతరాల పరిస్థితి ఒకటిగానే ఉంది. తాతలనాటి స్థితిగతులు అలాగే ఉన్నాయనిపిస్తున్నది. పూర్వ కాలంలోనైతే పండిన పంటలో కొంత భాగం తమకివ్వవలసిన పన్నుగా రాజులు సంగ్రహిస్తూ ఉండేవారు. రాజ్యాన్ని జాగ్రత్తగా కరువుకాటకాలు, దరిద్రం లేకుండానూ, వచ్చినా వాటిని ఎదుర్కోగల సత్తాతోవారు ఆనాటి వ్యవస్థను ఏర్పాటు చేసుకున్నారు. ఈనాటి వ్యవస్థ మారిపోయింది. ఇప్పుడు మనం ప్రజాస్వామికవ్యవస్థను స్వీకరించాం.

మన రాజ్యాంగాన్ని అందుకు అనుగుణంగా రూపొందించుకున్నాం. ప్రకృతి వైపరీత్యాలు, ఆపదలు, ప్రమాదాలు, అప్పుడూ ఇప్పుడూ ఎప్పుడూ ఉండేవేననిపిస్తుంది. పంటలు సరిగాపండక పోవటం, వరదలు రావడం, ఉప్పెనలురావడం, జననష్టం, జనం నిర్వాసితులు కావడం ఇప్పుడూ చూస్తున్నాం. ఇప్పుడైతే ఎన్నో నదుల మీద ప్రాజెక్టులు వచ్చాయి. వ్యవసాయానికీ జనావాసానికీ నీటి సౌకర్యం ఏర్పడింది. వెనకటికాలం కన్నా పాడిపంటలు కూడా ఇప్పుడు వృద్ధి అయినాయి. కాని వంద, రెండు వందల సంవత్సరాల కిందట గ్రామీణ వ్యవసాయమంతా కేవలం వర్షాధారం మీదనే సాగేది. అందువల్ల కరువు కాటకాలు ఎక్కువగానే ఉండేవి. మన రాష్ట్రంలో మాత్రం కృష్ణా, గోదావరులు, జీవనదులు, మనను కాపాడుతుండేవి. కృష్ణా, గోదావరీనదుల మీద ఆనకట్టలు కట్టి, కాలువల ద్వారా కోస్తా జిల్లాలు;

సస్యశ్యామలం కావటానికి తోడ్పడ్డ "కాటన్"(Sir Arthur Cotton) దొరగారు ఆంధ్రులకు చిరస్మరణీయులు. ఈ విషయంలో భారతదేశంకూడా ఆయనకు కృతజ్ఞమై ఉండాలి.

## మా వూరి పరిసరాలు

ఇక మా ప్రొద్దుటూరు స్థితిగతులు గురించీ ప్రత్యేకతలు గురించీ కొంచెం చెప్పాలి. ఒక జాతి పురోభివృద్ధి, పురోగమనం గూర్చి తలచుకొన్నప్పుడు "పరమపదసోపానపటం" ఆట జ్ఞాపకానికి వస్తుంది. ఒక్కొక్క మెట్టు ఎక్కి పైకి పోతున్నప్పుడు కొన్ని ఆటంకాలు కూడా ఎదురవుతూనే ఉంటాయి. జారుతూ పడుతూ లేస్తూ మెట్లు ఎక్కాలి. ప్రణాళికలు నిచ్చెనలు అనుకుంటే వాటిని సరిగా అమలు చేయలేకపోవడం మనం ఎదుర్కోవలసిన అవరోధాలు అనుకోవాలి. సోమరితనం పెద్ద ఆటంకం. మన అవసరాలేమిటో గుర్తించలేక పోవడం అదొక పెద్ద అవరోధం. ఇవన్నీ సోపానపటంలో 'పాములు'. నిజానికి జాతిచరిత్రలో ప్రగతికి కొన్ని సౌకర్యాలు ముఖ్యం. అందులో మొట్టమొదటి సౌకర్యం రహదారులు.

దారులు సరిగా వుంటే రాకపోకలు బాగా సాగుతాయి. ప్రయాణం రద్దీ ఉంటుంది. ఒక ఊరి నుంచి ఇంకొక ఊరికి త్వరత్వరగా వెళ్ళవచ్చు. కాని ఆ రోజుల్లో ప్రయాణ సౌకర్యాలు సరిగా ఉండేవి కావు. ఈ రోజులలో విమాన ప్రయాణం చేసి అమెరికానించి పదిహేనువేల కిలో మీటర్లు హుటాహుటి భారతదేశానికి రాగలుగుతున్నాం. మా తరంలో అంటే 70, 80 ఏళ్ళ కిందట 20 కి.మి వెళ్ళటానికి అమెరికా నుంచి ఇండియా చేరుకునేంత కాలం పట్టేది. అంటే సాధారణంగా కాలినడకనో, ఊరినుంచి ఊరికి రైతులు రెండెడ్ల బండిలో జల్ల వేసుకుని గూడుకట్టుకొని, దానిపై ఈతాకు చాపలు కప్పి ఎండతగలకుండా మెల్లిగా ప్రయాణం చేసేవారు. కొంచెం బెజవాడ (విజయవాడ)లాంటి పట్టణాలలో అయితే ఒంటెద్దుబళ్ళు, గుర్రపుబండ్లు ఉండేవి. ఈ నాటి సిటీ బస్సులు ఆనాడు లేవు. చాలా కాలానికి పెద్ద రహదారుల మీద చాలా పరిమితమైన సంఖ్యలో బస్సులు కనిపించేవి. అవి బొగ్గుతో నడిచే బస్సులు. తరవాత తరవాత క్రమంగా ఆయిలు, పెట్రోలు ఇంజన్లతో నడిచే బస్సులు

వచ్చాయి. నేటి కాలపు బస్సు సర్వీసులు ఇంచుమించు ప్రతి పల్లెనూ కలుపుతున్నాయి.

అందుచేత పెద్ద ప్రయాణాల మాట అటుంచి మా ప్రాతూరు నుంచి విజయవాడ రావాలంటే కాలినడకన రైలు బ్రిడ్జిదాకా నాలుగైదు కిలోమీటర్లు నడిచి ఆ తర్వాత రైలు బ్రిడ్జిపైనే కాలినడక నడిచి దాని మీదుగా బెజవాడ చేరుకునేవాళ్ళం. ఈ బ్రిడ్జిమీద నడవటానికి పన్ను కూడా వసూలు చేసేవారు. ఈ పన్ను వసూలు చేయటానికి పాటపెట్టి కాంట్రాక్టు ఇచ్చేవారు. ఆ రోజులలో ఈ కాలినడక వంతెన నుపయోగించుకోవటానికి ఒక అణా తీసుకొనేవారు మనిషికి. అణా అంటే ఆనాడు రూపాయిలో పదహారోవంతు. అంటే ఇప్పుడు సుమారు 6,7 పైసలన్నమాట. ఈ రూపాయి కొనుగోలు శక్తినీ, విలువనూ అలా ఉంచండి.

ఇట్లా వంతెనపై ప్రయాణం చెయ్యనక్కరలేకుండా మా ఊరు ప్రాతూరు, రేవునుంచి తిన్నగా 'డింగీలు' అంటే చిన్నపడవలు అటూఇటూ తిరుగుతూ ఉండేవి. సరుకులు వగైరా వ్యాపార రీత్యా బెజవాడకు మనుష్యులతో సహా చేరుస్తూ ఉండేవి ఈ డింగీలు. ఏటి వొడ్డు ఊరవడంచేత మా ఊళ్ళో అంతా గజఈతగాళ్ళు ఉండేవారు. మా ఊరి మూలలో పెద్ద ఏరువరదగా వచ్చినప్పుడు హుషారుగా ఈ గట్టునుంచి అవతలి గట్టువరకూ మళ్ళీ అవతల నుంచి తిరిగి ఊరి గట్టువరకు ఒకే దమ్ములో ఈదే గజీతగాళ్ళు ఉండేవారు. ఏటి మధ్యలంక భూములు కూడా చాలా ఉండేవి. అందుచేత మేతకోసం గొడ్లను ఏటిలో దింపితే అవి ఈదుకుంటూ లంకలోకి మేతకోసం పోయి మేసి సాయంత్రానికి తిరిగి వచ్చేవి. ఈ గొడ్లవెంట ఒక మనిషి తెప్పమీద ఈదుకుంటూ ఏటిలో కూడా మళ్ళేసుకుంటూ గొడ్లను కాసుకుని వచ్చే గొడ్డు కాడి బుడ్డోళ్ళు ఉండేవారు. 10 సంవత్సరాల మధ్య వయసుపిల్లలకు ఇదే పని. ఇప్పుడు మనం పిల్లల శ్రమ జీవితం, చైల్డ్ లేబర్, హర్షించటం లేదు. అయితే ఆ రోజుల్లో అందరికీ చదువుండేది కాదుకదా. ఆ రోజుల్లోనూ ఈ రోజుల్లోనూ ఏదో ఒక పని చేస్తూనే ఉన్నారు పిల్లలు. అది ఆ వర్గంవారి బ్రతుకుతెరువుకు అవసరం. సరిఅయిన ప్రాథమిక విద్యా విధానం ఆచరణలో లేనంతవరకు, ఇది తప్పదు. పిల్లలందరికీ సరిగా చదువుకునే అవకాశం, ఆదుర్దాకలగాలి. అప్పుడుగాని అందరికీ విద్య అనే

ఆశయం ఫలించదు. ఈ విధంగా గొడ్లూ, మనుష్యులూ లంకల చుట్టూ తిరగడానికి వారు తినే ఆహారం ఉపయోగపడేదనుకోవచ్చు. గొడ్లకైతే అక్కడ పుష్కలమైన, పుష్టికరమైన ఆహారం లభించేది. అందుకే 'లంకమేత గోదావరిఈత' అనే సామెత పుట్టి ఉంటుంది.

## దారిదొంగలు – దారిద్ర్యం

ఇక మా ఊరికి సంబంధించి, ఆ ప్రాంతాల గురించి, ఇతర రవాణా సౌకర్యాలు ప్రస్తావించు కుందాం. ప్రయాణ సౌకర్యాలు మెరుగుపడాలంటే మంచి రహదార్ల అవసరం తప్పనిసరి. మా కృష్ణకట్ట మీద ఎగువవైపు నడిచి బ్రిడ్జి దగ్గరకు చేరుకోవలసి ఉండేది. చీకటి పడితే దొంగల భయం వుండేది. దొంగల, దొంగతనాల ప్రస్తావన ఎలాగూవచ్చింది కాబట్టి, ఆనాటి దారిదోపిళ్ళ వృత్తాంతాలు కొంచెం చెపుతాను. అప్పట్లో దొంగల భయం జాస్తిగానే ఉండేది. అది ఆనాటి సామాన్య జన దారిద్ర్యానికి చిహ్నం అనుకోవచ్చు. చదువులేక పోవటం, పొట్టకూటికి ఇతర సాధనాలు లేకపోవటంవల్ల పాటక జనం ఈ దొంగతనాలకు దిగేవారు. అయితే నవ నాగరకత పెరిగిన చోట్లలోనూ కరువుకాటకాలు తమ ప్రభావం చూపుతున్న చోట కూడా దొంగతనాలు, దారిదోపిళ్ళు ఇప్పుడు మాత్రంలేవా? అందులో ఆ రోజుల్లో ప్రయాణాలు కూడా మెల్లిగా ఏ రెండెడ్లబండిలోనో కాలినడకలనో సాగేవికదా! అప్పుడు దారులు కొట్టటం బహుతేలికగా ఉండేది.

ఈ దొంగతనాలు, ఎక్కువగా ఎరుకలు ఏనాదులు మొదలైన అరణ్య జాతులవారు చేసేవారు. బలహీనవర్గాలకు చెందిన అట్టడుగు మాలమాదిగలు కూడా చేసేవారు. బ్రిటిషువారు, నాగరక జాతులకు చెందిన వారవటం చేత ఈ నేర జాతుల వారిని(క్రిమినల్ ట్రైబ్స్)సంస్కరించాలని తలపోశారు. అందువల్ల మన దేశంలో వాళ్ళ ప్రభుత్వం స్థిరంగా కుదురుకున్న తర్వాత ఈ నేరస్త జాతుల జీవన పరిస్థితులు బాగుచేయాలని ప్రభుత్వం ఆలోచించింది. అక్కడక్కడ ఈ జాతులకు నివాస సౌకర్యాలు ఏర్పరచి పనులు కల్పించి వారికి దొంగతనం చేయవల్సిన అవసరంలేకుండా చేయడానికి ప్రయత్నించారు. ఇట్లా ప్రభుత్వం ఆ రోజుల్లో ఏర్పటు చేసిన స్థావరాలను క్రిమినల్ సెటిల్‌మెంట్లు అనేవారు.

ఇక్కడంతా వనవాసి తెగల వారైన ఎరుకలు, ఏనాదులు ఎక్కువగా ఉండేవారు. బెజవాడ రైలు బ్రిడ్జి దిగగానే ఏటి ఒడ్డు పక్కనే ఆనాటి బ్రిటిషు ప్రభుత్వంవారు ఇలాటి క్రిమినల్ స్థావరాన్ని ఒకటి ఏర్పాటు చేశారు. అటువంటి ఆ ఎరుకల నివాస స్థావరంలో ఒక స్కూలు పెట్టి వాళ్ళ పిల్లలకు పాత బుద్ధులు రాకుండా చదువు చెప్పించేవారు. ఒక క్రైస్తవ మిషనరీ కూడా అక్కడ ఉండే ఏర్పాటుండేది. ఒక చర్చి కూడా ఉండేదక్కడ. వృత్తి జీవనానికి కూడా ఏర్పాటు చేసేవారు. వారిని సుబుద్ధుల్ని చేయటానికి, సన్మార్గంలో జీవిస్తే మిగతా సంఘంలోని ఇతరులతో సమాన స్థాయికి చేరుకోవడానికి చేసే ప్రయత్నం ఇదంతా. ప్రభుత్వం వారి ప్రయత్నం అప్పట్లో చాలావరకూ సఫలమైందనే చెప్పాలి.

## పుట్టుకతో పుట్టిన బుద్ధి పుడకలతో గాని పోదంటారు

కుక్కతోక సరిచేయటం ఎంతకష్టం! అయినా ఈ ప్రయత్నం సఫలం కావడానికి ప్రభుత్వాధికారులు మరో ప్రయత్నం కూడా జోడించేవారు. రోజూ పోలీసులు వచ్చి అందరూ ఇళ్ళలో ఉన్నారా లేదా అని గస్తీ తిరిగేవారు. ఈ గస్తీ పోలీసులు అక్కడి నివాసగృహాలకు వచ్చి తనిఖీ చేసి హాజరు మార్కు వేసుకుని వెళ్ళేవారు. అయినా ఇందులో కొందరు చురుకుపాలుగల వాళ్ళు పోలీసులతో లాలూచీ పడి బయటకు పోయి దొంగతనాలు దోపిళ్ళూ యథావిధిగా కొనసాగిస్తూనే ఉండేవాళ్ళు. పోలీసులు గనక లాలూచీ పడ్డారా ఇది తేలికైన పనేగా. మరి యీ ప్రయత్నం ఎట్లా సఫలంకావాలంటే, పెద్ద తరంవారయిన యీ జాతుల వారి బుద్ధులు మారినా మారకపోయినా వాళ్ళ పిల్లలకైనా యీ బుద్ధులు అబ్బకుండా చూడాలన్నదే ఈ సెటిల్‌మెంటు అధికారుల తాపత్రయమూ, సదాశయమున్నూ.

ఈ విధమైన పొద్దు ఒక్క మన దేశం ముఖం మీదనే పొడవ లేదు. బ్రిటిషువారు కూడా వాళ్ళ దేశంలో నేరస్తజాతులతో బాధలు పడినవాళ్ళే. రెండు మూడు వందల ఏళ్ళకు పూర్వం బ్రిటన్‌లో కూడా స్వదేశీయులైన నేర ప్రవృత్తిగలవాళ్ళను హంతకులను అత్యాచారులను సంస్కరించలేక ఆస్ట్రేలియా దేశానికి వలస పంపించేవారు. అక్కడే ఆ ఖైదీలంతా స్థిర నివాసం ఏర్పరచుకొని ఎంతో కష్టపడి బాగా మారిపోయారు. వారి తరువాత తరాల వారు

సౌభాగ్యవంతులైనారు. ఆనాటి బ్రిటిషు క్రిమినల్సు మనుమలు, ముని మనుమలు, మీ తాతలిట్లాంటి వారంటే ఏమనుకొంటారో మన కిప్పుడు తెలియదు. కాని ఈ తరం ఆస్ట్రేలియనులు తమ గత తరాల చరిత్రకు ఏమీ సిగ్గు పడనవసరం లేదనే నా భావం.

## అండమాను ఖైదీలు

మనదేశంలో కూడా బ్రిటిషువారి కాలంలో యావజ్జీవ ఖైదు శిక్ష పడ్డ హంతకులను, తమ అధికారానికి ప్రమాదకరమని భావించిన విప్లవ కార్యకలాపాలు చేపట్టిన వారినీ, రాజకీయ ఖైదీలనూ అండమాన్ దీవులకు పంపేవారు. దీన్ని అప్పట్లో ద్వీపాంతరవాస శిక్ష అనేవారు. మన దేశంలో వారికి అండమాను ద్వీపాంతరమయితే కిందటి శతాబ్దాలలో ఆస్ట్రేలియాకు పంపించే ఖైదీలకు అది ద్వీపాంతర వాస శిక్షగా ఉండేది ఒకటే తేడా ఇందులో. మన అండమాన్ ఖైదీలు ద్వీపాంతర శిక్ష అవగానే తిరిగివారు స్వదేశానికి వచ్చేవారు. అయితే ఆస్ట్రేలియాకు ద్వీపాంతరవాస శిక్ష అనుభవించేందుకు చేరేవారు అక్కడే స్థిర నివాసం ఏర్పరచుకొనేవారు. తరతరాలు అక్కడే గడిపి ఆ దేశస్థులే అయిపోయేవారు. అయితే ఇప్పుడు ఇంగ్లండు వారూ ఆస్ట్రేలియావారూ పరస్పర సోదరభావంతోనే మెలగుతున్నారు.

ఇక మా ప్రాతూరు పరిసరాల్లోని ఒకటి రెండు సెటిల్‌మెంట్లను గూర్చి వివరిస్తాను. ఇందులో ముందుగా చెప్పవలసింది సీతానగరం సెటిల్‌మెంటు. ఈ సెటిల్‌మెంటు ఎరుకల వారికోసం, వీళ్ళనే ఎలుకల వారనికూడా అంటారు. వీళ్ళకు స్థిర నివాసం కల్పించే నిమిత్తం ఏర్పాటు చేశారు. తాడేపల్లి దగ్గర 'సీతానగరం' అనే పాత ఊరి స్థలంలో కృష్ణగట్టును ఆనుకొని ఈ సెటిల్‌మెంటు మంచి సుందరమైన వాతావరణంలో వుంది. అక్కడ సీతానగరం అనే చిన్న పల్లె పేరుకు మాత్రం ఉన్నా మిగిలిందల్లా ఒక ప్రసిద్ధకెక్కిన ఆంజనేయ దేవాలయమే.

ఈ ప్రదేశంలో ఒక ఆస్పత్రి, స్కూలు, చర్చి, మిషనరీ నివాసం ఉండేవి. ఇవన్నీ నాగరకతకు మారు రూపాలా అన్నట్లు అక్కడ చక్కగా నెలకొని ఉండేవి. ఆస్పత్రిని మాత్రం చుట్టు పక్కల ఉండే జనమంతా ఉపయోగించుకొనేవారు.

ఆ స్కూలులో చదివిన అప్పటి వెనుకబడిన జాతుల పిల్లలు పెద్ద పెద్ద ఉద్యోగస్థులైనారు. నవనాగరకతలో చేరిపోయారు.

తరవాత తరవాత ఈ సెటిల్‌మెంటు అంతా శిథిలమై పోయింది. పాతతరం వారంతా కాలగర్భంలో కలిసిపోయినారు. తరవాత తరం వారందరికీ బాపట్ల దగ్గర స్టూవర్ట్‌పురంలో స్థిర నివాసం కల్పించి ఆధునిక సౌకర్యాలు కూడా ఏర్పాటు చేసి వారి జీవనోపాధికి మార్గాలు ఏర్పరచారు. కాని ఈ తరం వాళ్ళలో కూడా చదువుకున్న వారిలో కూడా 'తెలివిగల సినిమా తరహా గజదొంగలు' తయారైనారు. వాళ్ళ తెలివంతా కొత్తకొత్త పద్ధతులలో దొంగతనాలు చేయడం. కొడితే ఏనుగు కుంభస్థలాన్నే కొట్టాలనేటటువంటి సింహందొంగలు తయారైనారు. దూరదూర ప్రదేశాలలో దొంగతనాలు చేసి కూడా తిరిగి 'గప్‌చిప్‌గా' ఇంటికి చేరుకుంటున్నారు వీళ్ళు. ఆ జరిగిన దొంగతనాల పనితనాన్ని బట్టి, తరహాను బట్టి పోలీసులు ఈ రకం దొంగతనం 'మా స్టూవర్ట్‌పురం మిత్రులే చేయగలరు. అని మరొకరికి సాధ్యమా' అని విస్తుపోతుండటం కద్దు. ఈ విధంగా మా సీతానగరం నిన్నటి చరిత్రలో ప్రసిద్ధికెక్కింది.

మా చిన్నతనంలో చిన్న చిన్న దొంగతనాలు – దారులు కాయటం, మా ప్రాతూరులో అయితే 80, 90 సంవత్సరాల క్రితంవరకు పొద్దుకుంకితే భయంగా ఉండేదిట యీ ఎరుకల వాళ్ళ బెడదతో వీధి దీపాలుగాని ఇంట్లో విద్యుద్దీపాలుగానీ లేక బజారులన్నీ చీకటిగా ఉండే రోజులు. అమావాస్య అయితే కారు చీకటిగా ఉంటుంది గనుక దొంగలకది మంచి రోజు. ప్రాతూరులో అయితే చీకటి పడితే అందులో అమావాస్యరోజులైతే దొంగతనాలకు యీ సెటిల్‌మెంటు ఎరుకల బెడద ఎక్కువగా ఉండేది. అందులో వాళ్ళు ప్రాణాలకు తెగించినవాళ్ళు. అందులో వాళ్లంటే ఊరిలో చాలామందికి భయంగా వుండేది.

తెల్లవారిలేస్తే ఊళ్ళో వాళ్ళంతా జీవనోపాధికి కూరలు, మిరపకాయలు, నెయ్యి, పాలు, పెరుగు అన్నీ కావిళ్ళమీద, నెత్తిమీద బస్తాలతో, తట్టల్లో పాలుపెరుగులతో అన్నీ బెజవాడ తీసుకపోయి అవి అమ్ముకుని రావాలి. వస్తున్నప్పుడు చీకటి పడుతుంది. అంతా బ్రిడ్జిదిగి కట్టమీద నడచి ఊరు చేరుకోవాలి. ఈ ఎరుకలు కట్టకింద చాటుగా దాక్కొని యీ వచ్చీ పోయే వారిని

తరుచు దోచుకుంటూ ఉండేవారు. ఎవరికి ఫిర్యాదు చేసినా అరణ్యరోదనంగా వుండేది. అందుకని మా ఊళ్లో వున్నయువకులలో కొందరు చొరవ చేసుకోగలిగిన వాళ్ళంతా గుంపుగా వెళ్ళి సెటిలుమెంట్ లోని ఎరుకల గుడిసెల మీద పడి వాళ్ళను చావగొట్టి వదిలారు. దాంతోటి ఎరుకలవాళ్ళకు ప్రాతూరు వారంటే హడలెత్తింది. అందుచేత అప్పటి నుంచి ఎవరైనా మాది ప్రాతూరని చెపితే ఆ పేరు రక్షరేకులా పనిచేసి వారి జోలికి పోయేవారు కాదు. అదీ ఆ రోజులలో దారికాచి కొట్టే దొంగల బెడద. ఒకటి, రహదారులు సరిగా లేకపోవటం, రెండు ఎక్కడా వెలుతురు, విద్యుద్దీపాలు లేకపోవడం, మూడవది వారి బీదతనం. ఈ మూడూ ఆ తర్వాత కాలంలో కొంత మెరుగుపడటంతో, గ్రామీణ జీవితాలలో కూడా కొంత వరకు వెలుగులు ప్రసరించడంతో, యీ దొంగతనాల భయం కూడా తగ్గింది.

ఇప్పుడు సీతానగరంలో ఎరుకల స్థావరం లేదు. బాపట్ల దగ్గర 'స్టూవర్టుపురానికి' మార్చారని చెప్పానుకదా! దానితో ఈ భూమి అంతా వ్యవసాయ భూమి అయింది. గవర్నమెంటు ఆసుపత్రి ఎత్తేశారు. చర్చి శిథిలమైంది. ఆనాటి సంగతులు చెప్పే చిహ్నాలు ఏమీ లేవుకాని మా తరం వారి మనస్సులలో ఆనాటి సంగతులు చెరగని ముద్ర వేశాయని మాత్రం చెప్పవచ్చు. అవి, యీనాడు వ్రాస్తున్న చరిత్రలో సంఘటనలైనాయి.

దొంగలు, దొంగలుగా ఉండిపోరు. సరిఅయిన పరిస్థితులు కల్పిస్తే వాళ్ళలోనూ మార్పు తీసుకొని రావచ్చు. జీవనోపాధి గౌరవంగా సంపాదించుకోగలిగితే వాళ్ళు కూడా సాంఘిక జీవనంలో కలిసిపోతారు. శక్తి మంతులే జీవించగలరు' (సర్వైవల్ ఆఫ్ ది ఫిట్టెస్ట్) అనే సిద్ధాంతం ఉండనే ఉన్నదికదా. వాళ్ళలో ఆ శక్తి కలగాలి. ఆ శక్తికి దూరమైనవాళ్లు జీవనోపాధికి దొంగతనమే వారికి మార్గమైంది. వాళ్ళ తర్వాత తరంవాళ్ళు అంటే వాళ్ళ సంతతికి కొంత విద్యాగంధం సోకటం వల్ల, ఇతర జీవనోపాధులు వెతుక్కొనే అవకాశం కల్పించబడటం వల్ల క్రమంగా సంఘజీవన ప్రవంతిలో వారు కలిసిపోయారు.

అయితే మానవ స్వభావాన్ని పూర్తిగా మార్చడం ఎవరికిసాధ్యం? శాశ్వతంగా ఎవరూదానిని సంస్కరించలేరు. ఈ ఆధునిక యుగంలో రకరకాల

చోరీలు, అత్యంతాధునిక పద్ధతులలో సంభవిస్తూనే ఉన్నాయి. పోలీసులు వాటికి ప్రతిక్రియలు అన్వేషిస్తూనే ఉన్నారు. చూపెడుతూనే ఉన్నారు. అయినా "శతకోటి దరిద్రాలకు అనంతకోటి ఉపాయాల"లాగా మంచిచెడ్డల సంఘర్షణ సాగుతూనే ఉంటుంది లోకంలో. అయితే చెడుకు చివరకు ఓటమి, మంచికి అంతంలో విజయమూ మన పురాణాలు ఘోషిస్తూనే ఉన్నాయి.

## గజదొంగ కోటప్ప

స్వరాజ్యోద్యమం రాకముందు అండమాను ఖైదీలనగానే హంతకుడు, గజదొంగలనే అర్థం. అటువంటి వారినీ ద్వీపాంతర వాస శిక్షపడిన వారినీ మాత్రమే అండమాన్‌కు పంపించేవారు. కాని,వందేమాతరం ఉద్యమం మొదలైన తర్వాత విప్లవకారులు చాలామంది అండమాను ఖైదీలుగా ప్రవాస శిక్షలను భరించారు. అప్పటి నుంచీ అండమాన్ ఖైదీలకు మనజాతి చరిత్రలో గౌరవ స్థానం లభించింది.

అయితే ఇప్పుడీ గజదొంగ కోటప్ప కథనం మా తాతలకాలం నాటిది. అప్పటికే అండమాను ఖైదీగా పేరు పొందిన 'గజదొంగ కోటప్ప' మా ప్రాంతానికి చెందిన వాడని చెప్పుకోవటంలో కూడా కొంత అతిశయం ప్రదర్శించ వచ్చునేమో మేము. ఏమంటారా? గజదొంగ బిరుదు సంపాదించటం సామాన్యమా ఏమి? ఎంత ధైర్యం కావాలి? ఎంత శక్తి సామర్థ్యాలు కావాలి? నిజమే. పాపం వాళ్ళ శక్తి సామర్థ్యాలకు సరిఅయిన వినియోగంలేక వాళ్ళకు విద్యాబుద్ధులు కలిగించే వాళ్ళులేక ఉదరపోషణార్థం ఈ సాహస మార్గానికి దిగుతారు వాళ్ళు.

కోటప్ప మా ప్రాంతంలో కొంత పెద్ద ఊరైన నూతక్కికి చెందిన వాడంటారు. అసలు ఆ నూతక్కి స్థల మాహాత్మ్యమే అటువంటిదేమో? ఆ గడ్డలోనే పౌరుషం సాహసం ఉన్నాయను కోవాలి. అక్కడ ఎప్పుడూ కోర్టు వ్యవహారాలతో, పోలీసుకేసులతో సందడిగా ఉంటూనే ఉండేది. సరిఅయిన మార్గదర్శనం లేకకాని ఆ ఊళ్ళో చాలా మంది 'లార్డుక్లైవు' (Lord Clive) అంత ప్రతిభావంతులు తయారై ఉండేవాళ్ళు. ఈ విషయం ఆ ఊరికి చెందిన మా లక్ష్మీ నారాయణబావ అంటూ ఉండేవాడు.

ఈ కోటప్పకు ద్వీపాంతర వాసశిక్ష పడి తిరిగి వచ్చి ఒక ఇంటివాడై ఓ జీవితాంతం సంసారం చేసుకున్నాడని చెపుతారు. మా తాతగారి కాలంలో

ప్రొద్దుటూరులో మా ఇంటి ముందర పెద్ద గుర్రాలశాల ఉండేది. మా తాతగారు తిరుమల రాయుడుగారు ఎప్పుడూ గుర్రం మీదే తిరిగేవారు. అందుకనే ఆ గుర్రాల శాల అక్కడ ఉండేది. అయితే ఈ కోటప్ప దొంగతనానికి వెళ్ళేటప్పుడు మా తాతగారితో చెప్పి ఆయన అనుజ్ఞపొంది ఏదో గుర్రాన్ని అతగాడి సవారీ కోసం తీసుకొని పోయేవాడు. రాత్రి పనిఅయిపోయిన తర్వాత ఆ గుర్రాన్ని మళ్ళీ తీసుకొని వచ్చి కట్టేసి పోయేవాడు. ఈ విధంగా ఆ గజదొంగ ప్రయోజకత్వానికి మా ఇంటి గుర్రాలు ఉపయోగపడేవంటే నమ్ముతారా? ఇంకొక మార్గాంతరం ఏముంది? వాడు చండప్రచండుడాయె. గజదొంగాయె. మర్యాదగా వాడు అర్థించినప్పుడు మర్యాదగా ఊరుకొని తమగౌరవం నిలుపుకొనేవారు మా తాతగారు. ఈ విధంగా మా ప్రాంతం కీర్తి అండమాను దాక కూడా ప్రాకింది మరి!

# VII

# ప్రాతూరులో మా ఇల్లు

# MY HOUSE IN PRATURU VILLAGE

Our village house is situated in a very high elevation. It occupies practically the whole street length wise. The main Doorway of our house is done by the silpi who built MangalagiriTemple galigopuram. It is said no one of my generation would live in that house - an astrological prediction of the "Vasthusastra" - It is true!

మా స్వగ్రామాన్ని గురించి చెప్పుకుంటున్నప్పుడే మా పూర్వీకులు మాకిచ్చిన ఇంటిని గురించి కూడా చెప్పుకోవడం బాగుంటుంది. దానికి కూడా ఒక ప్రత్యేకత ఉంది.

ఊళ్ళో అందరి ఇళ్ళకన్నా మా పెంకుటి భవంతి చాలా ఎత్తుగా ఉంటుంది. ఇహ అంత ఎత్తున ఎవరైన మేడ కడితే తప్ప, వాకిట్లో ఎత్తైన అరుగులతో ఉన్నమా ఇల్లులాంటి ఇల్లు ఆ ఊళ్ళోలేదు. దాదాపు ఒక ఎకరం స్థలంలో కట్టారు. ఈ ఎకరంలో ముందు భాగాన్ని ఆక్రమించి ఉంటుంది మా ఇల్లు.

తూర్పు వాకిలి మాది. సూర్యుడు ఉదయిస్తూనే మమ్మల్ని పలకరిస్తాడు. ఆ బజారంతా దాదాపు మా ఇల్లు, ఇంటిదైన ప్రాకారం, ఆక్రమిస్తున్నాయి. దక్షిణంవైపు బజారులో ప్రాకారానికి చివరకు దగ్గరగా ఒక పెద్ద వేపచెట్టు, గంగానమ్మరావి, ఉన్నాయి. ఈ గంగానమ్మకు అప్పుడప్పుడు తిరణాల చేయటం కద్దు.

అంత పెద్ద ఇంటికి ఆ కాలంలో అన్ని ఇళ్ళ మాదిరిగానే బహు చిన్న కిటికీలున్నాయి. ఈ కాలపు కిటికీలలో నాలుగోవంతుకూడా వుండవు. బహుశా అంటే అరమీటరు నిలువు, పావు మీటరు వెడల్పు ఉంటాయి. ఎంతో విశాలమైన గదులకు అంత చిన్న కిటికీలు ఎందుకు ఉంచేవారో తెలియదు. కానీ ఆ చిన్నకిటికీనుంచి కూడా గాలి బాగానే వచ్చేది. వెలుతురు మాత్రం బయట నుంచే వచ్చేది. ద్వారాల ద్వారా వచ్చే గాలి,వెలుతురులే హెచ్చు. ఆ రోజులలో దొంగల భయం ఎక్కువగా ఉండటం చేత అంత చిన్న చిన్న కిటికీలు పెట్టేవారో ఏమో!

మా ఇంటి సింహద్వారం చాలా పెద్దదిగానూ అందంగానూ చెక్కబడి ఉంది. ఆ ద్వారబంధాన్ని మంగళగిరి గాలిగోపురం నిర్మించిన శిల్పి చేశాడని చెపుతారు. 'వాస్తు శాస్త్రప్రకారం' మా సింహద్వారం సరిగ్గా వీధికి ఎదురుగావుంది. దానిని వీధి శూల అంటారు. ఆ మాదిరిగా ఉండకూడదంటారు. ఇంకొక విడ్డూరం కూడా ఉంది మా ఇంటి కట్టడంలో. మా పెద్ద సింహద్వారంపైన మధ్యగా ఇంటితాలూకు పెద్ద దూలంవేశారు. ఇది కూడా శాస్త్ర ప్రకారం కూడదంటారు. మా ఇల్లు కట్టిన పూర్వీకులంతా మంత్ర శాస్త్ర వేత్తలు. మంచి శాస్త్రవేత్తలు కూడాకదా! - ఈ మాదిరి అశాస్త్రీయమైన విధంగా సింహద్వారాన్ని ఎందుకు పెట్టారు? ఆ దూలాన్ని ద్వారం తలకట్టున ఎందుకు అడ్డంగా వేశారూ? అనే విషయాలకు కారణాలు మనకు తెలియవు. అయితే ఆ కాలంలో వాళ్లంతా మంత్ర శాస్త్రవేత్తలే కనక ఈ వీధి శూలకు విరుగుడుగా ఆ ఇంటి దూలాన్ని సింహద్వారంపై వేసి ఉంటారు.

శాస్త్రజ్ఞుల అభిభాషణ ప్రకారం మా తాతల తరంతరవాత ఆ ఇంట్లో స్థిరంగా ఎవరూ ఉండరనే ఆ మాట వినపడుతుండేది. అట్లాగే మా తాతలు తిరుమలరాయుడుగారు, ఆయన తమ్ముడు వరదేశయ్యగారుతరువాత,ఆ ఇంట్లో

ఎవరూ కాపరం చేసేవారు ఉండలేదు. అయితే వితంతువులైన మా మేనత్తలు, బామ్మలు ఆ ఇంటినే స్థావరం చేసుకొని తమ జీవితాలు ధన్యం చేసుకున్నారు.

తరవాత మా పెదనాన్నగారు, మా రెండవ తాత పరదేశయ్యగారి కుమారుడు యజ్ఞనారాయణ బాబయ్యగారు ఉద్యోగాలనుండి రిటైరయిన సాయంత్రమే ప్రాతూరు చేరుకున్నారు. అదీ ఆ తరంవారిలో ఉండే తమ స్వంత ఊరిమీద ఉన్న ప్రేమ, అభిమానం.

ఇహ మాతరంవారం అంటే మనుమలతరంవారం తలో మూలా ఉన్నాం. ఒకడు బొంబాయి, ఒకడు కలకత్తా, ఒకరు మద్రాసు మరొకడు దేశమంతా తిరుగుతూ స్వంతవృత్తులలో మా యౌవన కాలాన్ని గడిపాము. ఇప్పుడు మా పిల్లలు ఖండఖండాంతరాలలోనూ ఉండి మా చేత అంతరిక్ష ప్రయాణాలు చేయిస్తున్నారు. అయితే మా స్వగ్రామంలో మా స్వంత ఇల్లు మాత్రం కొంత బాగుచేసి విద్యుద్దీపాలు, ఫాన్లు అమర్చి అధిక సుఖనివాసయోగ్యంగా చేశాం. టెలిఫోను కూడా పెట్టి ఇంటికి శోభను కూర్చాం. మా తరంవారు ఆ ఇంట్లో కొంత స్థిర నివాసం ఏర్పరచు కోవాలంటే ఇంకా ఎన్నో ఆధునిక సౌకర్యాలు ఏర్పాటు చేయించు కోవలసి ఉంటుంది. అయినా విజయవాడ హొటలుగదిలో రోజుకు 150, 200 రూపాయలు ఇచ్చేబదులు ప్రాతూరులోనే ఉంటే ఈ ఖర్చు తగ్గించుకోవచ్చు. అంతవరకు వసతులు ఏర్పరచామనే చెప్పాలి.

మా ప్రాతూరులో ఇల్లు కట్టి నాలుగువందల సంవత్సరాలైందంటారు. ఇప్పటికీ ఎన్ని వాన, వరదలు వచ్చినా అందరికీ ఆశ్రయమిచ్చే ఎత్తులో ఉండి గట్టిగా ఉంది మా ఇల్లు.

ఆనాటికీ ఈనాటికీ పల్లెలో మంచినీటి సౌకర్యం సమస్యే. అయితే మా దొడ్లో దక్షిణపువైపు ఒక మంచి జల, కల బావి, ఉండేది. ఊరివాళ్ళంతా మంచినీళ్ళు మా దొడ్లో బావి నుంచే తోడుకుపోయేవారు. అందువల్ల ప్రతిరోజూ ఉదయం దొడ్లో ఒక తిరుణాలగా ఉండేది యీ నీళ్ళు తోడుకొని వెళ్ళేవారిలో. దాదాపు నూరేళ్ళ పైగా ఉపయోగపడిన బావిలో జల హఠాత్తుగా ఇగిరి పోయింది. ఊళ్ళో ఎన్నో బోరింగు పంపులు వచ్చి యీ జల దిశను అటు లాగేసిందేమోననుకోవాలి. మా దొడ్లో కూడా ఒక బోరింగు పంపు వేయించాం.

ధారబాగానే వస్తుంది. ఇప్పుడు మా దొడ్లో బావి పాడుబడ్డబావి. పూడ్చడానికి ఇష్టంలేనందున ఇంకా అలాగే ఉండిపోయింది. చారిత్రాత్మక చిహ్నంకదా! ఆ ఇల్లు అంతా ఈ తరం వారం పంచుకున్నా ఇంకా ఆ ఇల్లు ఉమ్మడిగానే ఉంచాం. అదీ మాతరంలో ఇంకా చెరగని 'ఉమ్మడి కుటుంబ ఉల్లాసం' దీనికి కూడా మేము గర్వ పడుతుంటాం.

**పంచుకున్నప్పుడు జరిగిన ఒక తమాషా (దిష్టి లేదా దృష్టి)**

విషయం అవటానికి చిన్నదే. అయితే చాలా తమాషా అయినది. మా ఇల్లు పంచుకొనేటప్పుడు కట్టుబడితో ఉన్న ఇల్లంతా ఇద్దరన్నదమ్ములకు, ఆ వొట్టి దొడ్డి, ఇంకో సోదరుడికి వచ్చింది. అంటే ఆ బావిఉన్న ఒట్టిదొడ్డి భాగం ఒకరికి వచ్చింది.

ఆ బావి దగ్గర ఒక పెద్ద దబ్బచెట్టు వుంది. ఎప్పుడూ తోడుకోవటంలో ప్రవహించే నీరువల్ల బావి దగ్గరి మురికి నీరువల్లా ఆ చెట్టు బాగా పచ్చగా వుండి చెట్టునిండా దబ్బకాయలతో కలకలలాడుతూ వుండేది. అయితే ఆ దబ్బచెట్టు, నూతి భాగంవున్న దొడ్లో వుండటం వల్ల మా నాన్నగారు పెదసుబ్బయ్యగారి భార్య అయిన మా బామ్మకు ఇల్లంతా తమవాటాలోకి వచ్చినా ఆ దబ్బచెట్టు మీదనే తన ప్రాణమంతా పెట్టుకొని ఉండటంవల్లననుకుంటాను ఆ దబ్బచెట్టు మా భాగంలోకి వచ్చిందనగానే "అరే! ఆ దబ్బచెట్టు సుబ్బయ్య భాగానికి పోయిందన్నమాట" అని ఆవిడ విచారం వెలిబుచ్చింది. అంతే, ఆ చెట్టు రెండు వారాలలో నిలువునా ఎండిపోయింది. పాపం ఆ చెట్టుకు బామ్మ దిష్టికొట్టిందిరా అని అంతా అనుకున్నారు. జరిగిన సంగతి అయితే ఇది. దిష్టిలోని నిజానిజాలు ఇందులో మీరేనిర్ణయించాలి. ఇప్పటికి మా పితామహులగురించీ వాళ్ళు కట్టిన మా ఇంటిని గురించీ మా స్వంత ఊరు గురించి చెప్పాను. మంగళగిరి దేవాలయపు గాలిగోపురం నిర్మించిన శిల్పి మా ఇంటి సింహద్వారం రూపకల్పన చేశాడంటే గొప్పేకదా! అది తలచుకుంటే ఎంతైనా సంతోషమే కదా!

# VIII

# చదువుకున్న వారు ఊళ్ళో ఉంటే

# THE ADVANTAGE OF EDUCATED YOUTH SETTLING IN THE VILLAGES

> The amenities we could provide to our village, Pratur - We got well established - Bus conveyance, Post Office, Telephone system - Practically "Village Beautiful", concept of Pandit Jawaharlal Nehru.My friend Dr.Laxmana Rayudu who settled in Gannavaram (Andhra) revolutionised the life styles of all the villages - The place is called "Gannavaram of Thieves" now a modern urbanised Taluq Head Quarters with an Aerodrome to be proud of.

చదువుకున్న వాళ్ళు ఊళ్ళో ఉంటే ఆ ఊరికి కొన్ని ఉపకారాలు తప్పక జరుగుతాయి. మమ్మల్నీ మా ఊరునూ ఇందుకు ఉదాహరణగా తీసుకోవచ్చు.

ఇంగ్లీషు చదువులు వచ్చిన తర్వాత పై చదువులకు ఊరు విడిచి వెళ్ళటం, అట్లా చదువుకున్న తర్వాత పట్టణాలలోనే ఉద్యోగాలలో స్థిరపడిపోవటం,

అలవాటై పోయింది. ముందు తరాలలో చదువుకున్న జనాభా పట్టణాలకు వలస వెళ్ళటం ఆనవాయితీ అయింది. తరవాత తరవాత పారిశ్రామిక యుగ ప్రభావం ప్రసరించింది. దీనితో శ్రమ జీవులు కూడా వ్యవసాయ వృత్తిని విడిచిపెట్టి పట్టణాలలో ఫ్యాక్టరీలలో పనికోసం వలస పోవటం మొదలైంది. ఈ విధంగా శ్రమజీవులు కూడా ఊళ్ళు వదిలివెళ్ళటం ప్రారంభమైంది. ఈ విధంగా గత అర్ధ శతాబ్దంలోనూ ఎంతో మంది పల్లె జీవులు పట్టణాలకు చేరటం జరిగింది. జరుగుతోంది. ఇది ప్రపంచ మంతటా కనపడుతున్న పరిణామమే. అయితే ఒకటి ఆలోచించాలి. మనలాటి వర్ధమానదేశాలకు ఇది ప్రగతి చిహ్నమే అయినా పల్లెలు మాత్రం బోసిపోతున్నాయి. దెబ్బ తింటున్నాయి. ఇది రెండు వర్గాల ప్రజలలో కొట్టవచ్చినట్లు కనపడుతున్నది. పెద్ద పెద్ద భూస్వాముల పిల్లలు పై చదువులు చదివి పరిశ్రమలు స్థాపించటానికి,లేక పోతే పెద్దపెద్ద ఉద్యోగాల కోసం, పట్టణవాసు లవుతున్నారు.ఇంతేకాక చిన్న కారు రైతాంగం భూవసతులు తగినంతగా లేకపోవడం వల్ల ఒకటి రెండు ఎకరాల మీద కుటుంబపోషణసరిగా జరగక పట్టణాలలో కూలినాలి చేసుకోవటానికి వలస పోతున్నారు.

ఈ వలసను చూసి గాంధీగారు నూటికి ఎనభైమంది పల్లెల్లో నివసించే మనదేశంలో పల్లె ప్రజలకు పనికి వచ్చే ప్రణాళికలకు ప్రాధాన్యం ఇవ్వాలని ప్రబోధించారు. కుటీర పరిశ్రములు ఎన్నో విధాలుగా అభివృద్ధి పరిస్తేగాని పల్లెవాసుల జీవిత ఆర్థిక ప్రమాణం పెరగదని గాంధీజీ ఎంతో ముందు చూపుతో చెప్పారు. అందువల్లనే జాతీయోద్యమ చైతన్యోద్బోధకంగా "రాట్నమొడికే విధము తెలియండీ జనులార మీరా విధముగనుగొని మోదమందండీ" అని దేశీయులతో పాటలు పాడించారు. అంటే ఏమన్నమాట! రాట్నం మన పారిశ్రామిక వికేంద్రీకరణకు చిహ్నమన్నమాట. అప్పుడే గ్రామీణ జీవనపథంలో నూతన కాంతులు ప్రసరిస్తాయి. క్రాంతిపథంలో వారు ముందుకు పోగలుగుతారు.

## ప్రాజెక్టులకు నాయకుల పేర్లు

పని చేసేటప్పుడు ఎవరూ రారుగాని, పేరుదగ్గిర కొచ్చేటప్పటికి పట్టుదలలు పెరుగుతాయి. అంతకు ముందు ఈ ప్రాజెక్టుకు "సీతానగరం

పంపింగు" స్కీము అని వున్నా, మేమంతా ప్రాతూరి వారం ప్రయత్నించటం వల్ల గవర్నమెంటు రికార్డులలో 'ప్రాతూరు పంపింగు స్కీము' అని ఎలాగో ఎక్కింది. సరిగ్గా ప్రాజెక్టు ప్రారంభోత్సవ సమయంలో, మా వూరి పేరంటే మా వూరి పేరని, ప్రేక్షకులు అరవడం మొదలు పెట్టారు. అప్పుడు నీటి పారుదల మంత్రి అయిన శ్రీ అల్లూరి సత్యనారాయణ చొరవ చేసి, ఈ ప్రాజెక్టుకు ఏ వూరి పేరూ వద్దంటూ, దేశనాయకుల పేరు పెడదాం అని అప్పటికప్పుడు కీ||శే|| ఆంధ్రరత్న గోపాలకృష్ణయ్యగారి జ్ఞాపకంగా, "ఆంధ్రరత్న పంపింగు స్కీము" అని పెట్టాడు. తరావాతి పథకాలకు "దేశోద్ధారక నాగేశ్వరావుగారి పేరు, 'దేశోద్ధారక' అని వరుసగా పెట్టుకుంటూ పోయారు. ఈ రూపంగా నయినా మన కోసం త్యాగం చేసిన త్యాగధనులను చిరస్మరణీయులుగా చేసుకోగలిగాం. ఈ పేరులోని మలుపు అందరి ఆనందాన్ని ఆమోదాన్ని పొంద గలిగింది.

కృష్ణా జిల్లా గన్నవరంలో స్థిరనివాసం ఏర్పరచుకొన్న మిత్రుడు డాక్టర్ లక్ష్మణరాయుడు ఎంత ప్రాంతీయ వికాసం సాధించగలిగాడో ప్రస్తావించు కొన్నాం ఇదివరకే. పూచిక మొలిచే బీడుభూములు, మెరక భూములు చెరుకుతోటలుగా ఎట్లా మారిపోయినాయో తెలుసుకున్నాం. ఆ ప్రదేశమంతా ఎంత సస్యశ్యామలమైందో స్మరించుకున్నాం. అదంతా ఒక వ్యక్తి సంకల్పం. నిరంతరకృషి.

ఇక మా ఊరి సంగతికి వద్దాం. మా ఊరి నుంచి వృత్తుల రీత్యా మా తరం వారమంతా బొంబాయి, మద్రాసు, కలకత్తా, హైదరాబాదు పట్టణాలలో స్థిర నివాసం ఏర్పరచుకొన్నా మా ఊరిని మాత్రం మరచిపోలేదు. ఆ ప్రాంతం వారికి కొన్ని సౌకర్యాలు కలిగించడానికి మా వంతు కృషి మేమూ చేశాం. అందులో మొదటగా చెప్పవలసింది "ఆంధ్రరత్న పంపింగు స్కీము" అనే ఎత్తిపోతల నీటి పారుదల పథకం. దాదాపు 1930 నుంచి 'సీతానగరం పంపింగు ప్రాజెక్ట'ని నలుగుతున్న పంటకాలువ ప్రాజెక్టు మొదటిది. దాదాపు పదిలక్షల రూపాయల వ్యయంతో మద్రాసు కాలువనుంచి ఎత్తిపోతల కాల్వద్వారా మూడు వేల అయిదువందల ఎకరాలు, మాగాణి భూమి అయ్యేట్లు ఏర్పాటు చేశాం. ఇది కాసు బ్రహ్మానందరెడ్డిగారు ముఖ్యమంత్రిగానూ అల్లూరి సత్యనారాయణరాజా ఇరిగేషన్ మంత్రిగానూ ఉన్నకాలంలో దాదాపు ముప్పై సంవత్సరాల కిందట

అమలు చేయించగలిగాము.ఈ పథకంతో ఒక్క ఎకరం వున్న బీదవాడికి కూడా సంవత్సరానికి సరిపోయే ధాన్యం, గొడ్లకు కావలసిన మేత సమకూరాయి. ఇందుమూలకంగా బీదసాదలు మా ఊరి వాళ్ళంతా 'అయ్యగారు మాకు వరి అన్నం పెట్టించారు' అని సంతోషిస్తూ వుంటారు.

## ప్రాజెక్టులకు నాయకుల పేర్లు

సాధించగలిగిన ఇంకో మంచి పని ఏమంటే విజయవాడ నుంచి ఆ ప్రాంతానికి ఒక మంచిరోడ్డు. ప్రతి ఊరికీ రవాణా సౌకర్యం ముఖ్యమనీ, కాలిదారులన్నీ రోడ్లు కావాలనీ, అటు తరవాత వాటి మీద బస్సులు నడవాలనీ ప్రతిగ్రామీణ ప్రాంతీయుడూ కోరుకుంటాడు. అదే మా ప్రధాన ధ్యేయమని రాజకీయ నాయకులు గంభీరంగా ప్రకటనలు చేస్తూ ఉంటారు. కాని అమలు జరిపించే ప్రయత్నంలో మాత్రం నత్తనడక లాగానే నడుస్తాయి అవి. అన్నిటి కన్న ముఖ్యమైన సౌకర్యం తారు రోడ్డు ఉన్న రహదారని నా వుద్దేశ్యం. "ఆంధ్రరత్న పంపింగు ప్రాజెక్టు" రూపకల్పన జరిగి పనిచేసేనాటికి మా ఊరినుంచి డొంకన,ఎండిన బాటలో కారులు నడిపాం. బురదగా ఉన్నా ఎండటం వల్ల కలిగిన వీలుతో కృష్ణ కట్ట మీదుగా కార్లలో ముఖ్యమంత్రి, ఇతరులు రాగలిగారు. కాని ఒక్క వర్షం కురిసిందంటే మోకాలు లోతు బురదలో కట్టమీదగాని డొంకనగాని నడవాల్సి వస్తుంది. కార్లను మనుషులు మొయ్యాల్సిందే అప్పుడు. కాస్త ఎండటం వల్ల కలిగిన సౌకర్యంతో కారులో ప్రాతూరు ప్రాంతానికి పోగలిగినా ఏమాత్రం మేఘం కనిపించినా కారులో వెళ్ళిన పెద్దమనుష్యులు గబగబా కారులో బయలుదేరి విజయవాడ చేరుకుని తిష్ఠ వేసేవారు. ఆ పరిస్థితి ఇప్పుడులేదు. మా ఊరివరకు మంచి తారురోడ్డు పడి ఎంత వర్షం కురిసినా పదినిముషాలలో ఇప్పుడు విజయవాడ చేరుకోవచ్చును. ఈ రోడ్డు కొక పెద్ద చరిత్రే ఉంది.

## ఒక రోడ్డు వేయడానికి 20 సంవత్సరాలు

దాదాపు 20 సంవత్సరాల నుంచి ఈ రోడ్డు వేయించటానికి ఎన్నో ప్రయత్నాలు చేశాం. మొదట పంచాయితీలు ఒప్పుకోవాలన్నారు. పంచాయితీ

రాజ్ ఇంజనీర్లను కలసి సంప్రదించాం తర్వాత జిల్లా పరిషత్ వారిది ఆ బాధ్యత అన్నారు. వారినీ కలిశాం. ఆ తర్వాత 'హైవేస్' వారిది ఆ పూచీ అంటే పెద్ద రహదారి క్రింద చేర్పించి అదొక భగీరథ ప్రయత్నం చేయాల్సి వచ్చింది. ఈ విధంగా ఎన్నో గవర్నమెంట్లు మారినా మంత్రులు మారినా మా రోడ్డు ప్రాజెక్టు మాత్రం 'అనినంతనె వేగ పడక' మెల్లిగా నడిచింది. డబ్బు చాలనప్పుడు జిల్లా కలెక్టర్లు చెరువు పనులకింద కూడా ధనం దీని కోసం మంజూరు చేశారు. దాదాపు 20 సంవత్సరాలకింద మొదలు పెట్టిన ఈ రోడ్డు విజయవాడ ప్రకాశం బరాజ్ దగ్గర నుంచి కుంచనపల్లి, ప్రాతూరు, గుండి మెడ, చిర్రావూరు, నూతక్కి ఊళ్ళకు 16 కి.మీ దూరం మంచి ప్రయాణ సౌకర్యం ఏర్పరచగలిగింది. వాణిజ్యం కూడా గణనీయంగా అభివృద్ధి చెందుతాయి. అయినా ఒక ఓవర్సీరు గారు ఇట్లా వ్రాశారు నాకు. 'మీ బాధపడలేకే మీ ఊరి వరకు రోడ్డు తారు చేశారండీ, కాబట్టి మీరు వచ్చి చూడండి.' ఇట్లా ఆయన నాకు వ్యక్తిగతంగా ఉత్తరం రాసినందుకు ఎంతో సంతోషించాను. ఇన్ని సంవత్సరాలు ప్రయత్నించి ఎలాగో మా ఊరివరకు మంచిరోడ్డు వేయించ గలిగినా మిగతా రోడ్డునూ తక్కె వరకు ఇంకా ఎగుడు దిగుడుగా ఉండి కారుపోయే సౌకర్యం లేకపోవడం ఎంతో విచారకరం. ఇంత ముఖ్యమైన సౌకర్యం ఏర్పరచుకోలేక పోవడానికి ప్రజల అశ్రద్ధ, అజ్ఞానం కారణాలనుకుంటాను. డబ్బు ఉన్నా పని సరిగా జరిగించుకోలేరు. ప్రాంతీయులకు ఆరాటం ఉండాలి. ప్రభుత్వం చేసే ప్రయత్నం ఫలవంతం కావాలంటే ఆ ప్రాంతంలోని ప్రజలు కూడా ప్రాంతీయాధికారుల మీద తగినంత ఒత్తిడి తీసుకుని వస్తేగాని పనులు త్వరగా జరగవు. రాజకీయాలకు అతీతంగా ఆయా ప్రాంతాల ప్రజలలో చైతన్యం కలిగి పనిచేస్తేనే మన ప్రణాళికల వల్ల పల్లెప్రాంతాలు త్వరితగతిని ఫలవంత మవుతాయి. లేకపోతే 'కరిమింగిన వెలగపండు' చందాన ప్రణాళికలు వ్యర్థ మవుతాయి.

మా ఊరికి కలిగిన మూడో సౌకర్యం పోస్టాఫీసు. అంటే అదే తపాలా ఆఫీసు. ఆ తర్వాత టెలిఫోను సౌకర్యం కూడా కలిగింది. దాదాపు పది ఫోనులున్నాయి. ఒక టెలిఫోన్ ఎక్స్చేంజి కూడా ఉంది. అదేకాక ఇక్కడ అధికారుల సహకారం వల్ల ప్రాతూరు, విజయవాడ ఎక్స్చేంజ్‌తో కలపబడి తిన్నగా విజయవాడనంబరులాగే టెలిఫోన్ చేసుకునే సౌకర్యం కూడా కలిగింది. ఒక మా ఊరికి కావలసిన దేమున్నది? ఊరు శుభ్రంగా ఉంచు కోవటమే.

అందునా కనకదుర్గ వారధి కూడా వచ్చిన తర్వాత విజయవాడ మా ఊరికి మరీ దగ్గరయింది. ఈ విధంగా విజయవాడలో కలిసిపోయి పల్లె అయిన మా ప్రాతూరిలో కూడా పొలాలధరలు, ఇళ్ళ స్థలాల ధరలు పెరిగి పోయినాయి పంచాయితీలు సరిగా పని చేసి ఊరి పారిశుద్ధ్యం, ఊళ్ళో రోడ్లు, మరుగుదొడ్ల సౌకర్యాలు కలగజేసు కోవలసి వుంది. ఈ విధంగా పట్టణంలో ఉన్నా ఊరిమీద అభిమానంతో మా ఊరికి కూడా ఎన్నో సౌకర్యాలు తేగలిగామంటే ఈ తరం సోదరులంతా ఎంతో సంతోషం పొందుతున్నారు గ్రామీణ ప్రాంతాలలో కూడా అభివృద్ధి చెందిన దేశాల మాదిరిగా సౌకర్యాలు అన్నీ వృద్ధి అవుతేకాని పల్లెల నుంచి పట్టణాలకు వెళ్ళే ప్రజల వలసను ఆపలేరు. ఈ కనీస సౌకర్యాల గురించి ప్రభుత్వం గ్రామీణ ప్రాంతలపై తన దృష్టి ప్రసరింప చేస్తుందని ఆశిద్దాం!

## మా పెదనాన్నగారి సలహాలు

మా పెదనాన్నగారు ప్రాతూరి యజ్ఞ నారాయణగారు రివెన్యూ డిపార్టుమెంటులో పని చేస్తూ ఉండేవారు. రివెన్యూ ఇన్స్పెక్టర్ హోదాలో రిటైరైనారు. ఏ మాత్రం సెలవు దొరికినా కుటుంబంతో సహా స్వగ్రామం ప్రాతూరు చేరేవారు. రిటైరు అయిన తర్వాత కుటుంబం అంతా వచ్చి ప్రాతూరులోనే స్థిరపడ్డారు. ఉద్యోగంలో ఉన్నప్పుడు రెండు మూడు సంవత్సరాలకోసారి మక్తాలు వసూలు చేసుకోవటానికని వచ్చేవారు. అప్పుడు గ్రామస్తులలో మక్తాదార్లు తమ దగ్గర ఎంతుంటే అంత ఇచ్చేవారు. మిగతా దానికి 'ప్రామిసరీ నోటు' అణా బిళ్ళతో సహా అని,పైకం మొత్తం వ్రాసి, సంతకం పెట్టి పోయేవారు. రైతులకు 'యెగ్గయ్యగారి' నోటు అంటే అది రికార్డు కోసమేనని తలచేవారు. వాళ్ళకా నమ్మకం ఉండేది. అవి ఎప్పుడూ కోర్టు ముఖం చూసేవి కావు. కోర్టులంటే ఆ నోట్లకు గిట్టదు అనేది అందరికీ తెలిసిన విషయమే. నిజంగా ఆయన కోర్టుకే వెళ్ళదలుచుకంటే ఒక ప్లీడరుకు సరిపోయే పని చేతినిండుగా ఉండేది.

మా కుటుంబానికి దాదాపు వంద ఎకరాలుండేది గనుక ఒక్క కుటుంబమైనా ప్రాతూరులో ఇల్లు కనిపెట్టుకుని ఉంటే పొలాలు బాగుపడేవి. ఒక కుటుంబానికి దర్జాగా ఉదర పోషణా జరిగేది. అయితే నెల జీతాల మీద ఉన్న

మోజు మీద అంతా ఉద్యోగాలే ఎన్నుకుని కృష్ణా జిల్లా వాసులయ్యారు. అయితే అప్పటికీ ఇప్పటికీ కూడా మా కుటుంబాల వారికి ప్రాతూరంటే అభిమానమనే చెప్పాలి.

ఇక చదువుకున్న వాగివల్లి ఊరికి జరిగే ఉపకారం దగ్గరకు వద్దాం. మా పెదనాన్నగారు తరచు రెండు కథలు చెపుతుండేవారు. ఈ రెండూ కూడా సువర్ణాక్షరాలతో లిఖించదగినవే

మొదటి కథ ఇది. 1913లో ప్రాతూరు దగ్గర గుంటూరు జిల్లా వైపున కృష్ణా నది కట్టకు గండి పడింది. ఆ రోజులలో వరదలు రావడం, కరకట్టలు గండ్లుపడి ఊళ్ళుమునిగిపోవడం అన్ని నదుల విషయంలోనూ సహజంగానే ఉండేది. తర్వాత తర్వాత ఆనకట్టలు వచ్చి సాగుభూములు విస్తరించిన తర్వాత ఈ బెడద కొంచెం తగ్గింది. వరద ముచ్చట్లలో చెప్పుకోవలసిన సంగతులు ఏమంటే కొత్తలంకలు వేయడం, పాతలంకలు హఠాత్తుగా మాయమవటం, కట్టకు ఏరుకుమధ్య నున్నపొలాలు వరద నీటిలో మునిగి ఎకరాలు ఎకరాలు ఒక రాత్రిలో మాయమవటం సంభవించేది అల్లా గట్టుని ఆనుకుని ఉండే పొలం మాకుటుంబానికి ఒక 20 యకరాల ఖండం ఉండేది. అందులో దాదాపు పది యకరాలు ఒకే రాత్రి మా తండ్రిగారి హయాంలో తెగి మాయమై పోయింది అది తిరిగి వస్తుందేమోనని, దానిపై హక్కు పోకుండా ఉండటానికి, దానికి కూడా చాలాకాలం మా వాళ్ళు శిస్తు కడుతూ ఉండేవారు. కాని కొన్ని సంవత్సరాల తర్వాత ఆలా చెల్లించడం మానేశారు.

మా తరంలో మాకు కూడా ఒక చిన్న అనుభవం ఈ వరదల విషయంలో ఎదురైంది. ఆ మిగిలిపోయిన పదియకరాల భూమి గట్టునానుకొని మాకు ఉండేదికదా, దాన్ని 'సావరం' అనేవారు. ఒక రోజు మేమంతా ఆ పొలం ఏటిగట్టున కూర్చుని కబుర్లు చెప్పుకొని పొద్దు బోయిన తర్వాత ఇంటికి వచ్చాం. మరునాడేమైంది. అదంతా ఏటి పాలైపోయింది. వరద తాకిడికి అంతర్థానమై పోయింది. అక్కడే ఇంకా కూర్చుని ఉంటే మేం కూడా నదీ గర్భంలో కలసి పోయే వాళ్ళం కదా అనిపించింది! నదీతీరంలో పొలాల పరిస్థితులు ఇట్లా ఉండేవి మరి.

ఇక వరదలు వచ్చినప్పుడు కూడా ఎటువంటి పరిస్థితెదురవుతాయో మా ప్రాతూరు ప్రజల జీవితంలోనే చూడవచ్చు. 1913వ సంవత్సరంలో పెద్దగా

కృష్ణానది పొంగిపొర్లే పరిస్థితి ఏర్పడింది. అనుకోకుండా మా ప్రాతూరు దగ్గర, అంటే విజయవాడకు దక్షిణం వైపు కట్ట, అంటే గుంటూరు జిల్లా వైపు కృష్ణ కట్టకు హఠాత్తుగా గండిపడింది. అంతవరదలో ఉన్న కృష్ణ కట్టలు తెంచుకొని ప్రహించిందంటే ఎంత ప్రాంతం జలమయమవుతుందో ఎవరూహించగలరు? బసవరాజు అప్పారావుగారు వరద కృష్ణమ్మ గురించి అద్భుతమైన గీతం ఒకటి వ్రాశారు.

*'కంటికంతా జలమయంబై*
*మింటి వరకును ఏకరాసై*
*మహాప్రళయ పుటంటిలో*
*వటపత్రశాయివయి*

ఒంటిగా ఉయ్యాలలూగే కృష్ణయ్యను వర్ణించారాయన. అదుగో అలాటి పరిస్థితి ఏర్పడి ఉంటుంది అక్కడి పల్లె జీవనానికి. ఎన్నో వందల సంఖ్యలో ప్రజలు మరణించి ఉంటారు. కట్టలు తెగి నీరు ప్రవహించి పొలాలన్నీ ఇసుకదిబ్బలు వేసినవి చాలా భాగం.కొద్ది భాగం పొలాలు రేగడి మన్ను వేసి బలం చేకూర్చుకున్నాయి. వరద తీసేటప్పటికి ఈ విశేషాలన్నీ బయట పడ్డాయి. కృష్ణవేణమ్మ తల్లి మాకున్న పెద్ద తాడిచెట్టు చేలో ఏం వేసిందో వేరే చెప్పాలా? ఆఖండ మంతా ఇసుక దిబ్బతో నిండి అప్పటికీ ఇప్పటికీ ఇసుక పొలంకిందే మిగిలి పోయింది. 30 సంవత్సరాల కింద మా ప్రాంతంలోని భూములు "ఆంధ్రరత్న పంపింగు స్కీము" ద్వారా లిఫ్టు ఇరిగేషన్ కాల్వల ద్వారా మాగాణి భూములు అయ్యేవరకూ 'తడిచేను' ఇసుక పొలంగానే ఉండిపోయింది. రైతులు ఎక్కువ కౌలు ఇచ్చేవారు కాదు. ఆ చేలో నాటికీ నేటికీ ఒక తాటి చెట్టు ఉన్నది. అంచేతనేమో దానికి 'తాడిచేను' అనే పేరు నిలిచి పోయింది. అక్కడే మరో నాలుగు ఎకరాల ఖండం 'మునాయి' చేను 'మునాయి' అనే ఏ రైతుబిడ్డో ఆ చేను చేసుకుంటూ ఉండి ఉండేవాడేమో! అది మాత్రం బాగా పండేది. ఆనాడు గరువు భూమిగానే చెల్లుబాటవు తున్నది. పల్లెలలో ఈ పంటభూములను తమాషా తమాషా పేర్లతో వ్యవహరించటం ఉండేది. తూర్పు పొలమనీ, కట్ట ఇవతల పొలమనీ, కట్టలోపలి పొలమనీ, నాగాయితునకఅనీ, వెంకటప్పయ్యగారి చేననీ, 'పేటవారి' చేననీ 'సావరమనీ' ఇలా అనేక రకాలపేర్లతో ఉండేవి ఆ పొలాలు. మా తరంలో కూడా ఈ పేర్లతో మా పొలాలు గుర్తు పట్టుడానికి వీలుగా ఉండేవి.

మాకు పూర్వం వచ్చిన పొలాలలో 'చిర్రావూరు ఈ నాం' పది ఎకరాల పొలం ఉండేది. నూతక్కి గ్రామంలో కూడా 'ఈనాం భూము'లుండేవి. మా తాతగారు ఆ ప్రాంతానికి మణేదారుగా ఉన్నప్పుడు నాలుగు ఎకరాలు నూతక్కి గ్రామంలో 'ఈనాం' వచ్చింది. 'మణేదారంటే' సర్కారు తరపున పన్నులు వసూలు చేయడంలో సహాయపడే ఉద్యోగి అన్నమాట. ఆయన జీతం ఆ రోజుల్లో నెలకు నాలుగు రూపాయలే అంటే నమ్ముతారా? గుర్రంమీద ఆ ఊళ్ళన్నీ తిరుగుతూ మంచిహోదాలో ఉండేవారు. ఈ రోజులలో 4 వేలు వచ్చే ఉద్యోగస్థుడికి కూడా ఆ 'హోదా' అదిన్నీ అన్ని ఊళ్ళమీద ఉండదు. రెండో ప్రపంచ యుద్ధకాలంలో చాలామంది సామాన్య ఉద్యోగులకు కూడా జీతాలు హెచ్చుగానే ఉండేవి గానీ మా నాన్నగారు 'ఏమిటోరా! ఈ రోజుల్లో జీతాలు గొప్పేగాని ఇవి 'హోదా' లేని ఉద్యోగాలురా అనేవారు. మా రోజుల్లో ఒక మేజస్ట్రేటుగానీ తహశీలుదారుగానీ చివరకు రెవెన్యూ ఇన్‌స్పెక్టరుకుగానీ ఎంతహోదా, ఎంత మంది బంట్రోతులు ఉండేవారు అనేవారు మా నాన్నగారు.

ఒక ఇంత ఉపోద్ఘాతం తర్వాత మళ్ళీ 1913 కృష్ణ వరదల కాలానికి పోదాం. మా ఊరు ప్రాతూరుండే కృష్ణ దక్షిణపు గట్టున నాలుగో ఫర్లాంగు దగ్గర, ఇప్పుడైతే మూడోకిలోమీటర్ అని చెప్పాలి. పెద్ద గండి పడింది. వెంటనే గవర్నమెంటు వారు తగిన చర్యలు తీసుకుని ఇసుక బస్తాలు తరలించి గండిని పూడ్చి రాత్రీ పగలూ కాపలా కాసి ప్రజల ప్రాణాలు రక్షించారు. అధికారం నిలబెట్టుకోవటానికి బ్రిటిషు పాలకులు ఆయుధాలు ఉపయోగించినా ఇటువంటి ప్రమాదాలు ముంచుకొని వచ్చినప్పుడు వారు తమ ఆధునిక శాస్త్ర పరిజ్ఞానాన్ని తప్పకుండా ప్రజల సంక్షేమ కార్యక్రమాలలో ఉపయోగించే వారు. మన కాటన్ దొరగారి భిక్షమేగదా, కృష్ణాగోదావరి డెల్టాల సతత హరిత శ్యామల భూములకు కారణం. అంతకు పూర్వమైతే మిగతా కరువు ప్రాంతాల్లాగానే ఈ జిల్లాలు కూడా కరువు ప్రాంతాలుగానే ఉండేవి. క్షామ పీడితాలుగానే గుర్తింప బడేవి. ప్రజలు ఆకలి బాధలకు గురి అవుతూనే ఉండేవారు. ఆ కరువుల సందర్భంగానే డొక్కా సీతమ్మగారి అన్నదానం గురించి ప్రజలంతా కీర్తించేవారు. ఆనకట్టలు కట్టిన తర్వాత సుజలాం, సుఫలాం, సస్యశ్యామలం అయింది ఈ ప్రాంతమంతా.

ఈ విధంగా 1913లో వచ్చిన కృష్ణ వరదల గండి పూడ్చిన తర్వాత వరద తగ్గిన తర్వాత పాత కృష్ణ కట్ట ఎత్తు తక్కువగానూ బలహీనంగానూ ఉండడం చేత బాగా ఇవతల మరో పెద్ద కట్టవేసి ఎంత వరద వచ్చినా ఆపేటట్టుగా ఎన్నో పొలాలను మధ్యనుంచి చీల్చివేశారు. అందువల్ల ఈ కొత్త కట్ట నిర్మాణంతో అనేక పెద్ద పెద్ద ఖండాలుగా ఉన్న నెంబరు పొలాలు,మధ్యగా చీలిపోయి కట్ట ఇవతల పొలం (అంటే వరద తగలని పొలాలు) కట్టలోపలి పొలం (అంటే వరదలో మునిగే పొలాలు) అని రెండు భాగాలుగా విడిపోయినాయి. ఈ విధంగా కట్టకింద చాలామంది పొలాలు పోయి వాటికి గవర్నమెంటువారు నష్టపరిహారం చెల్లించారు అప్పట్లో. ఈ నష్టపరిహారం నాటి సంగతులే మా పెదనాన్నగారు తరచు ప్రస్తావించే మొదటి కథ లేదా ఉదంతం. దీనికిగాను ఇంత ఉపోద్ఘాతం చెప్పవలసి వచ్చింది.

ఈ కృష్ణ కట్ట కొత్తగా వేయటం మూలంగా మాకు అదివరకున్న నూట యాభై ఎకరాల పొలం ఎనభై ఎకరాల కిందకి తేలింది. అయినా ప్రాతూరువారు ఆనాటికీ ఈనాటికీ నూరు ఎకరాల జమీందారులే. ఇప్పటికీ ఈ తరంలో అందరూ పొలాలూ అన్నీ అమ్మేసుకొని పోయినా వారికేమండీ ప్రాతూరివారు మహానుభావులు, ఈ ప్రాంతానికి పంపింగ్ ప్రాజెక్టు తెప్పించిన మహానుభావులు, అనుకుంటూ ఉంటారు. ఈ ప్రాజెక్టే లేకపోతే అంతా ఈ పాటికి పొలాలు అమ్మేసుకుని మరో ప్రాంతానికి వలసి పోవలసి వచ్చేదికదా అని అక్కడి మా కరణం బావగారితోపాటు అక్కడి హరిజన కుటుంబాలు, చిన్నరైతులు పెద్దరైతులు హృదయపూర్వకంగా నమస్కారాలు చేస్తుంటారు. ఈ తరం వాళ్ళమయిన మాకు, అదీగాక చిన్నవాళ్ళమైన మాకు వారు కృతజ్ఞతలు చూపుకుంటూ ఉంటే ఎంతో మొహమాటంగా ఉంటుంది. ఎందుకంటే ఈ ఉపకారంలో సొంతసొమ్ము ఖర్చు చేసింది ఏమీలేదు గనుక!

ఈ కట్ట కింద పోయిన పొలాలకు బ్రిటిషు గవర్నమెంటు న్యాయమైన పరిహారం ఇవ్వటానికి సిద్ధపడింది. అది ప్రభుత్వ బొక్కసం నుంచే వస్తుంది. దీనికిగాను తమ అధికారులను పంపి, అంచనాలు వేసి డబ్బు ఇచ్చే సమయంలో మా పెదనాన్నగారు అక్కడకు ఉద్యోగిగా రావడం తటస్థించింది. ఆయన రెవెన్యూ డిపార్టుమెంటు వారు కావడంవల్ల మాతోబాటు, ఇతరులకు గూడా

గిట్టుబాటయ్యేట్లు నష్టపరిహారం ఇప్పించ గలిగారు. కృష్ణ గండి రామాయణంలో ఇది పిట్టకధ. ఈ ఉద్యోగులు వచ్చి విచారణ చేసి అక్కడికక్కడే అన్నీ త్వరగా పరిష్కారాలు చేసి డబ్బు పంచి పెట్టారు. ఆ సమయంలో మా పెదనాన్నగారు యజ్ఞనారాయణగారు అక్కడకు వచ్చి అక్కడ జరుగుతున్న తమాషా చూశారు. ప్రభుత్వోద్యోగాలు తమ ప్రభువుల మెప్పుకోసం, వారి నుంచి ఏదో కితాబు రాబట్టుకోవాలని వారి చిత్తం వచ్చిన రీతిలో బహుకొద్దిగానే నష్టపరిహారం చెల్లిస్తూ రైతులను పంపించి వేస్తున్నారు. అది చూసిన మా పెదనాన్నగారు మెల్లిగా ఆ అధికారులను ఏ విధంగా యీ పరిహారం చెల్లిస్తున్నారు? ఏ దామాషా, ఎలా లెక్కలు కడుతున్నారు? అని ఏమీ తెలియని వారిలాగానే ఇంగ్లీషులో ఆ అధికారుల తాబేదార్లను ప్రశ్నించడం మొదలు పెట్టారు. వాళ్ళప్పుడు చేస్తున్న పరిష్కార విధానం చట్టవిరుద్ధమని, రైతులకు అన్యాయం జరుగుతున్నదనీ వారి కళ్ళముందే విప్పి చూపించారు. వాళ్ళ కళ్ళు తెరిపించారు. తరువాత ఆ అధికారులు మా పెద్దనాన్నగారు కూడా రెవెన్యూ ఉద్యోగి అని గ్రహించి "మీరు మెదలకుండా ఊరుకోండి బాబూ, మీ డెబ్బయి ఎకరాలకు వేరే హెచ్చు మొత్తం ఇస్తామని" ఆయనను బుజ్జగించాలనీ, మభ్యపెట్టాలనీ చూశారు. కాని మా పెదనాన్నగారు లొంగిపోలేదు. అందరికీ న్యాయం చేయాల్సిందేనని పట్టు బట్టడంతో గత్యంతరం లేక అధికారులు రైతులందరికీ సరిఅయిన పరిహారం చెల్లించారు. అప్పుడు మా గ్రామస్థులంతా మా పెదనాన్నగారికి కృతజ్ఞతలు తెలిపారు. ఈ విధంగా చదువుకున్న వ్యక్తి ఒకరు, ఎన్నివందల రైతు కుటుంబాలకో లక్షల రూపాయలు ఆదాయం వచ్చేట్లు న్యాయం చేకూర్చారు. పాపం అప్పట్లో బ్రిటిషు అధికారులు ఏమీ అన్యాయం తలపెట్టలేదు. అయితే మధ్య వచ్చిన దళారీ ఉద్యోగస్థులు తమ ముల్లె ఏదో మునిగిపోతున్నట్లు అన్యాయం తలపెట్టారు రైతులకు. అలా మా పెదనాన్నగారి ఆగ్రహానికి, మందలింపుకు గురి అయినారు వాళ్ళు. అప్పుడు వచ్చిన పెద్ద మొత్తాన్ని 'కాంపెన్‌సేషన్ ఎమౌంటు; అంటూ మా ఉమ్మడి కుటుంబ సభ్యులు పంచుకుని చాలాకాలం పొదుపుగా వాడుకున్నారు. అన్నివేల రూపాయలు ఒక్కసారిగా వారు కౌలు వసూళ్ళలో ఎప్పుడూ చూడనే లేదు. అందువల్ల పొలం పోయినా వచ్చిన నష్టపరిహార మూల్యం చాలా కాలం వారి జీవితాలకు ఉపయోగ పడింది. మా నాన్నగారు మాత్రం ఆ డబ్బును, మా పినతాతగారూ, ఆ రోజులలో

కొంచెం ధనవంతుడూ అయిన, అలా పేరు తెచ్చుకున్న కాకినాడలో ఉండే లక్కరాజు శరభయ్యగారి దగ్గర దాచుకొని, కావల్సిన మొత్తం అప్పుడప్పుడు కొద్దిగా తెప్పించుకుంటూ కాలక్షేపం చేశారు.

ఇక రెండో పిట్టకథ

ఈ సందర్భంలో కూడా మా పెదనాన్నగారు కుటుంబ సమేతంగా ప్రాతూరులో ఉండడం తటస్థించింది. ప్రతి ఊళ్ళో రెండు భాగాలుండటం మన భారతదేశపు పల్లెటూళ్ళలో సర్వసామాన్యమేకదా! అట్లాగా ఊరూ, మాలపల్లె మా ఊరులో కూడా వేరువేరుగానే ఉండేవి. సరే! మాలపల్లెలో కూడా వేరే అవాంతర విభాగాలు మాలపల్లె, మాదిగ పల్లెలుండేవనుకోండి. అది వేరే విషయం. అంతేకాక వాళ్ళ ఉభయవర్గాలలో తీవ్రమైన విభేదాలుంటాయన్న సంగతి దాదాపు రెండు దశాబ్దాల కిందటి వరకు నాకు తెలియనే తెలియదు. ఆ రెండు పల్లెల మధ్య ఒక సమస్య ఉత్పన్నమైనప్పుడు ఆ విషయం నాకు తెలిసింది. ఈ తరం వాళ్ళకు ఏం తెలుస్తుంది?

అసలింతకూ ఆ సమస్య ఏమంటే, ఆ సంఘర్షణ వృత్తాంతం ఏమిటంటే ఆనవాయితీ ప్రకారం మాలవారి శవం, మాదిగవారి బజారున పోయే వీలు లేదట. పబ్లిక్ బజారులో అనగా బహిరంగ వీధిలో శవం పోవటానికి ఆటంక పరిచే అధికారం రెండో వర్గంవారికి ఏమి ఉంది? అది అహంకారం, అజ్ఞానం, అహంభావ ప్రభావం తప్ప. అప్పుడు పోయి నేను చూదునుగదా ఆ ప్రాంతంలో మాలవారికి ఒక బడి, మాదిగవారికి ఒక బడి ప్రభుత్వ అజమాయిషీలో అక్కడ ఉండటం నాకు చాలా ఆశ్చర్యమనిపించింది. ఊళ్ళో ఇతర కులాల వారికి బడి లేకపోవడం మూలకంగా ఊళ్ళో వాళ్ళు కొద్దిమంది కూడా "పాటిమీది" బడికే పోతుండేవాళ్ళు. నేను కల్పించుకొని ఈ రెండు పాఠశాలలు కలిపి ఒక పెద్ద బడిగా రూపొందిస్తే బాగుంటుందని జిల్లా అధికారులతో సంప్రదింపులు జరిపితే వారు "బాబూ! మీకు కావల్సి వస్తే వేరే బడి అడగండి. అంతేగాని ఆ పాఠశాలల జోలికి పోకండి" అనటం చాలా ఆశ్చర్యమనిపించింది.

ఇంకొక తమాషా కూడా చెప్పాలి. మా పాటిమీది హరిజనులని చెప్పుకునే వారంతా నిజంగా ఎంతో బీదవారు. అంతేకాక వారంతా రెండు తెగల

కింద చీలిపోయి ఎప్పుడో క్రిస్టియను మతం పుచ్చుకున్నారు. మాలలేమో ప్రొటెస్టంట్ శాఖలో చేరిపోయినారు. మాదిగలేమో కేతలిక్కులో చేరిపోయినారు. అప్పటి మతప్రచారకులు కూడా తమకు ఇబ్బంది లేకుండా రెండు వర్గాల వారికి చెరో 'చర్చి' పరంగా మతాన్ని ఇప్పించి వాళ్ళలోని కులభేదాన్ని సమన్వయించటానికి కూడా ఏ మాత్రం ప్రయత్నం చేయలేదు. ఇదీ అప్పట్లో హరిజనవాడల పరిస్థితి. ఈ పరిస్థితి చూసి నేనన్నాను. "ఒరే నాయనలారా! మేము బ్రాహ్మణులమైనా గాంధీగారి సిద్ధాంతాలకు కట్టుబడిన మిమ్మల్నందరినీ మా ఇంటికి ఆహ్వానించి ఇతరత్రా పై కులాల వారిచేత కూడా గృహప్రవేశానికీ, దేవాలయ ప్రవేశానకీ ఒప్పించటానికి ఇన్ని దశాబ్దాలుగా అవస్థలు పడుతుంటే, మీరు ఇప్పటికీ ఇట్లాగే ఉన్నారేమిటి?" అని బోధించాల్సి వచ్చింది. అయితే ఇప్పుడిప్పుడే యువతరంవారిలో ఆ భేదభావాలు సమసి పోతున్నాయి.ఇది ముదావహం. వాళ్ళు నిర్మాణాత్మకమైన కార్యక్రమాలలో పాల్గొంటున్నారు. అయితే ఊళ్ళో ఉన్న పెద్ద ఆసాములు కూడా తమ తమ పార్టీల కక్షలలో హరిజనులలోని ఈ వేర్పాటు ధోరణులను, విభేదాలను ఉపయోగించు కుంటున్నారు.ఆయా పార్టీలవారు వాళ్ళను పంచు కుంటున్నారు.

## గుర్రంపై పెళ్ళి ఊరేగింపు

ఇది పూర్వం మా ఊళ్ళో జరిగిన ఒక ఉదంతం. మా పెదనాన్నగారు అదృష్టవశాత్తూ ఈ సందర్భంలో మా ఊళ్ళో ఉండడం తటస్థించింది. హరిజనవాడలో పెళ్ళి జరిగింది. మాలవారి వర్గంలోనో, మాదిగవారి కులంలోనో కాని, అది మాత్రం తెలియదు. వాళ్ళు సాధారణంగా గుర్రం మీద ఊరేగడం, పెళ్ళి సమయపు ఆచారంగా పాటిస్తారు. ఇహ డప్పులు వాయించడం, చిందులు తొక్కడం ఉండనే ఉంటాయి కదా! ఈ ఊరేగింపుటుత్సవం పెద్ద కులాలున్న వీధిలోకి తరలబోతున్నదని తెలిసింది. ససేమిరా వల్లకాదని పెద్ద కులాలవారు పట్టు బట్టారు. పాటిమీద మాలమాదిగలకు కూడా అంతకంటే ఎక్కువ పట్టుదలలే వచ్చాయి. ఇదొక పెద్ద దొమ్మిగా తయారవ బోతున్నదేమోనన్నంత ఉత్పాతాన్ని సృష్టించింది. శాంతి భద్రతలు భంగమై కక్షలు పెరిగే పరిస్థితి ఏర్పడింది. ఇటువంటి సందర్భాలలో హరిజనులదే భుజబలం, అంగబలం, మొండితనం బలం ఎక్కువగా పనిచేస్తాయి. అంతేగాక

ఆ రోజులలో ఆ మాలమాదిగలవర్గాలలో మాంచి క(్రసాము ·వస్తాదులుండేవారు. నిజంగా దెబ్బలాటంటూ వస్తే ఎవరుగెలిచినా రక్తపాతమేకదా! అప్పుడు వారూ వీరూ అంతా ఊరి వారంతా పెద్దగా భావించే మా పెదనాన్నగారి దగ్గరకు తీర్పుకోసం వచ్చారు. అదీ ఒకందుకు మంచికే అయింది.

### పెదనాన్నగారి సలహా

ఊరివాళ్ళ నుద్దేశించి మా పెదనాన్నగారిట్లా చెప్పారు.పల్లికు బజారులో నడిచే అధికారం కానీ ఊరేగింపుగా వచ్చే హక్కుగానీ గూడెం వారికి ఎవరూ భంగపరచలేరు. ఆ హక్కు వాళ్ళకెవరూ తీసివేయలేరు. అయితే వాళ్ళంతా ఈ రాత్రి ఊరేగింపుగా రాదలచుకున్నదీ, వారి ఉత్సాహాన్ని, సంతోషాన్నీ, అతిశయాన్నీ మీ ముందరప్రదర్శించటానికే గదా! అది మీకు చూడటం ఇష్టం లేకపోతే మీరంతా పెందలాడే భోంచేసి తలుపులన్నీ గట్టిగా బిడాయించుకుని పడుకోండి. సందడి లేని వీధిలో, నిర్మానుష్యమైన బజారులో వాళ్ళు ఊరేగింపు కానిచ్చుకుని వెళతారు. అయితే నేను ఒకటి స్పష్టం చేస్తున్నాను. మా ఇంటి దర్వాజాలు మాత్రం తెరిచే ఉంటాయి. నేను తప్పకుండా వాళ్ళను ఆహ్వానిస్తాను అని గట్టిగా హితబోధ చేశారు మా పెదనాన్నగారు.

ఆయన చెప్పినట్లుగానే ఊరివాళ్ళంతా తలుపులు మూసుకొని పడుకున్నారు. హరిజనులంతా మామూలుగా పెళ్ళి ఊరేగింపులో మాదిరిగా పెళ్ళి దంపతులను గుర్రంమీద ఊరేగిస్తూ మంగళవాయిద్యాలతో, డప్పులతో, గంతులతో కేరింతలతో ఆనందంతో వచ్చి మా ఇంటి ముందు చాలా సేపు వారి విద్య చూపి పోయినారు. వాళ్ళ ప్రదర్శన చాలా కనుల పండుగ్గా వున్నది. మా పెదనాన్నవాళ్ళ కివ్వవలసిన కట్నకానుకలు ఇచ్చి ఆదరించిపంపారు. ఈ విధంగా ఉభయ వర్గాల ఉద్రేకాలు చల్లారి పోయినయ్. తర్వాత రెండు పక్షాల వాళ్ళు కూడా యుక్తితో కూడిన మా పెదనాన్నగారి సలహాకు సంతోషించారు. కృతజ్ఞత విషయం మాత్రం తెలియదు.

ఈ విధంగా ఊళ్ళో విజ్ఞత గలవ్యక్తి ఒక్కరున్నా పల్లెల ప్రశాంతతకు, ప్రగతికి అది ఎంతగానో తోడ్పడుతుందనడం నిర్వివాదాంశం. ఇది మా పెదనాన్నగారు ఊరికి చేసిన రెండవ ఉపకారం!!

# IX

# దొంగల గన్నవరం

# DONGALA GANNAVARAM

Our high school education was in Gannavaram Krishna District. In the outskirts always fear of thieves - under the Peepul Tree on the highway. Now the whole area is well populated - The economic rehabilitation of the locality by revolutionising the Agriculture by my friend Dr. Laxmanarayudu who settled there.

**కృష్ణాజిల్లా – గన్నవరంలో :-**

మా హైస్కూలు చదువులన్నీ కృష్ణాజిల్లా గన్నవరం హైస్కూలులో జరిగినయి. ఆ వూరు అప్పటికే దొంగల గన్నవరంగానే పేరు గాంచింది. ఈ వూరుకు ప్రతిగా గోదావరి డెల్టాలో ఒక గన్నవరం ఉంది. దానిని డెల్టా గన్నారం అనేవారు. ఇప్పుడు మనం చెప్పుకునేది మేం చిన్నతనంలో చదువుకున్న దొంగల గన్నవరం గురించి.

ఇప్పుడు విజయవాడ విమానాశ్రయం నుండి ఊళ్ళోకి వస్తోంటే పెద్ద రావి చెట్టు ఉంది. అక్కడ చీకటిగాను, జనసమ్మర్దం లేకుండాను ఉండేది. ఇహ ఒంటరిగా వచ్చే బాటసారులను దోచుకోటం తేలికేగదా. దాదాపు 10, 15 కి.మీ దూరం వరకు ఆ రోడ్డుమీద భయంగానే ఉండేది. దొంగల గన్నవరం కూడా ఇప్పుడు మారిపోయింది.

ఒకప్పుడు జోరుగా దొంగతనాలు సాగిన గన్నవరం, అది అసలు దొంగల గన్నవరం అని ప్రసిద్ధి కెక్కింది కదా! అటువంటి గన్నవరం పరిసరాలలో ఎన్నో మార్పులు వచ్చాయి. పూర్వకాలంలో దారులు కొట్టే ఆ దొంగల రావిచెట్టుదగ్గరే విమానాశ్రయం వచ్చింది ఇప్పుడు. నిర్మానుష్యంగా ఉన్న దారి పక్క పొలాలు, సీమపంది మాంసం కర్మాగారం వగైరా పారిశ్రామిక వాతావరణం కాలూనింది. గన్నవరం దాటగానే పక్కన కనిపించే గరువు భూములు, అట్టే నీరు అవసరం కాని మెట్టపంటల భూములు చెరుకు పండించే పొలాలైనాయి. గొట్టం బావులు తవ్వి మంచి జలలు గల బోరింగులు ఏర్పాటు చేయటంతో చెరుకు మొదలైన బంగారు పంటలకు ఆస్కారం కలిగింది. రైతులు, కూలీలు, ఆర్థికంగా బాగా మెరుగు పడ్డారు. పూచిక పుల్లలు మొలిచి పశువులు గడ్డిమేయడానికి కూడా పనికిరాని 'బీడు' భూములు, రూపాయల వర్షం కురిపించే వాణిజ్య పంటలకు నోచుకున్నాయి. ఇహ దొంగతనాలు చేయవలసిన అవసరం ఎవరికి మాత్రం ఎందుకుంటుంది?

ఆ ప్రాంతమంతా అంత అభివృద్ధిలోకి రావడానికి కారణం మా మిత్రుడు డాక్టర్ లక్ష్మణరాయుడు. అతడు వైద్యవృత్తిమీదే కాకుండా చుట్టుపక్కల పేదసాదల ఆర్థికాభివృద్ధికోసం, ఆధునిక వ్యవసాయ పద్ధతులలో వాళ్ళకు శిక్షణ కలగచేసి ఆ ప్రాంతీయులంతా అతన్ని దేవుణ్ణి కొలిచేట్లుగా వాళ్ళ అభివృద్ధికి తోడ్పడ్డాడు. ఈ విధంగా పల్లెలలో చదువుకున్నవారు ఒక్కరైనా ఉంటే ఈ పాటికి మన పల్లెలు ఎంతైనా బాగుపడేవి.

రాజకీయ నాయకులు ఏ పార్టీకి చెందినా ప్రజలు కోరేది మాత్రం నిర్మాణాత్మకమైన కార్యక్రమం. ఆ మేలుచేసిన వాళ్ళు ఏ పార్టీకి చెందినా ఆ వ్యక్తి పట్ల ప్రజలు కృతజ్ఞులై ఉంటారు. ఈ తత్త్వం, ఈ రహస్యం రాజకీయవేత్తలకు తెలియదనడానికి వీలులేదు. అయితే ఆచరణలో పెట్టటానికి తగిన చొరవ చూపించలేరు. ఏమంటే రాజకీయనాయకులలో ఎక్కువమంది స్వార్థపరులు.

అందువల్ల రాజకీయమంటే రచ్చకీయంగానే మిగిలిపోయింది. రాజకీయాలంటే తమపదవులు, ప్రాభవాలు, ప్రాపకాలు అనిమాత్రమే అనుకోకుండా తాను తనవారూ పచ్చగా బతుకుతూ అభివృద్ధి సాధించాలన్న దృక్పథం వారికి కలగాలి. ఒక్క ఎన్నికల మీదనే తమ సమస్త శక్తులు కేంద్రీకరించ కూడదు చోటా నాయకులు, బడానాయకులు. అంచెలంచెలుగా తాము ఏ పదవిలోకి ఎట్లా ఎక్క వస్తామా అని కాక ప్రజల అవసరాలు ఎలా తీరుతాయా అనీ, తమ పదవీకాలంలో వాళ్ళకేమి మేలు చేయగలుగుతామా అనీ తాపత్రయపడితే తమ పదవులు పదిలంగా ఉంటాయి. అవి ఎక్కడకూ పోవు. ప్రస్తుతం జరుగుతున్న అభివృద్ధి కార్యక్రమాలు ఇంకా మెరుకుగా సాగుతాయి. బీదసాదలకు కనీస సౌకర్యాలు త్వరితగతిని లభిస్తాయి. ఇలాంటి దృక్పథం పెంపొందించుకోకపోతే మన ఏడులక్షల గ్రామాలు ఎన్ని శతాబ్దాలు గడచినా అలానే ఉండిపోతాయి.

విజయవాడకు 5 కి.మీ. దూరంలో ఉన్న మా ప్రాతూరుకు రోడ్డు రావటానికి దాదాపు 20 సంవత్సరాలు పట్టిందంటే భారతదేశపు పల్లె జీవనసౌభాగ్యం పురోగమించడానికి ఎన్ని సంవత్సరాలు కాలహరణం జరగాలో, జరుగుతుందో ఆలోచించండి.

## సాంఘిక దోపిడి మాటేమిటి?

పల్లెటూరు పరిసరాలలో దొంగతనాలు, దారిదోపిళ్ళ మాట అట్లావుంచి ఈ అణుయుగంలో ఇంకో విధమైన దోపిడి అందరూ చూస్తుండగానే జరుగుతున్నది. కమ్యూనిష్టు సిద్ధాంత సూత్రాలకు మూలాధారం అనదగింది మూలధనం. దాన్నే కేపిటల్ అని నిర్వచిస్తారు వాళ్ళు. కూలీల కష్టఫలితం వల్ల పేరుకున్న సంపద అది. అందువల్ల సంఘంలో అందరికీ దాని మీద పరిసమానమైన అనుభవయోగ్యపు హక్కు ఉన్నది. అదే ధనరూపం ధరించి లక్ష్మిగా తాండవంచేస్తున్నది.. అక్రమంగా దాన్ని దాచిపెడితే అదే నల్లధనం అవుతుంది. అందువల్ల నేటి సాంఘిక పరిస్థితుల దృష్ట్యా రాజకీయ సంఘర్షణల, ఆర్థికవ్యవస్థా విశ్లేషణల ద్వారా ధనికవర్గం వారు, పెట్టుబడిదారీ వర్గంవారు తమ దగ్గర మూలిగేటంత మూలధనం ఉంచుకోకూడదు. ఈ విధంగా అధికంగా నిల్వలుంచు కోవటమే పెద్దదొంగతనంగా పరిగణించాలని సామ్యవాద ఆర్థిక

శాస్త్రవేత్తలు ప్రకటించారు. అందువల్ల ఆ మూలుగుతున్న ధనాగారపు ముసలమ్మలను బయటకు తెచ్చి ప్రజాస్వామ్య అధికారుల చేతుల్లో వాళ్ళకు కాస్త ఊపిరి ఆడేట్లు చేయడం మంచిపని. ఇట్లా చేయకపోతే రెండు పూటలా పూర్తిగా తిండిలేనివాడు, తనకు వేరే ఉపాధిలేక, ఉద్యోగం దొరకక, చదువు లేక ఏంచేస్తాడు? కండబలానికి పని కల్పించడమేకదా అతడు చేయగలిగిందల్లా. *'మాలపల్లి' నవలలో ధర్మకన్నాల సిద్ధాంతం ఇట్లా పుట్టిందే. దారులు కాసి ఉన్నవాడి దగ్గర కాస్తో కూస్తో ఊడలాక్కుని పొట్టపోసుకుంటాడు. ఇది కూడా ధర్మమేనని సామ్యవాద సిద్ధాంతాలు సమర్థిస్తాయి. ధర్మపన్నాలు చెప్పి ఏం ప్రయోజనం? ధర్మమార్గాలు చూపాలి కాని. కడుపు కోసం చేసినా దొంగతనం తప్పేనని కోర్టులు శిక్షిస్తాయి. సరే బాగానే వుంది.

కాని, చీకటి బజారులలో అన్ని వస్తువులనూ దాచి ప్రజల చేతి కందకుండా అధిక ధరలకు అమ్ముకుంటూ సాంఘిక జీవితాన్ని దుర్భరం చేస్తున్న దొంగ వ్యాపారస్థులకు ధర్మస్థానాలు ఏం శిక్ష విధిస్తాయి? వాళ్ళ ధనాగారాలను గూర్చి పట్టించుకుంటున్నాయా? కోర్టులకు కావల్సిందల్లా సాక్ష్యాలు, రుజువులు. కాబట్టి ఈ దోపిడి వ్యవస్థలో దోపిడులు తప్పవేమో! అయితే హింసామార్గం, ప్రాణనష్టం పనికిరావు.

ఇదంతా ఎందుకు ప్రస్తావించడమంటే 80, 90 సంవత్సరాలకిందటి సాంఘిక వ్యవస్థను పరిచయం చేయడానికే. అప్పట్లో దారులు కొట్టడం ఎక్కువగానే ఉండేది అనుకోవాలి. నాకు ఊహపోహలు తెలిసిన తర్వాత మా చిన్నతనంలో కృష్ణా జిల్లా గన్నవరాన్ని అదే ఇప్పుడు విమానాశ్రయం నెలకొన్న గన్నవరాన్ని 'దొంగల గన్నవరం' అనేవారు. ప్రస్తుతం వున్న విమానాశ్రయం ప్రాంతంనుంచి గన్నవరం ఊళ్ళోకి వెళ్ళేదోవలో రోడ్డుమీద పెద్ద 'జడలమాతంగి' మాదిరిగా రావిచెట్టు ఒకటి ఉండేది. అక్కడ చీకటి గుయ్యారంగా ఉండేది. ఏమైనా అజాగ్రత్తగా ఉంటే తప్పక దొంగలు కొట్టేవాళ్ళు.

గన్నవరం రైలుస్టేషను నుంచి ఊళ్ళోకి దాదాపు మూడు కిలోమీటర్ల దూరం ఉంటుంది. ఒంటెద్దుబండి ఎక్కిగానీ కాలినడకన అడ్డదోవలో వెళుతూ ఉంటేగానీ చీకటిగా ఉన్న రోజులలో దొంగలు కొట్టేవాళ్ళు. తరవాత తరవాత

రోజుల్లో త్వరగా ఊళ్ళోకి తీసుకొనిపోయే జట్కాలు వచ్చాయి. పెద్ద రహదారిగా మారిపోయింది విమానాశ్రయం రోడ్డు. నిముషానికో బస్సు తిరుగుతూ జనాభా ప్రయాణపు వత్తిడి హెచ్చిన తర్వాత యీ దొంగతనాల బెడద తగ్గింది. కొత్తకొత్త తరహాల దొంగలు ప్రపంచమంతా తయారైనట్లే బహుశా అక్కడా తయారై ఉండవచ్చునేమోకాని ఆ పాతదొంగల ప్రాముఖ్యం, భయం, ఇప్పుడేమాత్రం లేవు.

తూర్పు గోదావరి జిల్లాలోని 'డెల్టా గన్నవరం' అనే ఊరుంది. కాని ఆ ఊరికన్నా ఆ రోజులలో మేమున్న 'దొంగలగన్నారమే' ఎక్కువ ప్రసిద్ధికెక్కింది.

సరే ఎలాగూ దొంగల ప్రస్తావన వచ్చింది కాబట్టి అప్పట్లోనూ అంతకు కొంచెం ముందుకాలంలోనూ చెప్పుకొనే బందిపోటు దొంగతనాల గురించీ, మరాటీ దండులను గూర్చి కూడా కొంచెం చెప్పుకుందాం.

80, 90 సంవత్సరాల కిందట బందిపోటు దొంగలని గుంపులుగా వచ్చి ధనవంతుల ఇళ్ళను ఊళ్ళను దోచుకొనిపోయేవారు కొందరు. వాళ్ళు ఒక్కొక్కప్పుడు ముందుగా తెలియ జేసి వచ్చే వాళ్ళుట. ఊరివారికి వాళ్ళెవరో తెలిసినా చెప్పటానికి భయపడేవాళ్ళుట. నలభై ఏభైమంది దాకా వాళ్ళు దండుగా వచ్చి ఊళ్ళు దోచుకునే వారంటారు.

వీళ్ళ లాగానే మరాటీ దండులనే వాళ్ళ బెడద కూడా ఉండేది ఆ రోజుల్లో. మహారాష్ట్ర ప్రాంతాలనుంచి వీరు దండ్లుగా వచ్చి ఊరి బయట గుడారాలు వేసుకొని మకాం చేసి ఊరిని దోచుకోవటమో లేదా రివాజాగా ఇచ్చే ముడుపులు సంగ్రహించుకొని పోవటమో చేసేవాళ్ళట. బ్రిటిషు ప్రభుత్వం గట్టి ప్రయత్నంచేసి ఈ బందిపోటు దొంగతనాలను, పిండారీ దోపిడీలను అరికట్ట గలిగింది. అది చరిత్ర కెక్కిన విషయం అందరికీ తెలిసిందే.

మా ప్రాతూరుకి 10 కి.మీ దూరంలో ఉన్న మా మేనత్త అత్తగారి ఊరైన నూతక్కి గ్రామంలో వాళ్ళింట్లో బందిపోటు జరిగిందని మా మేనమామగారు మా తరానికి కథగా చెప్పేవారు. మా ఇంకో మేనత్తగారైన తిరుమలమ్మగారి ఊరైన కేతనకొండలో కూడా వారింట్లో ఒక సారి బందిపోటు దొంగలు ప్రత్యక్షమైనారని చెప్పేవారు. కేతనకొండ విజయవాడ హైదరాబాదు రోడ్డుమీద విజయ వాడనుంచి 24 కిలోమీటర్లలో ఉంది. ఊళ్ళకు సరైన రహదార్లు లేకపోవడం,

రక్షణ ఏర్పాటు లేకపోవడం, ఆనాటి సామాజిక పరిస్థితులు ఇలాంటి దొంగతనాలకు కారణమై ఉంటాయని వేరే చెప్పాలా? ఎలాగూ ప్రస్తావన వచ్చింది కాబట్టి కేతనకొండను గురించి కొంచెం పరిచయం ఇక్కడే చేస్తాను. కేతనకొండ వెళ్ళాలంటే విజయవాడ హైదరాబాదు రోడ్డు మీద 24వ కిలోమీటరు దగ్గరనుంచి రోడ్డుకు దూరంగా కొన్ని ఫర్లాంగుల దూరం లోపలకు వెళ్ళాలి. అంటే బస్సులో వెళ్తే రోడ్డుదగ్గర దిగి నడిచి పోవాలి. అయితే తరవాత తరవాత ఒక మార్పు జరిగింది. ఆ పాత కేతనకొండ దగ్గర వరదలు తరచూ వస్తుండేవి. ఊరు మునిగిపోతూ ఉండేది. అందు వల్ల అక్కడ వాళ్ళంతా లేచివచ్చి రోడ్డు పక్కనే స్థలాలు కొనుక్కొని ఇళ్ళు కట్టుకున్నారు. కొన్ని వందల సంవత్సరాలుగా ఒకచోట ఉన్న కుటుంబాలు కూకటివేళ్ళతో సహా పెకలించుకొని మరోచోటికి మారటమంటే, ఈ మార్పును కూడా ఒక విధమైన వలస కిందనే భావించాలి.

మా చిన్నప్పుడు మా మేనత్తగారింటికి తరచూ వెళుతూ ఉండేవాళ్ళం. అప్పట్లో మా మేనత్తగారిల్లు లంకంత కొంప అంటే నమ్మండి. దాదాపు ఒక ఎకరం పొలంలో పెద్దదొడ్లతో ఉండేది. ఆ ఇంటి వెనక పెద్ద వంట ఇల్లు కట్టటం నాకు తెలుసు. ఇంటి వైశాల్యం గురించి చెప్పాలంటే ఆ రోజుల్లో 'ఇన్ని దూలాల ఇల్లు' అనేవారు. అంటే రెండుగోడల మీదకు ఉండే పెద్ద దూలాల సంఖ్య మీద ఆ లెక్క ఉండేది. ఆ వంట ఇల్లే దాదాపు పది దూలాల పొడుగు ఆక్రమించి ఉండేది. వంట ఇల్లే అంత పెద్దదిగా ఉన్నప్పుడు ఇహ మిగతా ఇల్లు ఎన్ని గదులతో ఉండేదో ఆలోచించుకోవచ్చు. ఎంతమంది అక్కడ ఆ ఉమ్మడి కుటుంబంలో నివసించేవారో ఆలోచించుకోండి. అవన్నీ తరవాత విందురుగాని. ఇంతకూ ఇప్పుడు చెప్పవచ్చేదేమంటే అంత పెద్ద ఇల్లు పాడుబడి ఆ స్థలంలో ఒక చిన్న గొయ్యి వెలసింది. అందులో రెండు పాములు కాపరం పెట్టాయన్నారు. నేను వెళ్ళి చూశాను. తెలిసిన వాళ్ళెవరైనా చెబితే తప్ప ఆ స్థలంలో అంత పెద్ద ఇల్లుగాని, అసలు అలాటి ఇల్లు ఉండవచ్చునన్న ఛాయలుగాని ఊహించలేము. కుతూహలం కొద్దీ వెళ్ళి ఆ గొయ్యి చూసివచ్చా. పాములు మాత్రం కనిపించలేదు.

ఆ పూర్వపు కేతనకొండకు రాకపోకలు జరపాలంటే బండివెంట తుపాకీ ఉండాల్సివచ్చేది. దొంగలు, దొంగతనాలు గూర్చి అనుకొన్నప్పుడు

కేతనకొండ విషయాలు కూడా జ్ఞప్తికి వస్తున్నాయి. కేతనకొండ చిన్నఊరు. రోడ్డుకి దూరంగా లోపలికి వెళ్ళాలని చెప్పానుకదా! రోడ్డు మీదికి వచ్చి అక్కడ నుంచి 24 కిలోమీటర్లు వెళితే కాని విజయవాడరాదు. ఆ ఊరినుంచి విజయవాడ పోవాలంటే కాస్త వసతి కలవాళ్ళు రెండెడ్ల బండి కట్టుకొని ప్రయాణం చేసేవాళ్ళు. మిగతా వాళ్ళంతా రోడ్డు మీద కాలినడకనే వెళ్ళేవాళ్ళు. అప్పట్లో మేము విజయవాడ ప్రయాణం కావాలంటే ఏం చేసేవాళ్ళం. తెల్లవారు ఝామున ఏరెండుకో మూడుకో బయలుదేరి బండిలో పడుకొని మెల్లిగా ప్రయాణం సాగించేవాళ్ళం. బండి వెంట తుపాకీతో ఒక మనిషి నడిచేవాడు. దొంగలభయం వల్ల ఈ విధఃగా తుపాకి తోడు ఉండేదన్నమాట. సాధారణంగా అక్కడి పల్లెలో నివసించే బీదజాతి ప్రజలే ఈ దొంగతనాలకు పాల్పడుతూ ఉండేవాళ్ళు. బండి మెల్లిగా ముందుకు సాగేది. తెల్లవారేసరికి చద్ది అన్నాల మూటలు విప్పి పిల్లలకు ఆ అన్నం కలిపి ముద్దలు పెట్టేవాళ్ళు. వాటి రుచి ఇప్పుడు చెప్పతరం కాదు. విజయవాడ చేరేసరికి పది, పదకొండు గంటలయ్యేది. అప్పుడు పెద్దవాళ్ళు స్నానాలూ అవీ పూర్తిచేసుకుని మడి కట్టుకుని భోజనాలు చేసేవాళ్ళు.

అంటే 15 మైళ్ళు అంటే 24 కిలోమీటర్లు ప్రయాణం చేయటానికి సుమారు 10, 12 గంటల కాలం పట్టేదన్నమాట. తర్వాత జట్కాలు వచ్చి ఆ ప్రయాణం నాలుగైదు గంటలలో పూర్తిఅయ్యేది. ఇహ ఇప్పుడు బస్సు పట్టుకుంటే అరగంట ప్రయాణం. అందువల్ల ఇహ ఇప్పుడు దొంగలకు అవకాశం ఎక్కడిది? అదీ కాక ఆ ప్రాంతమంతా సారవంతమైన పాటినేల కావటంచేత నీటి సౌకర్యాలు ఏర్పడి, అధికమైన రాబడులు ఇచ్చే పంటలు పండిస్తూ రైతు కూలీల రోజు ఆదాయం చాలా పెరిగింది. విద్యాగంధం సోకటం వల్ల ఈ తరాల వారంతా సాంఘిక జీవన స్రవంతిలో చేరిపోయి సుఖజీవనం చేస్తున్నారు.

ఇంకొక ఆసక్తికరమైన ముచ్చట చెప్పాలి. ఒకవేళ మా చిన్నతనపు అప్పటి రోజులలోనైనా మాది కేతనకొండ అనీ కరణంగారి తాలూకు అని చెపితే ఆ దొంగలు మా జోలికి వచ్చే వాళ్ళు కారట! ఆ ఊరి కరణీకం మా మేనత్తకొడుకు దుర్గయ్యబావ కుటుంబానిది. అందుచేత హాస్యానికి మా బావతో

అనేవాళ్ళం. 'బావా! నీ పేరు చెప్పగానే దొంగలు వదిలేస్తారుట – అసలు నీకూ వాళ్ళకూ ఏదో లాలూచి ఉండేదేమో! వాళ్ళ దోపిడి మొత్తంలో ఏదైనా భాగం ఉండేదా ఏమిటి నీకు!! మీరంతా తోడుదొంగలైఉంటారు' అని ఆటలు పట్టించేవాళ్ళం. ఇక చోరపురాణం కట్టిపెట్టి ఇతర ముచ్చట్లు చెప్పుకుందాం.

# X

# మా వంశకథనం

# THE STORY OF MY ANCESTORS

They migrated from Nellore district to Praturu. Their original family name was "VITTAMRAJUVARU" - changed to "PRATUR" as family name.

My great grand fathers performed 'Yagnas' - were good TANTRIC experts. Deities were present at their calling. Though imprisoned for civil debts by the Government, my great grand father was found in the house only.

A room in our house is famous for easy deliveries. Women anticipating difficult deliveries used to come and deliver in the room.-The Room of "KISTAMMA"

The Pratury family - their ancestry- Village Praturu is situated on the opposite bank of Vijayawada. The River Krishna divides- Just so near but so far from urban civilization till the Prakasham Barriage and other bridges and roads were built. This includes the 'Kanaka Durgamma Varadhi' on Krishna River which our President Sri R.Venkataraman opened recently. Thus communications are the most important ladders of our rural prosperity.

My paternal great grand fathers were well versed in 'Mantra Sastra' which helped to cure people's ills.

The Brahminical landlords - Their expenditure on Religious Yagas-Yagnas. The appalling agricultural methods and yields depending mostly on rain for crops etc. etc. of our family 'Tantrick' capabilities.

మా ఇంటిపేరు ప్రాతూరు. మా ఊరు ప్రాతూరు. మా వంశం కుదురు ప్రాతూరు. ముమ్మాటికీ ఈ విధంగా మేము ప్రాతూరివారమైనాము. మేమే కాదు ప్రాతూరులో వున్న చాలా కులస్థుల ఇంటిపేర్లు హరిజనులతో సహా ప్రాతూరే. బ్రాహ్మణులలో అయితే 'ప్రా' తో మొదలైతే అంటే క్రావడి వున్న ఇంటి పేరిటి వారు నియోగి బ్రాహ్మణులు. ఉట్టి 'పా' అంటే క్రావడిలేని వారు వైదీకులు. అయితే కులభేదాలు లేకుండా మా అందరి ఇంటి పేర్లు 'ప్రాతూరి' కావడం ఒక విశేషం, అంతకన్నా సంతోషం.

మా పూర్వీకుల ఇంటిపేరు 'విట్టంరాజువారు'. విట్టంరాజువారంటే సరైన ఉచ్చారణమేమో! నొక్కి చెప్పినట్లవుతుంది. వారు నెల్లూరు జిల్లా నుంచి వచ్చారనీ వారు ఇక్కడ స్థిరపడి 'ప్రాతూరు' ఇంటి పేరు పెట్టుకున్నారట. అప్పటి నుంచి ఆ వంశం వారికి ఈ ఊరే స్థిరనివాసమైంది. ఎలాగూ ప్రస్తావన వచ్చింది కాబట్టి మా వంశవృక్షాన్ని ఇక్కడే వివరిస్తే సరిపోతుంది.

## మా ముత్తాతలు మంత్ర శాస్త్రవేత్తలు

మా మూలపురుషుడు "ఇల్లరికం" వచ్చాడని తెలుస్తున్నది. 'ఇల్లరికం' అంటే యీ తరం వారికి తెలీదేమో. కాస్త స్థితిమంతులై ఉన్నవారు అంటే ఆడపిల్లలు మాత్రమే ఉన్నవారు ఇంట్లో తమ తరవాత 'మగదిక్కు' అంటే ఇల్లు సిరిదిద్దే ఒక వ్యక్తి ఉండాలనే భావనతో అల్లుణ్ణి తమ ఇంటికి వారసునిగా తీసుకొని వచ్చి ఇంట్లోనే ఉంచుకొనేవారు. పెళ్ళి సంబంధం కుదుర్చుకొనే ముందే ఇది ఒక షరతుగా విధించేవారు పిల్లనిచ్చేవారు. దీనికి ఇష్టపడేవారు కూడా కొందరువుండేవారు. అయితే ఇలాటిది ఎప్పుడు సంభవం అంటే వరుడి తాలూకు వారు వధువుతాలూకు వారికంటే స్థితిగతులలో కొంచెం తీసికట్టుగా ఉన్నప్పుడు మాత్రమే. లేకపోతే 'మగవాడు' ఎందుకు వప్పుకుంటాడు. కాని అత్తవారింట్లో ఉండి సర్దుకు పోవడానికి కూడా మంచి స్వభావం ఉండాలి.

మా మూలపురుషుడికి నలుగురు కుమారులు. వాళ్ళంతా మంచి యాజ్ఞికులు. మంత్ర శాస్త్రవేత్తలు అయినట్లు లోకంలో ప్రసిద్ధి. యజ్ఞయాగాదులు చేసి మా ముత్తాతగారి తరంలో పొలాలు చాలాభాగం అమ్మినట్లు, అప్పులవారికి దఖలైనట్లు చెపుతారు. మా పితామహులు తిరుమలరాయుడుగారు మంచి వ్యవహర్త. ఆజానుబాహువుగా ఉండి మాంచి

హుందాగా ఉండేవారుట. ఆయన గుర్రంమీద చుట్టుపక్కల ఊళ్ళు తిరుగుతూ ఉండేవారుట. ఆ రోజులలో గుర్రం ఉండటమే పెద్ద హోదా. పెద్ద పెద్ద వారికి అదే వాహనంగా వుండేది;

ఈ రోజుల్లో కలవారికి కార్లు ఉన్నట్లు ఆ రోజుల్లో గొప్పవారికి గుర్రాలుండేవి. ఒక మోస్తరు స్థాయి వారికి ఇప్పుడు స్కూటర్లు ఉంటున్నాయనుకోండి. అప్పట్లో అధికారులకు, సంపన్నులకు, గుర్రాలే ప్రయాణ వాహనాలుగా ఉండేవి. మా తిరుమలరాయుడు తాతగారు వ్యవహర్త అవటం చేత తండ్రిగారి పొలాలన్నీ అప్పుల వారు కట్టుకుంటుంటే తాను పంచుకున్నట్లు దస్తావేజులు రాసుకుని ఒక నూరెకరాలు మా కుటుంబానికి దక్కేట్లు చేశారు. అప్పటి నుంచే ప్రాతూరు వారు వంద ఎకరాలు వున్న జమీందార్లుగా లెక్కలోకి వచ్చారు. ఆ విధంగా ఊళ్ళోవాళ్ళు వారిని గౌరవించేవారు. మా తాతగారి తరువాత మేము మూడో తరంవారమైనా ఇప్పటికీ కాస్తో కూస్తో ఆస్తి వుండి ఆ ఉమ్మడి భావాన్నీ సోదరభావాన్నీ నిలుపుకోగలిగినందుకు, ఆ సంప్రదాయాన్ని అనుభవిస్తున్నందుకు గర్వపడుతున్నాం. ఈ తరం వరకు మేము దాన్ని కొనసాగిస్తూనే వచ్చాం. ఇప్పటికీ మా అన్నదమ్ములలో ప్రాతూరు ఉమ్మడి కుటుంబ ఆస్తులలో ఎవరు ఏమి చేసినా అంతా ఆమోదిస్తాం. అది మా ఉమ్మడి కుటుంబపు ఆప్యాయత. నాలుగో తరానికి చెందిన మా పిల్లలు ప్రపంచంలో అన్ని మూలలలో ఉన్నా ఇదే భావంతో ఉన్నందుకు వారి తల్లిదండ్రులమైన మా తరంవారికి ఎంతో సంతోషకరమైన విషయం.

పూర్వకాలంలో యజ్ఞయాగాదులు, సంతర్పణలు, సప్తాహాలు, మోక్షసాధనకోసం ఎన్నో ధర్మకార్యాలు, రామపట్టాభిషేకాలు, సీతాకళ్యాణాలు చేసి ఆస్తులు హరించుకొని పోయిన పెద్దలు ఎందరో ఉండేవారు. ముఖ్యంగా బ్రాహ్మణ కుటుంబాలలో వీరి సంఖ్య ఎక్కువగానే ఉండేది.

పాతకాలంలో 'బ్రాహ్మణవ్యవసాయం' అనే మాట ఇట్లానే పుట్టి ఉంటుందనుకుంటాను. అయితే ఈ సామెతకు ప్రాధాన్యం ఇప్పుడు తగ్గిపోయింది. బ్రాహ్మణవ్యవసాయం అంటే ఏవిటో జపతపాలు చేసుకుంటూ తమ దృష్టిఅంతా 'ఆముష్మికం' మీద కేంద్రీకరించి ఐహికంగా పట్టించుకోక

పోవడంవల్ల వ్యవసాయంలో నష్టం వచ్చేది. ఇప్పుడైతే వ్యవసాయం చేయదలచుకొన్న బ్రాహ్మలు కూడా మిగతా రైతుల మాదిరిగానే ఫలసాయంపైనే దృష్టిని కేంద్రీకరించటం వల్ల మిగతా రైతులతో పాటే వారూ లాభదాయకమైన వ్యవసాయాన్నే చేస్తున్నారు. అయినా బ్రాహ్మణ వ్యవసాయానికి మా పూర్వీకులే తార్కాణం. యాజ్ఞికులు కావటానికి వందల ఎకరాలు వాళ్ళు అమ్మారు. అందుకే మా తాతగారు తిరుమలరాయుడుగారు తెలివిగా తండ్రి దగ్గరనుంచి తన భాగం పంచుకుని ఒక వందెకరాలు అప్పుల వారిబారి నుంచి తమను తాము రక్షించు కోగలిగారు. అవే ఇప్పుడు మేం అమ్ముకోడానికి ఉపయోగించినయి. అదీ మా ఈ తరంవారి ప్రయోజకత్వం.

మా తాతగారు గొప్ప హోదాతో జీవించారుట. హుందాగా గడిపారుట. ఉద్యోగం చూడబోతే చిన్నదే. నెలకు నాలుగు రూపాయల జీతం గల 'మణేదారు' ఉద్యోగం చేసేవారు. అయితే ఆయన దర్జాను గురించీ హోదాను గురించీ మా పెద్దన్నయ్య గర్వంగా చెపుతూ ఉంటాడు. ఏమిటంటే ఆయన 'కృష్ణాకెనాల్' రైలుస్టేషనుకు రైలు ఎక్కడానికి వెళ్ళినప్పుడు ఆ స్టేషను మాస్టరుగారు మా తాతగారు విశ్రాంతిగా కూచోవటానికి ప్లాటుఫారం మీద పడకకుర్చీ ఏర్పాటు చేసేవాడుట. అంత పెద్ద ఉద్యోగి అయిన స్టేషను మాస్టరు మా తాతగారు కూర్చోడానికి కుర్చీ ఏర్పాటు చేయించారంటే తాతగారి హోదా హెచ్చుగా ఉన్నట్లే లెక్ఖకదా! ఆ ప్రాతూరి తిరుమలరాయుడి గారి మనవలం ఇప్పుడున్న మేమంతా. మా తండ్రులంతా గతించారు కదా! ఇక మేమే పెద్దలం. అంతేకాక ఈ 'మా తరం చరిత్ర', రాసుకోగల శక్తి అనండి సామర్థ్యమనండి యోగ్యత అనండి అదేదో కూడా కొంతలో కొంత ఉన్నందుకు మా తరంవారికి గర్వంగానే ఉంది మరి.

మా పూర్వీకులు అంటే మా తాతగారి తండ్రి యజ్ఞనారాయణగారు వైగెరాల వరకు వారంతా మంత్ర శాస్త్రవేత్తలు. దెయ్యాలు వున్నాయో లేవోగాని దెయ్యాలు భూతాలు ఉన్నాయని నమ్మి అవి తమను ఆవహించాయని కూడా నమ్మి మనసు బెంబేలెత్తిపోయి అదోవిధంగా వింతగా విడ్డూరంగా ప్రవర్తించేవారు చాలా మంది మన సంఘంలో ఉండేవారప్పుడు. ఇప్పుడూ కొంత మంది ఉండవచ్చు. ముఖ్యంగా ఇటువంటి వాళ్ళను పల్లెలో చిన్న చిన్న పట్టణాల్లో ఆ

రోజులలో ఉండేవారు. ఈ విధంగా 'గాలీ' 'ధూళీ' తమకు సోకిందని గంతులు వేసేవారు వస్తే ఆ క్షుద్రదేవతలేవో మా ముత్తాతలకు కనిపించేవట. మంత్రించి దర్భపుల్ల విసిరేస్తే ఆ క్షుద్రశక్తులు మాయమయిపోయి వచ్చినవాళ్ళు సుఖంగా తిరిగిపోయేవాళ్ళట. ఇది మనస్సుకు సంబంధించిన విషయం. భ్రాంతే కావచ్చునేమోకాని ఆ వ్యక్తులకు మాత్రం అది నిజం. ఈ కాలంలో కూడా మానసికమైన వత్తిడులే అన్ని రోగాలకు మూలకారణం అంటున్నారు కదా? మానసిక శాస్త్రవేత్తలు కూడా వ్యాధులకు, రోగాలకు మనస్సే కారణమని అంటూనే ఉన్నారు. అందువల్ల మనస్సు మీద పనిచేసి మనస్సుకు 'గురి' కలిగించే ఏ విధానమైనా మంచిదే. అందుకే కాబోలు 'మానిందిమందు' అనే లోకోక్తి పుట్టి ఉంటుంది. వేదాంతులు 'మనస్సు'ను 'ఆత్మను విడదీస్తారు. మనస్సు కోరికలకు బలిఅవుతుంది. ఆత్మ వేదాంతమార్గాన్ని చూపిస్తుంది.

దేవుడని నమ్ముకొని, మొక్కులు మొక్కుకొని, ముడుపులుకట్టి దైవదర్శనం చేసుకుంటే తగ్గిన అనేక దీర్ఘవ్యాధులు, మందులు లేవని వైద్యులు చెప్పిన వ్యాధులు కుదిరి, ఆ విధంగా నయమైన వ్యక్తులను కళ్ళారా చూశామని చెప్పే వివేకవంతులు అనేకమంది ఉన్నారు. మంత్రశాస్త్రం లేదనటానికి వీలులేదు. అయితే మన గ్రహింపునకు అందనివి, మనం తెలుసుకోలేనివి, తెలియనివి ఏవీ లేవని అనగలమా? అట్లా అనటం వివేకం అనిపించుకోదేమో! నిజంగా వివేకవంతుడైతే అట్లా అనటానికి సాహసించడు. అయితే 'వినదగునెవ్వరు చెప్పిన, వినినంతనె వేగపడక వివరింపదగున్' అనే పద్యాన్ని ఎప్పుడూ జ్ఞాపకం ఉంచుకోవాలి.

## అమ్మవారు ప్రత్యక్షం

మా తాతలకు, ముత్తాతలకు వాళ్ళ ఉపాస్యదేవతలు అమ్మవార్లు ప్రత్యక్షంగా కనిపించేవారుట. విద్య ఉన్నవాడికీ, విద్య ఉండి తాంత్రికాల జోలికి పోకుండా న్యాయంగా బ్రతికే వారికీ సరస్వతీ కటాక్షమేకానిలక్ష్మీకటాక్షంఅరుదుగా లభించేదేమో ననుకోవాలి. ఇందుకు నిదర్శనం మన గొప్పగొప్ప కవులంతా అనుభవించిన దారిద్ర్యం. కాని ఆ మహాకవులు బమ్మెర పోతనామాత్యుల వంటివారు తాము అనుభవిస్తున్నది దరిద్రమనుకోలేదు. అదే మహదనుగ్రహం అనుకున్నారు. 'బావా! భాగవతాన్ని ఏ మహారాజుకైనా అంకితం ఇస్తే ఎంచక్కా

దర్జాగా సుఖంగా మహదైశ్వర్యంతో బతకవచ్చుకదా' అని శ్రీనాథ మహాకవి పోతనగారికి బోధించాడంటారు. అయినా పోతన మహాకవి అందుకు అంగీకరించలేదుకదా పైగా 'బాలరసాలసాల నవపల్లవ కోమల కావ్యకన్యను, కూళలకెందుకిస్తానయ్యా' అని ధిక్కరించి నిర్భయంగా 'ఆపదుపుకూడు భుజించుటకంటె సత్కృవుత్ హాలికులైననేమి, గహనాంతరసీమల కందమూల కౌద్దాలికులైననేమి?"అని, ఆత్మతృప్తినీ,ఆత్మవిశ్వాసాన్ని ప్రకటించుకున్నాడని పెద్దలు చెబుతారు. అదే నేటివరకు తరతరాల వారిని మహాత్ములను ప్రభావితం చేస్తున్నది. నిజానికి సామాన్యులకు కూడా అది ఆదర్శంకావాలి. అనువర్తించాలి. ఎందరో మహానుభావులు. పోతనగారివంటి వారందరికీ వందనాలు. బమ్మెరపోతరాజు, త్యాగరాజు మొదలైనవారు రాజాశ్రయాన్ని కోరలేదు, సరే ఒక్కొక్కసారి రాజాగ్రహానికి కూడా గురైనారు. ఈ విధంగా ఆలోచిస్తేమరి సరస్వతీదేవికీ లక్ష్మీదేవికీ ఒకరిపొడ ఒకరికి ఎందుకు గిట్టదో తెలియదు. వాళ్ళు తోడికోడళ్ళు కాదు కాని అత్తాకోడళ్ళు. అందుకే వాళ్ళిద్దరికీ పడదేమో! అయితే ఇలా అత్తకోడళ్ళకు పడకపోవడం సృష్టి పుట్టినప్పటినుంచీ సాగుతూనే ఉన్నదన్నమాట! భగవదనుగ్రహం కోసమే కదా ఎవరైనా యజ్ఞాలైనా, యాగాలైనా చేయడం. అవిచేసి మా ముత్తాతలు అప్పుల పాలై ఎన్నో వందల ఎకరాలు పోగొట్టుకున్నారు. కాబట్టే వాళ్ళు యజ్ఞయాగాదుల ద్వారా అర్చించిన దేవుళ్ళు, దేవతలు కూడా ఆ మా ముత్తాతలను ఆముష్మికంగా ఏమన్నా అనుగ్రహం చూపారో ఏమో కాని ఐహిక దృష్ట్యా చూస్తే నష్టపరచినట్లేకదా!

## అప్పులు తీర్చలేని వారికి సివిలు జైలు

ఆ రోజులలో శిస్తులు ఇవ్వకపోతే పొలాలు వేలం వేయడమే కాక అప్పటికీ వసూలు మొత్తం సరిపోకపోతే జైలుశిక్షకూడా అనుభవించవలసి వచ్చేది అప్పులపాలైన ఆసామీలు. ఈ విధంగా మా ముత్తాతలకాలంలో పన్నులు కట్టలేకపోతే అధికారులు జైలు వారంట్లతో సహావస్తే మా ముత్తాత గదిలో కూర్చుని జపం చేసుకుంటూ ఎంతసేపటికీ బయటకు రాలేదుట. వచ్చిన కోర్టు అధికారులు తలుపుసందులోంచి చూస్తే వాళ్ళకు ఎదురుగుండా అమ్మవారు కనిపించినట్లై భయపడి వెళ్ళిపోయారుట!

ఆ రోజులలో ప్రతి చిన్న అధికారం చెలాయించే పదవికీ తెల్లదొరలు, ఇంగ్లీషు వారే సీమనుంచి ఇక్కడకు వచ్చి ఉద్యోగాలు చేసేవారు. అందుచేత ఇహ ఇట్లా లాభంలేదని ఆ అధికారి దొరవారే స్వయంగా కృష్ణ కట్టమీదుగా వచ్చి కట్ట దిగి ఊళ్ళోకి రావటానికి ప్రయత్నించారట. మా ఊరేమో కృష్ణానది గట్టుకు ఆనుకుని ప్రస్తుతం నిర్మించబడిన ప్రకాశం బారేజి కిందుగా రెండు మైళ్ళ ఆరవ ఫర్లాంగు రాయి దగ్గర ఉన్నది. ఈనాటి కొలమానం అయితే 4వ కిలోమీటరు దగ్గరవున్నదని చెప్పాలి. అక్కడ దొరగారు కట్టదిగబోతుంటే ఆయన దారికి అడ్డంగా అమ్మవారు నిలబడి ఆయనను కట్ట దిగకుండా ఆపేసిందట. ఆయన గుర్రం అలానే నిలబడి పోయిందట. గుర్రమంటే ఇంకో సంగతి జ్ఞాపకం వస్తున్నది. 80, 90 సంవత్సరాల కిందట ప్రపంచమంతటిలోనూ గుర్రానికే ఎక్కువ వినియోగంవుండేది. గుర్రాలమీదనే వ్యాపారాలు. శక్తి గణాంకంగా 'హార్స్ పవర్' అనేమాట ఇట్లా పుట్టిందే. పొలం పనులలో కూడా గుర్రాలనే ఉపయోగించేవారు. అందుకే గాబోలు గుర్రం, ఎద్దు సమానం అన్న నానుడి పుట్టింది. గుర్రంగాడిదా సమానమా? అనే సామెతకూడా ఉండనే ఉన్నది.

ఆ కాలంలో కలెక్టర్లుగా ఉన్నదొరలు మంచి మంచి గుర్రాలమీద జిల్లాలలో పర్యటిస్తూ కొంచెం గొప్పవారు. రైతుల యోగక్షేమాలు విచారిస్తూ ఉండేవారు. అట్లానే మా ముత్తాతగారు పన్నులు ఎందుకు చెల్లించలేదు అని కనుక్కోవటానికి స్వయంగా వస్తున్న దొరగారిని అమ్మవారు ఎదురై వెనక్కి తిరగకొట్టిందంటే ఆశ్చర్యంగానూ నమ్మలేనిదిగానూ వుందిగదా! ఉపాసనబలం తప్పక ఉండి ఉంటుంది. అదే మా ముత్తాతగారిని కాపాడి కూడా ఉంటుంది.

మా పూర్వీకులు అంటే మా ముత్తాతకంటే పూర్వీకులు అప్పయ్య సోమయాజులుగారు ఉండేవారు. ఆయన యజ్ఞయాగాదులు చేయడం వల్లనే సోమయాజులైనారు. పెద్ద యజ్ఞం కాక కాస్త చిన్న యజ్ఞం చేస్తే అటువంటి వారిని 'పాకయాజి' అనేవాళ్ళు. 'వైశ్వదేవపరుడు' అనేటువంటిది కూడా ఇటువంటిదే. ఇవన్నీ వైదికకర్మలకు సంబంధించినవి. పరలోకంలో సుఖంగా ఉండటానికి పారమార్థికమైన ఇహలోక కార్యకలాపాలు. వీటిని అనుష్ఠించే వాళ్ళకు ఇటువంటి బిరుదులుండేవి.

ఈ కాలంలో కూడా బ్రిటిషువారి పరిపాలనలో కూడా సర్, రావుబహదుర్, దివాన్ బహదూర్ మొదలైన బిరుదులుండేవి. స్వరాజ్యం వచ్చిన

తర్వాత స్వతంత్ర భారతప్రభుత్వం పద్మశ్రీ, పద్మభూషణ్, పద్మవిభూషణ్, భారతరత్న వంటి బిరుదులను ఏర్పాటుచేసింది. ఇవి వివిధవర్గాలుగా ఉన్నాయి. విశిష్టసేవాచక్ర, పరమవీరచక్ర మొదలైనవి ఒక వర్గం. అన్నిటికన్నా పెద్దది 'భారతరత్న' అని మీకు తెలిసిందే.

ఇప్పుడైతే పెట్టు బిరుదులు కాక, పుట్టు బిరుదులు చెలామణిలో ఉన్నాయి. ఆ రోజుల్లో లాగా కాకుండా ఈ రోజులలో యజ్ఞయాగాదులు చేయకపోయినా మామూలుగా తమ పేరులచివర వైదికులైతే సోమయాజులనీ, నియోగి శాఖవాళ్ళైతే 'శర్మ' అని తగిలించు కుంటున్నారు. కాని మరీ ఈ రోజులలో 'శర్మ' అని వైదికుల శాఖవాళ్ళు కూడా పెట్టుకుంటున్నారు. 'అర్థం' కావాలంటే ఇందులో పెద్ద తప్పేమీ లేదు. అయితే పూర్వకాలంలో సోమయా-జాలుగారైతే చెవులకు కుండలాలు ధరించి పండిత శాలువలు కప్పు కొని వేదం బాగా చదువుకున్న విద్వాంసులుగా 'సోమ' యాగంచేసి చలామణి అయ్యేవారు. చూసీ చూడటంతోనే వేషభాషలను బట్టి సోమయాజాలుగారని తెలిసిపోయి సభామర్యాదలు పొందేవారు. అట్లాగా మా తాతముత్తాతలు అప్పయ్య సోమయాజులు, యజనయాజన సోమయాజులు అనే పేర్లతో చలామణి అయ్యేవారు. అందులో అప్పయ్య సోమయాజులుగారు గొప్పపేరుపొందినవారు.

అప్పయ్య సోమయాజులుగారు కూడా యజ్ఞయాగాదుల వల్ల అప్పులపాలైతే కోర్టు కేసులు పెట్టి అరెస్టు చేసి జైలులో పెట్టారుట. రాత్రి జైలులో పెడితే మళ్ళీ ఉదయాన తన పనులు తాను చేసుకుంటూ ఇంట్లోనే అందరికీ కనిపించారు. జైలు అధికారులు అక్కడ ఆయన కోసం వెదుకుతూనే ఉన్నారు. ఇక్కడ ఆయన తమ స్వంత ఇంట్లో ఏమీ జరగనట్లే మామూలు కార్యక్రమాలను, పూజపునస్కారాలను నిర్వహించుకుంటూనే ఉన్నారు. ఆయన ఉపాసనా బలాన్నీ మంత్ర మహోత్మ్యాన్నీ చూసి అధికారులు ఇహ ఆయన జోలికి పోలేదట.

## పోకకాయను సాలగ్రామం చేయటం

అప్పయ్య సోమయాజులుగారు తన మంత్ర మహిమతో పోకకాయను సాలగ్రామం కింద మార్చేశారుట. 'సాలిగ్రాం' అంటే శివుడి స్వరూపమైన శిల.

అది చిన్న శిలా లింగం రూపంలో ఉంటుంది. దీనికి పూజలు, అర్చనలు చేస్తారు. ఆ సాలిగ్రామాన్ని మా తాతల తరంవరకు మా ఇంట్లోనే పూజలో వుంచి అర్చన చేసేవారు. దీనినే దేవతార్చన అంటారు. అంటే దేవతలను పూజించడమన్నమాట. మా తాతగారు తిరుమల రాయుడి గారి వరకు మా ఇంట్లో దేవతార్చన ఉండేది. ఆ సాలిగ్రామానికి పూజ జరుగుతూ ఉండేది. ఆయన మరణానంతరం ఆయన వియ్యంకుడు అంటే మా పెదనాన్నగారి మామగారు నూతక్కి లక్ష్మీనారాయణగారు తీసుకవెళ్ళి నూతక్కి గ్రామంలో దేవతార్చన జరిపేవారు. తరవాత ఆయన ఆ సాలిగ్రామాన్ని దేవుడి గుళ్ళో ఇచ్చేసి అక్కడే అర్చన చేసే ఏర్పాట్లు చేశారుట. నరసింహస్వామి విగ్రహాలు కూడా మా ఇంట్లో ఉండేవి. వాటిని కూడా మా ఊరి గుళ్ళో ఇచ్చారు. ఎందుచేతనంటే మా తండ్రుల తరం వారంతా ఇంగ్లీషు చదువులు చదువుకుని ఎంత చిన్న ఉద్యోగాలైనా అంగీకరించి వాటి మీద వ్యామోహం వల్ల ఊరు విడిచిపోయారు. అందువల్ల ఇంట్లో మడిగాగాని ఇంక ఇతరమైన భక్తి శ్రద్ధలతోగాని పూజచేసేవాళ్ళు లేకపోవటంవల్ల వాళ్ళు ఆ బాధ్యతను దేవాలయానికి అప్పగించి తమ ఇంటి సంప్రదాయాన్ని ఆ విధంగా నిర్వహించారు. ఈ ఉద్యోగాల మూలంగా ఇంట్లో దేవుళ్ళందరికీ యీ మాదిరిగా ఉద్వాసన చెప్పవలసి వచ్చింది.

ఇదీ మా పూర్వీకుల పూజా పునస్కారాల చరిత్ర. మా వంశ చరిత్ర చెపుతూ మంత్రశక్తి మొదలైన విషయాలు, ముందుతరాలవాళ్ళకి విచిత్ర అనుభవాలు నమ్మలేనంత గొప్పగా ఉన్నవాటిని ప్రస్తావించ వలసివచ్చినందుకు గర్వంగానే ఉంది.

## పురిటికి కిష్టమ్మగది

ఇంకో ఆసక్తికరమైన సంగతి చెప్పాలి. మా ఇంట్లో ప్రవేశించగానే కుడివైపున ఒక గది ఉంది. ఆ గదిని 'కిష్టమ్మగది' అంటారు. అంటే పూర్వం ఎవరో కృష్ణమ్మ అనే ఆవిడ మా ఇంట్లో, అంటే మా కుటుంబంలో ఉండి ఉంటుంది. ఆ కృష్ణమ్మగారే ఈ కిష్టమ్మ.

ఆ కిష్టమ్మగదికి ఒక విశిష్టత ఉంది. ఉండేది. ఆ రోజులలో ఎవరికైనా 'కాన్పు' కష్టమయితే వచ్చి ఆ గదిలో పడుకుంటే కాన్పు తేలికగా అయ్యేదిట. అదీ ఒక నమ్మకమేననుకోండి. మానసికశాస్త్ర ఏం చెపుతున్నదీ? నమ్మకమే ముఖ్యమని. 'మనవీవ మనుష్యప్రాణం' కదా. మనస్సు ఆహ్లాదకరంగా ఉంచుకోవాలి. సుఖదుఃఖాలన్నీ మనసులోనే పుడతాయి. మనసుపైనే పని చేస్తాయి. అట్లా వాళ్ళ నమ్మకం వల్లే వేగంగా నొప్పులు వచ్చి వెంటనే ప్రసవించే వారనటం నమ్మదగ్గ విషయమే!!

# XI

# మా అమ్మ కథ

# THE STORY OF MY MOTHER

Mother is the best teacher - All our inspiration to us is through her. She was like Mother of "Gorky" - The life of my father in his Mother-in-law'splace at Madras - Lot of adjustment is necessary for a son-in-law coming from a village to an upper class life style!

'గురువులందు పరమగురువు తల్లి' అని భారతంలో ఉంది. అందువల్లే కాబోలు మన పెద్దవాళ్ళు ప్రత్యక్షదైవాల గూర్చి చెపుతున్నప్పుడు ముందుగా తల్లినే తలచుకొన్నారు. 'మాతృదేవోభవ, పితృదేవోభవ' అనేది పెద్దలనుడి. కాబట్టే ఇప్పటి విద్యావేత్తల ఆలోచనలలో కూడా కుటుంబ సంక్షేమంలో, విద్యా విజ్ఞాన వికాసాలలో తల్లికే అగ్రస్థానం ఇవ్వాలంటున్నారు. స్త్రీ విద్యావంతురాలైతే ఆ కుటుంబమంతా విద్యావంతమౌతుంది. పురుషుడు విద్యావంతుడైతే అతడొక్కడికే జ్ఞానం పరిమితం అన్నారు వేత్తలైనవారు.

తల్లి చదువుకున్నదయితే ఆ విజ్ఞానం, క్రమశిక్షణ పద్ధతులు, కుటుంబంలోని సభ్యులందరికీ అలవడే అవకాశం ఉంది. వ్యాప్తిచెందే సౌలభ్యం

ఏర్పడుతుంది.తండ్రి బాగా విద్యావంతుడైనా చాలా వరకది ఆయన వృత్తినైపుణ్యానికే దోహదపడుతుంది. అందువల్ల ముందర మా అమ్మ వ్యక్తిత్వం, ఆమె పుట్టుపూర్వోత్తరాలు, ఆమె పెంపకంలో నా అనుభవాలు,కాస్త చెప్పాలని ఉంది. విశ్వవిఖ్యాత రచయిత మాగ్జిం గోర్కీ తల్లి స్థానాన్ని నిరూపిస్తూ 'ది మదర్' అనే నవల వ్రాశాడు. ప్రపంచ భాషలన్నిటిలో ఇది పేరు తెచ్చుకుంది. నేను కూడా 'మాతృదేవోభవ' అంటూ నా కథను ప్రారంభిస్తున్నాను.

మా అమ్మగారి తండ్రి కలపటపు రంగారావుగారు. వారి అసలు స్వస్థలం తూర్పుగోదావరి జిల్లా కాకినాడ అయినా వృత్తిరీత్యా వారు మద్రాసులో స్థిరపడ్డారు. అయితే రంగారావుగారు పైపైన చిన్న చిన్న వ్యాపారాలు చేస్తూ సుఖంగా కాలక్షేపం చేస్తూ ఉండేవారు. గ్రామీణ ప్రాంతాలవారు, ఒక మోస్తరు చిన్న పట్టణాలవారూ పెద్ద పట్టణాలకు సుఖజీవనావకాశాలు వెతుక్కుంటూ ఇప్పుడు వలస సాగిస్తున్నట్లే ఆ రోజులలో కూడా కొన్ని వర్గాలవారు పెద్ద పట్టణాలు చేరడం ఉండేది. అలాంటి పరిస్థితులలోనే మా తాతగారు రంగారావుగారు స్వస్థలం విడిచి ఉండవచ్చు. ఉండవచ్చేమిటి అలాటి ఉద్దేశంతోనే ఊరు విడిచి వెళ్ళారు. పెద్ద పెద్ద వారి పరిచయాలైనాయి ఆ మహా పట్టణంలో వారికి. తుని రాణీగారి దివాన్‌గిరి కూడా కొన్నాళ్ళు చేశారు వారు. ఆ సంస్థాన వ్యవహారాలు మద్రాసు నగరంలో చూసిపెడుతూ ఉండే వారన్నమాట. ఊరికే ఉండకుండా ఏదైనా వ్యాపారం కూడా చేస్తే బాగుంటుందని నెయ్యి వ్యాపారం ప్రారంభించారుట. మన ఆంధ్ర ప్రాంతంనుంచి నేతి డబ్బాలు దిగుమతి చేసుకొని మద్రాసునగరంలో పెద్ద ఎత్తున కాక ఏదో చిన్న తరహా వ్యాపారం చేసేవారు తాతగారు. ఒక సారి ఏం జరిగింది? ఆ సారి వచ్చిన నేతి డబ్బా తూకం సరిగానే ఉన్నది కాని నేతి అడుగున బరువు పెరగటానికి ఒక పెద్ద గుండ్రాయి వేసి ఉన్నదట. ఇలా మోసం చేయడం తప్పుడు తూనికల ద్వారా లాభం పొందుదామనే అత్యాశ, మోసపుబుద్ధి ఎగుమతి దారులలో అనాదిగా కళాకౌశలంతో వర్ధిల్లుతూ వస్తున్నదే.

అందుకే ఈ రోజులలో మన ప్రభుత్వం వారు,ముఖ్యంగా మన విదేశీ వ్యాపార లావాదేవీలలో చూపించే నమూనా ఒకటి, పంపించే సరుకు ఒకటిగా ప్రవర్తించవద్దని మరీ మరీ మొత్తుకుంటున్నారు. దేశంలో వివిధ విపణులలో

అమ్మే సరుకులు కూడా నిర్దుష్టంగానూ ఉత్తమప్రమాణాలు అందుకున్నవిగానూ ఉండాలని ఎన్నో నియమయావళులు కూడా రూపొందించారు. వినియోగదారుల హక్కులలో ఇదొక ముఖ్యాంశంగా ప్రతి దేశంలోనూ పాటిస్తున్నారు. దారితప్పిన వారిని దండిస్తున్నారు.

సరే మరి ఇటువంటి వంచనా శిల్పానికి గురిఅయి మా తాతగారి 'నేతివ్యాపారం' కూడా కొద్ది కాలంలో గుండ్రాయిలాగా స్థాణువైంది. అంటే, అభివృద్ధిలేని కారణంచేత తాము గురి అవుతున్న మోసాలను నవ్వుతూ ఇతరులకు చెప్పుకుంటూనే ఆయన తనదైన 'బ్రాహ్మణ వ్యాపారాని'కి స్వస్తి చెప్పారు. అయితే తమ హోదాకు, స్థాయికి తగినట్లు అక్కడ తమ పలుకుబడి ద్వారా జరగాల్సిన చిన్న చిన్న పనులను ఇతరులకు చేసిపెడుతూ 'దివాన్‌గిరీ' హోదాలో మద్రాసు నగరంలో జీవితం గడుపుకుంటూ వచ్చారు.

1915 వ సంవత్సరంనాటికి మన దేశంలో 'కారు'లు హోదా చిహ్నంగా పరిగణనలోకి ఇంకారాలేదు. ఒకటీ అరా అక్కడక్కడ ఎంతో గొప్పవారి దగ్గరమాత్రం ఈ వాహనాలుండేవేమో! అప్పట్లో మా తాతగారికి పెద్ద 'గుర్రపుసార్టు' ఉండేది. దీన్నే 'హార్స్‌కోచ్' అనేవాళ్ళు. అంటే ఆనాటి ఆ స్థాయి ఇప్పుడు రెండుమూడు కార్లు ఉన్న హోదా అన్నమాట. అది ఆనాడు మా తాతగారు అందుకున్న, అనుభవించిన జీవితపు హోదా.

మా తాతగారు మద్రాసులో కోమలేశ్వరన్ పేట లో రంగనాధం పిళ్ళై అనే మిత్రుడి ఇంట్లో కాపరం ఉండేవారు. నాకు ఆ ఇల్లు ఒక లీలగా మనసులో మెదలుతున్నది. మా తాతగారు రంగారావుగారు ఆనాడు ఎటువంటి దర్జా అనుభవించారో ఎటువంటి స్థితికి ఎదిగారో ఆ విశిష్టస్థాయి అర్థం చేసుకోవటానికి ఒక ఉదాహరణ పరిశీలించండి. మా నాన్నగారు ప్రొతూరు వెంకట సుబ్బారావుగారు స్కూలుఫైనలు పాసుకాగానే ఆ రోజులలో 'ఎఫ్.ఏ' అనే నేటి కాలపు 'ఇంటర్మీడియెట్' లో చేరటానికి అత్తవారింటికి వెళ్ళారు. ఆ విధంగా ఆయన మద్రాసు చేరారు. రాయపేటలోని 'వెస్లీకాలేజీ' లో ఆయన తన పై చదువు సాగించటానికి చేరారు. అత్త వారింట్లో ఉండి చదువుకోవాలన్న మాటే కదా! ఆయన ఇల్లరికం పోలేదు కదా స్వరాజ్యం అనుకోవటానికి. అంత పెద్ద హోదాగల మామగారి ఇంట్లో ఉండటమంటే కొంచెం ఇబ్బందికరంగానే

పరిణమించి ఉంటుంది నాన్నగారికి. అయితే ఎటు చూసినా 'ప్రేమ' వాతావరణమే కదా!

మా నాన్నగారు పల్లెటూరులో అక్కడి పెంపకంలో చిన్నప్పటి నుంచి గారాబంగా పెరిగారు. ఆయనకు ఆరునెలల శిశుదశలోనే మాతృవియోగం కలిగింది. అప్పటినుంచి తన పెద్దక్కయ్యగారైన తిరుమలక్కయ్యగారింట్లో కేతనకొండ అనే అతి చిన్న పల్లెటూళ్ళో ఆయన పెరిగారు. ఆ అక్కయ్య గారు, వాళ్ళు సంపన్న గృహస్థులే అయినా అదొక కుగ్రామం గదా! ఎంతో పరిమితమైన పరిధి అక్కడి జీవన వాతావరణం. ఒక చిన్న వాగుకూ ఒక పెద్ద నదికీ మధ్య ఎంత అంతరం ఉంటుందో నగర జీవితానికీ అతి సామాన్యమైన పల్లెటూరి జీవితానికీ అంత భేదం ఉంటుంది. ఇహ మా నాన్నగారి మద్రాసు జీవితంలో కలిగిన పరిస్థితుల మార్పుగూర్చి పరిశీలిస్తే పరిస్థితులనేవి మానవ జీవితంపై ఎటువంటి ప్రభావాన్ని ప్రసరింపచేస్తాయో తెలుసుకోవచ్చు.

అప్పట్లో ఆ కాలంలో ఆ రోజుల్లో బ్రాహ్మణ కుటుంబాల వారూ ఆర్థిక స్తోమత ఉన్న ఇతరకుటుంబాల వారూ మగవాళ్ళైతే కొంచెం పెద్దవారు 'ముట్టుచెంగావి' రంగు పంచలు కట్టుకునేవారు. ఆ చెంగావిరంగు కొంచెం లేత గులాబీరంగుకు దగ్గరగా ఉండేది. పూర్తిగా వుట్టి తెల్ల మల్లుపంచెలు కట్టేవారుకారు. అంచులేని బట్టలు, వుట్టి తెల్ల మల్లుబట్టలు వితంతువులు, శ్రాద్ధాలు పెట్టేవారూ మాత్రమే కట్టుకునేవారు. పల్లెటూళ్ళలో అయితే అవి రోజూ ఇంటి చాకలి ఉదయం వేస్తే వాటిని సాయంత్రాకని కల్లా శుభ్రం చేసి తెచ్చి ఇచ్చేవాడు ఇస్త్రీ అనే మాటే అరుదు ఆ రోజుల్లో. ఇంతకన్నా బాగా ఉండాలి బట్టలు అంటే గంజి పెట్టి మడతలు పెట్టి వారానికోసారి తెచ్చి ఇచ్చేవాడు చాకలి. చాకలి వాళ్ళకు మంగళ్ళకు సంవత్సరానికి ఒక సారి ఆ ప్రాంతంలో పండే ధాన్యపు గింజలు ఇచ్చేవారు. వరి పండే ప్రదేశమైతే వడ్లు, మెట్ట ప్రాంతమైతే జొన్నలు ఇచ్చేవారు. ఈ విధంగా 'ముట్టుచెంగావి' వాతావరణం నుంచి మా నాన్నగారు మద్రాసులో, కాలేజి చదువుకు అత్తవారింటికి 'కాపురానికి' వచ్చేటప్పటికి ఆయన మనస్తత్వం ఎటువంటి పరిణామానికి లోనై ఉంటుందో ఆలోచించండి.

కాలేజీలో చేరేముందు మా నాన్నగారికి తాతగారు 24 కోట్లు, 24 చొక్కాలు, 24 పదిహేడువందలరెండు (1702) బ్రాండు మల్లు పంచెలు

అంటే అంచులేని తెల్లటి మల్లు పంచలన్నమాట. కాని, కుట్టించి ఆయన వస్త్ర సంపదను రూపొందించారు. రెండు జతల 'బూట్లు' వాటికి సరిపడ 'మేజోళ్ళు' ఇంకా కావలసిన 'నెక్ టై'లు (కంఠలంగోటీలు) మా నాన్నగారికోసం సిద్ధం చేసి ఒక పెద్ద బట్టల దొంతరను ఆయనకు అప్పగింత చేశారు. ఇన్ని బట్టలు ఒక మానవమాత్రుడు ఉపయోగించుకోవటం తమ పల్లెటూరి జీవితానుభవంలో మా నాన్నగారు ఎప్పుడూ కనీ వినీ ఎరిగిందికాదు. ఆయన కళ్ళముందు ఇది ఎంతటి పెద్దమార్పు అనాలి? ఆ రోజుల్లో నవనాగరక రూపరేఖలను చాటి చెప్పే 'ఫాషన్' అయిన ఒక నిలువుటోపీ కూడా తలమీద పెట్టుకోవడం ఉండేది. ఆనాటి నాగరక వేషం అప్పటికి కాని పూర్తికాదు. అంచేత మా అమ్మగారి నాన్నగారైన మా రంగారావు తాతయ్యగారు ఈ పూర్తి స్థాయివేషంతో తనదైన స్థాయికి తగినట్లు మా నాన్నగారికి ఒక 'పగటివేషం' వేయించి మహానగర విద్యా సంస్థ రంగశాలా ప్రవేశం చేయించారు. ఈ పట్టణవాసపు జీవితనాట్యరంగ ప్రవేశానికి ఇది ఒక 'అరంగేట్రం' అన్నమాట. ఇదంతా మా నాన్నగారు తాను బయటకు వెళ్ళేటప్పుడు, కాలేజీకి వెళ్ళేటప్పుడు విధిగా పాటించి తీరాలి. ఆ రోజుల్లో కొందరు పెద్దలు తమ వేష ధారణలో తలపాగాలు ధరించేవారు. కాని మా తాతగారి తలవేషం టోపీలకే పరిమితమై పోయింది. ఆయన ఆనాటి 'ఫొటోలు' మా నాన్నగారి 'ఫోటో'లు అన్నీ ఆ 'ముస్తాబు'తోనే ఉన్నాయి. ఇంకోటి కూడా మరచేపోయాను తొందరలో. ఈ 'ఓపెన్ కాలర్'కు కిందపొరగా దొరలు వేసుకునే 'వేయిస్ట్‌కోట్' కూడా వేసుకొంటే కాని ఆ వేషధారణకు నిండు దనం వచ్చినట్లుగా ఆ రోజుల్లో ఒప్పుకునే వాళ్ళు కాదు. అంటే శరీరపు పైభాగపు దుస్తులలో ఒక బనీను, చొక్కా, 'వేస్టుకోటు' ఆపైన 'ఓపెన్ కాలర్ కోట్' అన్నీ కలిపి నాలుగు మడతలు అంటే పొరలు అయినాయన్నమాట. వీటన్నిటికీ తోడు పైన 'నెక్‌టై' కూడా విధిగా అలంకరించుకొని తీరవలసిందే. అసలే ఊపిరాడక గిజగిజలాడుతుంటే ఈ 'నెక్ టై' కంఠానికేమిటో ఉరిలా ఉండేది అనుకోవాలి. పల్లెటూళ్ళో ఏదో ఉతికిన చొక్కా ఒకటి వేసుకుంటే వేసుకొని లేకపోతే లేకుండానే హాయిగా ఎటువంటి నిర్బంధం లేకుండా 'ఫ్రీ'గా మసలుకొనే వ్యక్తికి గంజిపెట్టి పెళపెళలాడేట్లు 'ఇస్త్రీ' చేసి ఈ దుస్తుల దొంతర ప్రాణానికి ఎంత గుదిబండ అనిపిస్తుందో ఆలోచించండి. బహుశా ఆయన

మనసుకి ఇవన్నీ ఒక పెద్ద బెడదగా తయారై ఉంటాయి. ఖేదంపొంది వుంటారు కూడాను.

ఈ దుస్తులోపాఖ్యాన్నాన్ని బట్టి ఆనాటి సాంఘిక పైస్థాయి వ్యక్తుల నాగరిక వస్త్రధారణ ఎలా ఉండేదో తెలుసుకోవచ్చు. అందుకే ఇక్కడ విపులంగా వీటి ప్రస్తావన తీసుకొని రావడం జరిగింది. పిల్లనిచ్చిన మామగారు మంచి హోదాలో ఉండటంవల్ల ఆయన హోదాకు తగినట్లుగానే అల్లుడు కూడా ఉండాలని ఆశించటంలో తప్పులేదు కదా! అదే మా తాతయ్య ప్రయత్నం. అయితే హోదా ఏమోకాని ఇదంతా ఒక గోదాలో దిగి కుస్తీ పడుతున్నట్లు అనిపించేది మా నాన్నగారికి.

అన్నీ వేసుకున్నా, కంఠానికి 'టై' వేసుకోవటానికి సొగసైన 'ముడి' వేసుకోవటం మా నాన్నగారికి చేతనయ్యేది కాదు. అప్పుడు మా అమ్మగారి సహాయం కావల్సి వచ్చేది.ఆమె అర్ధాంగి కాబట్టి వెంటనే సాయపడేది పాపం. ఈ సంపూర్ణ వేష గౌరవంలో ఏది లోపించినా ఆ సన్నివేశం మా తాతగారి కంటబడితే మా నాన్నగారితో ఏమీ అనేవారు కాదు కాని అలవోకగా 'లక్ష్మమ్మా' అని ఒకసారి కూతురిని కేకవేసేవారు. దాని అర్థం మా నాన్నగారికి బాగా తెలుసు కాబట్టి వెంటనే లోపలకు లంఘించి కావలసిన సవరణలు పూర్తిచేసుకుని అప్పుడు మాత్రమే బయటకు వెళ్ళేవారు. అదీ మా అమ్మగారు పెరిగిన కుటుంబ పరిస్థితి.

మా తాతగారికి చాలా మంది హై కోర్టు జడ్జీలు, ఇతర పెద్ద పెద్ద ఆఫీసర్లతో పరిచయాలుండేవి .అందువల్ల ఈ తెలివితేటల అల్లుణ్ణి పెద్ద చదువులు చదివించి హోదాగల ఏ పెద్ద ఉద్యోగమో చేయించాలని ఉండేది కాబోలు. అప్పుడే మా చురుకైన తెలివితేటలు గల అమ్మకు అనువైన భర్తగా ఆయన్ను దిద్దితీర్చ వచ్చునని మా తాతయ్యగారి తాపత్రయం!

ఇటువంటిదీ మా అమ్మ పెరిగిన అనుదిన చలువబట్టల పట్టణ నాగరికత వాతావరణం. అదీ ఆ 'పట్టణకథ'. ఇంట్లో ఎప్పుడూ వంటమనిషీ ఇతర నౌకర్లూ చాకర్లూ ఉంటూ ఉండేవాళ్ళు. మా అమ్మకు మద్రాసు పుట్టినింట కాఫీ బాగా అలవాటు. ఒకటో రెండు గ్లాసులు లేదా పంచపాత్రలు ఈ కాఫీపారణకు ఉపయోగించేవాళ్ళు. ఇవన్నీ కంచుపాత్రలే కావటం ఒక విశేషం. 'పింగాణీ'

కప్పులు, పాత్రలు దొరలు ఉపయోగించేవి కాబట్టి అవి 'మడి'కి పనికిరావు. కాబట్టి 'మన'కి పనికిరావు.

ఈ విధంగా 'కాఫీ' అలవాటైన మా అమ్మ మూడు పూటలా లేక ముప్పొద్దులా సలక్షణంగా చద్దిఅన్నాలు, వేడన్నాలూ, తినే కేతనకొండ కాపురానికి వెళ్ళింది. కేతనకొండ మా పెద్ద మేనత్త తిరుమలమ్మగారి అత్తవారి ఊరు. తల్లి చిన్నప్పుడే పోగొట్టుకున్న పిల్లవాడవటం చేత ఆవిడే పెద సుబ్బయ్యగారయిన తమ్ముణ్ణి బహుగారాబంగా పెంచింది. మా నాన్నగారికి 13 సంవత్సరాలు వయసు వచ్చేదాకా కాళ్ళకు గజ్జెల పట్టాలుండేవి. ముద్దుగా అంతా ఆయనను చంకన ఎత్తుకొని కూడా మోసేవారు. అదీ ఆయన గారాబపు జీవితం. ఎంతో పసితనానే మా నాన్నగారి తల్లి పోయింది. పెద్దవారైన తర్వాత ఆయనకు 50 సంవత్సరాలన్నా రాకముందే మా అమ్మగారు కూడా చనిపోయింది. అందువల్ల జీవితానుభవం మీద ఆయన అంటూ ఉండేవారు. 'చిన్నప్పుడు తల్లి పోకూడదు. పెద్దప్పుడు పెళ్ళాం పోకూడదు' అంటూ. నిజంగా మా నాన్నగారి సూక్తిలో ఎంతో అర్థం ఉంది. దాన్ని ఆర్యోక్తిగా భావించాలి. భార్యా వియోగం పొందిన ప్రతి వ్యక్తికీ ఈ విషాదం అనుభవంలోకి వచ్చేదే. మా నాన్నగారు అందులోని మానసికమైన వెలితిని, నవ్వుతూనే గంభీరంగా చెప్పేవారు. ఎంత డబ్బున్నా, కూతుళ్ళు అల్లుళ్ళు, కొడుకులు కోడళ్ళు ఎంత బాగా చూస్తున్నా జీవిత భాగస్వామిని లేనిలోటు లోటుగానూ ఎంతో వెలితిగానూ కనిపిస్తూనే ఉంటుంది. అయితే సహచారిణి రోగగ్రస్తురాలు కాకూడదు. అప్పుడది మరింత బాధ. వయసుకు తగిన పరిపక్వతతో సహచారిణిగా ఉంటే ఎంతో మనశ్శాంతిగా తృప్తిగా ఉంటుంది. అయితే ఈ లోటు పూరించుకోవడానికి మరో వివాహాన్ని మాత్రం నేను సుతరామూ అంగీకరించను. పూర్తి వ్యతిరేకిని. ఎందుకంటే మగవాడికి ఎంత ముదిమి పైబడినా 'గంతకు తగిన బొంత' అని ఎవరైనా ఒకరు పిల్లనివ్వడానికి రావచ్చు. దీనిని సంఘం కూడా తప్పు పట్టదు. పైగా ఒక్కొక్క సందర్భంలో హర్షించవచ్చుకూడా. కాని ఎంత చిన్నవయసులో ఉన్నా స్త్రీ వితంతువు కాగానే ఎన్నో శాస్త్రాలు విధించి, తంతులు చూపి, ఆవ్యక్తికూడా మానవ మాత్రురాలేనన్న విషయం చాలా కాలం మన సంఘం ఉపేక్షించింది. ఈ మధ్యనే సామాజిక దృక్పథంలో ఈ విషయంలో కొంత మార్పు వచ్చినట్లు

కనపడుతున్నది. స్త్రీకి కూడా ఎన్నో అవకాశాలనిస్తున్నది. కొంతలో కొంత ఉదార వాదాన్ని ప్రదర్శిస్తున్నది. అందువల్ల స్త్రీకి లేని సౌకర్యం, లేదా హక్కు పురుషుడికి ప్రత్యేకించి ఎందుకుండాలి అన్నది నాప్రశ్న. నా అభిమతం.

సరే మళ్ళీ మా నాన్నగారి అత్తవారింటి కాపురం సంగతి సందర్భాలు ప్రస్తావించుకుందాం. మా తాతగారి సంతానం ఇద్దరూ కూతుళ్ళే కాబట్టి ఇంగ్లీషువారి భావజాలం ప్రకారం చట్ట ప్రకారమే కాక (సన్-ఇన్-లా) అల్లుళ్ళను మా తాతగారు సర్వాత్మనా అంటే మానసికంగా కూడా కొడుకులుగానే భావించారు

అందువల్ల మా చిన్నతనం మరీ శైశవదశ అంతా మద్రాసులో మా తాతగారి ఇంట్లోనే గడిచింది. 1918 వ సంవత్సరంలో మా తాతగారు పోయారు. అంటే అప్పటికి నాకు మూడో సంవత్సరం నడుస్తున్నదన్నమాట. ఆనాటి సంగతులేవో లీలగా మనసుకి తోస్తున్నట్లుగా అనిపిస్తుంటుంది. మా మాతామహుడి గురించిన సంగతులు ఇప్పటికి సంక్షేపించి ఆనాటి మద్రాసు సంఘజీవన పరిస్థితులు, హెూదాలు, కొంతవరకు ఇదివరకే ప్రస్తావించి ఉన్నాను కాబట్టి ఆ నా శైశవకాలంనాటి స్మృతిపథంలో మిగిలిన సంగతులు గూర్చి కొంత చెప్పదలచుకున్నాను.

ఇంతకు పూర్వమే ఆనాటి నవనాగరకవేషధారణ తతంగం గురించి కొంతవరకు చెప్పే ఉన్నాను. ఆనాటి మా తాతగారు వేసుకొన్న పొడవాటి ఆల్పాకా (Alpaka) కోట్లు కొన్ని మేం మా చిన్నతనంలో మాకు పదమూడేళ్ళ ఈడు వచ్చేవరకూ వేసుకొనేవాళ్ళం. ఆ వయసులోనే ఆఖరుసారిగా నేను ఆల్పాకా కోటు వేసుకొని మా తాతగారి దర్జాను అనుభవించినట్లు గుర్తు. ఆ రోజుల్లో గుడ్డలు ఇతర అన్నివస్తువుల లాగానే చవుకగానే లభించేవి. ఇంచుమించు అన్నీ విదేశవస్త్రాలే. ఇండియాలో ఉత్పత్తే లేదు. (కోటు గుడ్డలు దళసరిగా 'హాలండ్ చెక్స్' అనేవి వచ్చేవి.) అప్పట్లో ఆ బట్ట గజం 'రెండున్నర అణాలు'ండేది. అంటే ఇప్పటి 15 నయాపైసలని మారకం విలువల అనుకోవాలి. అయితే ఈ నాటి కొనుగోలు శక్తికీ ఆనాటి కొనుగోలు శక్తికీ ఎక్కడా పోలిక లేనేలేదు. ఆనాటి రూపాయి కొనుగోలుశక్తి అద్భుత మనిపిస్తుంది ఇప్పుడు తలచుకొంటే. ఆనాడు రూపాయికి పదహారణాలు లెక్క. అయితే అణాకు కూడా ఎంతో విలువ ఉండేది ఆనాడు. చౌక్కా బట్ట తెల్లటి 'ట్విల్లు'

ఇది కొంచెం దళసరిగా వుండేది. పంచెలు 1702 బ్రాండు మల్లు పంచెలని ఇదివరకే చెప్పాను. అది చాలా నాజూకుగా సున్నితంగా ఉండేది. ఇంగ్లండులోని 'గ్లాస్కో' నగరంనుంచీ, మాంచెస్టర్ పట్టణం నుంచీ ఈ రకం పంచలు ఉత్పత్తి అయ్యేవి. గ్లాస్గో నగరంలోని మిల్లుల నుంచి ఇవి తయారయ్యేవి కాబట్టి ఈ రకం పంచెలను 'గ్లాస్గో' మల్లులని వ్యవహరించేవారు. అందువల్ల గ్లాస్గో నగరం పేరుకూడా యథాతథంగా వాడుకలో ఉండేది. అప్పటికాలంలో మనదేశం వాడుకకు అన్ని విదేశ వస్త్రాలే. దీనివల్ల బ్రిటిషు పారిశ్రామిక యజమానులకు కార్మికులకు అధికాదాయం లభించేది.

అందువల్లనే గాంధీగారు సత్యాగ్రహం మొదటిరోజుల్లోనే విదేశీ వస్తువుల్ని 'ఫారిన్ గూడ్స్' 'ఫారిన్ క్లాత్', 'బాయికాట్' చేయాలని ప్రబోధించేవారు. దానితో అప్పటి రోజుల్లో విదేశీ వస్త్ర దహనం పెద్ద ఉద్యమంగా ఊపందుకొన్నది. ఊరూరా విదేశీ వస్త్రదహన సంరంభం కనపడేది. దీనితో ఇంగ్లండులోని వస్త్ర పరిశ్రమకు బాగా దెబ్బతగిలింది. క్రమేపీ భారతదేశ స్వాతంత్ర్య సముపార్జనకు విదేశీ వస్త్ర బహిష్కారమే నాందీవాచకం పలికిందని చెప్పవచ్చు. ఇది ఆనాటి గుడ్డల ఉత్పత్తికీ, భారతీయుల వస్త్రధారణకూ సంబంధించిన వృత్తాంతం.

మనకు పారిశ్రామిక రంగంలో అప్పట్లో పెద్ద మిల్లులు లేవుకాబట్టి స్వరాజ్యం రావాలంటే అది సురాజ్యంగా మనుగడ సాగించాలంటే 'నూలు వడకండోయ్ బాబు' అని ప్రబోధించాడు గాంధీజీ. అటకల కెక్కిన రాట్నాలన్నీ కిందకి దిగాయి. ముందుకు వచ్చాయి. ఆ రోజుల్లో రాట్నంమీద, నూలువడకడం మీద ఎన్నో పద్యాలూ పాటలూ వచ్చాయి. గాంధీ మహాత్ముడు రాట్నమనే ఒక విశిష్ట ఆయుధంతో భారత ప్రజలను స్వాతంత్ర్య సంగ్రామానికి సమాయత్తం చేశాడు. భారత ప్రజలందరిచేత కదురు తిప్పించి, రాట్నం మీద పనిచేయించే బోధచేశాడు. దానితో "నూలువడికే విధము తెలియండీ జనులార మీరా విధము కనుగొని మోదమందండీ" అని జ్ఞానదీక్ష పెట్టి "సాలు కరువది కోట్ల రూపాయలు" మన దేశానికి ఆదా చేశారు. సామాన్య ప్రజానీకానికి భృతి కలిగించారు.

ఈ విధంగా 1920 కి ముందర మా నాన్నగారి లాంటి వాళ్ళు విదేశీ వస్త్రధారణ అవలంబిస్తే గాంధీజీ ఆ ధోరణిలోని తప్పును విప్పిచెప్పి

భారతీయులచే దానికి స్వస్తి చెప్పించారు. మళ్ళా మా నాన్నగారి దుస్తుల కథనం దగ్గరకు వస్తే ఏ విధంగా ఒక వ్యక్తి అంతవరకూ అలవాటులో ఉన్న వాతావరణాన్ని వదిలి పెట్టి మరొక వాతావరణంలోకి వెళితే దుస్తుల దగ్గరనుంచీ అనేక కొత్త అలవాట్లకు విధేయత చూపవలసి వస్తుందో తెలుస్తుంది. (దాసోహం అనవలసివస్తుందో నిరూపితమవు తుంది.) ఈ వస్త్రధారణ యజ్ఞంలో చివరి అంశమైన మెడకు 'టై' బిగించుకోవడం మా నాన్నగారికి సరిగా స్వాధీనం కాకపోవడంతో మా అమ్మే 'టై' ముడివేయవలసి వచ్చేది. ఆ ముడివేసిన తర్వాత మా నాన్నగారు "నా కంఠానికి ఉరి, ఉరి," అని విసుక్కునేవారట. మా అమ్మకు ఇటు మా నాన్నగారితో అటు మా తాతయ్యగారితో ఇరకాటంగా ఉండేది. స్త్రీ సహనానికి అన్నీ పరీక్షలే కదా! నిజంగా మహిళకే స్వాతంత్ర్యం వుంటే మా నాన్నగారు కంఠానికి ఉరి, ఉరి అని విసుక్కుంటే, వెటకారంచేస్తే, నోరు మూసుకుని అలవాటుచేసుకోండి. సరిపెట్టుకోండి. లేకపోతే పల్లెటూరు బైతంటారు, అని తానూ కసురుకోవచ్చు కదా!

దీన్ని బట్టి ఒక పల్లెటూరి సంపన్న గృహం నుంచి వచ్చిన చదువుకున్న, ఇంకా పై చదువులు చదువుకోవాలనుకుంటున్న ఒక వ్యక్తి మరొక మహాపట్టణంలో సంపన్న గృహస్థులైన నవనాగరికుల ఇంట్లో అందులో పెద్ద హోదా, దర్జా, ఠీవి అనుభవిస్తున్న, సాగించాలని అభిలషిస్తున్న మామగారి ఇంట్లో ఏ విధంగా సర్దుబాటు చేసుకోవాల్సి ఉంటుందో మనం తెలుసుకోవచ్చు.

అంతేకాదు 75 సంవత్సరాల పూర్వం మహానగరంలోని ఆనాటి నవనాగరక వాతావరణంలో గారాబంగా నాజూకుగా సున్నితంగా ఇంట్లో వంటమనుషులవంటి సకల సౌకర్యాలతో ఆధునికత వసతులతో పెరిగిన ఒక యువతి ఒకానొక కుగ్రామమైన కేతనకొండలో ఆడబడుచులపెత్తనంలో భర్తతో ఏ విధంగా కాపరం చేయాల్సి వచ్చిందో మా అమ్మ మానసిక స్థితి అప్పట్లో ఎట్లా ఉండేదో ఎన్ని సర్దుబాట్లు, హద్దుబాట్లు చేసుకొని ఆమె మనస్సును అదుపులో పెట్టుకోవలసివచ్చిందో ఏ విధంగా ఆమె సర్దుకు పోగలిగిందో తెలుసుకోవాలని, ఎవరికైనా ఆసక్తి కలగకపోదు. అయితే ఆ విషయాలన్నీ 'కేతనకొండలో మా అమ్మ' అనేచోట మాటకట్టాయి.

# XII

# చిన్ననాటి ముచ్చట్లు - 1

# TIT-BITS OF MY CHILDHOOD DAYS-I

Mild punishments by my maternal grand father, Sri Ranga Rao. My mischiefs - hiding his snuff box, stubbernness. His prediction that I will be a great man or a dud, Seeing my fearlessness!

నేను 1915 సెప్టెంబరు 20 తేదిన రాజమండ్రిలో పుట్టానని చెప్పాను కదా! ఆ తరువాత మా అమ్మ పురిటింటి నుంచి మద్రాసు వచ్చి ఉంటుంది. 1918లో మా తాతగారు అంటే మా మాతామహులు రంగారావుగారు పరమపదించేంతవరకూ మా చిన్నతనం అంతా అక్కడే గడిచి వుంటుందనుకుంటాను. నా తరువాత మా తమ్ముడు కృష్ణశర్మ 1918వ సంవత్సరంలో పుట్టాడు. ఆ సంవత్సరమే మా అందరికీ ఎంతో అండదండలుగా ఉన్న మా తాతగారు క్షయవ్యాధితో మరణించారు. అప్పటి రోజుల్లో క్షయవ్యాధికి

మంచి వాతావరణం, గాలి, విశ్రాంతి తప్ప వేరే మందులేవీ లేవు. ఆయన మరణించిన మరో ఆరునెలలకే ఆయన ఏకైక సోదరుడు కలపటపు వెంకటచలంగారు, పెద్ద ఇంజనీరాయన ఆ రోజులలో, మంచి ఉద్యోగం హెూదాలో ఉన్నవారుకూడా చనిపోయారు. మరో ఆరునెలలు తిరగకుండానే మా తాతగారల పినతండ్రి కుమారుడు కలపటపు సుదర్శనరావుగారు, జిల్లా విద్యాధికారిగా పెద్ద ఉద్యోగం చేస్తున్నవారు హఠాత్తుగా మరణించారు. ఈ విధంగా 1918, 19 సంవత్సరాలలో ఒక్క సంవత్సరం కూడా తిరగకుండానే జగజ్జెట్టీలలాంటి వారు పెద్ద పెద్ద చెట్లు కూలిపోయినట్లు మరణించడంతో మా అమ్మకు పుట్టింటి సౌఖ్యం కరువైపోయింది. పుట్టింటి శోభ అంటూ మిగలకుండా పోయింది. ఇహమిగిలింది వితంతువులైన అమ్మమ్మలు మాత్రమే. ఇంతలో ఆస్తి తగాదాలు ప్రారంభమైనాయి. కాబట్టి మద్రాసునగరంలో ఆ కుటుంబం ప్రాభవమంతా చాపచినిగి చదరలాగా అయింది. మా తల్లిదండ్రులు మా నాన్నగారి అక్కగారి ఊరైన కే-శనకొండకు చేరుకోవలసి వచ్చింది. మా తమ్ముడు పుట్టిన సంవత్సరంలోనే ఇంత మంది మహామహులైన తాతయ్యలు మరణించటంతో వాడి జాతకంలో ఏదో దోషమున్నదని వాడి జాతకాన్ని ఆడిపోసుకునేవారుట. ఇంతకూ నా చిన్నతనపు ముచ్చట్లంటే 1918వరకూ అంటే నా మూడు సంవత్సరాల ముచ్చట్లు అన్నమాట. మా తాతగారింట్లో ఆ మూడేళ్ళ పసిబాలుడిగా నేననుభవించిన మహజ్జాతకం గురించిన ముచ్చట్లన్నమాట.

## శైశవగీతిక

మా మాతామహులు ఇద్దరు అన్నదమ్ములు. వారికి ఒక తోబుట్టు చెల్లెలు కూడా ఉండేది. వీళ్ళ తల్లి శంకరమ్మగారు. అంటే మా తాతమ్మగారు. ఆమె ఎప్పుడూ కాకినాడలో మసీదు వెనకసందులో ఉన్నవాళ్ళ సొంతఇంటిని అంటిపెట్టుకొని గడిపేది. శంకరమ్మగారు దాదాపు 90 సంవత్సరాల వృద్ధాప్యం వరకు జీవించినట్లు బాగా జ్ఞాపకం.

మా తాతగారైన రంగారావుగారికి ఇద్దరు కూతుళ్ళు. ఇంకా కొంత సంతానం నష్టమైందని మా అమ్మ చెప్పేది. మా అమ్మమ్మ, తాతయ్యలకు ఎంత

మంది పుట్టినా మా అమ్మ, పిన్ని ఇద్దరే పెరిగి పెద్దవాళ్ళైనారు. అందువల్ల తాతగారు ఇద్దరు పిల్లలనే అనుకునేవారు, అనేవారు. ఈ రోజులలో అయితే జనాభా లెక్కల నిమిత్తం చిన్నారుల అంటే ఏడాది వయసులోపున్నే మరణించిన వారి సంఖ్య కూడా లెక్కలోకి తీసుకొని ఇన్‌ఫెంట్ మోర్టాలిటీ రేట్ (శిశు మరణ పరిగణన) ఎంతో గుర్తిస్తూ అది మన సాముదాయిక ఆరోగ్య స్థితిగతులను గూర్చి, స్థాయిని గురించి తెలిపే ప్రధానాంశంగా కూడా గ్రహిస్తున్నాము. ఆ కాలంలో సంతాన నిరోధంగానీ దాని గురించిన ఆలోచనగానీ, ప్రచారం మాట అలావుంచి ఆ భావాన్నే తప్పుగా భావించేవారు. అసలు అలాటి మాటలు మాట్లాడటమే 'బూతు'గా ఎంచుకునేవారు.

మా పినతాతగారైన వెంకటచలంగారికి ఇద్దరే కుమారులు. కలపటపు రామగోపాలరావు, లక్ష్మణరావులు. మా తాతగారికేమో ఇద్దరూ కుమార్తెలే. ఇలా అన్నదమ్ములలో పెద్ద వారికి ఇద్దరూ కూతుళ్ళూ, తమ్ముడికి అంటే మా చిన్నతాతయ్యకు ఇద్దరూ కొడుకులే కావటం వల్ల మా తల్లులు, మేనమామలూ అన్నదమ్ములపిల్లలైనా ఏకోదరులలాగానే ఉండేవాళ్ళు. మా మాతామహులు రంగారావుగారు ఏవో వ్యాపారాలు చూసుకుంటూ హాయిగా కాలక్షేపం చేస్తూ ఉండేవారు. ఆయన తమ్ములు మా పినతాతగారు కూడా పెద్ద ఇంజనీరుగా ఉండి అన్నగారి స్థాయినే జీవించేవారు. ఈయన గవర్నమెంటు ఉద్యోగికూడా. అందువల్ల ఆ దర్జా కూడా ఉండేది వీరికి. వీళ్ళ పినతండ్రి కుమారుడు కలపటపు సుదర్శనరావుగారు. ఆయన ఆ రోజుల్లో జిల్లా విద్యాధికారిగా పెద్ద ఉద్యోగం చేసేవారు. అలాంటి ఉద్దండులైన ముగ్గురు తాతలు ఆరేసి నెలల తేడాలో మరణించారు. ఈ అకాలమరణాల వల్ల ఆ కుటుంబంలో చాలా వొడిదుడుకులు సంభవించాయి.

### తాతగారి ఇల్లు

చిన్నప్పటి ముచ్చట్ల రంగస్థలం కూడా చెప్పుకోవాలిగా. మా తాతగారు కలపటపు రంగారావుగారు అప్పట్లో నివసించే ఇల్లు మద్రాసులోని కోమలేశ్వరన్ పేటలో 'రంగనాథ పిళ్ళై' వీధిలో ఉండేది. రంగనాథం పిళ్ళైగారు కూడా అప్పుడు జీవించే ఉన్నారు. మా తాతగారి ముఖ్య స్నేహితులలో అప్పట్లో ఈ రంగనాథం

పిళ్ళైగారు కూడా ఒకరు. పిళ్ళైగారు ఆ రోజుల్లో బాగా ధనవంతులు. మా తాతగారు రంగారావుగారికి చెంగల్పట్టు సమీపంలో ఉండే 'తూత్తుకుడి' అనే ఎస్టేటు ఉండేది. అందుచేత మా తాతగారు జమీందారీ ఫాయిలో 'శ్రోత్రియందార్' అనే బిరుదుతో పిలవబడేవారు. ఆ రోజులలో జమీందారులనీ, రాజాలనీ తమ తమ అధీనంలో ఉన్న భూస్వాస్థ్యాన్ని బట్టీ సంపదను బట్టీ కొందరు కొందరు గౌరవింపబడేవారు. ఈ శ్రేణిలో, "శ్రోత్రియంందార్" కొంచెం చిన్న తరహాలోది అనుకోండి. ఆ రోజుల్లో కాస్తంత కలిమి ఉన్న ప్రతివారూ ఇలాటి గ్రామాలు కొనుక్కొని తానూ ఒక జమీందారు హోదా పొందాలని తాపత్రయపడుతూ ఉండేవారు. ఇటువంటివారు ఆ రోజుల్లో చాలామందే ఉండేవారు. ఇందులో మా మాతామహులైన రంగారావుగారు కూడా చేరి ఉండటంలో వింత ఏముంది? ఆ జమీందారీని వారి చివరి రోజులలో వారే రంగనాథంపిళ్ళైగారికి అమ్మినట్లు వీలునామా ద్వారా తెలుస్తున్నది. మా తాతగారు పోయిన చాలారోజులకు ఆ జమీందారీ విక్రయించిన సొమ్ములో బకాయి బాపతు రంగనాథం పిళ్ళైగారి కుమారులు వడ్డీతో సహా లెక్క చూసి చెల్లించారు. అప్పటికి 12 సంవత్సరాలు దాటలేదు గనుక ఆడబ్బు వాళ్ళకు ఇవ్వక గత్యంతరం లేకపోయింది. సరిగ్గా పన్నెండో సంవత్సరం కూడా ఇంకో నెలలో ముగిసిపోతుందనగా మా మేనమామలు దావా వేస్తామంటే ఎందుకండీ అని వారు తమ లాయరుద్వారా డబ్బు ఇచ్చేశారు. ఈ సంఘటన మా తాతగార్లు పోయిన సుమారు ఇరవై ఏళ్ళకు అంటే మా విద్యార్థి దశలో జరిగినట్లు జ్ఞాపకం. ఇదంతా ఈ విధంగా ఎందుకు ప్రస్తావించటమంటే మా అమ్మ అటువంటి చెప్పుకోదగిన హోదాగల కుటుంబంలో పుట్టి ఎంతో గారాబంగా పెరిగింది అని చెప్పటానికే.

మా తాతగారు మాంచి హోదాలో జీవిస్తుండటం వల్ల ఎప్పుడూ వచ్చేపోయే వారితో ఇల్లు సందడిగా ఉన్నట్లు లీలగా గుర్తు వస్తున్నది. ఈ సంగతులన్నీ బహుశా నాకు మూడేళ్ళు కూడా రాకముందే జరిగి ఉండటం వల్ల ఆనాటి ఆ రోజుల విశేషాలు నా చిన్ననాటి ముచ్చట్లు మా అమ్మ, అమ్మమ్మ చెప్పిన భోగట్టాను బట్టే ఇక్కడ రాయాల్సి వస్తున్నది. అందులో ఆ కుటుంబానికి నేను మొదటి మనవణ్ణి. అదొక ముద్దు నా పట్ల.

అటువంటి పెద్ద కుటుంబంలో పుట్టి పెరగడంవల్ల మా అమ్మకు చాలా ఉదారాశయాలు హుందాగల భావాలు అబ్బినాయి. కుటుంబ పరిస్థితులు అస్తవ్యస్తమైనా తన కుమారులు తమ్ములూ కూడా తిరిగి తమ పూర్వపు ఔన్నత్యాన్ని అందుకోవాలని ఆమె తాపత్రయపడేది. తను కన్నకలలు నిజంచేసుకోవటానికి మమ్ములనెంతో ఉత్తేజపరిచేది ఆమె. ఆమె ప్రోత్సాహం మా కృషికి చాలా దోహదం కలిగించిందనే చెప్పాలి. తాను గడిపింది చాలా కాలం ఉమ్మడి కుటుంబంలోనే అయినా, తరవాత పూరిపాకలోనే సంసారంచేసినా, మా అమ్మ ఏనాడూ నొచ్చుకోలేదు. తానున్న పూరిపాకనే దివ్యభవనంగా భావించేది. అందరికీ ఆనందం కలిగించేది. తన పెద్దమనసుతో ప్రేమహృదయంతో విజ్ఞాన వికాసాలతో మా అందరికీ మార్గదర్శకురాలైంది మా అమ్మ.

నేను చెన్నపట్నంలో వైద్యవిద్యార్థిగా ఉన్నప్పుడు ఒకసారి కోమలేశ్వరన్ పేటలో ఆ ఇల్లు వెతికి పట్టుకొని చూసివచ్చాను. మనుషులు మాయమైనా తలుపులూ ద్వారబంధాలూ అలాగే ఉన్నాయి. ఆ ఇంట్లో తిరిగినట్లూ వంటింట్లో భోజనం చేసినట్లూ మండువాలోగిలిలో పచార్లు చేసినట్లు, దొడ్డిదోవన ఉన్న బజారులోకి వెళ్ళి అక్కడ ఎవరింటికో వెళ్ళిన సందర్భాలు కూడా ఒకదాని వెనక ఒకటి జ్ఞాపకాలలో తిరిగాయి. 'తాయి' అని మా ఇంట్లో ఒక ముసలిదాసీది కూడా అప్పట్లో ఉండేది.

## నా అల్లరి చేష్టలు

చిన్నపిల్లలు ఏవేవో అల్లరి పనులు చేస్తుంటారు. అది ఆ వయసుకు సహజమే. అంటే ఆ పిల్లల స్వభావాన్ని అనుసరించి వాళ్ళవాళ్ళ మనో వికాసస్థాయికి గుర్తు గా ఎంచుకోవాలి. అంతేకాదు ఆ అల్లరి పనులు పిల్లల ప్రపంచ విజ్ఞాన సంపాదనకు దారి అని కూడా గ్రహించాలి. దీనినే ఇంగ్లీషులో చెపితే 'క్యూరియాసిటీ' అంటారు. తెలుసుకోవాలనే తృష్ణవల్ల, ఆత్రుతవల్ల పిల్లలు చిలిపిచేష్టలు చేస్తూ ఉంటారు. అయితే నా అల్లరి మాత్రం కొంటెకృష్ణుడి అల్లరి చిలిపితనం కాదండోయ్!

నేను బాగా అల్లరి చేసేవాడినని మా వాళ్ళు రుజావుగా చెప్పడం చేత నేను తర్వాత జీవితంలో పెద్ద పిల్లల డాక్టరునయిన తర్వాత ఎవరైనా నా దగ్గర మా

వాడు అల్లరి చేస్తున్నాడని ఫిర్యాదు చేస్తే అల్లరి చెయ్యకపోతే వాళ్ళు పిల్లలనిపించు కుంటారటమ్మా! అని అడిగేవాణ్ణి. అదీ కాక అల్లరి చేయడానికి కాకపోతే పిల్లలెందుకు అనేవాణ్ణి. అసలు అల్లరే చేయకుండా స్తబ్ధుగా కూర్చుంటే ఏమండీ డాక్టరుగారూ! మా అమ్మాయి, లేదా మా అబ్బాయి అల్లరి చేయటంలేదు అని వచ్చి చెప్పి సలహా అడిగి తెలుసుకొని ఫీజిచ్చి పోతారు. అంచేత అల్లరి చేయటమనేది పిల్లల్లో ఉండే చురుకుపాలును వ్యక్తంచేస్తుందే కాని అందులో అంతగా బెంగపడాల్సిన దోషమేమీ కనిపించదు. అయితే కొందరు అతి చురుకుదనం చూపుతారు. కనపడినవన్నీ బద్దలుకొట్టడం వినాశకరమైన, హానికరమైన పనులు కూడా చేస్తుంటారు. అటువంటి వాళ్ళను మాత్రం కొంచెం కనిపెట్టి తరిఫీదు ఇవ్వాలి.

చిన్నప్పుడు ఎంతో స్తబ్ధుగానూ బహునెమ్మదిగానూ ఉన్నవారు ఆ తర్వాతకాలంలో ప్రపంచ విఖ్యాతి చెంది విజ్ఞానవేత్తలుగా మారిన వారున్నారు. ఇటువంటివాళ్ళలో ముందుగా చెప్పుకోదగినవాడు ప్రపంచ విఖ్యాతి చెందిన పరమాణువిజ్ఞాన శాస్త్రజ్ఞుడు 'ఐన్‌స్టీన్'. ఆయన చిన్నతనంలో ఎవరిగొడవా పట్టించుకొనేవాడు కాదు. ఆయన్ను గురించి తరగతిలో కొంచెం వెనకబడిన కుర్రాడని అనుకునేవాళ్ళుట. ఇదేవిధంగా కీర్తిశేషులు డాక్టర్ యల్లా ప్రగడ సుబ్బారావుగారు కూడా ఇక్కడ మెడికల్ కాలేజీలో ఎం.బి.బి.ఎస్ పరీక్షలో తక్కువ మార్కులు రావటంచేత ఆయనకు ఎల్.ఎమ్.ఎస్. (LMS) డిగ్రీ అంటూ ఇచ్చారు. ఆయనకు అసిస్టెంట్ సివిల్ సర్జన్ పోస్టుకూడా ఈ దేశంలో రాలేదు. ఇక్కడ విసుగెత్తి అమెరికా వెళ్ళి అక్కడ లెడర్లీ లాబరేటరీస్‌లో పరిశోధన విభాగానికి అధినేతఅయి ఎన్నో కొత్తమందులు కనిపెట్టారాయన. ఆనాటి వరకు మందులులేని, రోగచికిత్సలేని వ్యాధులకు ఎన్నో కొత్త మందులు కనిపెట్టారు. అందులో లెడర్‌మైసిన్ ఫోలిక్ యాసిడ్ నెత్తురు కాన్సర్‌ని నయంచేయకపోయినా నిరోధించే ఔషధాలను కనిపెట్టారు. అందులోయాంటి ఫోలిక్ యాసిడ్ డ్రగ్స్ అనేవి ప్రధానమైనవి. కాబట్టి అవకాశం, ఆదరణవుంటే మానవుడి మేధస్సు సమయం వచ్చినప్పుడు వికసిస్తుంది. ఎన్నో నూతనావిష్కరణలు జరుగుతాయి.

అందుచేత అల్లరిచేసే పిల్లలున్న వాళ్ళు జడుసు కోనక్కరలేదు. వాళ్ళే అదృష్టవంతులు. అయితే కొంచెం చురుకుతనం తక్కువైనా బాధపడనవసరం

లేదు. క్రమంగా అందరికీ అవకాశాన్ని బట్టి మనోవికాసం కలిగి ప్రయోజకులవుతారు. ఇంతకూ అల్లరిని గూర్చి అల్లరిపడవద్దు. ఇక చిన్ననాటి నా అల్లరి గూర్చి కొంచెం చెపుతాను.

అప్పటికి నాకు రెండున్నర ఏళ్ళో మూడేళ్ళో ఉంటాయి. చిన్నవాళ్ళు చేసేది అల్లరి అంటాం. అదే కొంచెం పెద్దవాళ్ళు చేస్తే కొంటెపనులనీ వాళ్ళను కొంటెవాళ్ళనీ అంటాం. పిల్లల అల్లరిలోనూ పెద్దవాళ్ళ చిలిపి ప్రవర్తన లేదా కొంటె చేష్టలలోనూ హాస్యం, ఆనందం రెండూ ఉన్నాయి.

నేను అల్లరి చేస్తుంటే మా తాతగారు రంగారావుగారు నా రెండు చేతులూ కట్టేసి వదలేసేవారుట. అప్పుడు నేను ఏడిచేవాడిని కాదట. మా తాతగారి ఇంట్లో ఒక నల్లటి కుక్క ఉండేదిట. నేను దాని దగ్గరకు పోయి 'కరిఅప్ప' 'కరిఅప్ప' (అరవంలో నలుపు అంటే 'కరి' అప్ప అంటే మనిషి) "మా తాతయ్య నా చేతులు కట్టేశాడు గాని నీవు విప్పవా?" అనేవాడినట. అది చూసిన మా తాతయ్యగారు పాపం అని జాలిపడి వింటనే విప్పేసేవారట

తాతయ్య అనో తాతా అనో అనకుండా 'తాతయ్యగారు' అనటానికి కారణంవుంది.కృష్ణా, గుంటూరు జిల్లాలో 'గారు' శబ్దం పెద్దవాళ్ళ విషయంలో ఎక్కువగా ఉపయోగించరు. 'నాన్న' అని 'తాతయ్య' అనీ సంబోధిస్తారు. ఇట్లా కాక కొంచెం ఏలూరు దాటి, రాజమండ్రి, కాకినాడల దగ్గరకు వెళ్ళేటప్పటికి 'నాన్నగారని', 'తాతయ్యగారని' పిలిచే 'గారు' శబ్దం వినిపిస్తూ ఉంటుంది. అయితే మాకు చిన్నప్పుడే అలవాటైన యీ సంబోధన మా కృష్ణా జిల్లా బంధువులకు ఏమిటో కొంత తేడాగా కన్పించింది. అట్లా కన్పించడం, విన్పించడం సహజమే. మేము ఇలా 'గారు' కూడా చేర్చి పెద్దవాళ్ళను సంబోధిస్తూ ఉంటే వాడికి ఆ తూర్పు అలవాటు అని మమ్మల్ని గూర్చి అనేవారు.

సాధారణంగా తెలుగు వాళ్ళు ఎంతో అవసరమైతే తప్ప, విధిలేకపోతే గాని తమ పల్లెలు వదిలి దగ్గర ఉన్నపట్టణాల వైపే పోరు. కూపస్థమండూక ప్రవృత్తే వాళ్ళకిష్టం. ప్రతి ఊరికీ ఇంకో ఊరు దూరంగా అనిపించి కడుపులో చల్ల కదలకుండా కూర్చోవడం అలవాటైన పాతకాలంలో ఇటువంటి విశేషాలుండేవి. ఇప్పుడైతే ప్రతి పల్లెలోని జనాభాకు తెల్లవారితే పట్టణం వాసన తగిలితేగాని ఉండలేకపోతున్నారు. జీవితవిధానంలో కూడా ఆర్థికంగా వ్యవహారకంగా ఎన్నో మార్పులు వచ్చాయి. జీవితం ఆర్థిక ధోరణితో వ్యవహారిక

ధోరణితో పెనవేసుకుని పోయింది. పూర్వకాలంలో ఆయా ప్రాంతాలలో కన్పించే ఆహార వ్యవహార, ఉచ్చారణ వ్యత్యాసాలు ఈనాడు అంతగా కనిపించడంలేదు. అవి చాలవరకు మిళితమైపోయినాయి. ఈ మార్పులు, ఆచారాలు ఒకచోట సంగమించటానికి కారణం ఒకనాటి మోటారు యుగం. ఇప్పుడు అణుయుగం కూడా వచ్చేసిందనుకోండి. మార్పులు మరింత వేగవంతమవుతాయి. ఈ మార్పులన్నీ ఎట్లా వస్తాయింటే ఎక్కడికి బడితే అక్కడకు త్వరితగతిని జరిగే ప్రయాణసౌకర్యాలు వృద్ధిచెందడం వల్లా, దేశదేశాలు పర్యటించాలనే అభిలాష కొందరిలోనైనా ప్రబలడం వల్లా ఇవన్నీ సంభవించాయి. ఏమైతేనేం తాతగారు! ఇంత వ్యాఖ్యానాన్ని కోరారు. ఇక మళ్ళీ నా చిన్ననాటి అల్లరిచేష్టల దగ్గరకు వద్దాం.

1918 నాటికి అంటే సుమారు 75 సంవత్సరాల క్రితం మద్రాసులో భూగర్భ డ్రైనేజ్ సౌకర్యంలేదు (అండర్ గ్రౌండ్ డ్రైనేజ్) ఇప్పుడు మనం వాడే ఫ్లష్‌ఔట్ పాకీదొడ్లు లేనేలేవు. ఆ పూర్వకాలపు మరుగుదొడ్లు నా స్మృతిలో లీలగా ఇప్పటికీ కదులుతున్నాయి. చెంబుతో నీళ్ళు బయటపెట్టి లోపలకు వెళ్ళేవారు. పాకీమనిషి రోజూవచ్చి శుభ్రం చేసి పోయేవాడు. మా తాతగారి అలవాట్లలో గురుశంక తీర్చుకోవడంలో కొంత ఆలస్యం కావడమనేది కూడా ఒకటి. ఆయన పరధ్యానంగా కూచుంటే నేను నెమ్మదిగా వెళ్ళి ఆయన బయటపెట్టుకున్న చెంబెడు నీళ్ళు పారబోసి వచ్చేవాడినట. ఇదేమైనా సామాన్యమైన అల్లరా?

## పొడుండబ్బీ

మా తాతగారు పొడుం పీల్చేవారు. నశ్యం అలవాటు ఉన్నవాళ్లంతా ప్రతి క్షణం దానికోసం అప్రయత్నంగానే తడుముకుంటూ ఉంటారు. ఆయన ఏమరుపాటున ఉన్నప్పుడు ఆ పొడుండబ్బీ తీసుకొనిపోయి ఎక్కడో మారు మూల దాచేవాడిని. అంతేకాని మామూలుగా చిన్నపిల్లలు పెద్దలు చేసే పనులను అనుకరించినట్లు పొడుంపీల్చేవాడిని మాత్రంకాను. ఇహ ఇంట్లో పొడుండబ్బీ దొంగ మరెవరున్నారు. నేనే కదా! అంచేత మా తాతగారు 'తిరుమలాయ్' అని నన్నే ముందుగా పిలిచేవారు. పొడుండబ్బీ తీశావా? అంటే తీశానని చెప్పేవాణ్ణి. వెంటనే తాతగారు ఒక బెత్తం తెమ్మనేవారు. తెచ్చేవాడిని. చెయి చాచమనేవారు.

చాచేవాడిని. అప్పుడాయన బెత్తంతో మెల్లిగా భయపెట్టటానికి మాత్రమే చురుకు తగలకుండా కొట్టేవారనుకుంటా! ఆయన దెబ్బవేసినా చెయి వెనక్కి తీసుకోకుండా ముడవకుండా అలాగే చాపి ఉంచేవాడినట. ఆయనకూడా అంటీ అంటకుండానే బెత్తపు దెబ్బ తగిలించినా నేను మాత్రం జంకకుండా ఉండేవాణ్ణి. సామాన్యంగా పిల్లలు భయపడిపోతారు గదా! దెబ్బతగిలినా సరే నేను చెయ్యి తీసేవాడినికానుట. దానికి మా తాతగారే అబ్బా! అనుకుంటూ లోపల ప్రేమ సందడించగా మా అమ్మను పిలిచి 'లక్ష్మమ్మా' వీడు వట్టి మొద్దువాడయినా అవుతాడు, లేకపోతే చాలా తెలివిగలవాడయినా అవుతాడే అనేవారుట. ఈ మాటలన్నీ మా అమ్మ ఎన్ని మార్లైనా పదే పదే చెప్పేది. బహుశా అమ్మ శిక్షణవల్ల, ప్రోత్సాహంవల్ల, చలవవల్ల మొద్దబ్బాయిని మాత్రం కాలేదు. మా తాతగారు మాత్రం చాలా ప్రజ్ఞాశాలి అయిఉంటారనే చెప్పాలి. ఏమంటే అంత చిన్నవయసుననే నా భావిజీవిత పరిపక్వతనూహించి చెప్పగలిగారు కదా! నా మొండితనాన్ని ఆయన ఆనాడే చక్కగా అంచనా వేశారన్నమాట. మా ఆవిడ ఎప్పుడూ అంటూ ఉండేది. 'మీరు తలచుకున్నదే కానీ మీ బుర్రలో దూరిందే కానీ మీరు చేస్తారు' అంటూ. అట్లా అని నేనేమి మొండిగా చేశానే అని మా ఆవిడను ఎదురుప్రశ్న వేస్తే సరేలెండి ఇప్పుడు తర్కమెందుకు? అనేది.

ఇట్లా చిన్నప్పుడే మనం మెలిగే విధానాలను ప్రవర్తించే తీరుతెన్నులను గమనించి మన పెద్దలు మన భావిదశలను ఊహించి జాతకంలో చెప్పినట్లుగా కొన్ని కొన్ని సూచనలు చేయగలగటం కద్దు.

ఇప్పుడు ఆధునిక మానసిక శాస్త్రవేత్తలు కూడా శిశువు జన్మించినప్పటినుంచి మొదటి కొద్ది నెలలలోనే వారి ప్రవర్తన రీతులను పరీక్షించి వాళ్ళ తెలివితేటలను, చురుకుతనాన్ని అంచనా వేయగలుగుతున్నారు. ఎందుచేతనంటే ఎవరైనా ఎవరినైనా దత్తత తీసికోని పెంచుకోవాలంటే మరీ నెలల పసిగుడ్డునాటి నుండీ పెంచుకుంటేగాని వారు బిడ్డలు లేని తలిదండ్రులకు పూర్తిగా అలతకరు. అందుచేత యీ పరీక్షలు కూడా అవసరమైనాయి.

## గంగాస్నానం, గోదావరి స్నానం

మా తాతగారి ఇల్లు కాకినాడలో పెద్దబజారులో ఉన్న మసీదు వెనకసందులో

ఉండేదని ఇదివరకే చెప్పాను. అక్కడ మా తాతమ్మ ఒంటరిగానే కాపురముండేది. అందునా దిగ్గజాల్లాంటి ఇద్దరు కుమారుల మరణంతో మనసులో ఎంతో దిగులు ఉన్నా అక్కడే కాలం నెట్టుకొస్తూ నిబ్బరంగా ఉండేది. నా చిన్నప్పుడు అంటే నాకు ఏడాది కూడా నిండనప్పుడు 7, 8 నెలలప్పుడు మా అమ్మ తాతమ్మదగ్గర కాకినాడలో అప్పుడప్పుడు కొన్నాళ్ళు గడుపుతుండేది.

అది మండువాళ్లిల్లు. మండువా చుట్టూతా ఉన్న భాగాలలో అద్దె వాళ్ళుండేవారు. అద్దెకున్నా అన్ని కుటుంబాల వారు ఒకే కుటుంబంలో వారుగా మెలగ గలిగేవారు. అది ఆనాటి మనుష్యులలోని మార్దవాన్ని అంతఃకరణ స్వభావాన్ని, కలివిడితనాన్ని, విశాలదృష్టినీ తెలియచేస్తుంది.

ఆడవాళ్ళంతా ప్రతిరోజూ కబుర్లకు చేరేవారు ఒకచోట. మగవాళ్ళు ఆఫీసులకు పోగానే వారంతా ఒకచోట చేరి ఆ మాటా యీ మాటా చెప్పుకునేవారు. అప్పుడు మా తాతమ్మ వంటావిడ (తాతమ్మకు వండిపెట్టే వంటలక్క) నన్ను ఎత్తుకొని తిరుగుతూ వుండేది. అప్పుడు నేను దేవతా వస్త్రాలతో అంటే పూర్తిగా దిశమొలతోనే ఉండేవాణ్ణి కదా! అప్పుడు ఆమె చంకలో ఉండి ఒంటేలు పోస్తుంటే ధారగా పడేదికదా ఒంటేలు; అప్పుడా వంటలక్క కొంటెగా నన్ను ఎత్తి అందరిమీదా పడేట్లు గుండ్రంగా తిప్పేదట. అంతటిలో ఊరుకోకుండా గంగాస్నానం, యమునా స్నానం అంటూ స్నానమంత్రాలు కూడా పఠించేదట. ఓసీ! నీ దుంపతెగ అని వాళ్ళు కసురుకుంటే మళ్ళీ స్నాన మంత్రాలతో పక పక నవ్వేదట! ఇంతకూ చెప్పవచ్చేదేమిటంటే మా తాతమ్మకు నేను ముద్దుల మునిమనువడిని కావటంచేత ఆమె జోక్యం కలగచేసుకొని ఏమిటే నీ ఆగడం అని వంటలక్కను వారించేదికాదనుకుంటా. ఇవీ నా జీవితంలో మరీ చిన్నప్పటి సంగతులు.

# XIII

# చిన్ననాటి ముచ్చట్లు - 2

# TIT-BITS OF MY CHILDHOOD DAYS - II

> My uncle biting my nose, your nose is gone somewhere. In those days child is initiated into schooling only at the completion of five years. No K.G. or early schooling as now. The I.Q. of modern children is comparatively high due to environment.

### ముక్కు కొరకటం

చిన్నపిల్లలకు పళ్లు వచ్చేముందర, కొత్తగా పళ్ళు వచ్చిన తర్వాత చిగుళ్ళ భాగంలోనూ ఆ లేత మొలకలలోనూ దురదగా ఉంటుంది. వాళ్ళు ఏది కనపడ్డా నోట్లో పెట్టుకొని కొరకటానికి ప్రయత్నిస్తుంటా రప్పుడు. ఆ కసి తీరటానికి ఏదైనా కటిక్కన కొరుకుతుంటారు. ఒక్కొక్కప్పుడు గట్టిగా పల్లు దిగేటట్టు కొరుకుతారు.

కొంత మంది పెద్దలకు చిన్నపిల్ల మీద ముద్దు తమాషా అనిపిస్తుంది. ముద్దుకు చిన్నపిల్లల ఏ చిటికెన వేలో నోటిలోకి తీసుకొని కొరుకుతారు. నాకిలాటి అనుభవం ఒకటి జ్ఞాపకంవుంది. అప్పుడు నాకు ఏడెనిమిదేళ్ళు ఉంటాయను కొంటాను. నా పైక్లాసులో చదువుతున్న వేగే సత్యనారాయణ అని నాకన్నా వయసులో పెద్ద కుర్రాడుండేవాడు. వాడికి నేను ముద్దు వచ్చినప్పుడు నా చిటికెనవేలు కొరికే వాడు. వాడి ముద్దు కాదు కాని నా ప్రాణాలు కడగట్టి పోయినట్లుండేది.

నాకు ఇద్దరు మేనమామలు కలపటపు రామగోపాలరావు, లక్ష్మణరావు. వీళ్ళు మా పినతాతగారైన వెంకటచలంగారి కొడుకులు. నా అసలు మాతామాహులు రంగారావుగారికి ఇద్దరూ కుమార్తెలే. వాళ్ళు మా అమ్మ, పిన్ని. మా పినతాతగారికి ఇద్దరూ కుమారులే. ఆడపిల్లలు లేరు. అంతా ఏకోదరులుగానే ఉండేవాళ్ళు మా తాతల సంతానం. అంతా ఒకే చోట మద్రాసులోనే ఉండేవారు. మా చినతాతగారి కొడుకులలో రెండోవాడు లక్ష్మణరావు. అతడిని 'బాబీ' అని పిలిచేవారు. పెద్దవాడిని 'బాబూరామ్' అని ముద్దుగా పిలిచేవారు. పెద్దయ్యే వరకూ వాళ్ళ అసలు పేర్లు మాకు తెలియవు. మామేనమామల్లో రెండోవాడు 'బాబీ' నా కంటే ఒక ఏడాదో ఏణ్ణర్థమో చిన్న. వాడికి చిన్నప్పుడు పల్లు దురద జాస్తిగా వుండేదను కుంటాను. నేను ఎప్పుడో ఏమరుపాటున ఉన్నప్పుడు చటుక్కున వచ్చి నా ముక్కు కొరికి పారిపోయేవాడు. ఆ నొప్పికి నేను రాగాలు తీస్తూ 'బాబీ నా ముక్కు కొరికాడు' అని ఫిర్యాదు చేసేవాడిని. నా ఫిర్యాదు విని మా పెద్దవాళ్ళు 'వెధవా! వాడు నీ కంటె చిన్నవాడు. వాడు కొరికాడని ఏడుస్తావేమిటి? పెద్దవాడివి ఆ మాత్రం తప్పించుకోలేవా?' అని నన్నే చీవాట్లు పెట్టేవారుట, వాడిని కోప్పడటం మానేసి. ఇలా చిన్నవాళ్ళనే సమర్థిస్తూ వెనకేసుకొని వస్తుంటారు పెద్దలు ఇప్పటికిన్నీ! చిన్నపిల్లల సంగతులు మహా తమాషాగా ఉంటాయి!

## నీ ముక్కు ఎక్కడికో పోయింది!

ముక్కంటే జ్ఞాపకానికి వచ్చింది. ముక్కంటిని గూర్చికాదు. మా తమ్ముడి 'ముక్కు' తిమ్మన ప్రహసనం.

నేను, మా తమ్ముడు కృష్ణశర్మ, ఇద్దరమే అన్నదమ్ములం. మా పిన్నికి కూడా చాలాకాలం వరకూ ఇద్దరే ఆడపిల్లలు. అందుచేత మా తాతా సహోదరులలాగానే ఈ ఇద్దరు అప్పచెల్లెళ్ళకు కూడా ఒకరికి ఇద్దరు మగపిల్లలు, మరొకరికి ఇద్దరూ ఆడపిల్లలే ఉండటం తమాషాగా ఉండేది. ఇదే దైనా వంశపారంపర్యంగా వచ్చే జన్యు (జీన్) లక్షణమేమో ననిపిస్తుంది. అయితే మా పిన్నికి చాలాకాలానికి తమాషాగా ముగ్గురూ వరుసగా అబ్బాయిలు పుట్టారు. నిద్ర పోతున్న ప్రకృతిని మనసు తట్టి లేపినట్లుగా అనిపిస్తుంది.

మా తమ్ముడు కృష్ణశర్మని ఇంట్లో కృష్ణుడు అనేవాళ్ళం. బళ్ళో పేరు కృష్ణశర్మ అని నాకు చాలాకాలం వరకూ తెలియనే తెలియదు. బళ్ళో చేర్పించేప్పుడు మా అమ్మ శర్మ అని కూడా చేర్పించి ఆ విధంగా రాయించింది. బహుశా మా తాతగారు డాక్టర్ శర్మగారు విజయవాడలో ఉండేవారే, ఆయన మాకు చాలా అండగా ఉండేవారు. ఆయన జ్ఞాపకార్థం అలా పెట్టించి ఉండవచ్చు. (తాతలపేర్లు మనుమలకు సంక్రమించటం ఆనవాయితీయే కదా! ఇదివరలో ఈ విషయం చెప్పుకున్నాం కూడాను).

ఇప్పుడు ఈ ఆనవాయితీలు పోయి ఏ 'గ్లాక్సో' కంపెనీ వారో పిల్లల పోషణ పుస్తకాలలో ఎన్నో పేర్లు ప్రకటిస్తూ ఉంటే ఆ పేర్లను చూచి ముద్దుగా ఉన్నాయని మురిసిపోతూ అర్థం తెలియని నోరు తిరగని పేర్లు ఈ కాలంలో పెడుతున్నారు.

మా తమ్ముడి పేరు బళ్ళో 'శర్మ' అవటం చేత వాడి సహాధ్యాయులైన స్నేహితులు వచ్చి 'శర్మ' ఇంట్లో ఉన్నాడా అంటే ఎవరు ఈ శర్మ అని నేను ప్రశ్నించేవాడిని చాలా రోజుల దాకా.

మా తమ్ముణ్ణి 5, 6 సంవత్సరాలు నిండేదాకా ఎవరైనా 'ఒరేయ్ నీముక్కు ఎక్కడకో పోయిందిరా మాకు దారిలో ఎదురైంది' అని ఎవరైనా ఇంట్లో వాళ్ళు అంటే ఇంకేముంది ' నా ముక్కు పోయింది' అని లబోదిబోమంటూ వాడు దీర్ఘాలు తీసేవాడు. 'ఒరేయ్! తడిమి చూసుకోరా నీ ముక్కు వచ్చిందంటే మళ్ళీ తడిమి చూసుకుని ఏడుపు మాని నవ్వేసే వాడు. ఎంత చిన్నవారైనా తమ స్వంతం ఏదో పోయిందంటే ఆ వస్తువుమీద ఉన్న మమకారం కొద్దీ ఎంత ఆదుర్దాపడతారో! ఈ ఆదుర్దా మరీ ఎక్కువైతే జీవితంలో

అదే కాపీనం అవుతుంది రాను రాను. అందుకే వేదాంతులు జీవితంలో జీర్ణించి పోయే స్వార్థపు భావాలను తొలగించటానికి నువ్వెవరు? ఏది నీది? ఏది నాది? సర్వం మిథ్య అని వేదాంత బోధ చేస్తూ ఉంటారేమో! కొంచెమైనా నిస్వార్థంగా ప్రవర్తించరా బాబూ అని నేర్పటానికి?

పై ముక్కు తమాషా ఎందుకు చెప్పానంటే చిన్నపిల్లలమనస్తత్వాలు తెలియచెప్పటానికే. వాళ్ళని ఎంత తేలికగా మభ్యపెట్టవచ్చునో, అట్లానే ఆ సున్నితమైన మనస్సులను ఎలా సన్మార్గంలో పెట్టడానికి కూడా వీలవుతుందో ఇందువల్ల తేటతెల్లమవుతుంది. వాళ్ళదేముంది. స్వచ్ఛమైన పసిమనస్సులు, ఏం చెపితే అది నమ్ముతారు! అందులో పెద్దవాళ్ళు చెప్పారంటే మరింత గురికదా వాళ్ళకు. అక్కడ ముక్కు వుందంటే వుందనీ లేదంటే లేదనేగాని దానిని తడిమిచూసుకొనే ఆలోచన వారికి కలగదేమో మరి! అయితే అందరు పిల్లలూ అలా వుండరనుకోండి. ఈ కాలపు పిల్లలను అంత త్వరగా ఏమార్చలేము. ఆనాటికీ ఈనాటికీ పిల్లల చురుకుతనంలో తెలివితేటల్లో అభివృద్ధి కనపడుతుందను కుంటాను. ఆ రోజులలో 5 సంవత్సరాల 5 నెలల 5 రోజులు నిండిన వెంటనే ముహూర్తం పెట్టి 'అక్షరాభ్యాసం' జరిపించేవారు. అదే ఈ రోజులలోనైతే మూడు, మూడున్నర ఏళ్ళునిండీ నిండకుండానే నిండాయని ప్రకటించి వాళ్ళకు త్వరగా చదువు రావాలనో లేదా ఇంట్లో అల్లరి బెడద తప్పుతుందనో పిల్లల్ని 'కిండర్‌గారెన్' స్కూళ్ళకు పంపు తున్నారు. అందుచేతనే ఏమో ఈ తరంవారికి తెలివితేటలు, వస్తు పరిజ్ఞానం, ఆశయాలు, మనఃపరిపక్వతలు, మా తరం వారి కంటె ఎక్కువగాను తొందరగాను అలవడుతున్నాయని చెప్పాలి.

అందువల్ల మన దేశంలోనూ పాశ్చాత్య దేశాలలోనూ 18 సంవత్సరాలు దాటితేగాని మోటారు నడిపే లైసెన్సు ఇవ్వకూడదన్న నిబంధనలుంటే 15, 16 సంవత్సరాలకే చిన్నపిల్లలు పెద్దవాళ్ళలాగా ప్రవర్తిస్తూ లైసెన్సులు కావాలంటున్నారు. ఈ లోపలే చాటుమాటుగా ఇంట్లో కారు నడపటం నేర్చుకుంటున్నారు. అమెరికాలోనూ అభివృద్ధి చెందిన ఇతరదేశాలలోనూ మోటారుయుగం చాలాకాలం కిందటనే ఆయా దేశాలలో ప్రారంభం కావడంవల్ల అక్కడ 16 సంవత్సరాలు నిండిన బాలబాలికలకు డ్రైవింగు లైసెన్సు ఇస్తున్నారు.

పిల్లలకు వయసుకు మించిన పరిపక్వతను వారి ఏళ్ళలో కుదించిన విజ్ఞానం లేతవయస్సులోనే కలిగించి ఎంతవరకు వారి ప్రవర్తన నియమావళికి సాయం చేస్తున్నామో తెలియటం లేదు. కాదని హెచ్చరిస్తే మీరు పాత చింతకాయ పచ్చడి మెచ్చుతున్నారని అంటారు. కొత్త చింతకాయ త్వరగా జలుబు చేస్తుందని వారికి తెలియదు.

ఈ నూతనమైన మనోవికాసంవల్ల యీ తరంవారికి అదే వయసులో 'నీ ముక్కు ఎక్కడికో పోయిందని' అంటే 'నీ ముక్కే పోయింది నా ముక్కు ఇదుగో' అని సమాధానం చెపుతారు. ఆ తెలివి తేటలు వారికి వచ్చాయనటానికి సందేహం లేదు. అందుచేత నీ ముక్కు ఓడిపోయింది, నా ముక్కు గెలిచింది అనే వాదనలో వారిదే పైచేయి. అలాంటి తరాన్ని అప్పుడే నిర్మించుకున్నాం. ఇది ప్రపంచం అంతటా జరుగుతున్నదే. దీన్ని గురించి అన్నీ మన మంచి కొరకే అని సంతోషించటం మంచిది.

ఈ ఆధునికత ఎంతవరకు వచ్చిందంటే ఆ మధ్య అమెరికాలో ఉన్న ఒక డాక్టరు దంపతులు తమ ఏకైకపుత్రిక పొద్దుపోయి బయటకు డేటింగుకు పోతోంటే ఆటంకపరిస్తే "షటప్ డాడీ" అని వెళ్ళిపోయిందట. ఈ సంపాదన ఐశ్వర్యం ఎవరికోసం అని వారు తమ కుమార్తె ప్రవర్తనను గూర్చి వాపోయారుట. తల్లిదండ్రులవి ఇండియా బీజాలు. అమ్మాయి అమెరికా వాతావరణంలో ఎదిగిన మొక్క. ఏ నాగరకతలో ఉన్నప్పుడు ఆ నాగరకతను వీలైనంతవరకు మన ఆలోచనలలో జీర్ణం చేసుకోవాలిగదా! లేకపోతే పైమాదిరి వ్యధతప్పదు.

## తల్లిపాలు – చంటి పిల్లలు
## గేదెపిల్లలు, ఆవు పిల్లలు, గాడిద పిల్లలు!

మా అమ్మకు 15 సంవత్సరాల వయసున నేను పుట్టి ఉంటాను. అప్పటికి అన్నీ బాల్యవివాహాలేగదా! ఆడపిల్లకు రజస్వలకాకముందే వివాహం చెయ్యాలి. అంటే నేను పుట్టటానికి ఏ మూడు నాలుగేళ్ళ ముందో వివాహం జరిగి ఉంటుంది మా అమ్మకు. అంటే మా అమ్మకు 11, 12 సంవత్సరాల వయసున మా నాన్నగారికి 20 సంవత్సరాల లోపు వయసున వాళ్ళకు పెళ్ళి జరిగి

ఉంటుంది. 1930 వ సంవత్సరంలో "సర్ హరవిలాస శారదా" గారు తెచ్చిన చట్టంతో (బ్రిటిషువారి) హయాంలో 'బాల్య (వివాహాలు నిషేధిస్తూ వివాహ సంబంధ సంస్కరణ ప్రారంభమైంది. సాంఘిక సంస్కరణలకు బ్రిటిషువారు ప్రోత్సాహం ఇచ్చేవారు.

పట్టణవాసంనుంచి వచ్చినా మా అమ్మ దగ్గర నాకు సమృద్ధిగా పాలు లభించాయి. అందుచేత నేను అమ్మ దగ్గర పాలు కావలసినన్ని తాగి పెరిగాను. ఒక్కొక్కప్పుడు నేను కడుపు నిండా తాగగా ఇంకా మిగిలిపోయేవట. ఒక్కోసారి 'చేపు' వచ్చి కారిపోయేవట. నిజంగా ఎంతో అదృష్టవంతుణ్ణికదా! తల్లి పాలు కావలసినన్ని తాగటం కన్నా భాగ్యమేముంది? ఎందుకీ ప్రస్తావన తెస్తున్నానంటే నేడు పేదరికపు తల్లులు తమ బిడ్డలకు పాలు కడుపునిండా ఇవ్వగలుగుతున్నా భాగ్యవంతులైన వారి సంసారాలలో తల్లులకు తగినంతగా చనుబాలు ఎందుకు ఉండటంలేదో డాక్టర్లకే పెద్ద సమస్యగా తయారైంది. అందువల్ల పూర్వకాలంలో అయితే బీద కుటుంబపు బాలింతలను 'పాలదాయి' అని వారికి డబ్బు ఇచ్చి తమ పిల్లలకు పాలిచ్చే తల్లులుగా భాగ్యమంతులు వారిని పెట్టుకొనేవారు. నేటి తరంలో చదువుకున్న తల్లులు అందులో పనిచేసే తల్లులకు ఈ సమస్య మరింత ఎక్కువ. అసలు పారిశ్రామిక యుగం ప్రారంభమైనప్పటినుంచీ అంటే గడచిన నూరు సంవత్సరాలుగా ఈ సమస్యకు అభివృద్ధి చెందిన పాశ్చాత్య దేశాలలో మరింత ప్రాధాన్యం వచ్చింది. మరీ గడ్డు సమస్య అయింది. అందువల్ల డబ్బాపాలు వచ్చాయి. ఈ కాలంలో తల్లి పాలు తాగే పిల్లలను చంటి పిల్లలన్నా డబ్బాపాలు తాగేవారిని 'డబ్బాపాలపిల్లలు' అంటే బాగుంటుంది. ఇట్లానే ఇతరమైన పాలు తాగే పిల్లలను గేదె పిల్లలు, ఆవుపిల్లలు, గాడిదపిల్లలు అంటే బావుంటుంది. ఇట్లా అనడమే సమంజసమేమో! చంటిపిల్ల అన్నట్లే తాగే ఆ చంటిపాలను బట్టి ఈ పేర్లు ఉపయోగించ వచ్చునను కుంటాను.

గాడిద పిల్లలు అన్నానని గాభరా పడకండి. తల్లి పాల కొరత అసలు పాశ్చాత్యదేశాలలో ప్రారంభమైంది. అందుచేత అక్కడి శాస్త్రవేత్తలు తల్లిపాలతో సరిసమానంగా ఉండే జంతువుల పాలకోసం అన్వేషణ సాగించారు. అన్ని పాలల్లోనూ ఆవుపాలే ప్రపంచం అన్ని దేశాలలోనూ ఎక్కువగా ఉపయోగంలో ఉన్నాయి. కాని శాస్త్రకారులు కనుక్కున్నదేమంటే అన్ని జంతువుల పాలలోకీ గాడిదపాలను పరీక్షించి చూస్తే అవి ఉత్తమంగా తేలాయట. తీపిలోనూ ఇతర

ప్రోటీన్, కొవ్వుపదార్థాలలోనూ తల్లిపాలకు తూచినట్లు ఇవి సరిపోయినాయి. అన్నిపాలకంటె తల్లిపాలు ఎక్కువ తియ్యగా ఉంటాయి. వాటిలో చక్కెరతనం ఎక్కువ. అంతతీపిగానూ గాడిదపాలు ఉంటాయి. అందుచేత ఫ్రెంచి శాస్త్రజ్ఞులు అన్ని జంతువుల పాలు పరీక్షించిన తర్వాత గాడిదపాలు శ్రేష్ఠమని ఖరారుచేశారు. తరవాత ఆ దేశంలో తల్లి పాలు లభించని చంటి పిల్లలకు గాడిదపాలు పోసేవారు.

గాడిదలను పెంచి వాటి పొదుగులు శుభ్రంచేసి తిన్నగా పిల్లలను అక్కడకే తీసుకొనిపోయి ఆ పాలు కుడిపేవారు. అంచేత "గాడిదపిల్లలని" అలాంటి చంటి పిల్లలను అనడంలో తప్పు లేదనుకుంటాను. క్రమక్రమంగా ఫ్రాన్సులోనూ ఇతర పాశ్చాత్యదేశాలలోనూ ఆవుపాలు సమృద్ధిగా దొరకడంచేత ఆవుపాలను తల్లిపాల వలె అనేక పోషక రసాయనాలు చేర్చి ఆవుపాలలోని ప్రోటీను పదార్థం మార్చి చిన్నపిల్లలకు తేలికగా అరిగేట్లు చేశారు.

మనదేశంలోనే గాని పాశ్చాత్య దేశాలలో గేదెలు లేవు. బఫెలోస్ అంటే అవి అమెరికాలో మాత్రమే. అక్కడ కూడా అడవుల్లోనే ఉంటాయికాని బయట చూడటానికి కూడా కన్పించవు. అంచేత ఆ దేశాలలో ఆవుపాలనే పిల్లలకు వాడతారు.

మన వేమన గారి పద్యం 'గంగిగోవుపాలు గంటెడైననుచాలు కడివెడైననేమి ఖరముపాలు' అన్న ప్రకటనం నేటి శాస్త్ర పరిశోధనల ప్రకారం చెల్లదు. అయితే గంగిగోవు మనకు పవిత్రమైన జంతువు. ప్రతి ఊరిలోనూ ఉంటుంది. గాడిదకంటె శుభ్రతగల జంతువు. కాబట్టి ఆవుపాలే శ్రేష్ఠమైనవని అంగీకరిద్దాం.

ఆయుర్వేద శాస్త్ర ప్రకారం గాడిదపాలు మందుగా వాడే ఆచారం వుంది. ఉబ్బసం ఉన్న పిల్లలకు ఈ పాలు మందుగా పోస్తారు. కుటుంబాలలో వంశపారంపర్య ఉబ్బసంగా వచ్చేవారికి చిన్నప్పుడు గాడిదపాలనే మందుగా పోస్తారు. చిన్నప్పుడు నాకు కూడా గాడిదపాలు పోశారుట. అందుకే బహుశా మా నాన్నగారిని జీవితమంతా పీడించి పీల్చి పిప్పిచేసిన ఉబ్బసవ్యాధి ఏదో చిన్నప్పుడు ఉన్నానని కన్పించినా తరవాత ఎప్పుడూ నన్ను బాధించలేదు. నేను మాత్రం 'చంటిపిల్లాడి'నేనండోయ్. ఇప్పుడు 75 సంవత్సరాలు దాటాయి కదా! అంచేత అరవయి దాటిన వారందరితో రెండవ శైశవంలో చేర్చాను షష్టిపూర్తి కావడం అంటే అదే గదా! అందువల్ల చంటి పిల్లాడిలాగే అమాయకంగా

అల్లరి చేస్తూ కాలం గడపాలనీ, గడవాలనీ కోరుకుంటాను. ఇప్పుడిక చంటిపాలు అక్కర్లేదు గనుక చంటి పాలు అవసరంలేని చంటి పిల్లాడినన్నమాట.

## లావు అవుతానని భయం

ఈ విషయాలన్నీ మా అమ్మ చెప్పినవేనండీ! మా అమ్మదగ్గర పాలు బాగా వుండడంచేత నేను దుండుముక్కలాగా తొనలు తేలి ఉండేవాడిని. మా అమ్మ ఇంకా ఇంకా పాలు ఇస్తే నేను బాగా లావు అవుతానని భయపడటానికి కారణం కూడా ఉంది. మా నాన్నగారి పెద్ద అక్కయ్యగారైన తిరుమలమ్మగారి ఊరు కేతనకొండలో పెరిగాను. అక్కడ మా రెండవ మేనత్త రత్నమ్మగారికి ఇద్దరు కొడుకులు, ఒక కుమార్తె అని ఇదివరలోనే చెప్పానుగదా! అందులో రెండవ కొడుకు అంటే కుటుంబయ్య బావను మా పెద్ద మేనత్త, పిల్లలు లేనికారణంగా దత్తత తీసుకుంది. అయితే అక్కడున్న అందరిదీ ఉమ్మడి కుటుంబమే గదా! అస్తి అంతా మూలధనంగా పునాదిగా మా తిరుమలమ్మత్తయ్యదే! ఇక ఈ ప్రస్తావనంతా ఎందుకంటే మా కుటుంబయ్య బావ చాలా లావుగా ఉండేవాడు. అంటే 17, 18 సంవత్సరాల వయసుకే దాదాపు నూరు కేజీల బరువు ఉన్నట్లు ఉండేవాడు. మరి ఆ రోజులలో 16, 18 సంవత్సరాల మగపిల్లలకు 8, 11 సంవత్సరాల కల్లా ఆడపిల్లలకు వివాహం చేసేవారు. అందుచేత మా కుటుంబయ్య బావకు అప్పుడే పెళ్ళి సంబంధాలు వస్తుండేవి.

మా కుటుంబయ్య బావకు ఏమిలోటు. దత్తత కుమారుడు. ఆస్తిపరుడు. రూపురేఖలు కూడా అసలు తల్లి రత్తమ్మత్తయ్య నలుపు వచ్చింది. కాని కనుముక్కు తీరు బాగా ఉండేవాడు. అయితే విపరీతమైన లావు. వచ్చిన సంబంధాలు పిల్లవాడు లావు అని కొన్ని సంబంధాల వాళ్ళు తిరిగి పోయేవారు. మగపిల్లవాణ్ణి ఆడపిల్లవారు తిరస్కరించటం ఈ రోజులలో కూడా విడ్డూరమే. మరి దాదాపు 80 సంవత్సరాల క్రితం బాగా ఆస్తి ఉన్న కుర్రవాడిని తిరస్కరించడమంటే ఎంతో అవమానంగా భావించేవారు మగపిల్లవాడి తరపువాళ్ళు. ఇలాంటి పరిస్థితిలో ఆస్తి ఉన్న బాగా సంపన్న కుటుంబమే అయినా మా కుటుంబయ్య బావకు లావు మూలంగా ఇలా అయిందంటే ఎంతో

విచారించదగిన అంశంగా ఎంచుకొనేవారు. అందువల్ల మా అమ్మకు నేనెక్కడ లావుగా తయారవుతానో అని భయం. పాలు సమృద్ధిగా ఉండడం వల్ల అప్పటికే నేను బాగా లావుగా ఉండేవాణ్ణి. మాతృహృదయం ఎంత దూరదృష్టితో ఆలోచిస్తుందో చూడండి. నేను కూడా మా కుటుంబయ్య బావలాగా అవుతానేమోనని ఎక్కువ నాకు పాలు ఇచ్చేది కాదుట. అదృష్టవశాత్తూ నేనంత లావు కాలేదు లెండి. సంబంధాలు ఏవీ తిరిగిపోలేదు కూడాను. చిన్నప్పుడు మాత్రం బాగా లావుగానే ఉండేవాణ్ణి.

నేను లావుగా ఉన్నా బాగా ముద్దుగా ఉండేవాణ్ణని మా అమ్మ ఒక కథ చెప్పేది. ఇంట్లో ఉన్న పిల్లలు ముద్దు వస్తున్న నన్ను ఎత్తుకోవడానికి వచ్చేవారు. దానికి మా అమ్మ ఒక షరతు పెట్టేది. అది ఒక తమాషా అయిన షరతు. ఆ రోజుల్లో ఏమిటి ఈ రోజుల్లో కూడా ముఖ్యంగా పాతకాలపు ఆచారాలున్న ఇళ్ళలో అందునా పల్లెటూళ్ళలో ఆహార విహారాలలో నిషేధాలు చాలా ఉంటాయి. పథ్యంపేరిట మజ్జిగ పోయరు. అనేక కూరగాయలు పెట్టరు. పండ్ల విషయంలో ఈ జాగ్రత్త మరీ ఎక్కువగా చూపుతారు. అందులో నారింజపండంటే మరీ నిషేధం. నారింజకాయ తింటే పడిశం పడుతుందని అసలు దగ్గరకు రానివ్వరు. మా అమ్మ బాలింతగా ఉన్నదంటే అప్పటికి రాజమండ్రిలో పోచిరాజు వెంకయ్యగారింట్లో ఉండి ఉండాలి. అందులో ఆయన తహసీల్ దార్ అవటం చేత రాజమండ్రిలో అన్నిరకాల పండ్లు విరివిగా వస్తూ ఉంటాయి. తహసీల్ దారుగారికిసప్లయిలకి ఏమీ లోటుండదుగదా.ఇంటి నిండా అన్ని పండ్లతోపాటు పెద్ద పెద్ద నారింజకాయలు కూడా ఉండేవి. నారింజపండ్లంటే మా అమ్మకు చాలా ఇష్టం. ఆ పండు జలుబు చేస్తుందని మా అమ్మకు ఇచ్చేవారు కాదట. ఇప్పటికీ ఏ పండు తిన్నా ఏదో జబ్బు చేస్తుందని మన వాళ్ళు పిల్లలకూ బాలింతరాళ్ళకూ ఇవ్వరు. నారింజ పండంటే మా అమ్మకు ప్రాణంకదా! అందుచేత ఎవరైనా పిల్లలు నన్ను ఎత్తుకోవడానికి ఇమ్మంటే నాకు చాటుగా ఒక నారింజకాయ తెచ్చిపెడితే అబ్బాయిని ఎత్తుకోనిస్తా, అనేదిట. వారు చాటుగా అమ్మకు ఆ పండుతెచ్చి ఇచ్చి నన్ను ఎత్తుకునేవారు. ఇది లంచం కిందికి వస్తుందో, 'బార్టర్' పద్ధతి కింద వస్తుందో మీరే ఆలోచించండి!

ఇది ఆవిడ బాలింతగా ఉన్న 10, 12 రోజులలో అయిఉంటుంది. ఎందుకంటే మొదటి 10, 12 రోజాలు పురుడు అని చెప్పి బాలింత ఒళ్ళు పచ్చిగా ఉంటుందని చాలా పథ్యపు నియమాలు పెడతారు. అంచేత అమ్మ మామూలుగా తిరగ కూడదు. అందులో ఎంతో మడి ఆచారాలతో మగ్గిపోతున్న బ్రాహ్మణకుటుంబాలలో ఇటువంటి నియమనిబంధనలు ఎక్కువగా ఉండేవి. అందుచేత జిహ్వాచాపల్యం వల్ల, నారింజపండు మీది అతిప్రీతివల్ల మా అమ్మ ఇటువంటి షరతు పెట్టి ఉంటుందను కుంటాను. బహుశా మా అమ్మ మా తమ్ముణ్ణి కన్న రోజులలో బాలింతగా ఉన్నప్పుడు ఈ ఉదంతం జరిగి ఉంటుందను కుంటాను. అప్పటికామెకు ఇరవై ఏళ్ళు కూడా లేవుకదా! చిన్న పిల్ల అనే అనుకోవాలి.

## తల్లిప్రేమ – పెళ్ళాం ప్రేమ

చిన్ననాడు పాలిచ్చేటప్పుడే మా అమ్మ చూపిన దూరదృష్టి ఆమె తన జీవిత కాలంలో అంతా చూపబట్టే మా జీవితాలు ఈ విధంగా సార్థకమైనాయి. ఏ పొలాలగట్లనో సేద్యం చేసుకుంటూనో బడిపంతులు ఉద్యోగంతో ఆగిపోకుండానో ఎంతో గర్వించేట్లు జీవితపథం సాగించ గలిగినందుకు అమ్మపట్ల మేమెంతో కృతజ్ఞులం.

తల్లి ప్రేమను మించిన ప్రేమ ప్రపంచంలోనే లేదని చెప్పాలి. కాని పెద్ద వాళ్ళైన తర్వాత పిల్లల భావాలు వేరుగా ఉంటాయి. అందుకేనేమో, 'అడ్డాలనాడు బిడ్డలు గాని గడ్డాలనాడు బిడ్డలా' సామెత పుట్టి ఉంటుంది.పెళ్ళైన తర్వాత తమ ప్రేమను సరిగా పంచలేక సహృదయులై అయినా యువకులు కొంత మధనకులోను గాక తప్పదు. మీరు మాకేం చేశారనో, మాకేం పెట్టారనో తల్లిదండ్రులను ఎదిరించే యువతీయువకులు కూడా లేకపోలేదు. అందువల్లనే పెళ్ళైన తర్వాత యువకులకు మనఃస్థితిని తల్లి విషమాయె, పెళ్ళాము బెల్లమాయె' అనే విధంగా చెప్పటం జరిగింది. ఇదే పరిస్థితి అత్తగారికీ కోడలికీ కూడా వర్తిస్తుంది. తాను ఒకనాటి కోడలినని మరచి కొడుకును తన చెప్పుచేతలలో పెట్టుకొని కోడరికం పెడతారనుకుంటాను. కొడుకు తమ మాటకెట్లా జవదాటకుండా ఉండాలని కోరుకుంటారో అదేవిధంగా కోడలు కూడా అత్త విధేయురాలిగా ఉండాలని కోడలి వంక చూస్తారు. అందువల్లనేనేమో అత్తాకోడళ్ళ సంబంధాలు ప్రపంచమంతటా చిటపటలాడుతూనే ఉండటంకద్దు.

## అత్తరికం – కోడరికం

ప్రతివారూ జీవితాన్ని అర్థం చేసుకుని, అనుభవజ్ఞానం సంపాదించి మన బాధ్యతలను, కర్తవ్యాలను సరిగా పాటిస్తే ఈ పాతకాలపు సామెతలను నేటికాలానికి అనుగుణంగా సరిదిద్దవచ్చు. భార్యాభర్తల మధ్య క్రమంగా పెరగవలసిన, పెరుగుతున్న అనురాగబంధం, బాధ్యతలు, తల్లిదండ్రులపట్ల చూపవలసిన ఆదరాభిమానాలు, మమతానుబంధాలు, అత్తరికం – కోడరికం వల్ల కలిగే మానసిక వైకల్యాలు పరిశీలించి వర్ణిస్తే మనో విజ్ఞాన శాస్త్రంలో ఒక ఉద్గ్రంధమే రాయవచ్చు

ఇదంతా మా అమ్మ తన పిల్లాడెక్కడ లావైపోతాడో అని భయం కొద్దీ ప్రవర్తించిన తీరు గురించిన ప్రస్తావనలో చిలవలు పలవలుగా విస్తరించి చెప్పాను. ఇంతకూ నేను చెప్పవచ్చింది ఏమంటే పిల్లలు లావైపోతారని తల్లులు పిల్లలకు పాలు తగ్గించి ఇవ్వాల్సిన అవసరంలేదని. 'తల్లి పాలు తరగని బలం' అని మనవి చేస్తూనా అదృష్టం కొద్దీ మా అమ్మ దగ్గర కడుపునిండా పాలుతాగానని చెపుతూ పిల్లలకు,తల్లులు ఉన్నంతవరకు పాలు ఇస్తూ,5, 6 నెలల నుంచి ఇతర ఆహారం అలవాటు చెయ్యడం మంచిదని సూచన చేస్తున్నాను. చనుబాలు క్రమంగా కరువవుతున్న ఈ ఆధునిక యుగంలో మా అమ్మలాగా తల్లులందరి బిడ్డలు సమృద్ధిగా పాలుగ్రోలాలని ఆశీర్వదిస్తున్నాను.

# XIV

# కేతనకొండ విశేషాలు - I

# TIT-BITS OF KETANAKONDA - I

A typical Indian joint family system, security and inconvenience that was the RENDEZVOUS, for all my family and widowed aunts! My father was brought up there by his eldest sister, as he had lost his mother when he was six months old. Hence, his real native village is Ketanakonda.

For a happy life, "One should not lose his mother when young or wife when one is old" - My father.

**ఉమ్మడి కుటుంబాల విశేషాలు - ఆనాటి సంగతులు.**

కేతనకొండ చిన్న పల్లెటూరు. ఈ చిన్నగ్రామం విజయవాడ హైదరాబాదు రోడ్డు మీద 15వ మైలురాయి దగ్గర కొంచెం రోడ్డుకు దిగువన

ఉన్నదని ఇదివరకే చెప్పాను. ఈ పదిహేను మైళ్ళు, లేదా ఇరవై నాలుగు కిలోమీటర్ల ప్రయాణం చేయటానికి దాదాపు ఏడెనిమిది గంటలు పట్టేదని కూడా చెప్పాను. ఈ విధంగా ఆ రోజుల్లో ఇంచుమించు అన్ని పల్లెల స్థితీ అలానే ఉండేది. అంటే సుమారు 70 ఏళ్ళ కిందటి ముచ్చట అన్నమాట. 1920 ప్రాంతాల పల్లెటూళ్ళకు కేతనకొండ ప్రాతినిధ్యం వహిస్తుందని చెప్పవచ్చు. ఆనాటి ఉమ్మడి కుటుంబాలు, ఆ ముచ్చట్లు తలచుకోవటానికి చాలా ఉత్సాహంగా ఉంది.

కేతనకొండ మా రెండో మేనత్త రత్తమ్మగారి అత్తవారి ఊరు. అంతకు ముందే ఆ ఊరికే మా పెద్ద మేనత్త తిరుమలమ్మగారిని ఇచ్చాం. అక్కడికి దగ్గర్లోనే కృష్ణ ఒడ్డునవుండే కొటికలపూడి కరణం గారు మా తిరుమలమ్మత్తయ్య భర్త. తిరుమలమ్మత్తయ్య పాపం చిన్నతనంలోనే సంతానం కూడా కలగకుండానే వితంతువైంది. పెద్ద ఆస్తి అవడంచేత ఆవిడ అక్కడే స్థిరనివాసం ఏర్పాటు చేసుకొన్నది. పెద్ద మేనత్త అంటే, కుటుంబ బాధ్యతలు చూసే పెద్ద గదా. ఆ రోజుల్లో ఆమె ఇంటికి పెద్దగా వ్యవహరించేది. ఆమె చివరి తమ్ముడు మా నాన్నగారు ప్రాతూరు పెదసుబ్బయ్యగారు. పేరు సుబ్బారావు అయినా పల్లెటూరి సంప్రదాయం ప్రకారం సుబ్బయ్య అనే పిలిచేవారు.

మా నాన్నగారు పుట్టిన ఆరునెలలకే ఆయన తల్లి మరణించింది. అందువల్ల మేనత్త తిరుమలమ్మగారి ఇంట్లో కేతనకొండలోనే ఆయన చిన్ననాటి జీవితమంతా గడచింది. మా నాన్నగారు అందరికంటే చిన్నవాడవటం, కుటుంబంలో మగపిల్లవాడవటం, పసితనంలోనే తల్లిని పోగొట్టుకోవటం వల్ల పెద్ద అక్కగారింట్లో చాలా గారాబంగా పెరిగారు. దానితో ఆయన ఆ కుటుంబంలోనివారే అయినారు. తరవాత మా అమ్మ తన 39వ ఏట టైఫాయిడ్ జ్వరం వచ్చి మా నాన్నగారు అప్పట్లో ఉద్యోగం చేస్తున్న కానుమోలులో మరణించింది. అప్పటికి, మేమంతా పెద్దవాళ్ళమయి పై చదువులలో ఉన్నాం. మా నాన్నగారికి అప్పటికి 45 - 46 సంవత్సరాల వయసు ఉంటుంది. తర్వాత మేము ఉద్యోగాలలో ప్రవేశించిన తర్వాత మా నాన్నగారిచేత ఉద్యోగం మాన్పించి, ఆయన్ను నేను మద్రాసు తీసుకొని వెళ్ళాను. అప్పుడు నాన్నగారంటూఉండేవారు. "మనిషి సుఖపడాలంటే

చిన్నప్పుడు తల్లిపోకూడదు, పెద్దయిన తర్వాత,భార్య పోకూడదురా" అని. ఈ రెండూ నేను తప్పించుకోలేక పోయినానురా, అని! కూడా అంటూఉండేవారు. అప్పుడు నేను అనేవాణ్ణి, "నిజమేననుకోండి. మీ పెద్ద అక్కయ్య తిరుమలమ్మగారు పువ్వులలో పెట్టి గారాబంగా పెంచారు మిమ్మల్ని. తల్లిలేని లోటు తీర్చారు. మరి మేం పెద్ద వాళ్ళమైన తర్వాత మేమిద్దరం కొడుకులం ఉన్నాంగదా మీకే లోటు లేకుండా చూడటానికి.అప్పుడు 'అది సరే నేను కాదనను, కాని ఈ లోటులోటే' అనేవారు నాన్నగారు. ఇది జీవితం కాచి వడబోసిన సూక్తిలాగ చెవులలో రింగుమంటూనే ఉంటుంది. "చిన్నప్పుడు తల్లిపోకూడదు, పెద్దప్పుడు భార్యపోకూడదు" అనే వాక్యం నిజంగా అనుభవసత్యం. అక్షరాలా తిరుగులేని సూక్తి.

ఈ కేతనకొండ జీవితమే మాకు కుదురు కావడానికి కారణం ఇంకోటి కూడా ఉంది. మా రెండో మేనత్త రత్తమ్మగారిని కూడా మా తాతయ్య కేతనకొండే ఇచ్చారు. రెండవ మేనత్త ఇంటిపేరు కూడా 'కోటికలపూడి' వారే మా రత్తమ్మత్తయ్య భర్తపేరు కృష్ణయ్యగారు. అయితే అంతా కిష్టయ్యగారని పిలిచేవారు. అంచేత మేమంతా కొటికలపూడి కిష్టయ్య మామ అనేవాళ్ళం ఆయనను. మా పెద్ద మేనత్త వితంతువు అవటంచేత కిష్టయ్య మామయ్యే ఇంటికి మగదిక్కుగా వ్యవహరించేవారు. ఆ దగ్గరదగ్గరి మూడు వూళ్ళ కరణీకాలు ఆయనవే. అవి కొటికలపూడి, కేతనకొండ, మూలపాడు కరణీకాలు. అవి వారసత్వంగా వచ్చాయి ఆయనకు. మూడు ఊళ్ళ కరణాలంటే ఎటువంటి పేరు ప్రఖ్యాతులుంటాయో కరణీకాలు రద్దయి, మండలాలు ఏర్పడ్డ యీ రోజులలో ఈ తరంవారు ఊహించటం కష్టం.

## ఈ ముహూర్తానికే పెళ్ళి!

ఇక మా రెండో మేనత్త రత్తమ్మగారికి కిష్టయ్య మామయ్యకు జరిగిన పెండ్లి చరిత్రకూడా తమాషా కథలాగే ఉంటుంది. మా రెండో మేనత్త రత్తమ్మగారు నల్లగా ఉన్నా ముఖం కళగా వుంటుంది. వంశపారంపర్య లక్షణమైన ముందు వరుస కొంచెం ఎత్తులు ఈమెలో కూడా కనపడుతుంది. ఐదు పైసల బిళ్ళంత బొట్టు పెట్టుకుని మహాలక్ష్మిలాగ ఉండేది. మా తిరుమలరాయుడు

తాతయ్యగారు ఈవిడకు ఒక సంబంధం కుదిర్చి లగ్నం పెట్టారు.కాన్నిలగ్నానికి రావలసిన పెళ్ళికొడుకు వాళ్ళు ఎందుకో రాలేదు. అయితే మా తాతయ్య పట్టుదలగా ఆ ముహూర్తానికే ఎవరినైనా తీసుకొని వచ్చి మా అత్తయ్యకు పెళ్ళి చేయడానికే నిశ్చయించాడు. మా పెద్ద మేనత్త తిరుమలమ్మగారి కేతనకొండలో వాళ్ళ ఇంటి అరుగుమీద వీధిబడి పెట్టి పిల్లలకు చదువు చెపుతూ ఉండే కొటికలపూడి కిష్టయ్యగారు పొడుగ్గా బద్దలావుండి ఎర్రగా బాగా ఉండేవాడు. ఈయన బాగా ఉంటాడని మా తాతగారికెవరో సలహా ఇచ్చారు. వెంటనే మా తాతయ్య ఆయన్ను పిలిపించి ఆయనకు తన కూతురునిచ్చి వివాహం జరిపించాడు. అప్పటి నుంచి మా కొటికలపూడి కిష్టయ్య మామయ్య జాతకం మారిపోయింది. మహర్దశ ప్రారంభమైంది. అత్తయ్యరాకతో ఆయన ఇల్లంతా లక్ష్మి తాండవమాడింది. పెద్ద ఆస్తి ఉన్న మా తిరులమ్మత్తయ్య కుటుంబానికి దగ్గిర బంధువైనాడు. వీధి బడిపంతులుగా ఉండే కిష్టయ్యమామయ్య మూడూళ్ళకు కరణమైనాడు. మా తాతయ్య మొండిపట్టుతో ఆ ముహూర్తానికే అత్తయ్య వివాహం జరిపించాలని జరిపించినా అది ఉభయతారకం అయింది. ఇప్పటి తరంవాళ్ళకు ఇటువంటి వృత్తాంతం తమాషాగా ఉంటుంది.

ఈ విధంగా ఇద్దరు మేనత్తలకు కేతనకొండ నివాసస్థలమై మిగతా ప్రాతూరి బంధుబలగానికది యాత్రాస్థలమే కాకుండా వాళ్ళ సమస్యా పరిష్కార ఆశ్రమంగానూ తయారైంది. అందుకే మాతృవియోగం పాలబడిన మా నాన్నగారు, తన ఆరోనెల పసితనంనుంచీ అక్కగారి ఆదరాభిమానాలతో పెరిగారు. తద్వారా అదే మాకూ ఆశ్రయమైంది. ఆ కేతనకొండే మాకూ పుట్టినిల్లయింది. పెద్ద ఉమ్మడికుటుంబంగా ఆ ప్రాపకం విస్తరించింది.

మాకు జ్ఞానం వచ్చేటప్పటికి మా మూడవ మేనత్త లక్ష్మమ్మగారు వితంతువవగానే కేతనకొండకే చేరింది. ఆవిడ భర్త దాదాపు వంద సంవత్సరాల కిందటే బి.ఎ., బి.ఎల్. పాసైనారంటే ఎంత గొప్ప భవితవ్యం ఉన్న భర్తను మా మూడో మేనత్త కోల్పోయిందో ఊహించవచ్చు. మా లక్ష్మమ్మత్తయ్య అత్తవారు కొంచెం ఉన్నవారే అయినా ఆవిడ కూడా పుట్టిల్లు మాదిరిగా ఉన్న కేతనకొండలో అక్కగారింటికే చేరింది. ఆ రోజులలో భర్తపోతే ఆ కుటుంబానికి ఎంత ఆస్తి ఉన్నా మనువర్తి తప్ప మరో సొత్తు పైన స్త్రీకి ఎటువంటి హక్కులు

లేవుకదా! ఈ విషయంలో ఇప్పుడిప్పుడు కొంచెం ఆశావహమైన సూచనలు కనపడుతున్నాయి. స్త్రీ జీవితం మెరుగుపడే పరిస్థితులు కూడా సమీపిస్తున్నాయి. స్త్రీకి, భర్త స్వార్జిత, పూర్వార్జిత ఆస్తులమీద హక్కులు ఏర్పడ్డాయి. అయినప్పటికీ స్త్రీకి పురుషుడితో సమాన హక్కులు రావడానికి ఎంతో పురోగమించాలి. అయినా ఆనాటికీ ఈనాటికీ ఎంతో వ్యత్యాసం ఉంది.ఒక నాటికి భర్త ఆస్తిమీద మహిళకు సర్వహక్కులూ సంక్రమించాలి, ముందు ముందు సంక్రమిస్తాయి.

ఇవీ మా కేతనకొండ అనుబంధానికి సంబంధించిన పూర్వాపరాలు. అవిభక్త కుటుంబంలాగా ఉండేది ఆ కేతనకొండలో మా జీవితం, అంటే ఆశ్చర్యపడనక్కరలేదు. ఇక మా అత్తయ్యల సంతానం గూర్చి చెపుతాను. మా రెండో మేనత్త రత్తమ్మగారికి ముగ్గురు పిల్లలు మిగిలారు. అందులో ఇద్దరు కొడుకులు, ఒక కూతురు. పాపం మా రత్తమ్మత్తయ్యకు మొత్తం పధ్నాలుగు కాన్పులు వచ్చినా అందులో ఈ ముగ్గురే దక్కారు. ఆరోగ్యంగా సుఖంగా పెరిగి పెద్దవాళ్ళైనారు. అత్తయ్య సంతానంలో పెద్దవాడు మా దుర్గయ్యబావ. రెండోవాడు మా కుటుంబయ్యబావ. మూడోది మా రాజమ్మవదిన. పేరు రాజమ్మ అయినా అందరూ ముద్దుగా 'రాజాయ్' అని పిలిచేవారు. అందుకని నేను కూడా 'రాజాయ్ వదినా' అనేవాణ్ణి.

## మా మేనత్తలు

ఇక మా అత్తలను గురించి చెపుతాను. 'అత్త' అనగానే 'అల్లుడికి అత్తాశ, బాపడికి పప్పాశ' అనే సామెత జ్ఞాపకానికి వస్తుంది. అత్త అనే పదంలోనే ఆ ముద్దు, పారవశ్యం, ఆపేక్ష ఉన్నాయి. మా మేనత్తలంతా మా నాన్నగారి కంటే చాలా పెద్దవారవటం చేత మేమంతా మా మేనత్తల మనుమల వయస్సులో ఉండటం చేత మాకు మేనత్తల విషయంలో వివాహ సంబంధాలు కలుపుకొనే ఆశలేమీ, అసలా ప్రసక్తి ఏది కాని ఉండేవి కావు. అయినా మా మేనత్తలు మాపట్ల చూపిన ప్రేమాభిమానాలు ఏనాటికీ మరువలేనివి. మరువరానివి.

మా తిరుమలరాయుడు తాతయ్యఅంటే మా పితామహుడికి ఇద్దరే కుమారులు. మా పెదనాన్న యజ్ఞనారాయణగారూ, మా నాన్నగారు

పెదసుబ్బయ్యగారున్నూ. ఆడపిల్లలు మాత్రం ఐదుగురు. పెద్దావిడ తిరుమలమ్మగారు. ఆ ఉమ్మడి కుటుంబ భవనానికి ఆమే పునాదిరాయి. ఆప్యాయతలకు, అభిమానాలకు అక్షయపాత్ర. ఆర్థిక స్తోమతకు ఆలంబనం. ఇంతేకాక మా రెండో మేనత్త రత్తమ్మగారు ఆ ఊరిలోనే కిష్టయ్య మామయ్యను పెళ్ళాడడంతో అదే ఊరిలో ఒకే సంసారంలో ఇమిడి పోయింది. మూడో మేనత్త లక్ష్మమ్మగారు కూడా వితంతువు కావడంతో కేతనకొండకే చేరింది. ముగ్గురు మేనత్తలూ ఒకే కప్పుకింద ఈ విధంగా చేరారు, వివిధ రూపాలతో. ఆలోచిస్తే ఇది ఒక వింత పరిస్థితి అనిపిస్తుంది. ఇంగ్లీషులో అయితే 'ట్రయిస్ట్ విత్ డెస్టినీ' (Tryst with Destiny) అంటాం. అంటే అదృష్టం ఇట్లా ఉంది, అదృష్టంతో ముడిపడిన పరిస్థితి ఇది అని తెలుగులో చెప్పుకోవచ్చు.

మా నాలుగో మేనత్త సీతమ్మగారు. ఈవిడను మా పెదనాన్నగారి సహాధ్యాయుడు మా ప్రాతూరి దగ్గర నూతక్కి వాస్తవ్యులు; ఇంటి పేరు కూడా క్రావడి ఒక్కటి మినహాయించి 'పాతూరి' వారు (మా ఇంటిపేరు ప్రాతూరు కదా!) అయిన పాతూరి శివరామయ్యగారికి మా పెదనాన్న ప్రేరేపణ మీద ఇచ్చారు. ఆ రోజులలో మా స్వగ్రామమైన ప్రాతూరు చుట్టుపక్కల ప్రాంతాలలో మా తాత తిరుమలరాయుడుగారంటే ఎంతో పేరు ప్రతిష్ఠలుండేవి. ఆయన వంద ఎకరాల ఆసామీ. దానితో ఆయన ఆర్థిక స్తోమత మీద ఆ చుట్టుపక్కల ఎంతో గౌరవం ఉండేది. అందుచేత అటువంటి ఆయనే తమ అమ్మాయిని ఇస్తామంటే కాదనే వారెవరుంటారు? ఎవరూ ఉండేవారుకాదు.

మా సీతమ్మత్తయ్య భర్త తరువాత ప్లీడరీ పరీక్ష ప్యాసై బాపట్లలో ప్రాక్టీసు పెట్టి పెద్ద స్థితిమంతులైనారు. ఆ కుటుంబంలో మా అత్తయ్యకు ఒక్కడే కొడుకు, మా లక్ష్మీనారాయణబావ. ఈ మా బావకూడా తరవాత తరవాత మాతరంలో మద్రాసులో లా చదివి బి.ఎ., బి.ఎల్., ప్యాసై తండ్రిగారి కుర్చీలో కూర్చుని పెద్దలాయరుగా పేరు తెచ్చుకున్నాడు. మా శివరామయ్య మామయ్య, లక్ష్మీనారాయణ బావ ఇద్దరూ దత్తాత్రేయ భక్తులు.

ఒక విషయం ఆలోచిస్తే తమాషా అనిపిస్తుంది. మా రెండో మేనత్త రత్తమ్మగారికి పధ్నాలుగు కాన్పులేమిటి? అందులో ముగ్గురే పిల్లలు జీవించటమేమిటి? ఒక మా నాలుగో మేనత్త సీతమ్మగారికి ఒక్కడే

ఒక్కొకొడుకేమిటి? ప్రకృతిలో కూడా ఏదో కుటుంబనియంత్రణ తత్త్వం గర్భితమై ఉంటుందేమో? ఇప్పటి 'ఫెర్టిలిటీ' క్రమాన్ని అనుసరించి మన పెద్దలు చెప్పారు- 'బీదవానికి కుక్క ముఠికి సంతానంబు, కోటీశ్వరునికి గొడ్డరికము' అని. ఇప్పుడు అభివృద్ధి చెందిన దేశాలలో ముఖ్యంగా ఆర్థికాభివృద్ధి చెందిన కుటుంబాలలో స్త్రీలకు గొడ్డరికం ఆవహించి జనాభా పడిపోతున్నది. అక్కడ కూడా బీదసంసారాలలో ఈ అధిక సంతానం. అనారోగ్య పరిస్థితులు మన ఆర్యోక్తినే సమర్థిస్తున్నాయి. అందువల్ల, మనం మన దేశంలో నిజంగా సంతాన నియంత్రణ పాటించాలంటే మార్గమేమిటంటే విద్యాధిక శాతాన్ని పెంచాలి. ఆర్థికాభివృద్ధిని సాధించాలి. జీవిత ప్రమాణం పెరిగినందువల్ల శాస్త్రజ్ఞులు కూడా దీనినే నొక్కిచెబుతున్నారు.

మా అయిదో మేనత్తపేరు సోమిదేవమ్మగారు. ఈవిడను బందరు కాపురస్తులు 'చైనం' వారికిచ్చారు. ఈవిడకు ముగ్గురు మగపిల్లలు, ఒక్కతే ఆడపిల్ల, చైనులుబావ, భద్రయ్యబావ, తిరుమలరావు అనేవాళ్ళు, ఆమె కొడుకులు. చంద్రమతి అని ఒక్కతే ఆడపిల్ల వారికి. వారి ఆర్థిక పరిస్థితి కొంత క్లిష్టంగా ఉండేది. అయితే మిగతా అప్పలంతా ఆవిడ సంసారాన్ని సంవత్సరానికి ఒకసారి, ఏదోవిధంగా సహాయంచేస్తూ ఆదరణ చూపిస్తూ ఉండేవారు.

మా కుటుంబాలలో వచ్చిన పేర్లలో సోమయాజులు, యజ్ఞనారాయణ, చైనం మొదలైన యీ పేర్లన్నీ పూర్వీకులు చాలా యజ్ఞయాగాదులు చేసిన వారవటంచేత వచ్చినవే అందుకే వందల ఎకరాలు అప్పులకింద కట్టి బీదవారైనారు. మా బందరు మేనత్త సోమిదేవమ్మగారి కుటుంబంకూడా యీ మాదిరిగా వారి పూర్వీకులు వైశ్యదేవాలు, యజ్ఞాలు చేసి ఆస్తులు పోగొట్టు కున్నందువల్లనే బీదరికం పాలై ఉంటుంది.

ఇప్పటికి, మా అయిదుగురు మేనత్తల గురించీ చెప్పినట్లైంది. ఆ కుటుంబంలో మా పెదనాన్నగారు, నాన్నగారూ ఇద్దరే అన్నదమ్ములని కూడా చెప్పాను కదా. ఈ ఏడుగురి తోబుట్టువుల జీవితాలు కేతనకొండ మా పెద్ద మేనత్త తిరుమలమ్మగారి కుటుంబంతో పెనవేసుకుని, అదొక ఉదార వసుధైక కుటుంబంగా రూపొందిందని చెప్పవచ్చు. ఈనాడైతే ఎవరికి వారే యమునాతీరే అన్నట్లుగా అయిపోయినాం. దూరప్రాంతాలకు ఇంకా దూరదేశాలకు కుటుంబ

సభ్యులు విస్తరిస్తున్నారు. ఉద్యోగరీత్యా ఎదిగిన కుటుంబ సభ్యులు విదేశాలలో స్థిర నివాసం కూడా ఏర్పరచు కొంటున్నారు. దేశంలోని తల్లిదండ్రులు వృద్ధులైన తర్వాత వెనకటికాలంలో వలె వాళ్ళు ఆదరణకు నోచుకోవటంలేదు. జీవించినంతకాలం భార్యాభర్తలే ఒకరికొకరు ఆసరా అయి, ఒంటరిగా మిగిలి పోతున్నారు. అందులో ఇద్దరూ ఉంటే కొంతవరకు ఫరవాలేదు. ఇక వారిలోఎవరన్నా ఒకరు జారిపోతే రెండోవారిది ఏకాంత జీవితమై పోతుంది. ఒక విధమైన జీవిత విధానానికి అలవాటుపడి స్వదేశ వాతావరణంలో జీవించిన పెద్దలు పాశ్చాత్యదేశాలకు వెళ్ళలేకపోతున్నారు. వెళ్ళినా అక్కడ ఇమడలేకపోతున్నారు. జీవించకనూ తప్పటంలేదు. అందుచేత ఆనాటి ఉమ్మడి కుటుంబ బాధ్యతలు, ఆప్యాయతలు గూర్చి ఇప్పుడవి లేకపోయెనే అని బాధపడటంలో తప్పులేదు. ఈనాటి సాంఘిక పరిణామాలను గుర్తించుకొనే వృద్ధులైనవారు, స్వచ్ఛందసంస్థలు, కూడా వృద్ధులైనవారికి అందుకు స్తోమతు ఉన్నవారికి వృద్ధాశ్రమాలు నిర్వహించాల్సిన అవసరం కూడా నేడు ఎదురవుతున్నది. దానికి అనుగుణంగా ఇప్పుడిప్పుడే ఇలాటి ఆశ్రమాలు కొన్ని నెలకొంటున్నాయి. ఉమ్మడి కుటుంబాలుంటే వృద్ధులకి బాధలు లేకపోవును. కుటుంబంలో జరిగే అనేక అవాంతర సంఘటనలను కూడా ఉమ్మడి కుటుంబాలు ఎదుర్కోగలుగుతాయి. తట్టుకోగలిగేట్లు చేస్తాయి. మనో నిబ్బరాన్ని పెంపొందిస్తాయి. ఇందుకు తార్కాణంగా మా మేనత్తల జీవితాలనే చూడవచ్చు. వాళ్ళంతా ఒకరి కష్టాలో ఒకరు ఆదుకుని భయపడకుండా కాలం వెళ్ళదీశారు. చిన్నప్పుడే మరీ పసితనమప్పుడు ఆరునెలల వయసుననే తల్లిపోయి పెద్దక్కయ్య తిరుమలమ్మగారింట్లో పెరగటం చేత,మా నాన్నగారికి కేతనకొండే పుట్టిల్లయింది. అదే మా అమ్మ కాపరానికి రావడానికి అత్తిల్లు కూడా అయింది.

# XV

# కేతనకొండ విశేషాలు - 2

# TIT-BITS OF KETANAKONDA -II

Joint family experiences. The family was very affluent. Gold everywhere.
Ketanakonda -My Mother,s 'defacto' mother-in-law's place. The contrasting family styles of Madras and this village. She had to adjust as a daughter-in-law. It is also important for every daughter-in-law and son-in-law to adjust. Proper preparation is necessary for every married couple even today to avoid divorces and bride burnings!

మా ముగ్గురు మేనత్తలూ కేతనకొండలోనే ఉండేవారని చెప్పాను. ఏదో కారణంగా వారక్కడ చేరవలసివచ్చింది. వాళ్ళు ఉమ్మడికుటుంబంగా తమ రోజుల్ని గడుపుకున్నారు.

మా రెండో మేనత్త రత్తమ్మత్తయ్యకు, కిష్టయ్య మామయ్యకూ ఇద్దరు కొడుకులూ, ఒక కూతురూ పుట్టారు. దుర్గయ్య బావ, కుటుంబయ్య బావ, రాజాయి వదినా, మా రెండో మేనత్త పిల్లలని ఇదివరకే చెప్పాను. అయితే రెండో వాడైన కుటుంబయ్య బావను, ఈ ఉమ్మడికుటుంబం పెద్ద అయిన మా తిరుమలమ్మత్తయ్య దత్తత తీసుకుంది. ఈ విధంగా కుటుంబం వ్యవహారికంగా కూడా పెనవేసుకుని పోయింది. రాజాయి వదినను అక్కడకు 15 కి.మీ దూరంలో గుంటూరు జిల్లాలోని పరిమి గ్రామంలో స్థితిపరులైనభగవాన్లుకు ఇచ్చి వైభవంగా వివాహం చేశారు. అందువల్ల కేతనకొండలో దుర్గయ్య,కుటుంబయ్య బావలు మిగిలిపోయినారు. తరవాత తరవాత వీరిద్దరి కుటుంబాలు విస్తరించాయి.

మా దుర్గయ్య బావకు మొదటి వివాహం కాగానే ఏడాదిలోపునే భార్యపోయింది. అయితే ఆవిడ చెల్లెల్నే ఇచ్చి మళ్ళీ పెళ్ళిచేశారు. ఆమె పేరు కామేశ్వరి. వీళ్ళ దాంపత్యం చాలా వైభవంగా బహుకాలం కొనసాగిందనే చెప్పాలి. దుర్గయ్య బావ భార్యను కాముడక్కయ్య అని పిలిచేవాళ్ళం. నిజంగా ఆమె సొంత అక్కయ్యలాగా ఆప్యాయత కనపరిచేది. అభిమానం చూపెట్టేది. అప్పటికే దుర్గయ్య బావ కరణీకంలో చాలాపేరు సంపాదించి, వల్లూరి జమీందారు సన్నిహితుడుగా ఉండి బాగా ఆస్తిపాస్తులు వృద్ధి చేసి సంపన్న గృహస్థుడయ్యాడు. అందువల్ల వాళ్ళ ఇంటి నిండా బంగారమే కనపడేది. మా కాముడక్కయ్యకు ఎన్నో నగలు. ఆ రోజుల్లో ప్రతి సంపన్న గృహిణికి బంగారపు ఒడ్డాణం, కంటె, కాసులపేరు, నాలుగు పేటల గొలుసు, చేతులకు వంకీలు, దీనినే దండకడియం అనేవాళ్ళు. ఇంకా ముంజేతులకు వేసుకున్నన్ని గాజుల వరుసలు ఉండేవి. ఇవన్నీ మా కాముడక్కయ్యకి ఉండేవి. ఎప్పుడూ కలకలలాడుతూ ఉండేది, ఆమె. అరంగుళం కైవారంగల పెద్ద కుంకుమ బొట్టు ఆమె నుదుట ఎప్పుడూ శోభిస్తుండేది. సాక్షాత్తు మహలక్ష్మిలాగా ఉండేది, ఆమెను చూస్తే. 'చిత్రములు స్వామి నీ దివ్య చేష్టలెల్ల' అన్నట్లు ఈ కాముడక్కయ్య జీవితచరమదశలో విరాగిణియై, సన్యాసిని రూపం ధరించి, స్వాములవార్లను సేవించుకుంటూ కాషాయ వస్త్రాలు ధరించేది. భర్త పోవటం చేత వికేశి అయింది. ఆమె మృత శరీరాన్ని చూసినప్పుడు ఇంతేకదా జీవితంఅని వైరాగ్యభావం కలిగింది. మా కాముడక్కయ్య విరాగిణి అయి సన్యాసినిలా జీవించినా ఆమె సహజమైన వ్యక్తిత్వం పోగొట్టుకోలేదు. మా చిన్నప్పుడు అంటే ఏ ఆరేడు దశాబ్దాల కిందట

ఏ విధంగా నవ్వుతూ కరుణామూర్తిలాగా అందరినీ ఆదరించేదో అదేవిధంగా సంతర్పణలలో కూడా ఉల్లాసంగా నిత్యసంతోషంగా సన్యాసులకు భిక్షా కార్యక్రమాలు ఏర్పాటుచేస్తూ ఉండేది. వాళ్ళ వెంట పర్యటనలు సలుపుతూ ఉండేది. కంచిస్వాముల వారిపై ఆమెకు అత్యంత భక్తి శ్రద్ధలుండేవి. ఆ స్వామివారికి కూడా ఆమె అంటే ఆదరణ, అభిమానమూ ఉండేవి.

మా కాముడక్కయ్యకు వితంతువైన ఇంకో అక్కగారుండేవారు. ఆవిడపేరు 'అప్పమ్మ'. అందుచేత అప్పమ్మక్కయ్య అనేవాళ్ళం. అప్పమ్మక్కయ్యకు వేరే సంసార ఝూంఝూటం లేకపోవటంతో కాముడక్కయ్యకు తోడుగా ఉండటానికి అరణం వచ్చినట్లుగా వచ్చేసింది. అందుచేత మా కాముడక్కయ్యకు పురుడు పుణ్యాలప్పుడు ,ఆ తరవాత ఇంటి చాకిరిలో అంతా సాయపడుతూ ఉండేది. ఓహో! అలాంటిది నిష్కామకర్మ అంటే! అటువంటి అంకితభావం, త్యాగజీవితం, నిష్కామసేవ అరుదుగా కనపడతాయి, ఈ కాలంలో అయితే. ఆమె అలా మోడువారిన జీవితం గడపటానికి ఒప్పుకోకపోయే వాళ్ళమే. మా అప్పమ్మక్కయ్య నిజానికి మాకు ఎంతో దూరపు చుట్టంకదా. అది దూరపు చుట్టరికం కదా! అయినా అప్పమ్మక్కయ్య మా అందరికీ తోబుట్టువే. అంతలా ఉండేవి ఆనాటి ఆప్యాయతలు, అనుబంధాలు, స్వచ్ఛంద బాధ్యతలు.

కాపురానికి వచ్చేప్పటికి మా అమ్మకు బహుశా 15 లేదా 16 సంవత్సరాల వయసు మాత్రమే ఉండి ఉంటుంది. ఆ ఉమ్మడి కుటుంబంలో ఎంతమంది వితంతువులో లెక్కవేశారు కదా! ఆ సన్నివేశంలో మా కాముడక్కయ్యకూ మా అమ్మకూ ఇంచుమించు ఒకే వయస్సు కావడంవల్ల మా అమ్మకు, అక్కకూ బాగా దగ్గరతనం ఏర్పడింది. మా అమ్మను నిజంగానే ఆమె పిన్నిలాగా చూసుకొనేది. అయితే వయసులో ఇద్దరూ సమానమైనా మా అమ్మ ఏమో మద్రాసు నాగరకతనుంచి వచ్చింది కావడంవల్లా, విశాలమైన లోకానుభవం ఉండడం వల్లా, ఇంట్లో అందరూ ఆమెను నాగరీకురాలిగా గౌరవించేవారు. మా అమ్మ, కాముడక్కయ్య ఎంతో కలివిడిగా స్నేహంగా తమ సాధకబాధకాలు కుటుంబ ప్రేమలు, సంతోషాలు ఒకరికొకరు చెప్పుకుంటూ కాలక్షేపం చేసేవాళ్ళు.

## మా అమ్మ అత్తవారిల్లు – కేతనకొండే

మా అమ్మ ఆనాటికి మద్రాసులో హెూదాగల నాగరక జీవనానికి, మంచి ఆర్థిక స్తోమతు గల కుటుంబానికీ చెందినది కావడంవల్ల ఒక పిల్ల జమీందారు ఇంట్లో పెరిగినట్లే పెరిగింది. అప్పటికే ఆమె హార్మోనియం వాయించడం నేర్చుకుంది. ఆమె కంఠస్వరం కూడా బాగానే ఉండేది. ఆమెది కోలముఖం. పెద్దముక్కు. ఒడ్డూ పొడుగూ ఉండి చక్కగా ఉండేది. మొగపిల్లవాడై పుట్టాల్సింది, ఆడపిల్లయి పుట్టింది. అది ఆమె దురదృష్టమేమో! కాని, ఆమె గర్భవాసాన జన్మించడం మాది ఎంతో అదృష్టం అనుకుంటాము. 1990వ సంవత్సరాన్ని 'ది ఇయరాఫ్ ది గర్ల్ చైల్డ్' గా ప్రకటించి ప్రపంచ సంస్థ జరుపుకొమ్మని కోరింది, ఆడపిల్లల పోషణలోనూ, తరతరాలుగా వాళ్ళ పట్ల దేశదేశాలలో చూపుతున్న వివక్షతనుఖండించి,వాళ్ళను కూడా మగపిల్లలతో పాటే సర్వసమానంగా చూడాలని కూడా ఉద్బోధించింది. ఇప్పటికైనా సంఘంలో ఆడపిల్లలపట్ల సరిఅయిన అవగాహన రావాలని కోరుకుంటాను నేను. నిజంగా మా అమ్మ మాకు అమ్మకావడం ఎంతో అదృష్టంగా భావిస్తాను నేను.

మద్రాసులో ఆమె పెరిగినప్పుడు నిత్యవాడకానికి కూడా చలవచేసిన ఇస్త్రీబట్టలే ధరించేది. గొప్ప నాగరక వాతావరణంలో హుందాగా పెరిగింది. అయితే,ఇలాటి పల్లెటూరికి ఆమె భర్తతో కాపురం చేయడానికి వచ్చింది. ఈ కుగ్రామం చేరటానికి ఆ రోజుల్లో సరైన ప్రయాణసౌకర్యాలు కూడా ఉండేవికావు. ఇటువంటిచోట ఆమె కాపురం చేయాలంటే ఎంత మనో నిబ్బరం ఉండాలో ఆలోచించండి. ఎంతో విశాలభావాలు, చాకచక్యం, సర్దుకుపోగల స్వభావం, ఓర్పు, నేర్పు ఉంటేకాని ఆ కాపురం సజావుగా సాగి ఉండేది కాదు. మా అమ్మ తనతో పాటు హార్మోనియం పెట్టె మరో పెట్టెనిండా ఇస్త్రీ బట్టలు తెచ్చుకొని ఉండడం సహజమేకదా. ఇంట్లో పెద్దలు, అందునా కిందటి తరానికి చెందిన వితంతువులు ఇవన్నీ ఎప్పుడూ చూసివేలు ఉండరు. వాళ్ళు ముక్కు మీద వేలు వేసుకోవడంలో కూడా ఆశ్చర్యం ఉండదేమో. పునిస్త్రీలు కాని మా అత్తయ్యలు, ఇంట్లో అధికారమంతా వాళ్ళదేకదా, 'ఒరే సుబ్బయ్యా! బోగందానిలా హార్మోనీ పెట్టె, ఇస్త్రీబట్టలు, ఇదేం కాపురం చేస్తుందిరా' అని బుగ్గలు నొక్కుకుంటూ ఉంటే మా అమ్మ పాపం ఎంత బాధపడిఉంటుందో,

కుమిలిపోయి ఉంటుందో ఊహించు కోవాల్సిందే. ఎంత సహనంతో, నిగ్రహంతో, నిబ్బరంతో అందరినీ ఆకట్టుకుని అక్కడ ఇమిడిపోగలిగిందో తలచుకొంటే చాలా ఆశ్చర్యం వేస్తుంది. ఆ పరిస్థితిలో మా అమ్మకు మా కాముడక్కయ్య అండదండలు, సలహా సంప్రదింపులు, ప్రేమాభిమానాలు పుష్కలంగా లభించి ఉంటాయనడంలో సందేహంలేదు.

## కొత్త కాపురంలో కోడలు చేసిన తమాషాలు

ఈ దేశంలో స్త్రీకి అత్తిల్లే సర్వస్వంకదా. అదే మోక్షమూ స్వర్గమూ. అది వినా ఏదీ లేదు. బహుశా మా అమ్మ కాపురానికి వచ్చేటప్పటికి ఏ పదిహేనేళ్ళదో అయి ఉంటుందామో అని ఇదివరకే చెప్పాను. ఇంతలోనే నేను పుట్టాను. మా అమ్మ జనన సంవత్సరం 1900 కావచ్చునని ఇదివరలోనే నిర్ధారించాను. నేను 1915వ సంవత్సరంలో పుట్టాను. అంతకు పూర్వమే రెండు సంవత్సరాలో, మూడుసంవత్సరాల కిందటో వివాహమై ఉంటుంది. అప్పట్లో ఆడపిల్లలు పెద్దమనిషి కాకముందే, వివాహాలు చేసేవాళ్ళు. పెళ్ళయిన తర్వాత రెండు మూడేళ్ళు తాను మెట్టబోయే అత్తవారిల్లు గురించి సహజంగానే ఆమె కలలుగని ఉంటుంది. కేతనకొండలో అమ్మ కాపురానికి దావడానికి ముందు మా నాన్నగారే ఆయన అత్తవారింటికి చదువునిమిత్తం చేరిన సంగతి ఇదివరలోనే ప్రస్తావించుకున్నాము. మా నాన్నగారే కాపురానికి అత్తవారింటికి వెళ్ళటమేమిటి అంటే అదంతా ఒక పెద్ద కథ! ఏదిఏమైనా భార్యభర్తలు కాపురం చేయడానికి ముందు ఆ రోజుల్లో ఒక శుభకార్యం జరిపేవారు. దాన్ని ఔపాసన కార్యక్రమం అనేవాళ్ళు. అంటే పెళ్ళినాటి పవిత్రాగ్నిని తిరిగి అనుసంధానం చేయడమన్నమాట. దీనికి కూడా ఆ రోజుల్లో మంత్రతంత్రాల వైదిక కార్యకలాపం ఉండేది. ఆ తరం చాదస్తాలు ఇప్పుడుండే అవకాశం లేదుకదా. యుక్తవయస్సు వచ్చి, విద్యావంతులైన తర్వాతనే ఇప్పుడు మగపిల్లలకు గాని ఆడపిల్లలకు గాని పెళ్ళిళ్ళు జరుగుతున్నాయి. అందువల్ల ఆనాటి శోభనమనే తంతు క్రమంగా రద్దయిపోయిందనే చెప్పాలి. అందువల్ల ఈ తరంవారికి ఆనాటి ఔపాసన కార్యక్రమం ఒక ప్రహసనం లాగానే ఉంటుంది. నిజంగా మా నాన్నగారి విషయంలో అటువంటి ప్రహసనమే జరిగింది. అదేమిటో చెప్పుకుందాం.

## దుర్గయ్య, కుటుంబయ్య బావలు

కుటుంబంలో ఎంత మంది పిల్లలున్నా నిర్వహణ బాధ్యత పెద్దకొడుకు భుజస్కంధాలమీదే పడుతుంది. ఆఖరువాడు అందరిలోకీ చిన్నవాడూ, ఆషామాషీగా తిరిగినా అతడిని ఎవరూ ఏమీ అనరు. పైగా వాడు చిన్నవాడని అందరూ సమర్థిస్తారు. ఎందుకోగాని సాధారణంగా సంసారాలలో ఈ పరిస్థితి కనిపిస్తుంది. చిన్నవాడు కొంత రికామీగా ఉంటాడు. పేదా –పెద్ద, బీదా బిక్కీ అన్న వ్యత్యాసం లేకుండా కుటుంబాలలో ఈ లక్షణం కనపడుతుంది. ఇదంతా జన్యు శాస్త్రం ద్వారా కాని తెలియదేమో. జీన్స్‌ను బట్టి ఈ విధంగా కుటుంబంలోని సంతానప్రవర్తన ఆధారపడి ఉంటుందని చెప్పవచ్చు.

అయితే కుటుంబవాతావరణమూ, పరిస్థితులూ బొత్తిగా తీసివేయాల్సినవేమీ కావు. పిల్లల ప్రవర్తనపై ఆ కుటుంబ వాతావరణం, పరిసర ప్రభావం తప్పక పనిచేస్తాయి. అయితే సహజంగా ఆ వ్యక్తిలోనే అటువంటి ప్రవృత్తి అంతరికంగా ఉండి ఉండాలి.దానికి ముద్దు పెంపకం కూడా దోహదం చేస్తుంది. అందుకే మన బంగారం మంచిది కావాలికాని అనే సామెత పుట్టి ఉంటుంది.

## పెంపుడు కొడుకు కుటుంబయ్య బావ గారాబాలు

మా ఇద్దరు బావలలో రెండోవాడైన కుటుంబయ్య బావను మా తిరుమలమ్మత్తయ్య పెంపుడు తీసుకుంది. అంటే కేతనకొండలోని సంసారానికి పునాది అయిన కొటికలపూడి తిరుమలమ్మగారి ఆస్తికంతకూ కుటుంబయ్య బావ లీగల్‌గా వారసుడైనాడు. అయినా ఆస్తిపాస్తుల అజమాయిషీ అంతా మా కిష్టయ్య మామయ్య చేతిలోనే వుండేది. తరువాత తరువాత అన్నదమ్ములు పెద్దవాళ్ళైన తర్వాత మా దుర్గయ్య బావే వ్యవహారాలన్నీ చూస్తూ వుండేవాడు.

ఈ అన్నదమ్ముల్లో చిన్నవాడైన మా కుటుంబయ్య బావ అల్లరి తమాషాగా వుండేది. అతడికి కోపం ఎక్కువ. కోపం వచ్చిందా ఏ వెండిగిన్నెనో తీసుకొని వెళ్ళి రోటిలోవేసి రోకటిబండతో చితక గొట్టేవాడు. లేకపోతే ఒక చిన్న 'నవారుపట్టె' గోచీగా పెట్టుకుని తిరిగేవాడు. రోజూ ఏదో ఒక కారణం వుండేది మా బావకు అల్లరి చేయడానికి. ఇవాళ సైకిల్ కొనాలంటే కొనాల్సిందే.

లేకపోతే ఆ రోజున పెంపుడు తండ్రి తద్దినం అయిందనుకోండి. సైకిలు కొనకపోతే ఇదిగో ఇదిగో చద్దన్నం తింటానని బెదిరించేవాడు. మరి యీాయన తద్దినం పెట్టకపోతే తిరుమలమ్మగారి భర్తకు దేవలోకంలో భోజన సదుపాయం హరించుకొని పోతుందనే నమ్మకం వుండేది కదా. తద్దినం నాడు ఏమీ తినకుండా దీక్షతో ఆ పని అయిందాకా ఉపవాసంతో పెట్టాలికదా! ఈ సుపుత్రుడు కాస్తా చద్దన్నం తింటే ఎలా? అందువల్ల సైకిలు తప్పకకొని పెడతామని వాగ్దానం చేసేవారు. అట్లా కొనిపెట్టేరు కూడా.

మా కుటుంబయ్య బావ గారాబాన్ని గురించి రాయడంలో ఉద్దేశం ఏమంటే ఇలాంటి పుత్రులు అనేక కుటుంబాలలో ఉండవచ్చు. ఇట్లా గారాబం, మంకు పట్టు వాళ్ళలోనూ ఉండవచ్చు. ఇప్పుడు నేను ఒక కుటుంబ కథనే చెపుతున్నాను. కాబట్టే పిల్లల గారాబపు వింత ప్రవృత్తులు తెలియచేయటం కూడా నా ధ్యేయం. అయితే ఇలా గారాబంగా పెరిగిన మా బావలాంటి వాళ్ళు కూడా పెద్దవాళ్ళైన తర్వాత ఏ రకమైన ఎగుడుదిగుడు ప్రవర్తన లేకుండా కుటుంబవ్యవహారాలను, తమ వ్యక్తిగత విషయాలను జాగ్రత్తగా నిర్వహించుకోవటం కద్దు. మా బావకూడా అలా ఎంతో మారిపోయినాడు. పెద్ద వాడైన తర్వాత మా కుటుంబయ్య బావ స్వార్థ దృష్టి లేకుండా అందరితో కలిసి మెలసి ఉండేవాడు. హాస్యప్రియుడిగా ప్రేమాభిమానపూరితుడిగా పేరు తెచ్చుకున్నాడు. ఇలా చిన్నప్పుడు తెలిసిన వ్యక్తి పెద్దయిన తర్వాత ఎటువంటి వ్యక్తిత్వం రూపొందించుకున్నాడో గమనించడం ఆసక్తికరంగా ఉంటుంది. 30, 40 ఏళ్ళ జీవితానుభవంలో ఆ వ్యక్తి ఎలా వ్యవహర్తగా రూపుదిద్దుకున్నాడో గమనించటం ఒక కథలో పాత్ర చిత్రణలో క్రమోన్మీలనం చదువుతున్నట్లు ఆనందిస్తాం. ఇలాటి సంఘటనలే ఎక్కడైనా కంటపడితే ఈ పిల్లలు కూడా పెద్దవాళ్ళైన తర్వాత ఎలా మారిపోతారో అనే ఉత్కంఠ కూడా కలుగుతుంది.

## మా నాన్నగారు, కుటుంబయ్య బావల అనుబంధం

మా నాన్నగారు కుటుంబయ్య బావకు స్వయానా మేనమామే కదా! మా నాన్నకన్నా కుటుంబయ్య బావ కొంచెం చిన్న. వీళ్ళిద్దరూ చదువుకోవటానికి బెజవాడలో ఒక గది తీసుకుని ఉండేవారు. ఇక తరువాత తరువాత అందరి

చదువులకోసం కేతనకొండ నుంచి వచ్చి బెజవాడలో కాపురం పెట్టటం జరిగింది. ముందర వీళ్ళిద్దరే బెజవాడలో ఉండడంవల్ల ఒక గది తీసుకుని హొటల్ భోజనం చేస్తూ చదువుకునేవారు.

స్కూలు నుంచి రాగానే మా బావ నిద్రపోయేవాడు. ఆయన గారాబం గురించి చెప్పానుకదా! మా నాన్నగారు ఇద్దరిలోకి పెద్దవారు కావడంచేత కుటుంబయ్య బావను లేపి భోజనానికి తీసుకొనివెళ్ళే బాధ్యత మా నాన్నగారిమీద ఉండేది. అయితే ఈ గారాబాల బిడ్డ ఎంతసేపు లేపినా నిద్రలేచేవాడు కాడట. మా నాన్నగారికి విసుగ్గా ఉండేది ఇలాంటప్పుడు. ఒక రోజు మా నాన్నగారు వీడి రోగం కుదర్చాలని ఎంతసేపు లేపినా లేవకపొయ్యేటప్పటికి ఒంటరిగానే వెళ్ళి భోజనం ముగించుకుని వచ్చి పడుకున్నారు. బాగా పొద్దుపోయిన తర్వాత మా బావకు మెలుకువ వచ్చింది. కడుపులో ఎలకలు పరిగెత్తి ఉంటాయి. అప్పటికి హొటళ్ళు కట్టేసి ఉంటారు. ఆకలితో ఆవురుమంటూ ఆ పూటకు పస్తు పడుకోవాల్సి వచ్చింది. అంతే కాక గారాబపు బిడ్డలు బాధ ఓర్చుకోలేరు కూడాను. కాని ఏం చేస్తాడు? మా బావ పేరు కుటుంబరావు అయినా ఇంట్లో కుటుంబయ్య అని పిలిచేవారు.

ఆనాటి నుంచి గారాబాం గీరాబం టక్కున కుదిరింది బావకు. ఇక అవాళ్టినుంచి కుటుంబయ్య ఎంత నిద్రలో ఉన్న భోజనం వేళకు మా నాన్నగారు ఒకటి రెండు సార్లు పిలిస్తేనే చాలు లేచి హడావిడిగా తయారయ్యేవాడు. తర్వాత తర్వాత మా నాన్న హాస్యంగా చెపుతూ ఉండేవాడు ఈ ఉదంతం. కుటుంబయ్య అని పూర్తిగా పలకక ముందే కు.....అనేటప్పటికే ఒక్క ఉదుటున లేచి కూచునే వాడని పరిహాసంగా చెప్పేవారు. ఆ ఒక్క పూట పస్తుతో బావరోగం భేషుగ్గా కుదిరి ఎంత మత్తులో ఉన్నా గమ్మత్తుగా భోజనానికి నా వెంట తయారయ్యేవాడని కథలాగా చెపుతుండేవారు మా నాన్నగారు.

## చిన్నాం, పెద్దాం

మా నాన్న వాళ్ళు ఇద్దరన్నదమ్ములు, మా నాన్నే చిన్నవారు. వీళ్ళిద్దరూ కుటుంబయ్య బావకు మేనమామలు. ఈ ఇద్దరు మేనమామలను మామయ్య అనకుండా 'చిన్నాం' 'పెద్దాం' అని ఆపేక్షగా ముద్దుగా ప్రేమగా పిలిచేవారు

మేనల్లుళ్ళు. అందరికీ నవ్వొచ్చే, ముచ్చట గొలిపే ఒక సంఘటన జరిగింది- కుటుంబయ్య కథానాయకుడిగానే. అప్పటికీ పిల్లల చదువుల కోసం కేతనకొండ వారంతా బెజవాడలో కాపరం పెట్టటం జరిగింది. మా పెదనాన్నగారు కూడా అక్కడే తాలూకాఫీసులో గుమాస్తాగా చేరారు. కుటుంబంలో ఆయనే పెద్ద మేనమామ కావడంవల్ల అక్కడి ఇంటి వ్యవహారాలన్నీ చూస్తూ ఉండేవారు.

ఒకరోజు మా కుటుంబయ్య బావకు కోపం రానే వచ్చింది. ఇక తన మామూలు ధోరణిలోనే కాలువలో పడి చస్తా, నే చస్తానని శివాలెత్తేవాడు. అది కుటుంబం వాళ్ళను బెదిరించడమన్నమాట. మా బావకు కోపం వచ్చిందా ఇంట్లో వారంతా గాభరాపడుతూ ఉండేవారు. ఇంతలో మా పెదనాన్నగారు వచ్చి ఈ కథంతా విన్నారు. అప్పుడాయన కుటుంబయ్యను చరచర ఏలూరు కాలువదాకా తీసుకొనిపోయి కాలువలో దించి 'చావరా వెధవ' అంటూ బావ బుర్రను పదిసార్లు లోతుకాలవలో గట్టిగా ముంచేటప్పటికి బావ గాభరాపడిపోయి ఇహమీద ఆ మాట అనను అని ఏడ్చాడుట. ఇక అప్పటి నుంచి కుటుంబయ్య బావ మరెప్పుడూ 'చస్తానని' ఇంట్లోవాళ్ళను బెదరించడం మానేసి అణుకువగా ఉండేవాడుట. ఆనాటి నుంచి కుటుంబయ్య బావకు పెద్దాం అంటే చచ్చే హడల్‌గా ఉండేదని చెప్పుకునేవారు. కుటుంబంలో అందరికన్నా చిన్నవాళ్ళు కొంచెం గారాబం చేయడం సహజమేకాని మరీ ఇట్లా ముదురుపాకంలోకి దిగకూడదు. అందుకే కాబోలు 'గారాబం గజ్జెల కేడిస్తే, వీపు దెబ్బలకేడ్చింది' అనే సామెత పుట్టింది. ఈ సామెత మా కుటుంబయ్య బావకు చక్కగా వర్తిస్తుంది.

## దుర్గయ్య బావ కథ

దుర్గయ్య బావ పేరు అసలు దుర్గాప్రసాదరావు. అయితే అంతా దుర్గయ్య అనే పిలిచేవారు. ఇద్దరన్నదమ్ములలో అంటే దుర్గయ్య, కుటుంబయ్యలలో దుర్గయ్య బావ సమర్థుడు. వ్యవహర్త. మూడు వూళ్ళ కరణీకం, కొటికలపూడి, కేతనకొండ, మూలపాడు కరణీకాలు ఆయనే అజమాయిషీ చేసేవాడు. వల్లూరు జమీందారుకీ దుర్గయ్య బావకీ పెద్ద దోస్తీ. వల్లూరు జమీందారుకు దుర్గయ్య బావ

పెద్ద సలహాదారు. ఆ జమీందారుగారిది అదొక పెద్దకథ. అయితే ఆ జమీందారుకి సలహాదారుడిగా సన్నిహితుడిగా ఉండి మా బావ నాలుగయిదు వందల యకరాల అడవి స్వంతానికి సంపాదించుకున్నాడు. తిరుమలమ్మత్తయ్య ఆస్తిని ఆధారంచేసుకొని చాలా పొలాలు కొని కుటుంబానికి బాగా ఆర్థిక స్తోమత పెంచి బాగా స్థితిమంతులైన కుటుంబాలలో ఒకడిగా బంధువర్గంలో రాణించాడు. ఇల్లు ఎంత లక్ష్మీప్రసన్నంగా ఉండేదంటే ఇంట్లో మా మేనత్త రత్తమ్మగారు 'రాణీకాసులు' దొంతరలుగా లెక్కపెట్టి పెట్టెలో పెట్టుకొనేది.

నాటికీ నేటికీ భారతదేశంలోని కుటుంబ ఆచారం ప్రకారంగాని, అంచనాల ప్రకారంగా గాని, అంతర్జాతీయ ప్రమాణాలను పట్టిగాని, బంగారం ఎంత ఉన్నదనేది ముఖ్యమైన ప్రశ్న. తరవాతనే తక్కిన ప్రశ్నలన్నీను. ఆ రోజుల్లో కుటుంబ స్త్రీలకు నగలమీద మోజు ఎక్కువగానే ఉండేది. ఒక కంటె, కాసులపేరు, నడుముకు మామూలు ఒడ్డాణం, అదికాక గజ్జెలఒడ్డాణం, చేతికి దండకడియాలు, మెళ్ళో జిగినీ గొలుసు, కొప్పులో 'నాగరం' కాక ఇంకా బంగారం మీద మోజువుండి కలవారు భరించగలవారు బంగారపు జడ కూడా చేయించుకొనేవారు. జడ పొడుగునా ఇంకా అలంకారాలు కూడా ఉండేవి. బంగారపు జడను నేను మొదటిసారిగా మా మేనమామ భార్య దగ్గరే చూశాను ఆమె రేలంగి కరణంగారి కూతురు. వాళ్ళింట్లో ఆడపిల్లలందరికీ బంగారపు జడ లుండేవి. ఇహ ఇంటిలో వెండి సామాను విషయం లెక్ఖలేదు. అయితే ఈ రోజుల్లో ఈ నగలుండనే ఉండవు. ఉన్నా బ్యాంకులో ఉంచాల్సిందే. రోజూ వాడుకోవడానికి గాని, వాటికి కాపలా కాయడానికి గాని ఇంట్లో మనుషులేరీ మరి? భార్యాభర్తలు ఉద్యోగంలో ఇంట్లో ఉండరు. మూడున్నర ఏళ్ళ పిల్లకూడా కాన్వెంటుకు పోతుంది. ఇహ ఇల్లు చూసేదెవరూ? మా మేనమామ కలపటపు రామగోపాలరావు ఢిల్లీ కాపురంలో యీ బంగారపు నగలన్నీ ఎప్పుడూ ఒక అల్మారాలో పెట్టి తాళం వేసేవాడు. వాళ్ళింట్లో ఒక కుర్రవాడు అయిదారేళ్ళుగా పనిచేస్తూ ఎంతో నమ్మకంగా ఉండేవాడు. వాడు ఒక మంచి రోజు చూసి ఇంట్లో ఎవరూ లేనప్పుడు మారు తాళంచెవితో తాళంతీసి ఆ బంగారు నగలన్నీ మా అత్తయ్య బంగారుజడతో సహా ఎత్తుకొని పలాయన మంత్రం పఠించాడు. ఇంతవరకూ జాడలేదు. మా మేనమామ, అత్తయ్య కాలగర్భంలో

కలిసిపోయారు. అందుచేత నమ్మకం ఉంచకూడదని పనివాళ్ళు, తీరుబడిలేని జీవితాలుగా పరిణమించిన తర్వాత ఈ నగలూ నాణాలు జీవితానికి భూషణం కాకపోగా ప్రాణాంతకం కూడా అవుతాయని గ్రహించాలి.

అయితే మా దుర్గయ్య బావ హయాంలో ఆ కుటుంబమంతా ఎంతో సిరిసంపదలతో తులతూగుతూ ఉండేది. ఆ రోజుల్లో బంగారం కూడా ఎంతో చౌకగా ఉండేది. 13, 14 రూపాయలకు ఒక కాసు బంగారం వచ్చేది. అప్పటి రూపాయలన్నీ వెండివి. నూటికి నూరుపాళ్ళు అవి వెండి రూపాయలు. ఇప్పుడు పావలా ఎత్తుకూడా వెండిలేదు వాటిలో. దీనినే డివేల్యుయేషన్, విలువ పడిపోవటం అనవచ్చు. అప్పటి రోజుల్లో బంగారం కాసులు విక్టోరియా రాణి బొమ్మముద్రతో ఉండేవి.అందువల్ల ఈ కాసులను రాణీకాసులు అనేవారు. ఇప్పుడు రాణీలు లేరు, కాసులు లేవు. ఇంట్లో బంగారం ఉండటమే అపరూపమై పోయింది. అదృష్టవంతులకెవరికైనా ఉన్నా అది బ్యాంకు లాకర్లలో ఉండాల్సిందే. స్త్రీలకు మెడలో ఒక్క మంగళసూత్రపు తాడున్నా దాని విలువకూడా వేలల్లో ఉండటం చేత దాన్ని కూడా తెంపుకొని పోయే దొంగలు తయారైనారు. భద్రత అనేది బొత్తిగా లేని కాలమైంది ఈ కాలం. కాబట్టి ఈ తరంవారు బంగారం నగల సంగతి మరచిపోవాల్సిందే. గిల్టు నగలు లేదా కృత్రిమ ముత్యాలతో సంతృప్తి పడాల్సిందే. గొప్పవారు ఏం పెట్టుకొన్నా అవి ఖరీదు అయినవేనని భావించవచ్చు. దొంగలు కూడా అట్లా భ్రాంతి పడవచ్చు. ఇప్పుడు నగల విలువకాని, నాణ్యతకాని, వాటి వైభోగంకాని ఎవరికీ తెలియవు. అసలు వాటి అసలు స్వరూపం కూడా ఇప్పుడు తెలుసుకోలేని కాలం వచ్చింది. ఒక శ్రీమంతుడి భార్య, భాగ్యవంతురాలు మాతో ఒకసారి యాత్రలలో కలిసింది. ఆవిడ చేతినిండా చాలా బంగారపు గాజాలున్నాయి. వాటిని చూసి ఎందుకండీ యాత్రలకు కూడా ఇన్ని గాజులు వేసుకొని వచ్చారని అడిగాము. అబ్బే అవి వెండిమీద పూతలెండి, బంగారపువి కావు అంటే ఆశ్చర్యంవేసింది.

ఈ విధంగా ఇప్పుడీ కాలంలో నగల అవసరమూ, ప్రీతి లేకుండా పోయాయి. ఆ రోజుల్లో రోజూ స్నానం అయిన తర్వాత పిల్లలు కూడా రోజూ ఈ నగలన్నీ ధరించి ఇంట్లో తిరుగుతుంటే లక్ష్మి తాండవించినట్లుండేది ఇంట్లో. ఇహ ఆ రోజులు మళ్ళీరావేమో! మా దుర్గయ్య బావ పుణ్యమా అని ఆ రోజుల బంగారపు నగలనైనా ఇప్పుడు తలచుకొన్నాం.

## దుర్గయ్య బావ స్వభావం

మా దుర్గయ్య బావ ఎంత సమర్థుడో శక్తిసంపన్నుడో అంత చురుకుపాలు, కోపంకూడా ఉండేవి. పెద్దయిన తర్వాత ఆస్తి పంపకాలలో అన్నదమ్ములిద్దరికీ మనస్పర్థలు వచ్చాయి. ఈ ఆస్తి అంతా నా సమర్థత వల్లే వచ్చిందని దుర్గయ్యగారూ, ఈ ఆస్తికి మూలం నా పెంపుడు తల్లి ఆస్తియే కదా లేకపోతే మిగతా ఆస్తి ఎక్కడిదని కుటుంబయ్యగారు ఘర్షణ పడ్డట్లు విన్నాం. అయితే పంపకాలు చేసుకున్నారు. విడిపడ్డారు. కాలగర్భంలో కలసిపోయారు. వారి కథలు మాత్రం సామాజిక పరిణామాలకు తార్కాణాలుగా నిలిచి పోయాయి.

## దుర్గయ్య బావ కుటుంబం

వెండిగిన్నె ప్రహసనం –తల్లి మమకారం కూతుళ్ళ మీదే! మన హైందవ సంప్రదాయంలో కూతుళ్ళకూ కొడుకులకూ సమానమైన వాటా ఆస్తిపాస్తులలో లేకపోవటం వల్ల తల్లిపేర ఏదైనా ఆస్తి, ఉన్నా లేదా ఆవిడ పుట్టింటివారు ఆమెకు ఏదైనా ఆస్తి ఇచ్చినా అటువంటి ఆస్తిని 'స్త్రీధనం' అనేవాళ్ళు. అటువంటి ఆస్తి అంతా కూతుళ్ళకే పోతుంది తల్లి వీలునామా వ్రాయని పక్షంలో. ఆవిడ ఇష్టానుసారం చేసుకోవచ్చు తన ఆస్తిని. భర్తకు ఎంత ఆస్తి ఉన్నా ఆయన పోతే భార్యకు 'మనువర్తి' హక్కు మాత్రమే ఉండేది ఇదివరలోనైతే. భర్త బతికి ఉన్నంతకాలం జమీందారిణిలాగా భర్తతోపాటే వైభవంగా, చేతికి అడ్డంలేకుండా బతికిన భార్య, వితంతువవగానే 'మనువర్తి'కి మాత్రమే నోచుకొని ఎంతో ఖేదం పాలవటం జరిగేది. లేదా అత్తింటిలోనే ఇమిడిపోయే అవకాశం ఉండేది. పిల్లలు లేకపోతే అత్తింటినే ఆధారం చేసుకొని బతికేదామె తాను అలా ఉండాలనుకొంటే. అయితే మనకు స్వతంత్రం వచ్చిన తర్వాత స్త్రీలకు కూడా ఎన్నో హక్కులు వచ్చాయి కాని ఇంకా సర్వసమానత్వ చట్టం మాత్రం రాలేదు. ఇది మన రాజకీయ నాయకులలో ఉన్న ప్రగతి విరోధక దృక్పథమనే చెప్పాలి. పూర్వాచార పరాయణత యథాతథ స్థితి అభిలాష అని చెప్పాలి. కాని కాలం ఎన్నో మార్పులు తెచ్చినట్లే తెస్తున్నట్లే స్త్రీలకు సర్వసమానత్వాన్ని కూడా తెస్తుందనే ఆశిద్దాం. చట్టప్రకారం ఆస్తిపాస్తులకు మహిళ కూడా సమాన వారసురాలవుతుందనే ఆకాంక్షిద్దాం.

బహుశా వెనకటి కాలంలో తల్లికి కూతుళ్ళమీద ప్రత్యేకాభిమానం ఉండటానికి ఇది కూడా ఒక అదనపు కారణమై ఉండాలి. కూతురు నిచ్చిన చోట వాళ్ళు ఎంత కలవారైనా తల్లి బాహాటంగానే గానీ లేదా చాటుమాటుగా కాని కూతుళ్ళకు ఏదో ముట్టచెప్పాలని ఆశ పడుతుండేది ఆ రోజుల్లో. ఈ మానసిక ప్రవృత్తికి అనుగుణంగా మా మేనత్తగారింట్లో ఒక చిన్న సంఘటన జరిగింది. మా రెండవ మేనత్త రత్తమ్మగారు ఇంటికంతా అధికారే కదా! ఒక రోజు ఆవిడకు తన ఏకైక పుత్రిక అయిన మా రాజాయ్ వదినకు ఒక వెండి గిన్నె పంపుదామని కోరిక కలిగింది. అట్లా చేస్తే ఇంట్లో ఉన్న కోడళ్ళు ఏమైనా అనుకుంటారేమోనని ఇంటి చాకలిని పిలిచి ఒక గుడ్డలో ఒక వెండిగిన్నె మూటగట్టి ఆ చాకలికిచ్చి రహస్యంగా పరిమి వెళ్ళి మా వదినకిచ్చి రమ్మని పురమాయించింది. చాకలి యీ చిన్న రహస్యపు మూటను తీసుకొని వెళుతుంటే మా దుర్గయ్య బావ కంటపడ్డది. ఏమిటిరా అది అని ఆయన అడిగితే చాకలి 'పెద్దమ్మగారు ఈ గిన్నె రహస్యంగా తీసుకొని పోయి పరిమి అమ్మాయిగోరికి ఇమ్మన్నారండీ' అని చెప్పాడు. అప్పుడు మా దుర్గయ్య బావ నవ్వుతూ తల్లి దగ్గరకు వచ్చి 'అమ్మా ఇలా ఈ వెండిగిన్నె రహస్యంగా ఎందుకే పంపటం, నీవు పంపుతానంటే ఎవరు వద్దంటారు. పోనీ రాజాయి వాళ్ళు ఏమైనా లేనివాళ్ళా? ఇలా రహస్యంగా పంపిన వస్తువు ఎవరైనా కొట్టేస్తే లేదా దారిలో పోతే దాన్ని ఆరా తీయటం ఎలా' అని అమ్మను కసురుకున్నాడు. మా రత్తమ్మత్తయ్య సమర్థించుకోవటానికి తంటాలు పడింది. ఇదీ ఆనాటి వెండిగిన్నె ప్రహసనం!

# XVI

# ఆనాటి జమీందార్లు

## ZAMINDARS OF THOSE DAYS

"Valluru Zamindar". was a lover of dogs and was known 'Kukkala Rajah.' Experiences with Zamindars. The parading of a Big Tiger in cage caught by the Zamindar. Hunting was a hobby of the rich people, now prohibited .

మా దుర్గయ్య బావ జమీందారీ ఫాయిదాలో జీవితం గడిపేవాడని చెప్పాను కదా. దానికి కారణం ఆయనకు వల్లూరి జమీందారుగారితో గల స్నేహమే. జమీందార్ల హోదాలు నశించిన ప్రస్తుతకాలంలో ఈ తరం వారికి వారి జీవిత విశేషాలు తెలియవు. ఆ రోజులలో జమీందారీలు చట్టరీత్యా రద్దుకాక మునుపు ఆ జమీందార్ల అసలు పేర్లు ఎవరికీ తెలిసేవి కావు. వాళ్ళ సంస్థానాలను బట్టి ఊరిపేర్లను బట్టి నూజివీడు జమీందారు, ఉయ్యూరు రాజావారు, పిఠాపురం మహారాజావారు, చల్లపల్లి జమీందారుగారు, విజయనగరం మహారాజావారు అని

ప్రజలు వారిని గూర్చి వ్యవహరించేవారు. జమీందార్ అంటే శ్రీమంతుడనీ, భోగపురుషుడు అనీ హోదాగల అధికారి అనీ భావన ఆ రోజుల్లో ఉండేది. అంచేత ఈ విశేషణాలన్నిటికీ తార్కాణగా వాళ్ళు చెలామణి అవుతుండేవారు. వారిని ఆశ్రయించుకొని జీవించేవారు కూడా చాలామంది ఉండేవారు.

వల్లూరు జమీందారీ చిన్నదయినా ఆ జమీందారుకి చాలా పేరుండేది. ఈయన తర్వాత అతి దరిద్రం అనుభవించి బెజవాడ వీధి అరుగుల మీద కూడా పడుకున్నట్లు ప్రజలు చెప్పుకునేవారు. అప్పట్లో జమీందారులలో చాలామంది ఉదారులుగా కూడా ఉండేవారు. కళాపోషణ, ధార్మికబుద్ధి, ప్రజాహిత కార్యతత్పరత కూడా వాళ్ళలో ఉండేవి. ప్రజలు మెప్పు పొందేటందుకై అనేక సాంఘిక కార్యక్రమాలలో కూడా వారు పాల్గొనేవారు. మంచి పరిపాలకులని పేరు తెచ్చుకున్నవాళ్ళు కూడా ఉన్నారు. దైవభక్తి, కవిపండితపోషణ, దేవాలయోద్ధరణ, జాతీయోద్యమాభిమానంలో కూడా పేరు తెచ్చుకున్నారు కొందరు. రాజకీయ నాయకులు రైతునాయకులూ ఉండేవారు. ఆంధ్రులలో అటువంటి శ్రీమంతులలో శ్రీ ఎన్.జి.రంగా గారొకరు. దేశంలోనే రైతుకూలీ హక్కుల ఉద్యమాలు నడిపినవారిలో ఆయన అగ్రగణ్యుడు. కురువృద్ధులైన నాయకులలో 50 ఏళ్ల పార్లమెంటు సభ్యులుగా దేశసేవచేశారు.

1937 లో మొదటి కాంగ్రెసు ప్రభుత్వాలు పనిచేసినప్పటినుంచీ జమీందారీ రద్దుకు ప్రయత్నిస్తూనే వచ్చారు. మద్రాసు రాష్ట్రంలో ప్రకాశంగారు రెవెన్యూ మంత్రిగా జమీందారీ రద్దు చట్టానికి చాలా కృషిచేశారు. స్వరాజ్యం వచ్చిన తర్వాత దక్షిణాది రాష్ట్రాల జమీందారీలు ఉత్తరాదిన ఉన్న తాలూకాదారీలు అన్నీ రద్దయి, రైతులకు భూములమీద సర్వహక్కులు సంక్రమించినాయి. అంతకు ముందు రైతులు కౌలుకు తీసుకుని దున్నుకునే హక్కు తప్ప అమ్ముకునే హక్కు అసలు ఉండేది కాదు. భూసంస్కరణలలో జమీందారీ రద్దుచట్టం ఒక ముఖ్యఘట్టం అని చెప్పాలి. తరవాత స్వతంత్ర సంస్థానాలు కూడా రద్దయినాయి. సంస్థానాధీశులు కూడా జాతీయ జీవనస్రవంతిలో కలసి పోయినారు. వాళ్ళకు కూడా సామాన్య పౌరహక్కులే వర్తించాయి.

ఆనాటి రాజులు, జమీందారులు నేడు పారిశ్రామికవేత్తలుగా రాజకీయనాయకులుగా వారి వారి అభిరుచులను అభిలాషలను బట్టి

మారిపోయారు. ఇది ప్రపంచంలోనే కనీ వినీ ఎరుగని పరిణామంగా విప్లవాత్మకమైన చర్యగా చరిత్రకారులు చిత్రించారు. ప్రపంచ చరిత్రలో ప్రజా విప్లవాలలో ధనిక వర్గాలను రాజులను శిరచ్ఛేదం చేసి తమ పగను ప్రజలు తీర్చుకొనేవారు. కాని మన స్వాతంత్ర్యోద్యమం శాంతియుతంగా గాంధీజీ నిర్వహించడం చేత ధనిక పారిశ్రామిక వర్గం ఈ విధంగా జనజీవన స్రవంతిలో కలిసిపోయే అవకాశం కలిగింది. ఇప్పుడిక 'జమీందారీ' అనే భావనాత్మక పదం మాత్రమే మిగిలిపోయింది. జమీందారులు కాలగర్భంలో కలసిపోయినారు.

వల్లూరి జమీందారీ చిన్నదైనా ఆయన జీవితం ఎలా పరిణమించిందో చూద్దాం. వల్లూరి రాజావారికి వేటకుక్కలంటే ఎంతో సరదా! అడవులలో వేట అంటే ఈయనకు ఎక్కడలేని ఉత్సాహం ఉండేది. దీనికోసం ఈయన వేట కుక్కలను నూర్లకొద్దీ విదేశాలనుంచి తెప్పించేవారు. వాటికి ప్రత్యేకపోషణ చేయించేవారు. ఈ కుక్కల ఖరీదు వేలరూపాయలలో ఉండేది. వాటన్నిటినీ వెంటేసుకుని అడవికి వేటకు వెళ్ళటం ఆయనకెంతో సరదాగా ఉండేది. అదే ఆయన జీవితాదర్శం. ఇన్ని వందలకుక్కలను వేలకొద్దీ రూపాయలు వెచ్చించి ఆ కుక్కలనే పంచప్రాణాలుగా భావించి ప్రేమించటం వల్లనే ఆయనకు 'కుక్కల రాజా'గారని పేరువచ్చింది. ఆయన దగ్గర సలహాదారుగా ఉండేవాడు మా దుర్గయ్య బావ. అందుచేత ఈయనకు కూడా కొంచెం జమీందారీ లక్షణాలు సంక్రమించాయి. ఇస్త్రీ చేసిన లాంగుకోటు, జేబుకు గడియారం, దానికో బంగారుగొలుసుండి అదో ఆభరణంగా ప్రకాశించేది. చేతిలో వెండి పొన్నుకర్రతో నడుస్తుంటే మా దుర్గయ్య బావ పిల్లజమీందారుగా ఉండేవాడు. ఈయన తమ్ముడు కుటుంబయ్య బావకు ఈ వేషభూషలేవీ ఉండేవి కావు. పేరు ప్రఖ్యాతులన్నీ మా దుర్గయ్య బావ ద్వారానే కొటికలపూడి వారి కుటుంబానికి సంక్రమించాయి.

మా బావ ఎప్పుడూ ఈ రాజాగారితో మద్రాసుకు ఫస్టుక్లాసులోనే ప్రయాణం చేసేవాడు. మిగతా మా కుటుంబీకుల కప్పుడు ఫస్టుక్లాసులో మెత్త ఎలా ఉంటుందో కూడా తెలియదు. సామాన్యులకు ఫస్టుక్లాసు ప్రయాణం అనూహ్యం. అందుచేత అప్పట్లో మా దుర్గయ్య బావ అలాంటి క్లాసులో ప్రయాణం చేసేవాడంటే మా అందరికీ గొప్పేకదా! ఈ ప్రయాణాలలో వారివెంట భోగంవారు కూడా ఉండేవారు. అంటే ఏమిటని ఈ కాలంవారు

అడగవచ్చు. ఆ రోజులలో ఈ వర్గానికి చెందినస్త్రీలు శృంగార కళలోనూ సంగీతం నాట్యంమొదలైన లలితకళలలోనూ నైపుణ్యం కలిగి ధనికవర్గాల యువకులకు వృద్ధులకు శరీర సుఖం చేకూరుస్తూ జీవితాలు సాగించేవారు. ఈ విధమైన కళావంతులైన స్త్రీలు తమకు సపర్యలు చేస్తుండగా దర్జాగా రైలు ప్రయాణాలు చేస్తుండేవారు రాజావారూ, ఆయన మిత్రుడు మా బావగారూ. మా బావ కూడా ఆ భోగం వారి సేవలు అందుకుంటూ ప్రయాణం సాగిస్తూ ఉంటే తమాషాగా ఉండేదని మాకు చెప్పేవాడు. అది వినటం మాకూ తమాషాగా ఉండేది.

## వల్లూరి రాజాగారివేట

జమీందార్లకు వేట ఒక పెద్ద వినోద కాలక్షేపంగా ఉండేది. ఒకసారి బెర్నార్డ్‌షా గారు చెప్పారు. ఈ ధనికవర్గాల వారు అంటే అరిస్టోక్రాట్స్ బలహీనులు అనుకో,బోకండి. వారు మంచి కసరత్తు చేస్తారు. దేహానికి ఆరోగ్యం, దారుఢ్యం ఇచ్చే గుర్రపు స్వారీలు కత్తిసాములు చేస్తారు. రోజూ వ్యాయామం చేస్తారు. దెబ్బలాడటానికి బలం ఉండదనుకోకండి. మహారాజులు కూడా మల్లవిద్యలో వ్యాయామంలో ఆరితేరి ఉంటారు. ఈ క్రీడలలో వేట ఒకటి. అది అప్పట్లో రాజులకు జమీందారులకు మంచి కాలక్షేపంగా ఉండేది. అలాగా వేటప్రియులలో వల్లూరి జమీందారుగారు కూడా ఒకరు.

కేతనకొండ, కొండపల్లి అటువైపు పెద్ద అడవులుండేవి. ఆ అడవులు వేల ఎకరాల విస్తీర్ణంతో జమీందార్ల సొంత హక్కులుగల భూములుగానే ఉండేవి. అందులో ఒక నాలుగువందల యకరాలు మా దుర్గయ్య బావ తనపేర పెట్టించుకున్నాడు. ఈ అడవులలో చెట్లు చేమలూ అమ్మటం వల్లనూ చెట్లు కొట్టి లేదా ఎండిన చెట్ల నుంచి బొగ్గులు తయారుచేసి డబ్బు సంపాదించేవారు.

అడవులను నాశనం చేయకూడదు అనేది నేటి నినాదం. వందలాది సంవత్సరాలుగా ఇప్పుడు సంభవించిన ఉపద్రవం చూడలేదు. ఇప్పుడు అడవులు త్వరత్వరగా బోసి పోతున్నవి. ఇంధనంకోసం, ఇళ్ళ కలపకోసం ఎన్నో వృక్షాలు నిర్మూల మవుతున్నాయి. చీమలు దూరని చిట్టడవులు కూడా పలచబారి పోతున్నాయి. వ్యవసాయంకోసం చెట్లు పడగొట్టి సేద్యపు భూములు

విస్తరిస్తున్నాం. మన భుక్తి కోసం పెద్ద నదులకు ఆనకట్టలు నిర్మిస్తే వేల ఎకరాలు మునిగిపోవటంతో అక్కడున్న వన్యమృగాలు కూడా నశించి పోతున్నాయి. ఇప్పట్లో మాదిరిగా కాకుండా అప్పటి రోజుల్లో అడవులు అడవులుగా ఊళ్ళు ఊళ్ళుగా ఉన్నరోజులవి. అందుచేత ఆ కేతనకొండ చుట్టుపక్కల అడవులు చిన్నవైనా ఆ అడవులలో పెద్ద పెద్ద పులులుండేవి. సింహాలు ఉండకపోయేవేమో! చిరుతపులులు, ఎలుగుబంట్లు సర్వసామాన్యంగా కన్పించేవి. అయితే పెద్దపులులు మాత్రం చాలా పెద్దవి ఉండేవి. పులివేట చాలా గొప్ప వేటగా అనితరసాధ్యమైన క్రీడగా పాశ్చాత్యులు భావించేవారు. జమీందార్లు, రాజులు కూడా అలానే భావించేవారు. వేట సంగతి అలా ఉంచండి. ఆ ప్రకృతి సౌందర్యం గురించి ఆలోచించండి. ఫలవృక్షాలు, పూలచెట్లు, ఎంతో విశాలంగా పచ్చదనం వ్యాపించిఉండేవి ఆ అడవులు.

అక్కడ ఉండే ప్రశాంత వాతావరణంలో ప్రవహించే వాగులు, ఉపనదులు, పెద్దనదులు అక్కడి ప్రకృతిని మరింత సౌందర్య దీప్తిమంతం చేస్తాయి. సూర్యోదయం, సూర్యాస్తమానం, చీకటి రాత్రులు, వెన్నెల రాత్రులు, ఎంతో శోభాయమానంగా వుంటాయి. అడవిలో అదొక దివ్యసౌందర్యం విరాజిల్లుతూ ఉంటుంది. పురుగుల పుట్టలు, పాములు, పక్షులు, వివిధరకాలైన జంతువులు అక్కడ నివసిస్తాయి. లేళ్ళు, ముంగిసలు, జింకలు, దుప్పులు ఒక ప్రకృతి లయ అక్కడ కనపడుతుంది. అందుకే బహుశా ముని ఆశ్రమాలు అడవులలో ఉండేవి పూర్వకాలంలో. మోక్షసాధనకు అడవులే అనుకూలంగా ఉండేవి. మునులు కూడా తమ సొంతానికి కాకుండా లోకసౌఖ్యంకోసమే తపస్సు చేసేవాళ్ళు. ఈ అరణ్య నాగరకత ఒకప్పుడు హిందూమతానికి గొప్ప శోభ చేకూర్చింది. ఋష్యాశ్రమాలు మానవకళ్యాణం కోసం నిరంతరం నిమగ్నమై ఉండేవి. మహారాజులు కూడా వేటకు వెళ్ళినప్పుడు ఈ మునుల ఆశ్రమాలు దర్శించు కొనేవారు. మునులు తమ తపస్సు ద్వారా రాజులను రక్షిస్తే మునులకు క్రూరమృగ బాధలేకుండా రాజులు వేటకు వెళ్ళి ఆ మృగాలను సంహరించేవారు.

అయితే ఆధునిక కాలంలో వేట పద్ధతులు మారి పోయినాయి. పల్లూరు రాజావారు ఎన్నోరకాలైన సీమకుక్కలను వేలరూపాయలు ఖర్చుచేసి తెప్పించేవారు. ప్రజాధనం దుర్వినియోగమై పోతున్నదే అని ఆయన

ఎంతమాత్రం అనుకొనేవారు కాదు. అందువల్ల ఆయన 'కుక్కల రాజా' అనే పేరు కూడా సంపాదించుకున్నారు. ఆయన సన్నిధానవర్తులు, సర్దారులు కూడా ఆయన వెంట ఉండేవారు.

వేటకు బయలుదేరడమంటే సామాన్యం కాదు. దానికి ఎంతో హంగామా ఉంది. దాన్ని ఒక ఉత్సవంలా నిర్వహించేవారు. డప్పులు వాయిస్తూ పరిచారకులు వెంట నడిచేవారు. వేటలో ఆరితేరినవారు రాజావారిని చుట్టుముట్టి ఉండేవారు. ఎక్కడైతే వేట శిబిరం ఏర్పాటు చేయాలో అక్కడ డేరాలతో, ఆహారపదార్థాలతో పరివారం సిద్ధంగా ఉండేది. ఆ వేట బృందానికి హుషారు కలిగించడానికి మద్యపానాలు కూడా ఉండేవి. ఇలాగా పులివేట ఎంతో సంరంభంతో కూడుకొని ఉండేది ఆనాడు!

ఈ వేటకు అన్ని హంగులు సమకూర్చటానికి వెంకటస్వామి అనే ఒక వ్యక్తి ఉండేవాడు. అతడి దగ్గర ఎప్పుడూ తుపాకీ సిద్ధంగా ఉండేది. అడవిలో ఏది కావాలన్నా ఏ పని కావాలన్నా ఆ వెంకటస్వామి అజమాయిషీ ఉండవలసిందే.

జమీందారు కూడా చాలా చలాకీగా హుషారుగా ఉండేవారు. మిగతా వేటగాళ్ళ చురుకుతనం వల్ల, ప్రజ్ఞవల్ల ఏదైనా పులి బోనులో పడ్డా లేదా చిక్కినా ఆ ఘనత అంతా రాజావారికే సంక్రమించేది. పెద్దపులి వేటకు ఒక పెద్ద బోను. ఆ బోనులో ఎరగా ఉంచేందుకు మేకలు కూడా వేట బృందం వారి వెంట వెళ్ళేవి. ఈ పెద్ద బోనులో ఒక మేకను కట్టేసి ఎరగా ఉంచి ఎక్కడ వాళ్ళక్కడ ప్రశాంతంగా తప్పుకునేవారు. చెట్లమీద సర్దుకుని చడీచప్పుడూ లేకుండా కూర్చునేవారు. ఆ పులి సరిగ్గా మేక కోసం వచ్చి బోనులో పడిపోయేది. దాంతో వేటకు ముగింపు జరిగేది.ఒకసారి ఈ విధంగా బోనులో చిక్కిన పులిని చుట్టు పక్కల ఊళ్ళ వెంబడి ఊరేగించారు. ఈ గొప్ప సంఘటన జమీందారుగారి బలపరాక్రమాలను, ఘనతను చాటిచెప్పేది. ఊళ్ళలోని ప్రజకు కూడా అదొక పెద్ద వినోద కాలక్షేపంగా ఉండేది.

ఈ విధంగా ఒకసారి రాజావారు పట్టిన పెద్దపులి చాలామదించి ఉన్న దాన్ని బోనులో పెట్టి రెండెడ్ల బండిమీద ఊరేగించిన దృశ్యం నా కళ్ళలో కనపడుతున్నట్లు స్మృతిపథంలో కదులుతున్నది. అప్పుడు చూసినంత పెద్దపులిని అటుతర్వాత ఇంతవరకు నేనెప్పుడూ చూడలేదు. మృగరాజు సింహమైనా, చురుకుదనంలోనూ బలంలోనూ పులే గొప్పదనుకుంటాను. అది

చాలా మదించిన పులి. చాలా ఎత్తుగా పొడుగ్గా ఉంది. దాని దేహం వెరపు గొల్పేటంత గంభీరంగా ఉంది. కళ్ళు అగ్నిగోళాల్లా మెరుస్తున్నాయి. మీసాలు విడివిడిగా పొడుగ్గా ఉన్నాయి. నన్నెవరు బంధించారు అని సవాలు చేస్తున్నట్లుగా ఉన్నాయి దాని చూపులు. నన్ను కూడా మహారాజులా గౌరవించండి అని దర్పంగా ఉంది దాని వాలకం. నన్ను బోనులో పెట్టారుగాని లేకపోతేనా అన్నట్లు రోషంగా ఉంది ఆ పులి. పులిని చంపకుండా పట్టుకోవటం ఒక ఘనకార్యమే. గొప్పసంగతే. అటువంటి పులులను ప్రభుత్వంవారి జంతు ప్రదర్శనశాలకు బహూకరించటం జరిగితే ఆనాటి బ్రిటిషు అధికారులు జమీందారుగారి గొప్పతనాన్ని ప్రశంసించేవారు. అదికూడా దృష్టిలో ఉంచుకునేవారు అలనాటి జమీందారులు. మా దుర్గయ్య బావ ఆ పులిని మా కేతనకొండవూరిలో కూడా ఊరేగింప చేశాడు. దీనితో ఆయనకూ రాజావారికీ గల సాన్నిహిత్యం అందరకూ తెలిసి పోయింది. కేతనకొండలో నాడు చూసిన పులి ఊరేగింపు నేటికీ నా మనసులో మెదిలినప్పుడు వల్లూరి రాజావారు, వేటపెద్ద వెంకటస్వామి, ఆ పెద్దపులిబోను, అందులో పులి, మా దుర్గయ్యబావ గొప్పదనం నా ఊహాపథంలో తళుక్కుున మెరుస్తాయి.

వల్లూరి రాజాగారి వంటి వారు బహుతక్కువ మందే ఉంటారు. పాపం తరవాత ఆయన ఎన్నో అప్పులలో మునిగి జమీందారీ పోగొట్టుకొని బహుదీనావస్థలో మరణించాడు. అంత గొప్ప జాతకుడు, జమీందారీ చిన్నదైనా ఒక్క వెలుగు వెలిగాడు. కుక్కల రాజాగా పేరు పొందాడు. చివరకు చితికిపోయి బెజవాడ వీధులలో అరుగులమీద పిచ్చివాడికి మల్లే పడుకొనేవాడని చెప్పుకునేవారు. 'ఓడలు బండ్లు, బండ్లు ఓడలు అవుతా'యంటే ఇదే కాబోలు.

ఆ తరంలోని జమీందార్ల వారసులు ఈ కాలంలో ధనవంతులైన వ్యాపారస్థులు, పారిశ్రామిక యజమానులుగా, కంట్రాక్టర్లుగా బాగా ఆర్జనపరులైనారు కొందరు. కొందరు నీతినిజాయితీలకు దూరమై పోయినారు కూడాను. ఆనాటి కళాపోషణ, దాతృత్వం నేడు తలచుకొనేవాళ్ళు లేరు. అయితే జమీందారీ వ్యవస్థ మంచిదని కాదు నా అని అభిప్రాయం. అది ఒక కథగా కలగా మనం తలచుకోవచ్చు. ఇక్కడికి ఈ వల్లూరి జమీందారు గారి కథకు స్వస్తి చెపుదాం.

# XVII

# ఔపోసనకార్యం

# NUPTIAL CEREMONY OF PEDA SUBBAIAH (MY FATHER) EARLY PART OF THE CENTURY

Experiences at the lunch served at the NUPTIAL Ceremony of my father, in the early 20th century had vast differences in the food servicing pattern between Tamils and Andhras which shocked the village based relatives of my father. With the way sambar, rasam, little ghee, were served to begin with, they got up practically with hunger.
This was recounted as an amusing story till a few decades, after the event and when we were young.

మా నాన్నగారిపేరు సుబ్బారావు అయినా సుబ్బయ్య అనే ఆయనను వాడుకగా పిలిచేవారనీ కుటుంబంలో ఉన్న ఇద్దరు సుబ్బయ్యలలో పెద్ద

వాడవటం చేత మా నాన్నగారిని పెద సుబ్బయ్య అనేవారనీ ఇదివరలోనే చెప్పాను. ఇప్పుడు విజయవాడని వ్యవహరిస్తున్న పట్టణాన్ని అప్పుడు బెజవాడని వ్యవహరించేవారని కూడా చెప్పాను. విజయవాడ సమీపంలోని కొండమీద పాండవ మధ్యముడు అర్జునుడు తపస్సు చేసినందువల్లనూ విజయం పొందినందువల్లనూ ఆ ఊరు విజయవాడ అయిందని పౌరాణికులు చెపుతారు.

మా మాతామహులు కలపటపు రంగారావుగారు మద్రాసులో జమీందారీ ఫాయిదాలో వుండేవారనీ సాంఘిక హోదా కలవారనీ చెప్పాను. మా నాన్నగారి కుటుంబం వాళ్ళు బాగా ఆస్తిపాస్తులున్నవారైనా రంగారావుగారి ముందు భయంగానూ బిడియంగానూ సంచరించేవాళ్ళు. మా తాతగారు రంగారావుగారు మద్రాసులో స్థిరనివాసం ఏర్పరచుకొన్నందువల్ల మా నాన్నగారి ఔపోసన కార్యం విజయవాడలో తన మిత్రుడైన దినవహి హనుమంతరావు గారింట్లో ఏర్పాటు చేశారు. అప్పట్లో దినవహి హనుమంతరావుగారు బెజవాడ మునిసిపాలిటీకి అధ్యక్షులు. ఎనభై సంవత్సరాల క్రితం ఒక మునిసిపాలిటీ ఛైర్‌మన్ అంటే అది ఎంత పెద్ద హోదాయో యీ తరంవాళ్ళు ఊహించటమే కష్టం. దినవహి హనుమంతరావుగారు కూడా ఆజానుబాహువుగా పచ్చని పసిమితో గంభీరమైన మీసకట్టుతో అందంగా ఉండేవారు. ఆ హోదాలో ఉన్నవ్యక్తితో పల్లెటూరు జనాభా అయిన మా తండ్రివైపు బంధువర్గం భయభక్తులతో వినయంతో నడచుకోవటం సహజమే కదా! అంతే కాక మా నాన్నగారి వైపు బంధువర్గమంతా కాస్త పాతకాలపు మడీ, ఆచారం, సంధ్యావందనం ఇత్యాది పాటించే రకం.

## వడ్డనలలో తేడా

మా మాతామహులు మద్రాసు కాపురస్తులవటంచేత మద్రాసునుంచి వంట వాళ్ళనుగా అరవబ్రాహ్మణులను తీసుకొనివచ్చారు. అరవవాళ్ళ వంటలకు మన వంటలకూ చాలా తేడా వుంటుందాయె. వంటలలోనే కాదు, వడ్డనలలో కూడా ఈ తేడా కొట్టవచ్చినట్లు కనిపిస్తుంది. కూర కలుపుకోకుండానే సాంబారు తెస్తారు వాళ్ళు. అంతేకాదు.సాంబారు, చారు, కూటు, కారం తక్కువగ చప్పిడి కూరలు,వాళ్ళ ఆధరువులు. మన తెలుగు వాళ్ళలాగ వర్రఖారం వేసిన పచ్చళ్ళు కలికానికి కూడా కనిపించవు అరవభోజనాలలో. అన్నం, వ్యంజనాలు

వడ్డించగానే సాంబారు పోస్తారు. ఆ సాంబారులో కూరలు, కూటు, వగైరాలు నంచుకుంటూ భోజనం కానివ్వడం అరవ సంప్రదాయం.

మనవాళ్ళు పప్పు, కూర, పచ్చళ్ళు కలుపుకొని, కలుపుకున్న ప్రతిసారీ నెయ్యి వేయించుకుని కలుపుకొని సుష్టుగా భోంచేస్తారు. పెరుగుతోనో మజ్జిగతోనో భోజనం ముగించడమే వారికీ మనకూ కూడా మామూలు. అది సరే.

బ్రాహ్మణ కుటుంబాలలో ఆ రోజులలో అంతా మడి బట్టలు ధరించి, పైన తడిదో లేక మడి తువ్వాలో వేసుకుని భోజనాలకు కూర్చునేవారు. కుటుంబంలోని పెద్దలు పూజాపునస్కారాలు, దేవతార్చనలు, సంధ్యావందనాలు మొదలైన కార్యక్రమాలు పూర్తిచేసుకుని ఒకరితరవాత ఒకరు వచ్చేవారు. ఈ విధంగా కుటుంబంలో పెద్దలంతా పంక్తిలోకి వచ్చేవరకూ ఔపోసనపట్టి భోజనాలు ప్రారంభించకూడదు ఎవరూ. పల్లెటూళ్ళలో అయితే ఈ పట్టుదలలు, నియమాలు మరింతగా పాటించేవారు. బంధువులలో పెద్ద లెవరైనా ఎంత ఆలస్యంచేసినా మిగతావాళ్లంతా ఉపక్రమించకుండా కూచుండి పోవాల్సిందే. సరే ఈ తంతు అంతా అయి అందరూ కూర్చొని ఔపోసనాలు పట్టిన తర్వాత, భోజన కార్యక్రమం ప్రారంభించటం మా నాన్నగారి అత్తగారి వైపు బంధువులను దిగ్భ్రాంతులను చేసింది.

అరవబ్రాహ్మణులు వాళ్ళ వడ్డన ఆచారం ప్రకారం అన్నం మీద నెయ్యి అభిఘరించడంతో పాటే సాంబారు తెచ్చారు. తరవాత వడ్డనలో కూరలు కొంచెం కొంచెం అడిగి కనుక్కున్నా వెంటనే చారు తెచ్చారు. వెంటనే మజ్జిగ తెచ్చారు. ఈ మాదిరి వడ్డనకు మన వాళ్లంతా తెల్లబోయారు. పప్పు అన్నంలో ఉండగానే వడ్డనవారు సాంబారు,సాంబారు, రసం రసం, మజ్జిగ మజ్జిగ అనో పెరుగు పెరుగు అనో దాడిచేస్తుంటే మన కృష్ణా, గుంటూరు జిల్లాల జనాభాకి ఊపిరాడ లేదు. నెయ్యి ధారాళంగా వడ్డించడం అసలే కనపడలేదు.ఈ ఉరుకుల పరుగుల వడ్డనలతో మా నాన్నగారి వైపు బంధువులు కడుపు నిండా అన్నం తినే అవకాశం కూడా లేకపోయింది. ఏమన్నా అనటానికీ ఆక్షేపించటానికీ వీల్లేదాయె. వాళ్ళనేమంటామని భయమాయె. అందువల్ల అర్ధాకలితోనే లేచిపోయి విడిదికి చేరుకుని మళ్ళీ వంట ప్రయత్నంచేసినట్లు కూడా వదంతి వుండేది. అక్కడ పదార్థలోపం వల్లా కాదు, వడ్డించేవాళ్ళకు వీళ్ళు సుష్టుగా తిని బ్రేవుమని

తేన్చకూడదనీ కాదు ఇలా జరిగింది. వడ్డన పద్ధతులలో అరవ, ఆంధ్ర భోజన కార్యక్రమంలో ఉండే తేడావల్లే ఇలా జరిగింది. ఇట్లా చిన్న చిన్న వ్యవహారాలలోనే ఎంతో తేడా ఉండటంవల్లే ఆ కాలంలో పెళ్ళిసంబంధాల విషయంలో తమ జిల్లాలను దాటి వెళ్ళే వారు కాదు. వీరు తూర్పువారనీ, వారు పడమటవారనీ ఇచ్చి పుచ్చుకోవడాలలో, సాంఘికవ్యవహారాలలో సతమతమై పోతూఉండేవారు. ఉదాహరణకు భోజనం దగ్గరనే గుంటూరు జిల్లా వారి విధానం వేరు, కృష్ణాజిల్లా వారి పద్ధతి వేరుగా ఉండేది. గుంటూరు, కృష్ణా జిల్లాల వారికి రాజమండ్రి, కాకినాడలు తూర్పు అయితే వాళ్ళకు విశాఖపట్నం తూర్పు. భోజన పదార్థాల తయారీలో కూడా రుచులు, అభిరుచులు వేరుగా ఉండేవి. కృష్ణా గుంటూరు జిల్లాల వారికి నేతి పోపులు కావాలి. పిండివంటల దగ్గర నుంచీ నేతితో చేయడం ముఖ్యం. తూర్పు గోదావరి జిల్లావారికి నూనె పోపులు కావాలి. అదిన్నీ పప్పు నూనె పోపులు. ఆ జిల్లాల వారిలాగా నూనె పోపులు వాడితే గుంటూరు, కృష్ణా జిల్లాల వాళ్ళు అనారోగ్యం పాలవతామని భయపడేవాళ్ళు. ఈ రకమైన భేదాలు బ్రాహ్మణ కుటుంబాలలో మరీ ఎక్కువగా ఉండేవి. ఇంకా మరీ తూర్పువారికి భోజనాలలో చేతి మీద కూడా నూనె వేసుకొనే అలవాటు. అది కృష్ణా గుంటూరు వాళ్ళకైతే కనీ వినీ ఎరుగని ఊహించ లేని అలవాటు. ఆంధ్రదేశంలోని జిల్లాల మధ్యే ఇంత వ్యత్యాసం ఉంటే ఇక మన తెలుగు వారి సంప్రదాయానికీ అరవ సంప్రదాయానికీ వంటావార్పుల విషయంలో అయితేనేమి, వడ్డన విధానంలో అయితేనేమి,కొండంత వ్యత్యాసం ఉండటంలో ఆశ్చర్యమేముందీ? ఈ విధంగా మా నాన్నగారి శోభనం వేడుకలో నాన్నగారి కృష్ణా గుంటూరు జిల్లాల ఆత్మీయులంతా అర్ధాకలి విందుకు గురి అయినారు. అరకడుపుతో లేచిపోయినారు. ఈ సుబ్బయ్య శోభనం వేడుక, కథలు కథలుగా మేం పెద్దవాళ్ళమైన తర్వాత కూడా మా బాపట్ల మేనత్త కొడుకు లక్ష్మీనారాయణ బావ చెపుతూ ఉండేవారు.

## మన భోజనాలలో తేడాలు

భోజనాల ప్రస్తావన వచ్చింది కాబట్టి ఇక్కడే ఇంకో తమాషా కూడా ముచ్చటించు కోవాలి. కృష్ణా, గుంటూరు జిల్లాల వాళ్ళు,చారు తద్దినానికిగాని,

లేదా జబ్బుచేసి తగ్గి పత్యం పెట్టినప్పుడు గానీ చేసుకునేవారు. చారులో పప్పు వేసే అరవ విధానం వీళ్ళకు లేదు. 'ఉండ' చారని నీళ్ళలో చింతపండు, పసుపు, ఉప్పువేసి కాచి పోపు పెట్టేవారు. అది పుల్లగా నోటికి రుచిగా ఉండి పథ్యం తీసుకొనేరోజు బాగానే ఉండేది. అయితే మద్రాసునుంచి కేతనకొండకు కాపురానికి వచ్చిన మా అమ్మ ఆహారపు అలవాట్లు ఇక్కడి వారికన్నీ కొంత వేరుగా ఉండేవి. ఆమెకు రోజూ చారు కావాలి. రోజూ చారు కావాలంటే ఇదెక్కడి తద్దినంరా అనుకొంటూ రోజూ తద్దినం రావాల్సినంత ఘోరంగా ఉండేది కేతనకొండ వారికి. ఇంతేకాక మా అమ్మకు తూర్పు అలవాటు వేపుడు కూరల అలవాటు కూడా ఉండేది. ఈ విధంగా మద్రాసు అలవాట్లు, మన తూర్పు ప్రాంతపు అలవాట్లు రెండూ జోడించి ఉండేవి మా అమ్మ ఆహార అలవాట్లు. మరి ఈ జిల్లాల వారికి ముద్దకూరలు కావాలి. వేపుడుకూరలు చాలా అరుదుగా చేసేవారు. మా పెద్ద మేనత్త తిరుమలమ్మగారికి మా అమ్మ ముద్దుల మరదలేకదా! అందువల్ల ఆమెకు ప్రత్యేకంగా ఇవన్నీ చేయిస్తే 'అబ్బా! ఈవిడకింత గారాబమేమిటమ్మా అని అనుకుని పోతారేమోనని లోపల ఆవిడకు సంకోచం. కొంచెం భయం. అన్నిటి కన్నా ఎక్కువ బిడియం. కాని మా అమ్మ మీద ఆమెకు ప్రేమ. అందుచేత ఏదో దెప్పిపొడిచినట్లు, మా అమ్మ ఆహారపు అలవాట్లనుద్దేశించి 'మా లక్ష్మమ్మకు బ్రెవుచ్చల్లేచారు, పిల్లి వట్టలల్లే వేపుడూ కావాలమ్మా' అంటూనే వీలయినప్పుడల్లా అవి చేయించి పెడుతూనే ఉండేది. ఉండచారు కూడా అదే రంగులోనే కదా ఉండేది. ఈ ప్రస్తావన వస్తే తినేవాళ్ళకు ముందే సగం ఆకలి చచ్చిపోతుంది. అయితే మా అత్తయ్య ఆత్మీయత మా అమ్మకు తెలుసు. అందువల్ల ఆనాటి విశేషాలన్నీ మా అమ్మ మాకు కథలుగా వినిపించేది.

## మా అమ్మ కాఫీ అలవాటు

మద్రాసులోనే మా అమ్మ తన చిన్నతనమంతా గడపడంవల్ల మా అమ్మకు రోజూ ఉదయం ఒక గ్లాసు వేడి కాఫీ కావాలి. ఆ రోజుల్లో పింగాణీ కప్పులు లేవు. అయినా ఇంకో అభ్యంతరం కూడా ఉండేది. పింగాణీ సామానులు 'దొరలు' ఉపయోగించేవి. అంచేత అవన్నీ మైలసామానులు. మా అమ్మమ్మ

టొమాటాలు ముట్టేదికాదు. ఎందుకమ్మా అంటే అవి దొరలు మాంసంలో వేసుకుంటార్రా మనం తినకూడదూ అనేది. ఆ రోజుల్లో ఆచార వ్యవహారాలు, భావధోరణి,అలా ఉండేవి. వాళ్ళ లోకం వాళ్ళదిగా ఉండేవాళ్ళు పెద్దవాళ్ళు. ఈ రోజుల్లో కిలో ధరెంతైనా సరే మనం టొమాటాలు విడిచిపెట్టలేం. మా అమ్మమ్మ స్వర్గంలోంచి చూస్తూ బోలెడు ఆశ్చర్య పడుతుందేమో!

అసలు విషయం కాఫీకదా! అంత పెద్ద కేతనకొండ ఉమ్మడి సంసారంలో పాడిపంటలకు లోటేమిటి. తిండికేమీ లోటుండేది కాదు. పెద్ద బానల నిండా రోజూపాలుండేవి. అప్పట్లో దాదాపు ముప్పై ఆవుల పాడి ఉండేది కేతనకొండలో. గేదె పాడి తక్కువే. ఏది ఏమైనా పాలు సమృద్ధి. ఇహ కాఫీకి కావాల్సింది కాఫీపొడి, పంచదార. కాఫీపొడి బజారునుంచి సంపాదించి తేవాలి. అది పల్లెటూరు కదా.

చిక్కగా కాఫీ డికాషన్ వేసి నీళ్ళు పిసరు కూడా కలవని ఆ చిక్కటి పాలు పోసి కావలసినంత పంచదార వేసుకుని వేడివేడిగా తాగుతుంటే ఇంట్లో కుర్రకారుకు హుషారుగా ఉండేది. కాఫీ కోసం వాళ్ళు పెద్ద పెద్ద చెంబులు పెట్టుకొని కూర్చునేవారు. అత్తయ్య కాఫీ అలవాటు వాళ్ళకు పరమానందంగా ఉండేది. అయితే మా అమ్మకు కావలసింది ఒక గ్లాసు కాఫీ మాత్రమే. మా బావలకు వగైరాలకు కావలసింది తలో మరచెంబుడు కాఫీ. దీనితో మా అమ్మ ఉదయం అలవాటుగా రోజూ కాఫీ తాగాలంటే ఒక గుండిగెడు కాఫీ చెయ్యాల్సి ఉండేది. అప్పుడు గాని ఆమె ఒక గ్లాసు కాఫీకి నోచుకోదు. రోజూ ఈ బాధ పడలేక ఆవిడ కూడా కేతనకొండ ఉమ్మడి కుటుంబంలో అప్పుడప్పుడు కాఫీ కాచేది. ఆ రోజు అత్తయ్య కాఫీ కోసం అందరూ చెంబులు పెట్టుకొని కూచునేవారు. అదీ మా అమ్మ కాఫీ అలవాటు ప్రహసనం. ఈ విధంగా ఆహారాభిరుచులు, భోజనరుచులు, వీటి తేడాలు హాస్యాన్ని సృష్టిస్తాయి. చెంబులతో కాఫీ తాగడం హాస్యాస్పదమేకదా! ఇక పిల్లి వట్టలవేపుళ్ళు, బర్రె మూత్రం చారు అని వాటిని వర్ణించటం ఎంత అపహాస్యమో గ్రహించవచ్చు.

# XVIII

# మా వంశ వృక్షం

# GENEOLOGICAL TREE

The "Geneological Tree of any family gives a depth into your heritage - Our Ancestor Mr AYYAPARAJU came from Nellore district He had five sons - All of us are descendants of these five sons. We are now a seventh generation progeny All "Pratury" families can look back, as to where our common descendency meets. In our village, family name "Pratury" is borne by many castes including Harijans !

సూర్యవంశం, చంద్రవంశం రాజులు మొదలైన వారికి వంశ వృక్షాలు ఉండటం కద్దు. సింహాసనాలను అదిష్ఠించే అధికారానికి ఆవార సత్వాల రికార్డు అవుసరం. అయితే, మన బోటి సామాన్యులకు కూడా ఈ వంశ వృక్షాల గొప్ప ఏమిటి అనుకోవద్దు. ఎవరి గొప్ప వారిది. అయినా, మన పుట్టు పూర్వోత్రాలు తెలుసుకోటం విజ్ఞాన దాయకం, ఆనందదాయకం. అందుకే ఈ వంశ వృక్ష కధనం.

వంశ వృక్షం వేయాలంటే, పెద్ద వాళ్లంతా బ్రతికివుండి, వారి స్మృతిపధంలోంచి పాత తరం వాళ్లపేర్లు బయటికి లాగి, లిఖిత పూర్వం చేసి వుంచాలి. అందుకే దాదాపు ఏభయి సంవత్సరాల క్రితంమేమంతా ఏ సెలవలకో

చేరినప్పుడు, మా పెద్దలను అడిగి, మెల్లిగా ఒక 'వృక్షం' తయారుచేశాం. రాసి నవన్నీ ఎక్కడో పోయాయి. మళ్ళీ అదృష్టంకొద్దీ, ఎక్కడినుంచో బయటపడినయి-అలా వ్రాసిన ప్రాతూరివారివంశ వృక్షాన్ని పరిశీలిద్దాం- ఇది ప్రాతూరి వారి వంశ కథనం ! మావూరిలో వున్న వారంతా చాలామంది ప్రాతూరివారే.అన్నికులాలలోనువారు వున్నారు. పాటిమీదవున్న హరిజనులంతా ప్రాతూరి వారే. ఇందులో బ్రాహ్మణులలో "ప్రాతూరి" వారంతా నియోగులు- "పాతూరి" వారంతా వైదీకులు- ఈ మాదిరిగా ఎక్కడెక్కడో వున్న వారందరూ ఒకే కుదురునుంచి వచ్చినవారే !

వంశానికి ఆది పురుషులు "అయ్యపరాజు" గారు. వారికి అయిదుగురు కుమారులు. ఒక్కొక్కరి సంతతి ఒక పటం కింద వేస్తే ప్రాతూరివారందరికివున్న 'అనాది' సంబంధాలు తెలుస్తాయి. ఈ అయిదూ, అయిదు పటాలు గా వేస్తే, ప్రస్తుతం వున్న వాళ్ళంతా, తొమ్మిదోతరానికి కూడా దిగారు. తమాషా ఏమిటంటే మా తిరుమలరాయుడిగారి పాత్రులమంతా, మాకుదురులో మూడో తరం వారమయినా, ఇంకా కలిసి కోదరులుగానే వున్నాం. మా ఇల్లంతా ఉమ్మడిగానే వుంది. పెద్దలు భాగాలు చేసినా మేము దానిని ఒక కుటుంబ సంస్థగా రూపొందించటానికి ప్రయత్నిస్తున్నాం - గవర్నమెంటయిన వారికి, బీదలకు, ఇళ్ళ స్థలాల క్రింద ఇచ్చి, వారు ఇవ్వవలసిన బాకీ పైకం పంచుకుంనే ఉమ్మడి ప్రయత్నంలో వున్నాం ! మా సంతానాలు, దేశ విదేశాలలో వున్నా అంతా ఒక కుదురుకు చెందామన్న "సోదర సంతోష" భావాన్ని మాలో ఒక అరుదైన విశేషంగా భావిస్తున్నాం .

ప్రస్తుతం వున్న వారిలో మా పెదనాన్న గారి కుమారుడు, పెద్దతిరుమలరావు, ఇప్పుడు అమెరికాలో పుత్రుడు దగ్గిర కాలక్షేపంచేస్తున్నాడు, వాడు చెపుతాడు, వాస్తు ప్రకారం, ఇంట్లో ఈ తరం వారు ఎవరూ కాపురం చెయ్యరని ! అలాగే ఎవరో ఒకరు వూళ్ళో ఉన్న వాళ్ళేఅయినా కొద్దిపాటి అద్దెలకు వుంటున్నారు. ఇంటికి విద్యుద్దీపాలు, టెలిఫోను కూడా పెట్టించాం. విజయవాడకు ఒక పేటకింద, మావూరు అయిపోయినా, మేము వెళ్ళి ఒక వారం రోజులైనా ఉండే అవకాశం లేకుండా పోయింది. అయినా, ఆ ఇంటి మీద, వూరిమీద, మా అందరికి అపారమయిన అభిమానం ఉంది.

*"ధన్యులై చన్నారటే, మా తాత తండ్రులు ఇచ్చటే*
*వీడి పోవుచునుండెనా బంధంబు, నను నేడే పొమ్మనుచుంటివా?*
*కాలాడదాయె తల్లీ, నిడనాడగలనటే, కల్పవల్లీ!*
*నేనొకడనే భారమా! ఓ ఇనవంశకులధామమా!*

అని, అర్ధ శతాబ్దం క్రితం మామిత్రుడు, కవి, వెంకట్రామయ్యగారు, పశ్చిమ గోదావరి జిల్లాలోని వడలి గ్రామాన్ని, తన ఆస్తిపాస్తులు అమ్ముకుని పోయిన సమయంలో వ్రాశాడు. అదేమాకూ వర్తిస్తుందేమో !

మా తలిదండ్రులలో, మా పెదనాన్నగారు యజ్ఞనారాయణగారు, నలభయి సంవత్సరాలు ఊరు వదిలి కృష్ణాజిల్లా నందిగామ ప్రాంతంలోను ఇతర చోట్ల, రెవిన్యూ డిపార్టుమెంటులో పని చేసి, "రిటైరు" అవగానే ప్రాతూరుచని, అక్కడే కాపురం పెట్టి పొలాలు బాగుచేయటం మెదలు పెట్టి, ఆకస్మాత్తుగా మరణించారు. మా పిన తాతగారికుమారుడు, చిన యజ్ఞనారాయణ బాబాయి, అదేవిధంగా ఉపాధ్యాయవృత్తిలోంచి 'రిటైర్' అవగానే, ఆసాయంత్రమే, మావూరు నుంచి, కొండవల్లి బండి తెప్పించుకుని, మరుక్షణం ప్రాతూరు చేరి అక్కడే మరణించాడు. ప్రాతూరు వారు అక్కడ స్థిర పడే అవకాశంలేక పోయింది. మాతరం వారంతా, బొంబాయి, మద్రాసు, కలకత్తా పట్టణాలలో వృత్తిరీత్యా వుండి పోయాం! అయితే, మాకు ప్రాతూరు మీద ఒకే ఒకందుకు అభిమానం. వేలకొద్దీ సంపాదనలున్నా, అది చాలక పొలాలు అమ్మటానికి వెళ్ళేవాళ్లం. మా తల్లిదండ్రులంతా రెండు సంఖ్యల జీతాల మీద ఆస్థి అంతా కాపాడితే, నాలుగు, సంఖ్యలలో సంపాదించినా, 'మా తరం' వారం, వచ్చేడబ్బు చాలక, చదువులకనో, మరో పనిమీదో, ఎక్కువ డబ్బు కావలసినప్పుడల్లా వెళ్ళి అమ్ముకుని వచ్చేవారం. మా చిన యజ్ఞనారాయణ బాబయ్య "ఒరే వెధవల్లారా మీరంతా తలో దిక్కునా అడుక్కుతింటున్నట్లు, ఈ పొలాలు అమ్మటానికి వస్తారురా"! అని ప్రేమతో తిట్టేవాడు! మాకు నవ్వే సింగారమన్నట్లు, మా ప్రగతి చూచి, మేమే నవ్వుకునేవాళ్ళం. అలా ఈ తరం అన్నదమ్ముల మందరం ఒక సెంటు భూమిలేకుండా అమ్మి నిత్య భృతికోసం ఖర్చు పెట్టామంటే మీకు కూడా ఆశ్చర్యంగా వుంది కదా.

'మాతరం కథే' వ్రాశాను కాబట్టి, ఈ వంశవృక్షాన్ని గురించి ఇంతటితో

ముగిద్దాం! అయితే మరో సంగతి జ్ఞాపకానికి వస్తోంది. మా తిరుమలరాయుడు తండ్రిగారు యజ్ఞనారాయణగార్కి అప్పట్లో తహశీల్ దార్ గారి అమ్మాయిని ఇచ్చారుట. ఆరోజులలో "తహశ్శీల్ దార్" అంటే చాలా పెద్ద హెూదా గల ఉద్యోగం క్రింద లెక్క. ఆమెను "మేనా" మీద బోయీలు సంగీతాలు పాడుకుంటూ తీసుకువచ్చేవారుట. ఇక్కడ అంతా అప్పట్లో జొన్నన్నమే తినే వారు. కాబట్టి, ఆవిడ గొప్పింటి పిల్లగా వరి అన్నానికి అలవాటుపడింది. కనుక, తహశ్శీల్ దార్ గారే ఒక ఏడాదికి ఇంటికి సరిపడ "వరిధాన్యం" పంపించేవారట. అదోరకం కథగా మా ముసలి మేనత్తలు చెపుతూ వుండే వారు. కొన్ని వంశ వృక్షాలలాగా మర్రి వూడలు వేసిన వంశంకాదుమాది. పరిమిత కుటుంబంగానే వుండి అంతా సుఖంగానే వున్నాం ఈ తరంలో!

ఆదిపురుషులు అయిదుగురి పటాలూ, విడివిడిగా వేశా. ఎక్కడైనా వున్న ప్రాతూరువారు అవి చూడటంతటస్తేస్తే వారెక్కడున్నారో చూసుకోండి. ఇహశలవు. చూసుకోవచ్చు.

# XIX

# బెజవాడ కాపురం ముచ్చట్లు

## Bezwada Family Events - I

Bezwada was the centre for High School education for many. Hence a family was set up - The second town was Machilipatnam (Bandar) the capital, had, college education also - Frenchpet - a French enclave in Machilipatnam and a very convenient place for Child Marriages in those days

దాదాపు ఎనభై ఏళ్ళ కిందటి మాట. ఆ రోజులలో కుటుంబంలోని పిల్లల హైస్కూలు చదువులు సాగాలంటే పట్టణాలలో కాపురాలు పెట్టాల్సిందే. కృష్ణా జిల్లాకు విద్యా సాంస్కృతిక కేంద్రమైన బెజవాడకే ఆ రోజుల్లో అంతా చేరుకునేవారు. జిల్లాకి పరిపాలన కేంద్రం అంటే కలెక్టరాఫీసు, ఇంకా ముఖ్యమైన ఆఫీసులు సముద్రతీరాన ఉన్న బందరులో ఉండేవి. అంటే ఇప్పటి మచిలీపట్టణం. ఆ రోజుల్లో దొరలే పరిపాలకులుగా వచ్చేవారు కాబట్టి ఆ

జిల్లాలో ఏ ఊరు శీతోష్ణస్థితికి తాము ఉండటానికి అనువుగా ఉంటుందో చూసుకునే వారు. బందరు రేవుపట్టణం కాబట్టి మిగతా చోట్లకంటే చల్లగా వుంటుంది. ఇక రెండో అంశం ఏమంటే వ్యాపార కేంద్రం రీత్యా బందరు ఎగుమతి దిగుమతులకు విదేశ వ్యాపారానికి అనుకూలంగా ఉండేది. అప్పట్లో మచిలీపట్నం రేవు పట్టణంగా సౌకర్యాలతో ఉండేది. అందువల్ల మొదట్లో మన ప్రాంతంతో వ్యాపారం చేయటానికి డచ్చిచ్చి వారు వచ్చారు. ఈ విధంగా పెద్ద ఎత్తైన విశాలమైన బంగాళాలు వారు కట్టినవి ఇప్పటికీ నిలచి ఉన్నాయి.

వాళ్ళను నెట్టివేసి ఫ్రెంచివారు వచ్చారు. అందుచేత మనకు స్వరాజ్యం వచ్చేవరకు బందరులో 'ఫ్రెంచిపేట' కనపడుతూ ఉండేది. దానికో గవర్నరుండేవాడు. ఫ్రెంచి భాష ప్రభావం కూడా ఉండేది. బందరు జీవితంపై కూడా కొంత ఆ ఫ్రెంచి పేట ప్రభావం కన్పించేది.'ఫ్రెంచి పేట' అంటే అది ఫ్రెంచి వారి రాజ్యాంగానికి లోబడి బ్రిటీషువారి చట్టాలకు వెలుపలగా ఉండేది. పేట చిన్నదయినా దర్జా దర్పాలకు లోటుండేది కాదు. ఈ చిన్న చిన్న స్థావరాలు మనవాళ్ళకు ఒకందుకు ఉపయోగపడేవి. 1930 వ సంవత్సరంలో 'శారదాయాక్టు' వచ్చి బాల్యవివాహాలు రద్దై ఆడపిల్లలకు 16 ఏళ్ళు,మగపిల్లలకు 18 ఏళ్ళు, నిండితేకాని వివాహం చేయకూడదన్న నిర్బంధం వచ్చినప్పుడు బ్రిటిషువారి చట్టాన్ని ఉల్లంఘించటానికి అనువుగా వందలకొద్దీ వివాహాలు ఈ ఫ్రెంచి పేట, కాకినాడ దగ్గర ఫ్రెంచివారి అధీనంలో ఉండే యానాం మొదలైన చోట్లకు వెళ్ళి జరిపించేవారు. ఇప్పుడా శారదాబిల్లు వంటి బాల్యవివాహ నిరోధ చట్టాలు, అందుకు సంబంధించిన ప్రహసనాలు చెప్పాలంటే పూర్తిగా ఒక అధ్యాయమే రాయాల్సి ఉంటుంది. ఇంతకూ మనం తెలుసుకోవలసిందేమంటే బ్రిటిషువారు కృష్ణాజిల్లా పరిపాలన కేంద్రంగా బందరును ఎంచుకున్నారని.

ఇక బెజవాడ కాపురంలో జరిగిన కొన్ని విశేషాలు చెపుతాను. మరో చిన్న విశేషం. బ్రిటిషువారు 'కృష్ణా డిస్ట్రిక్టు' అనే ప్రస్తావనను 'కిష్టా' అని వ్రాపడి లేకుండానే వ్యవహరించేవారు. మనకు స్వరాజ్యం వచ్చిన తర్వాత నోరారా 'కృష్ణా' అని ఉచ్చరించు కుంటున్నాము, రాసుకుంటున్నాము. ఇంకా వెనకటి తరానికి చెందిన మా బోటి వాళ్ళం ఇంగ్లీషులో రాసేప్పుడు 'కిష్టా జిల్లా' అనే రాస్తుంటాం. తెలుగు దనం గుర్తు వస్తే వెంటనే కృష్ణా అనే రాస్తాం.

గ్రంధకర్త, భారత రాష్ట్రపతి, ఆనాటి భారత ప్రధాని శ్రీ రాజీవ్ గాంధీ

శ్రీమతి జానకీవెంకటరామన్, రాష్ట్రపతి, గ్రంధకర్త, మనుమడు కె.వంశీమోహన్

నేను జన్మించిన బియ్యపు సుబ్బయ్యకొట్లు, ఆంధ్రభీష్మ న్యాపతి సుబ్బారావుపంతులుగారి ఇంటిపక్కన.

ప్రొత్తూరులో మా ఎత్తు అరుగుల ఇల్లు.
ముందర మా అన్నయ్య పెద్ద తిరుమలరావు, మా హరిజన రైతు కొండూరు సుబ్బయ్య.

ఇంటిముందర మిత్రులతో
(ఎడమనుండి) 1. సూయా వెంకటేశ్వరరావు, 2. గుండిమెడ గోపాలకృష్ణమూర్తి (కరణంబావగారు) 3. పెద్ద అన్నయ్య పెద్దతిరుమలరావు, 4. రచయిత చినతిరుమలరావు.

డాక్టర్ ఘంటసాల సీతారామశర్మ
(పినతాతయ్య, బెజవాడ)

మా అమ్మమ్మ దుర్గాంబ
(జీవితంలో ఆదర్శప్రాయులు)

నేటి గాంధినగర్‌లో 1923 సం||లో జరిగిన కాంగ్రెసు మహాసభ ఆహ్వానసంఘ సభ్యులు

క్రింద కూర్చున్నవారిలో పైపంచ లేకుండావున్నవారు మహర్షి బులుసు సాంబమూర్తిగారు

కుడినుండి మూడవవారు మొసలికంటి తిరుమలరావుగారు

కుర్చీకివెనుక వరుసలో నిలుచున్న వారిలో ఎడమ నుండి మూడవవారు శ్రీ లక్కరాజు సుబ్బారావుగారు (కోశాధిపతి)

గ్రంథకర్త, కాకినాడలో మహర్షి బులుసుసాంబమూర్తిగారి
చిత్రపట ఆవిష్కరణ

గ్రంధకర్త, ఆంధ్రకేసరి జన్మదిన సందర్భముగా
పూలమాల అలంకరించుట

హైదరాబాదు విమానాశ్రయంలో శ్రీ రాజీవ్‌గాంధీని ఆహ్వానించుట

మా వైతరం వారితో గ్రూపుఫోటో
నేను, మానాన్నగారు, రమణమూర్తి బాబాయి వగైరా

కేతనకొండ కుటుంబం వారు బెజవాడలో పిల్లల చదువుల కోసం కాపురం పెట్టినప్పుడు ముందు రోజులలో అంటే పూర్తిగా కుటుంబం రాకముందు మా నాన్నగారు పెద సుబ్బయ్య (అసలు పేరు సుబ్బారావు) ఆ కుటుంబంలో ముద్దుల పెంపుడు కొడుకు కుటుంబయ్య బావ కలిసి ఉండి హోటలులో భోజనం చేస్తుండేవారని ఇదివరకే చెప్పాను. కుటుంబయ్య బావకు అతిగారాబం ఉండటంలో వింతేమీ లేదు. కేతనకొండ ఆస్తి కంతకూ మూల స్తంభం మా పెద్ద మేనత్త తిరుమలమ్మ గారు కుటుంబయ్య బావను పెంచుకొంది. పైగా అతడు కుటుంబం పిల్లల్లో చిన్నవాడు. చిన్నవాడికి గారాబం సహజం.

ఆ రోజుల్లో చెప్పుకోదగిన హోటళ్ళు బెజవాడలో కూడా ఉండేవి కావంటే ఈ తరం వాళ్ళు నమ్మడం కష్టం. ఎందుకంటే ఆంధ్రదేశంలో ఇప్పటికీ కూడా 'రౌండ్ ది క్లాక్' అంటే అహర్నిశలూ వేళాపాళా లేకుండా ఇడ్లీ దొరకాలంటే బెజవాడ హోటళ్ళలో దొరకాల్సిందే. మరి రెండో ప్రపంచ యుద్ధకాలంలో మద్రాసు వంటి పట్టణాలలో బియ్యం రేషనింగ్ మూలంగా బియ్యం రవ్వతో చేసిన ఇడ్లీ దొరికేదికాదు. రూల్సు ప్రకారం అన్నం ఒక చిప్పతో పెట్టేవాళ్ళు. కడుపు నిండాలంటే దొంగతనంగా మరో హోటలుకు వెళ్ళి మళ్లీ తినాల్సిందే. అలాంటి రోజుల్లో కూడా అంటే రెండో ప్రపంచ యుద్ధ కాలంలో సైతం పెద్ద ఇడ్లీ, వేడి వేడి భోజనం కడుపునిండా పెట్టే హోటళ్ళు ఒక్క విజయవాడలోనే ఉండేవి. మరి ఇక్కడ ఆ రేషనింగు చట్టం లేదా అనవచ్చు. చట్టం దేశం అంతా ఒకటే. అయితే అన్నపూర్ణగా ప్రసిద్ధి చెందిన ఆంధ్రదేశానికి నడిబొడ్డు విజయవాడ. అంతేకాక చట్టాలను హూన్‌కాకి చేసే చాకచక్యం ఆంధ్రులకు, అందునా కృష్ణా జిల్లా వాసులకు వెన్నతో పెట్టిన విద్యేకదా! వరదలో ఉన్నా కృష్ణా ప్రవాహాన్ని చూసి వాళ్ళు భయపడరు.

అప్పట్లో కాఫీ టీ, ఇడ్లీ దోసెలు వగైరా ఫలహారాలు లేకపోయినా చవుకగా కడుపునిండా భోజనం పెట్టే సూరయ్య, పేరయ్య హోటళ్ళు, పూటకూళ్ళ అమ్మలక్కలు చాలామంది ఉండేవారు. పూటకూళ్ళమ్మంటే అమ్మలాగా ఆప్యాయతతో తిను నాయనా అంటూ ఆ పూటకు కూడు పెట్టే చోటని అర్థం చెప్పుకోవచ్చు. అవైతే పెద్ద వ్యాపార నిలయాలు కావు కాబట్టి రాత్రి ఎనిమిది

తొమ్మిది గంటలకల్లా భోజనాలు పెట్టటం పూర్తి చేసి ఇళ్ళు కడుక్కొని హొటళ్ళు మూసేసేవారు. ఇంకొక సంగతి కూడా తమాషా అయింది చెప్పాలి. కొన్ని బ్రాహ్మణ హొటళ్ళలో మడిబట్టలు సహా సప్లై చేసేవారు. ఎంతో ఆదరం చూపుతూ పూటకూళ్ళ అయ్యలు, అమ్మలు ఉండేవారంటే మనకు ఆశ్చర్యంగా ఉంటుంది కదూ! అయితే అది మాత్రం యథార్థం.

ఈ విధంగా పూటకూళ్ళ ఇంటిలో తింటూ మా నాన్నగారు, మా బావ కుటుంబయ్య చదువుకొన్న నాటి చిత్ర సంగతులు కొన్ని చెప్పాను. మా బావ అతిగారాబం, మొద్దు నిద్ర, ఒకరోజు కడుపు కాలేటప్పటికి మొద్దు నిద్ర గిద్ర ఆ తర్వాత ఎగిరి పోవడం చెప్పాను. అటు తరవాత కేతనకొండ కుటుంబమే బెజవాడ చేరింది. అప్పుడు కూడా మా కుటుంబయ్య బావ అతిగారాబం, మొండి పట్టుదలా, మా పెదనాన్నగారు, ఆయన్ను 'పెద్దాం' అనేవాళ్ళు మా బావలు. మా బావ రోగం తక్కున కుదర్చటం, మా బావ బాలలీలలు, కోపం వస్తే ఒక నవారు పట్టగోచీగా పెట్టుకొని తిరగటం, వెండి గిన్నె తీసుకొని వెళ్ళి రోట్లో వేసి నలగగొట్టటం, తద్దినం నాడు చద్దన్నం తింటానని బెదిరించడం, సైకిలుకొని పెట్టకపోతే తద్దినం పెట్టనని ధాంధూములు చేయడం, కోపం వస్తే చస్తా చస్తానని బెదిరించడం, ఇలా ఒక సారి పేట్రేగి పోయినప్పుడు 'పెద్దాం' మా బావను జబ్బ పట్టుకొని బరబరలాగి కృష్ణ నీళ్ళలో ముంచి ఊపిరాడకుండా చేసి బుద్ధి చెప్పడం వెనకటి ప్రకరణంలో చెప్పాను.

ఆ రోజులలో బాల్యవివాహాలే జరిగేవి కాబట్టి 10,11 సంవత్సరాల వయసుననే ఆడపిల్లలకు వివాహాలు చేసేవారు. 13,14 సంవత్సరాలకు ఆడపిల్లలు అత్తగారింటికి వెళ్ళేవారు. మా అమ్మ 1900 సంవత్సరంలో పుట్టిందనీ నేను 1915లో పుట్టాననీ ఇదివరకే చెప్పాను. బాల్యంలోనే వివాహం అయినా యుక్తవయస్సు వచ్చేసరికి ఒకరికొకరి పై అనురాగబాంధవ్యం దృఢంకావటానికి అవకాశం ఉండేది. బాగా వయసు వచ్చిన తర్వాత పెళ్ళిళ్ళు జరిగిన తర్వాత కొంతకాలానికి శోభనం? జరగటం కూడా ఉంది ఇప్పుడు. అయితే పూర్వకాలపు బాల్యవివాహాల వల్ల లేతవయసుననే వధూవరులు ఒకరికొకరు అంకితమై పోయే భావ మాధుర్యం ఉండేది. అందుకని నేను బాల్యవివాహాలను ప్రచారం చేస్తున్నాననుకోవద్దు. ఆనాటి పరిస్థితులు

తలచుకుంటే ఇప్పుడు ఒళ్ళు కంపర మెత్తుతుంది. ఆ కాలపు పరిస్థితులవి. ఈ కాలపు పరిస్థితులివి.

కేతనకొండలో ఉన్న మగపిల్లల చదువుకోసం కాపురం బెజవాడకు మార్చారని ఇదివరకే చెప్పాను. మా నాన్నగారు,దుర్గయ్య బావ,కుటుంబయ్య బావలు చదువుకు బెజవాడ చేరారు. మా నాన్నగారు బాగానే చదువుకున్నారు. కుటుంబయ్య బావ స్కూలుఫైనల్ దాకా చదివాడు, ప్యాసైనాడో లేదో తెలియదు. దుర్గయ్య బావ ఏ ఫోర్తుఫారం దగ్గరో ఫిఫ్తుఫారం దగ్గరో చదువు ఆపేసి కరణీకం పరీక్షకు వెళ్ళి కరణీకం చేయడానికి వెళ్ళిపోయాడు.

ఈ రోజులలోలాగా ఆ రోజులలో హాస్టళ్ళులేవు. అందువల్ల పట్టణాలలో కాపురాలు పెట్టి పిల్లలను చదివించేవారు. ముఖ్యంగా బ్రాహ్మణ కుటుంబాల వారే పల్లెలు వదిలి పట్టణాలలో చదివించేవారు కాపురాలు పెట్టి. ఈ విధంగా కేతనకొండ నుంచి బెజవాడ కాపురం స్థిరపడింది. అద్దె ఇంటి యజమానులు కూడా బంధుమిత్రులుగానే కలిసి పోయేవారు.

అప్పట్లో బెజవాడలో కంట్రాక్టరుగా పేరుపొంది కొంత ధనికులైనవారు దేవరాజుగారు. వారి ఇల్లు అప్పటి గవర్నరు పేట మార్కెటు రోడ్డులో ఉండేది. దేవరాజుగారి భార్య మహాలక్ష్మమ్మగారు. ఆమె పాతకాలపు ఇల్లాలు. నుదుట పెద్ద బొట్టు పెట్టుకుని కలకలలాడుతూ ఉండేది. నేనప్పట్లో చాలా చిన్న వాడినైనా ఆమె కట్టుబొట్టు రూపురేఖలు నా స్మృతిపథంలో ఇంకా హత్తుకునే ఉన్నాయి దేవరాజుగారు సంపన్నులు. ఆయన స్థాయి పెద్దది. అయినా ఆయన ఇల్లాలు బహు సాత్వికురాలు. మా కేతనకొండ కుటుంబమంతా ఆమె పట్ల భయభక్తులతో గౌరవాభిమానాలతో ఉండేవారు.

మా అమ్మకూడా నాన్నగారితో పాటే బెజవాడ కాపురానికి వచ్చింది. కాపురం బెజవాడకు మార్చినా వచ్చిపోయే చుట్టాలు ఎక్కువగానే ఉండేవారు. ఆనాటి బెజవాడ కాపురానికి ఇంకో ప్రత్యేకత కూడా ఉంది. బెజవాడ మధ్య స్థంగా ఉండి రైల్వే జంక్షన్ కావటం వల్ల కూడా వచ్చిపోయే చుట్టాల తాకిడి ఎక్కువగానే ఉండేది. అంతా దగ్గర దగ్గర బంధువులేనాయె. వీళ్ళెప్పుడు వచ్చినా మడిబట్టలు మడిభోజనం కావాలనేవారు. అందువల్ల మడిపంచెలు ఆరేసి సిద్ధంగా ఉంచాలి. చాలా స్థితిమంతులైతే తప్ప వంటవాళ్ళను పెట్టుకొనే

వారు కాదు. ఇంట్లో గృహిణే మడికట్టుకుని వంటచేయాలి. అతిథి సత్కారం చేయాల్సి ఉండేది. అది కుటుంబం పరువు మర్యాదలకు సంబంధించిన విషయంకూడా. కేతనకొండ కుటుంబం వారు కూడా ఈ చేదస్తపు మడి,మైల, ఆచారాలను పాటించేవారు. ఆనాటి వాళ్ళ ఆచారాలు, జపతపాలు, స్నానసంధ్యలు వారి వ్యావహారిక జీవితం మీద ఏమీ ప్రభావం చూపినట్లు లేదు. వీళ్ళలో కరణాలు కూడా ఉండేవారు. వీళ్ళు నిత్యజీవితంలో మంచి వ్యవహర్తలు. లోక వ్యవహారాలలోనే మునిగి తేలుతుండేవారు. భక్తిలేని పూజ పత్రిచేటు అన్నట్లుగా ఉండేవి మడి, దడి, కుటుంబాచారాలు.

మా అమ్మ లక్ష్మమ్మ ఇంటికోడలు. కోడలు చూపవలసిన వినయ విధేయతలు, నమ్రతలు, నిర్వహించ వలసిన బాధ్యతలు మోయ వలసిన బరువులు ఉంటాయి. అత్తమామలకు నమ్రతతో పరిచర్యలు చేయటం, ఇంట్లో వంటా వార్పు మొదలైన చాకిరీ కోడలుకు తప్పేవి కావు. ఈ ఇంటి అనుదిన చాకిరీలో బట్టలు ఉతికి మడికి ఆరవెయ్యడంకూడా ఒక కార్యక్రమం. చాకలి బట్టలు ఉతికి తడిగా ఉంచితే వాటిమీద నీళ్ళు చల్లి మళ్ళీ తడిపి ఆరేస్తేగాని ఆ వస్త్రాలు మడికి పనికిరావు. ఈ విధంగా కుళాయి దగ్గర బట్టలు వుతికి మడికి ఆరేసే బాధ్యత మా అమ్మ వహించ వలసి వచ్చింది. మామూలు బట్టలు చాకలి ఉదయం తీసుకొని వెళ్ళి సాయంత్రం తెచ్చి ఇచ్చేవాడు. ఈ పద్ధతి ఆనాడు బెజవాడలో కూడా ఉండేది. కాని ఇంటి మడి వాడకానికి కావలసిన పంచలు చీరలు అన్ని ఇంటి దగ్గరే ఒక చిన్న చాకిరేవు నడిచేది. ఇది చాలా శ్రమ అయినా కోడలి కర్తవ్యంగా అమ్మ బాధ్యత తీసుకొనేది.

ఒక రోజున మా అమ్మను మడిగట్టుకుని కందిపచ్చడి, వంకాయ పచ్చిపులుసు పచ్చడి చేయమన్నారు. ఆ రోజుల్లో పచ్చళ్ళు ఉంచటానికి 'రాతి చిప్ప' లేదా 'రాచ్చిప్ప'లు ఉండేవి. ఇప్పుడన్నీ గాజు, ప్లాస్టిక్కు వస్తువుల మయమైపోయింది కాబట్టి రాచ్చిప్పలంటే ఏమిటో తెలియక పోవచ్చు.ఇంకా ఎక్కడైన పల్లెటూళ్ళలో పాతతరం వాళ్ళ వాడుకలో అవి ఉన్నాయేమో! అప్పట్లో మా కుటుంబానికి కావలసిన కందిపచ్చడి తయారుచేయాలంటే ఒకటిన్నర లేక రెండు కిలోల కందిపప్పు రుబ్బురోలులో వేసి పాత్రంతో రుబ్బాల్సివచ్చేది. ఈనాటి గ్రైండర్లు వాళ్ళ ఊహాప్రపంచంలో కనిపించే

అవకాశం కూడా లేదు. మన దేశంలోనే కాదు. పాశ్చాత్య దేశాలలో కూడా ఉండేవి కావు. ఇట్లా రెండుకిలోల కందిపప్పు రోట్లో వేసి పాత్రంరాయిపీడి పట్టుకొని రుబ్బేటప్పటికి చిన్నప్పటినుంచి అతి సుకుమారంగా పెరిగిన మా అమ్మ చేతులు బొబ్బలు పొక్కినాయి. తరవాత కాలేసిన వంకాయలు వొలిచి పచ్చిపులుసులో ఉప్పుకారంవేసి చేతితో నలిపి పులుసుపచ్చడి చేసేటప్పటికి ఇహ మా అమ్మ చేయిమంటలెత్తి ఉండాలి పాపం చెప్పతరం కాకుండా ఉండిఉండాలి. ఎవరితో ఏమని చెప్పుకోవాలో తెలియక ఒక మూల కూర్చుని లోపలలోపలనే ఏడవటం మొదలుపెట్టింది. ఒక మూల కూర్చుని ఏడుస్తున్న మా అమ్మను దేవరాజు గారి భార్య అన్నపూర్ణమ్మగారు చూసి చాలా జాలిపడి ఇంట్లో పెద్దవాళ్ళను పిలిచి మీకేమైనా మతులున్నాయ్రా అని మందలించింది. మా అమ్మకు ఎంత బాధ కలిగిందో చెప్పి అందర్నీ చీవాట్లు పెట్టింది. పచ్చడి చేయమని చెప్పారే కాని మా అమ్మ పాపం అందుకు శక్తిమంతురాలో కాదో మా మేనత్తలు ఆలోచించ లేదు. వాళ్ళంతా పల్లెటూళ్ళలో పెరిగారు. చిన్నప్పటినుంచీ ఇటువంటి వాటికి అలవాటు పడ్డారు. అయితే అమ్మ గారాబంగా సుకుమారంగా పెరిగింది. ఆ విషయం వాళ్ళు ఆలోచించలేదు. ఇంటి యజమానురాలు అన్నపూర్ణమ్మ గారంటే అందరికీ భయమే కనుక తమ తప్పు తెలుసుకుని విచారపడ్డారు.

## మా అమ్మకు కృష్ణ కాలువగండం

దేవరాజు గారింటికి దాదాపు రెండు కిలోమీటర్ల దూరంలో కృష్ణరేవు ఉన్నది. అక్కడకు వెళ్ళి స్నానం చేసి ఒక బిందెడు మంచినీళ్ళు మడిగా తేవాలి. ఒకరోజు ఈ పని మా అమ్మకు అప్పగించారను కుంటాను. ఇంట్లో వారందరితో పాటు అమ్మకూడా ఉదయమే కృష్ణాస్నానానికి పోయింది స్నానం చేస్తుంటే కాలుజారి నీళ్ళలోకి పోయింది. ప్రాణానికే ప్రమాదం సంభవించ వలసిందే. అదృష్టవశాత్తు దగ్గర్లో ఉన్నవారొకరు బయటకు లాగారు. అమ్మో అమ్మో ఇవాళ లక్ష్మమ్మకు ఎంత గండం తప్పిందను కున్నారు అంటూ బుగ్గలు నొక్కుకుంటూ అమ్మ వెంట వెళ్ళినవాళ్ళంతా ఇంట్లో బాధపడుతూ చెప్పుకున్నారుట. ఇంట్లో వాళ్ళ మనస్సుల్లో ఇంకో బాధకూడా ఉంది. మా

అమ్మ తండ్రిగారు రంగారావుగారు పెద్ద హోదాలో ఉన్నవాడాయె. ఏదైనా అయితే ఆయనకు సమాధానం చెప్పుకోవటానికేమైనా ఉందా? అంతేకాని అయ్యో చాలా గారాబంగా సుకుమారంగా పెరిగిందే ఈ పిల్లకు ఇటువంటి పనులు చెప్పవచ్చా అని కాదు. మైలుదూరం నుంచి మడినీళ్ళ బిందె మోయమనటం మోటుపని చెప్పటమే ఆ పిల్లకు అని వాళ్ళకు తోచలేదు. ఆ రోజుల్లో ఇంచుమించుగా అన్ని కుటుంబాల వాళ్ళు ఉదయమే స్నానాలకు కృష్ణానదికి వెళ్ళి వచ్చేవారు. మడిబిందెలతో మంచినీళ్ళు తెచ్చుకునేవారు. అయితే బెజవాడ కాపురంలో అయిన అలవాటు ఆ తరవాత మా అమ్మ నాన్నలు పల్లెటూళ్ళలో కాపురం పెట్టినప్పుడు చెరువు నుంచి మంచినీళ్ళు తెచ్చుకోవడంలో మా అమ్మకు తోడ్పడింది.

## నెత్తిమీద నీళ్ళబిందెలు

మా అమ్మ మాకు ఆ రోజుల సంగతులు చెపుతూ ఇంకో విషయం కూడా చెపుతూ ఉండేది. తాను చిన్నప్పుడు కాకినాడలో ఉన్నప్పటి ముచ్చట అది. కుళాయిల నుంచి చెరువుల దగ్గర నుంచి అప్పలమ్మలంతా నీళ్ళబిందెలు నెత్తి మీద పెట్టుకొని చేతులతో పట్టుకోకుండా నడిచేవారట. నేడు భరతనాట్యంలో నెత్తిమీద చెంబులు కిందపడకుండా నాట్యం చేసినట్లు వాళ్ళు చేతులు వదిలేసి చేతులాడించుకుంటూ కబుర్లు చెప్పుకుంటూ వయ్యారంగా విలాసంగా చురుగ్గా నడిచిపోతుంటే మా అమ్మకు ఆశ్చర్యం వేసేదట. అందు చేత మా అమ్మ ఏమే అమ్మీ! చేతులతో పట్టుకోకుండా తలమీద బిందె ఎలా నిలుస్తుందే అని అడిగేదట. అప్పుడు వాళ్ళు "అమ్మగోరూ! దానికో మంత్రం ఉంది" అనే వాళ్ళట. మా అమ్మ తరవాత తెలుసుకొని ఉంటుంది, అది అభ్యాసం మీద అలవడ్డదేనని.

## విజయవాడలో శర్మ తాతయ్య ఆదరణ

మా అమ్మ బెజవాడ కాపురంలో అక్కడే మా రంగారావు తాతయ్య పినతల్లి కుమారుడు డాక్టర్ ఘంటసాల సీతారామశర్మగారు డాక్టరు ప్రాక్టీసు చేస్తూ ఉండేవారు. ఆ రోజుల్లో ఆయనక్కడ పెద్ద డాక్టరుగా పేరు పొందారు. ఆయన

ఒకరోజున మా అమ్మ కాపురం చూశారుట. మా అమ్మ పుట్టింట్లో ఎంత సుకుమారంగా సుఖంగా పెరిగిందో ఆయనకు తెలుసు. అంచేత ఆయన లోపల బాధపడి కేతనకొండ వారితో తన బంధుత్వం తెలుపుకుని మా అమ్మను పుట్టింటికి తీసుకొని వెళుతున్నట్లు తీసుకొని వెళుతూ ఆదరించేవారుట. ఈ ఆదరణ మా తరంలో కూడా మేమంతా డాక్టర్లు ఇంజనీర్లమయిన తర్వాత కూడా ఆయన పోయేవరకూ కొనసాగుతూనే వచ్చింది. ఈ పరిచయంతో మా కేతనకొండ బంధువర్గమంతా ఏ జబ్బు చేసినా వెళ్ళి శర్మ తాతయ్య గారి ఇంట్లో మడి భోజనాలతో సహా మకాం వేసుకుని మందులు పుచ్చుకునేవారు. ఆనాటి బంధుప్రేమలు, ఉమ్మడి కుటుంబాల ఆదరణలు అట్లా ఉండేవి.

డాక్టర్ శర్మగారు మా అమ్మకు పినతండ్రి కాబట్టి మా ఒక్క కుటుంబానికే ఆ ఆదరణ పరిమితమై ఉండేది కాదు. అట్లా కాకుండా మా అమ్మ అత్తవారివైపు వారంతా భోజనాలతో సహా ఇంట్లో వైద్యానికి చేరేవారంటే ఇది ఈనాడు అపాత్రదానంవంటి ఆదరణ మేమోననిపిస్తుంది. నాకు మూడో ఏడు నిండేసరికే మా రంగారావు తాతయ్య పోయేసరికి మా అందరికీ డా॥ శర్మ తాతయ్యే నిజమైన అమ్మ తరపు తాతయ్య అయినాడు.

## కథా, నవలా, జాతి చరితా!

ఒక వ్యక్తి చుట్టూ ఉన్న జీవితానుభవాలను ఆ వ్యక్తి స్వభావాన్ని వర్ణించుకుంటూ సంక్షిప్తంగా చెబితే అది ఒక కధ అవుతుంది. అదే కొందరి వ్యక్తుల సాముదాయిక జీవితాన్ని సంఘ జీవనస్రవంతిలో జరిగిన సంఘటనలను వర్ణించి చెపితే ఒక నవల అవుతుంది. ఒక గొప్ప వ్యక్తి జీవితచరిత్రను మొదలు పెట్టే ఒక ఘట్టం వరకు వేరెవరైనా ఇష్టం వచ్చినంత మేరకు రచించినా అది జాతి చరిత్రగా గాని, చరిత్రలో ఒక భాగంగా గానీ తప్పకుండా రూపొందుతుంది. ఇక ఆ వ్యక్తే వ్రాస్తే అది స్వీయచరిత్ర అవుతుంది. వేరే రచయిత వ్రాస్తే జీవిత చరిత్ర అవుతుంది. ఇవన్నీ చరిత్రలో భాగాలే. ఈ విధంగా కేతనకొండ ఉమ్మడి కుటుంబంలో ఒక భాగమైన ఒక వ్యక్తి మా కుటుంబయ్య బావ కథలోనే ఎన్నో సన్నివేశాలు, సంఘటనలు మెరిసిమెచుకొని పోయినాయి. ఆనాటి పెద్దలు, పెళ్ళిళ్ళ విషయంలో మేనరికాలకు అత్యంత ప్రాధాన్యం ఇచ్చేవారు. వాటి

తమాషాలు, మంచిచెడ్డలు ఒక్క మనిషి కథలోనే చోటు చేసుకోవడం ఎక్కడైనా అరుదైన సంగతి. అయితే మా కుటుంబయ్య బావ విలక్షణ ప్రవృత్తి కలవాడు, విచిత్రానుభవాలు కలవాడు. అందువల్ల పెద్దయిన తర్వాత ఎంతో సమర్థుడై ఆస్తిని ఎన్నోరెట్లు తన తెలివితేటలతో వృద్ధి చేసినవాడు, కుటుంబానికి ఆర్థిక స్తోమతను, సుఖసంతోష సౌకర్యాలను చేకూర్చిన వాడు దుర్గయ్య బావే అయినా ఆయన ఈ కథలో కథానాయకుడు కాలేకపోతున్నాడు. అదే ఒక్కొక్క వ్యక్తిలో ఉండే విశేషం. మళ్ళీ ఈ అధ్యాయంలో కూడా కుటుంబయ్య బావే కథానాయకు డవుతున్నాడు.

## మా మేనత్తల కుటుంబాలు

మేనరికాల సంబంధాల గురించి చెప్పడం ఈ అధ్యాయంలో నా ఆశయం కాబట్టి ముందు మా ముగ్గురు పునిస్త్రీ మేనత్తల గురించి చెప్పడం బాగుంటుంది. మా కేతనకొండ మేనత్తరత్తమ్మ గారి రెండవ కుమారుడు కుటుంబయ్య బావ కథంతా కేతనకొండ చుట్టూనే పరిభ్రమిస్తుంది కాబట్టి ఆవిడను ఇక్కడ వదిలేద్దాం. ఆవిడ తర్వాత మేనత్త సీతమ్మగారు. ఆమె కాపురం బాపట్ల. మా మామయ్య శివరామయ్యగారు బాపట్లలో ప్లీడరు ప్రాక్టీసు చేసేవారు. ఆ రోజుల్లో ఫస్టు గ్రేడ్ ప్లీడర్‌గా ప్రాక్టీసు చేయడం కూడా గొప్పగానే ఉండేది. వీళ్ళు కింది కోర్టులలో వాదించేవారు. బి.ఎ., బి. ఎల్. ప్లీడర్లైతే హైకోర్టు వరకూ వాదించవచ్చు. అయితే శివరామయ్య మామయ్యది సొంత ఊరు మా స్వగ్రామం ప్రాతూరు దగ్గరే కృష్ణ ఒడ్డుకు దిగువన ఉండే నూతక్కి. వారి ఇంటి పేరుకూడా ప్రాతూరు వారే. అయితే వాళ్ళది వేరే గోత్రం కావడం వల్ల మా మేనత్త నిచ్చారు. ఆయన తర్వాత బాగా సంపాదనపరుడై బాపట్లలో పేరుపడ్డ ప్లీడరుగా ఉండి సంపన్న గృహస్థుగా ఉండేవాడు. ఆయనకు ఒక్కడే కుమారుడు మా లక్ష్మీనారాయణ బావ. ఆయన కూడా ప్లీడరు పరీక్ష ప్యాసై తండ్రిగారిని వృత్తి నుంచి రిటైరు చేయించి ఆ పనంతా ఆయనే నిర్వహించుకునేవాడు. అయితే మా లక్ష్మీనారాయణ బావ ఈ కథలోకి ప్రవేశించేటప్పటికి ఆయనకు 18 సంవత్సరాలే వయసు. ఆయనకు పెళ్ళి కావాలి. అందంగా ఉండేవాడు. అందుచేత మా పెదనాన్నగారికి లక్ష్మీనారాయణ

బావ ఒక ముద్దుల మేనల్లుడు. రెండో మేనల్లుడు మా కుటుంబయ్య బావ. మా మూడో మేనత్త ఇంటి పేరు చైనంవారు. ఆమె పేరు సోమిదేవమ్మగారు. ఈమెకు కూడా ముగ్గురు మగపిల్లలు ఒక ఆడపిల్ల ఉండేవారు. ఈ ముగ్గురు మగ పిల్లలు కూడా మా పెదనాన్న గారికి మేనల్లుళ్ళే. అయితే వారిది కొంచెం బీదకుటుంబం కావడంవల్ల పెళ్ళిసంబంధాల విషయంలో వాళ్ళు అప్పట్లో గణనకు రాలేదు.

ఇక మేనరికాల విషయంలో శ్రద్ధ చూపుదామనే ఆసక్తి, సంకల్పం మా పెదనాన్నగారికి ఆయన పెద్ద కుమార్తె వర్ధనమ్మక్కయ్యకు 8,9 సంవత్సరాలు రాగానే అప్పటి నుంచీ మొదలైంది. మరి ఆ రోజుల్లో 'అష్టవర్షాత్ భవేత్కన్యా' అని ఆడపిల్లకు ఎనిమిదేళ్ళు రాగానే పెళ్ళిచేయాలనే తహతహపడేవారు కదా! అప్పట్లో రజస్వలానంతర వివాహాలు నిషేధం అని కూడా అనుకునేవాళ్ళు. కొంప మునిగిపోయినట్లు బాధపడేవాళ్ళు రజస్వల అయిన తర్వాత కూతురు పెళ్ళిచేయడం. అందువల్ల మా పెదనాన్నగారు వర్ధనమ్మక్కయ్య పెళ్ళి ప్రయత్నం మొదలుపెట్టారు.

అయితే మా కుటుంబయ్య బావ కొంచెం నల్లగా ఉండేవాడు. మా రత్తమ్మత్తయ్య బాగా నలుపు. ఆవిడ భర్త కిష్టయ్య మామయ్యేమో బాగా రంగుగా ఉండేవారుట. మా కుటుంబయ్య బావ లావుగా ఉండడం చేత సంబంధాలు వచ్చి తిరిగిపోతూ ఉండేవిట. కుటుంబయ్య బావ లావంటే లావే, బాగాలావు. పద్దెనిమిదేళ్ళ వయసున పొడుగ్గా ఉన్నా చాలా లావుగా ఉండేవాడు. నలుపే కాక బాగా లావుగా కూడా ఉండడం చేత చూడగానే నచ్చే వాడు కాదు పెళ్ళి కొడుకుగా. వీరు ఎంత స్థితిమంతుడైనా సంపన్న గృహస్థుడైనా ఆయనకు పిల్లనిచ్చేవారు కూడా సంపన్న గృహస్థులే కదా! అంచేత తమ అమ్మాయికి ఈడూజోడూ కాడని వెనక్కిపోయేవారు. ఆ రోజుల్లో పిల్లా పిల్లవాడూ చూసుకొనే పెళ్ళి చూపులుండేవి కావు. పెద్దవాళ్ళే వధువూ వరుణ్ణీ చూసి ఇరుపక్షాలవారూ ఇష్టపడితే జతకలిపేవారు. పెళ్ళిముహూర్తం నిశ్చయించి పిల్లలకు చెప్పేవారు. ఇక పెళ్ళికూతురు, పెళ్ళికొడుకు ఒకళ్ళనొకళ్ళు చూసుకునేది పెళ్ళి పీటల మీదే. ఈ విషయం మా తరానికే బోలెడు ఆశ్చర్యం గొల్పేది. ఇక ఈ తరం వారికి అనూహ్యం అలాంటి వివాహాలు.

ఈ కారణాల వల్ల మా పెదనాన్నగారి ఉద్దేశమంతా మా బాపట్ల మేనత్త కొడుక్కి తన పిల్లను ఇవ్వాలని ఉండేది. పైగా మా బాపట్ల బావ అందగాడు

కూడా కదూ! ఆయన చూపు మా లక్ష్మీనారాయణ బావమీద ఉండేది. అయితే మా కుటుంబయ్య బావ జనక తండ్రి కృష్ణయ్య మామయ్యకు మా పెదనాన్న కూతురు వర్ధనమ్మక్కయ్యను తన కోడలుగా చేసుకోవాలని ఉండేది. దీనికి రెండుకారణాలు. ఒకటి మా వర్ధనమ్మక్కయ్య ఎర్రగానూ అందంగానూ ఉండేది. రెండోది ఇతర సంబంధాలేవీ అనుకూలించటం లేదు. అన్నీ తిరిగి పోతున్నాయి. ఆ రోజుల్లో ఒక సంపన్న గృహస్థుడి కొడుక్కి సంబంధం తిరిగిపోయిందంటే ఎంతో అవమానకరం. ఈ రోజుల లాగానే ఆరోజులలో కూడా వరుడిదే పైచేయి మగపెళ్ళివాళ్ళు ఆడపెళ్ళివాళ్ళను తిరస్కరించవచ్చు కాని చూపులదాకా వచ్చిన తర్వాత మగపెల్లవాణ్ణి తిరస్కరిస్తే ఇంకా ఏమైనా ఉందీ? ఆదరించినా, అక్కర్లేదు పొమ్మన్నా మగ పెళ్ళివాళ్ళే అనాలి. మా కుటుంబయ్య బావ విషయంలో ఇందుకు వ్యతిరేకంగా జరుగుతున్నది. ఈ విధంగా మా పెదనాన్న కూతురి పెళ్ళి విషయం ఈ రెండు మేనరికాల మధ్య ఊగిసలాడింది.

మొదటిమెట్టుగా తాను స్వయంగా వెళ్ళకుండా మా పెదనాన్నగారు బాపట్ల సంబంధానికి ఆయన బావగారైన మా మామయ్య కృష్ణయ్యగారిని పంపించారు. ఇందులో మా పెదనాన్న గారి తెలివితక్కువతనం కనపడుతూనే వుంది కదా! ఇక మా కృష్ణయ్య మామయ్య ఆ కాలపు కరణం. అంటే సాఫీగా నడవనిస్తే మన ప్రజ్ఞ ఏముందీ? అనుకొనేవారు ఆ కాలపు కరణాలు. కరణమంటేనే పేచీ. అంతా కరణీకమే. అదీగాక మా కృష్ణయ్య మామయ్యకు తన కొడుకు కుటుంబయ్యకు మా వర్ధనమ్మక్కయ్యను చేసుకుందామని ఉందికదా! అలాంటి మనిషిని రాయబారం పంపడమేమిటి? ఆ వ్యవహారం ఎక్కడైనా సాఫీగా నడుస్తుందా? మా పెదనాన్నగారు చేసింది రెవిన్యూ డిపార్టుమెంటు ఉద్యోగమైనా రోజూ వందమంది కరణాలతో ఫాయిలా పాయిలా వ్యవహారాలు చూసి వాళ్ళ స్వభావాలు బాగా గ్రహించినవాడైనా ఇక్కడ సొంత విషయంలో పప్పులో కాలేశాడనే చెప్పవచ్చు.

కృష్ణయ్య మామయ్య బాపట్ల రాయబారం వెళ్ళాడు. మా ప్రాతూరి వారి కుటుంబంలో ఉబ్బసంవ్యాధి ఉండేది. మా నాన్నగారి తల్లికి అంటే మా నాయనమ్మకు బాగా ఉబ్బసం ఉండేది. ఇది వంశపారంపర్యా అందరికీ రాకపోయినా కొందరికి తప్పకుండా వచ్చే అవకాశం లేకపోలేదు. తర్వాత మా మేనత్తలలో బందరు మేనత్త చాలాకాలం ఉబ్బసంతో బాధపడుతూనే ఉండేది.

నలుగురు పిల్లల తల్లి అయినా ఆవిడకా బాధ తగ్గలేదు. మా నాన్న అన్నదమ్ములలో మా నాన్నగారికి ఉబ్బసంవ్యాధి ఆయన్ను ఎంతో కుంగ దీసింది. ఆయన ఎంతో పైకి రావలసినవారు ఎంతో వెనుకబడటానికి కారణమైంది. ఇదంతా తరవాత కాలంలో జరిగిన విషయం అనుకోండి. అయితే కుటుంబంలో ఉబ్బసం ఉన్నదనే ఒక మిష మీద లేదా అనుమాన కల్పనం మీద మా శివరామయ్య మామయ్య కుటుంబంవారు యీ సంబంధానికి ఒప్పుకోలేదని కృష్ణయ్య మామ రాయబారంలో వాళ్ళ సందేశం తీసుకొనివచ్చారు. ఇది 'కృష్ణరాయబారం' అంత పేరు తెచ్చుకుంది. పాండవులు అవమానభారంతో కోపం తెచ్చుకున్నట్లే 'ఆ శివరాముడికి ఇదొక కుంటిసాకు దొరికిందా' అని మా పెదనాన్నగారు ఆగ్రహోదగ్రులైనారు. అసలు ఒక విషయం చెప్పాలి. కోపం ముందు పుట్టి, ఆ తర్వాతే మా పెదనాన్నగారు పుట్టారు. దాంతో మా పెదనాన్న గారికి చర్రున కోపం వచ్చి తన చెల్లెలు సీతమ్మగారి ఇంటి గడప దాదాపు పది సంవత్సరాల దాకా తొక్కలేదు మా పెదనాన్నగారు. బాపట్ల ఊసే ఎత్తలేదు. ఈ సంబంధం కలిసి రాకుండా పోవడానికి మా కృష్ణయ్య మామయ్య కరణీకం కూడా కొంత ఉందనీ, ఆయనను ఈ రాయబారం పంపటం చాలా తెలివితక్కువ అనీ చాలామంది ఇంట్లో అనుకున్నారు. అయితే ఏం లాభం. జరగాల్సిందేదో జరిగిపోయె! ఈ విధంగా కుటుంబాలలో వైమనస్యాలు, ఉద్రేకాలు పెరగడం జరిగి పోయింది. మా బాపట్ల లక్ష్మీనారాయణబావ పెళ్ళికి మేమంతా చిన్నవాళ్ళం వెళ్ళాంగాని మా పెదనాన్నగారి కుటుంబం నుంచి ఎవరూ రాలేదు. ఈ విధంగా ఆ రెండు కుటుంబాల వారి మధ్యా ఒక దశాబ్దం రాకపోకలు లేకపోయినాయి. ఆ రోజులలో పట్టుదలలు, అహంభావాలు అలా ఉండేవి. ఆ కోపతాపాలే కొంచెం పాలులో మాకు కూడా సంక్రమించాయేమో ననుకుంటాను.

## నేనూతిలో బడి చస్తా!

ఇహమిగిలింది మా పెదనాన్న గారి కుటుంబ దృశ్యం. మా కుటుంబయ్య బావ సంబంధం. బాపట్లవారి మీది కోపంతో వర్ధనమ్మక్కయ్యను

కుటుంబయ్యకు ఇస్తానని మా పెదనాన్నగారు ప్రకటించారు. (బహుశః మా కృష్ణయ్య మామయ్య కోరుకున్నది అదేనేమో!) కన్యాశుల్కంలో అగ్నిహోత్రావధానులు ప్రకటించినట్లే 'తాంబూలాలిచ్చేశాను, తన్నుకు చావండి '! అన్నట్లు మా పెదనాన్నగారు ప్రకటిస్తే అది శాసనమేకదా! ఇహ పెళ్ళి అయినట్లే. ఆటంకమేముందీ? మా వర్ధనమ్మక్కయ్యకి కూడా అప్పటికి ఎనిమిదితొమ్మిదేళ్ళ వయసేకదా! ఈ సంబంధం నాకొద్దనికాని, కావాలని కాని చెప్పే సమస్య ఏముంది ? అందుచేత సామాన్యంగా అయితే మా వర్ధనమ్మక్క పెళ్ళి మా కుటుంబయ్య బావతో అయినట్లే లేదా కాబోతున్నట్లే భావించు కోవాలి. అయితే ఈ కథ అట్లా సాగలేదు. కొంచెం అడ్డం తిరిగింది. చిన్నపిల్లే అయినా మా వర్ధనమ్మక్కయ్య ఎందుకో గాని, కుటుంబయ్య బావకిస్తే నేను నూతిలోకి దూకి చస్తా' అనే నినాదం మొదలెట్టింది. వత్తిడి, లాలన, బుజ్జగింపు ఎక్కువైనకొద్దీ మా అక్కయ్య భావప్రకటన కూడా అంత కంతకు ఎక్కువగా సాగింది. 'పుత్తడి బొమ్మా పూర్ణమ్మా' కథలా తయారవుతుందేమోనని భయపడ్డారు ఇంటివారు. అంచేత మా పెదనాన్న గారు సందిగ్ధంలో పడ్డారు. కాని తన బిడ్డకు ఈ సంబంధం విషయంలో ఎందుకింత వ్యతిరేకత కలిగిందో గ్రహించలేక పోయారు పెదనాన్న కుటుంబంవారు. దానికో కిటుకుంది. ఆ రహస్యం మా అమ్మ లక్ష్మమ్మగారు.

మా అమ్మ మద్రాసు నుంచి వచ్చిందనీ కుటుంబ సభ్యులందరిలో నాగరక భావాలు కలదని ఇదివరలోనే చెప్పాను కదా! అందుచేత మా అమ్మకు నల్లగా లావుగా ఉన్న కుటుంబయ్యబావకు పండంటి మా వర్ధనమ్మక్కయ్యను కట్టబెట్టడం ఏమాత్రం ఇష్టంలేకపోయింది. అందులో కేతనకొండ కాపురానికి వెళ్ళినప్పుడు ఆ చిన్నతనపు రోజులలో కుటుంబయ్య బావ వెర్రి మొర్రి గారాబపుచేష్టలు, పిచ్చి పట్టుదలలు, తెలివితక్కువతనాలు మా అమ్మకు తెలిసినట్లు మరెవరికీ తెలియవాయె. పాపం మా కుటుంబయ్య బావ లావన్న మాటేకాని కనుముక్కు తీరు బాగానే ఉండేది. నల్లరంగైతే మాత్రం నాణ్యంకాదా అని ప్రశ్నిస్తే నాణ్యమే సుమా అని చెప్పటానికి తగినట్లుగానే ఉండేవాడు. కాని అందరూ తిరిగిపోతున్న, ఎవరూ నచ్చని కుటుంబయ్యకు మన అమ్మాయిని ఇవ్వడమేమిటి? అని మా పెద్దమ్మ ఉద్దేశంగా ఉండేది. అందువల్ల మా అమ్మ

వర్ధనమ్మక్కయ్యను మెల్లిగా బుజ్జగించి చెవిలో ఒక చిన్నరహస్యం ఉపదేశించింది. అది మంత్రం లాగా పనిచేసింది. "ఎవరైనా నిన్ను కుటుంబయ్య బావను చేసుకుంటావా?" అని అడిగితే, అసలా ప్రసక్తి తెస్తే "నూతిలో పడిచస్తాను" అని బెదిరించమంది. ఇది రహస్యంగా ఉంచేం. ఈ గుట్టు బయటకు పొక్కకూడదు. ఈ మాట నీకు చెప్పానని ఎవరికీ చెప్పవద్దు. కొంప మునుగుతుంది అని గట్టిగా బోధించింది కూడా మా అమ్మ వర్ధనమ్మక్కయ్యకు. పాపం మా అక్కయ్య చిన్నదైనా ఈ రహస్యం ఎక్కడా పొక్కకుండా కాపాడింది చాలా సంవత్సరాలు దాచింది. అయినా కుటుంబయ్య బావ స్వరూపం మా అక్కయ్యకు మాత్రం తెలియకపోతే గదా! చూస్తూనే ఉండేది గదా. ఎలా మరిచిపోతుంది. అంచేత మా అమ్మ ఉపదేశించిన మంత్రం మా బాగా పనిచేసింది. ఈ జపం బాగా చెయ్యడం మొదలెట్టింది. ఎవరెంత బతిమాలినా అంత చండశాసనుడు, కోపిష్ఠి మనిషి అయిన మా పెదనాన్న కూడా ఎంతగానో శాంతంగా మెల్లిగా కూర్చుని నచ్చచెప్పడానికి ప్రయత్నించినా 'ససేమిరా' ఆ మాట మాత్రం వద్దనేది. ఇది మా పెదనాన్నగారి కుటుంబాన్ని అప్పట్లో చాలా కలవర పరిచింది.

ఆ చిన్నపిల్లకు అంత వ్యతిరేకభావం ఎలా కలిగిందో ఎందుకు కలిగిందో ఎవరేనా గట్టిగా బోధించి ఉండాలి అని అనుకున్నా ఈ సమస్యను ఏ విధంగా పరిష్కరించాలో మా పెదనాన్నగారికి దిక్కుతోచకుండా పోయింది. అది మా అమ్మ బోధించిన ఫలితమని ఆ తర్వాత కొన్ని దశాబ్దాలవరకు బయట పడలేదు. మా వర్ధనమ్మక్కయ్య ఈ విషయం గుంభనంగా ఉంచినందుకు మెచ్చుకోవాలి. మా అమ్మ సుకుమార ప్రవృత్తికి నాగరక భావాలను కూడా మెచ్చుకోవాలి. చేసేది లేక ఈ మేనరికం వదులుకున్నారు.

తరవాత దగ్గరలోనే కుంటముక్కల కరణంగారి కుమారుడు రాఘవరావు బావతో వైభవంగా మా అక్కకి విజయవాడలో వివాహం జరిగింది. అక్కయ్యకు దగ్గరదగ్గర పదిమంది పిల్లలు పుట్టారు. ముగ్గురో నలుగురో ఆడపిల్లలు ఐదారుగురు మగపిల్లలు అనుకుంటాను. పిల్లలకోడిలా ఎప్పుడూ కలకలలాడుతూ ఉండేది. ఎప్పుడూ నవ్వు మొహంతోనే ఉండేది. మా రాఘవరావు బావ కూడా సంబంధాలన్నీ దగ్గర ఊళ్ళ కరణాలతోనూ

బంధుబలగాలతోనూ చేశాడు. ఇందువల్ల మా అక్కయ్యకు ఒక పెద్ద సామ్రాజ్యం ఏర్పడింది.

మా కుటుంబయ్య బావకు కూడా రాసిపెట్టిన సంబంధం జరిగింది. భట్టిప్రోలు వారి సంబంధం. మా మాణిక్యమ్మక్కయ్య నిచ్చారు. ఆవిడగూడా కొంచెం నలుపూ, లావూనూ. ఇద్దరూ కాస్త నలుపు లావూ అయినా కలకలలాడే వదనారవిందాలతో మహాఉల్లాసంగా పరమానందంగా ఉండేవాళ్ళు. కేతనకొండ వెళ్ళినప్పుడుల్లా మా బావతో అక్కయ్యతో పాతకాలపు కథలు చెప్పుకుంటూ కాలక్షేపం చేసేవాళ్ళం. మా కుటుంబయ్య బావకు కూడా ముగ్గురు కూతుళ్ళు, ఒక కొడుకు. వాడిపేరు శర్మ.

శర్మ కూడా కొంచెం లావు. మేం విశాఖపట్టణంలో ఉన్నప్పుడు అక్కడ ఆంధ్రా యూనివర్శిటీలో ముగ్గురు శర్మలు చదువుకోవడానికి వచ్చారు. ఊరు కొత్తకావడం చేత వాళ్ళంతా మా 'గార్డియన్ షిప్' లోనే ఉండేవాళ్ళు. హాస్టలులో సీటు దొరికినంతవరకూ ఒకనెల మా ఇంట్లోనే భోజనం చేసి వెళ్ళేవారు. ఒకడు పొడుగుశర్మ. మద్రాసులో ప్రముఖ వాణిజ్య వేత్త సోమయాజులుగారి అబ్బాయి. రెండో శర్మ మా మేనల్లుడు, కొంచెం పొట్టిగా ఉండేవాడు. జియాలజీ ఎమ్.ఎస్.సి చదువుతూ ఉండేవాడు. వాడిని పొట్టి శర్మ అనేవాళ్ళం. మూడో శర్మ కుటుంబయ్య బావ కొడుకు శర్మ. కొంచెం లావుగా ఉండేవాడు. వాడిని 'లావు శర్మ' అనేవాళ్ళం. ఇంట్లో పిల్లలు సరదాగా అలా పిలిచేవారు.'పొడుగు శర్మ' 'పొట్టి శర్మ' 'లావుశర్మ' ఈ మాదిరిగా యీ ముగ్గురు శర్మలు విద్యార్థులుగా మా అధీనంలో ఉండి చదువుకుని పెద్దవారైనందుకు సంతోషం.

## 'పువ్వు పుట్టగానే పరిమళిస్తుందా'

అనే సామెత వుందికదూ! మనం చూసిన జీవితాలలో ఇది ఎంతవరకు అనువర్తిస్తుందో చూద్దాం. మా కుటుంబయ్య బావ విషయమే చూద్దాం. చిన్నప్పుడెంతో అల్లరిచేసేవాడు. గారాబంగా పెరిగాడు. క్రమంగా మధ్యవయస్కుడయ్యేటప్పటికి తన ఆస్తిపాస్తులు, బాధ్యతలు, పరిమితులు ఏమిటో తెలుసుకున్నాడు. తన భాగం విషయమై కొంత తగాదా పడ్డా, భాగం పంచుకొని ఆస్తి ఇంత అని తేలిన తర్వాత బహుజాగ్రత్తగా సంసారం

నిర్వహించుకున్నాడు. డంబాచారం ఎంత మాత్రమూ లేకుండా జీవించాడు. పిల్లలను చక్కగా పెంచి మంచి తండ్రి అనిపించుకున్నాడు. 50 సంవత్సరాల వయసున బావను చూసినప్పుడు ఈ కుటుంబయ్యేనా ఆ కుటుంబయ్యబావ అనిపించేది. ఆయన తరంతోనే పెరిగి ఆయన బాల్యలీలలు, పూర్వపుకథలు విన్న మా బోటివాళ్ళకు కూడా ఆశ్చర్యమనిపించేది. స్వభావాలు, పరిసర పరిస్థితులవల్ల మారుతాయి. మనలో వినిపించే,పెళ్ళికాగానే 'తల్లి విషమాయె, పెండ్లాము బెల్లమాయె' అనే సామెత కూడా మోటుగానే అనిపిస్తుంది. చిన్నప్పటి నుంచి పెంచి సాధారణంగా ముప్పయి సంవత్సరాల వయసు వచ్చేవరకూ, ఒక ఇంటి వాడు అయి పిల్లాపాపలతో స్థిర పడేవరకూ తహతహలాడే తల్లి,కుమారుడికి విషం ఎట్లా అవుతుంది? అయితే అటు తర్వాత ఇంకా ముప్పై సంవత్సరాలు అర్ధాంగిగా జీవిత భాగస్వామిగా ఉండవలసిన ఇల్లాలితో అన్యోన్యంగా ఉండాలి గదా! ఈ విధంగా మా మాణిక్యం అక్కయ్యతో మంచి గృహస్థనే అనిపించుకున్నాడు మా బావ. ఏ పిల్లల పెళ్ళిళ్ళలో కూడా పేచీలు వినిపించకుండా వివాహాలు చేశాడు. ఆయనకు బంధుప్రేమ కూడా ఎక్కువగానే ఉండేది. ఎంతో కలిసికట్టుగా ఉండి పువ్వు పుట్టిననాటి పరిమళాల ఘుమాయింపు కాకుండా, చక్కటి సువాసనా భరితంగా చివరివరకు జీవితం గడిపి అనంతమైన పంచభూతాత్మక సృష్టిలో కలిసిపోయారు ముందు మా బావా తరవాత మా మాణిక్యమ్మక్కయ్య.

ఇక ముగ్గురు శర్మల జీవితాలను చూద్దాం. ముగ్గురు ముగ్గురుగా ప్రత్యేకంగా వికసించారు. మా మేనల్లుడు పొట్టిశర్మ భూగర్భశాస్త్రంలో ప్రతిభావంతుడై కేంద్ర ప్రభుత్వోద్యోగంలో ఉన్నాడు. మా బావగారు అంటే అతడి తండ్రి చాలా చాదస్తంతో కూడిన నిష్ఠాపరుడు. అక్రమమైన క్రమశిక్షణలో పెరిగినవాడవటం చేత మా మేనల్లుడు వివాహం చేసుకోకుండా ఉండిపోయి కుటుంబపోషణకు దూరమై తల్లిదండ్రుల క్షేమసమాచారాలు కనుక్కుంటూ ఉండేవాడు. రెండోవాడు పొడుగు శర్మ ఆంధ్రా యూనివర్శిటీలో కామర్సు డిగ్రీ సంపాదించి ఆయన తండ్రి తన పెద్ద కుమారుడైన శర్మ తన షేర్‌బ్రోకర్ వ్యాపారం స్వీకరిస్తాడేమోనంటే అది కాదని అమెరికా వెళ్ళి పైడిగ్రీలు సంపాదించి అక్కడే క్లీవ్‌లాండ్‌లో ప్రొఫెసరుగా స్థిరపడి పోయినాడు. ఆనాడు ఈ

పాడుగుశర్మ అమెరికా వెడతాడనీ అక్కడే స్థిరపడతాడనీ ఎవరూ అనుకోలేదు. మూడో శర్మ 'లావు శర్మ' మా కుటుంబయ్య బావ కొడుకు మెల్లిగా బి.ఎల్. ప్యాసై ఇంటిదగ్గర చేరి కొన్నాళ్ళు బెజవాడ కేతనకొండల మధ్య తిరుగుతూ ఆఖరికి విజయవాడలో స్థిరపడి చదివిన చదువుకు సంబంధం లేకుండా ఆస్తి పాస్తులు చూసుకుంటున్నాడు. జీవనానికి లోటులేకుండానే ఉన్నాడు.

ఇలా ఈ ముగ్గురు శర్మల జీవితాలు మా కుటుంబయ్య బావ జీవిత ఆద్యంతాలు పరిశీలిస్తే పువ్వు పుట్టగానే ప్రసరింపజేసే పరిమళానికీ తరవాత పరిమళానికీ ఏమీ సంబంధం లేనట్లే కన్పిస్తుంది. ఇలాటి ఎన్నో జీవితోదంతాలు పరిశీలించిన మానసిక శాస్త్రవేత్తలు మనిషి పుట్టుకలో ఎలా ఉన్నాడో చూసి తరవాత జాతకాన్ని కాలచక్రం ఎలా మార్చకలదో కూడా అధ్యయనం చేసి మనకు మనశ్శాంతిని, సంతోషాన్నీ కూర్చాలంటే ఆ జ్యోతిష్కులు కొంచెం కష్ట పడాలేమో ననిపిస్తుంది.

కేతనకొండ పరిణామాలు మనకెన్నో విషయాలు తెలియజేశాయి.

# XX

# మా తాతమ్మ కథ

# THE STORY OF MY GREAT - GRANDMOTHER

Maternal grandfather's mother - her habits, life, death of my mother with Typhoid in 1939 for which in those days there was no cure - I regret my mother not seeing or enjoying her two sons' comfortable rise and settlement in life.

I saw my great-great grandmother, i.e, the mother of my grandmother who was 110 years of age, but was doing heavy household work on her own. She was objecting my mother doing hard work in the house as she was young when she had to lift a very heavy cot !!

మా తాతమ్మ, అంటే మా మాతామహులైన కలపటపు రంగారావుగారి తల్లి అన్నమాట. మా తాతగారయిన రంగారావుగారు నాకు మూడవ ఏటనే

పోవటం వల్ల వారిని చూసిన గుర్తులేదు. అయితే వారు నా పట్ల చూపించిన ముద్దుమురిపాలు, వారితో నేనాడిన చెలగాటాలూ మాత్రం నా చిన్ననాటి ముచ్చట్లలో చెప్పుకున్నాను కదా. వారి పట్ల నేను ప్రదర్శించిన చిలిపిచేష్టలను కూడా వర్ణించాను.

అయితే మా తాతగారైన రంగారావుగారి తల్లి శంకరమ్మగారు మాత్రం నాకు బాగాగుర్తే. మాకు బాగా 8,9 ఏళ్ళు వచ్చేవరకు ఆమె జీవించి ఉంది. ఆమె చివరిదశలో మా అమ్మ తీసుకొనివచ్చి ఆమెను మా దగ్గర ఉంచుకొంది. ఎంత డబ్బున్నా వృద్ధాప్యంలో రోజులు నిర్విచారంగా నెమ్మదిగా సుఖంగా జరిగిపోవాలంటే ఎంతో పుణ్యం చేసుకొని ఉం డాలేమో ననిపిస్తుంది.

ఇదివరలోనైతే సమష్టి కుటుంబపు బాధ్యతలు కొంతవరకు కట్టుదిట్టంగానే ఉండేవి. ఇప్పటికి కూడా పల్లెటూళ్ళలో కొంతవరకు కొనసాగుతూనే ఉన్నవనుకోవాలి. కాని దూరాభారపు ఉద్యోగాలు, పట్టణవాసాలు, ఇరుకుఇళ్ళలో కాపురాలు, ఏకకుటుంబ సభ్యులైనా కలివిడిగా బ్రతికే వ్యవస్థను, మనస్తత్వాన్ని మార్చివేశాయి. అందువల్ల ఇంట్లో ముసలివాళ్ళు ఉంటే వాళ్ళు ప్రత్యేక సౌకర్యాలతో, గుర్తింపుతో, ఆలనపాలనతో వారి అవసానకాలం గడిపే పరిస్థితి తగ్గి పోతోంది. పాశ్చాత్యదేశాలలో అయితే కుటుంబంలో తల్లిదండ్రులు ముసలివారైపోతే వారు "వయోధికనిలయాల"లో (Old age Home) లో గడపవలసిందే. వాళ్ళ సంతానంలో కాస్త వయసుకు పెద్దవారైన వాళ్ళు వీలును బట్టి శని, ఆదివారాలలో వాళ్లను చూసి వస్తుంటారు. మనదేశంలో కూడా ఇప్పుడు వృద్ధులకు సంబంధించినంత వరకు అవాంఛనీయ పరిస్థితులు కొన్ని ఎదురవుతున్నాయి. మనదేశంలో కూడా సంపన్న కుటుంబాలే అయినా ఉన్నతస్థాయికి చెందిన కుటుంబాలే అయినా, పిల్లలు ఈ రోజుల్లో దూరదేశాలకు కూడా ఉద్యోగాల నిమిత్తం, జీవితంలో అభివృద్ధికోసం వెళుతూ ఉండటం వల్ల, తల్లిదండ్రులు ఏకాకులై ఏకాంతవాసం అనుభవించాల్సి వస్తున్నది. పాశ్చాత్యదేశాల పోకడలు కూడా మనకింకా వంటబట్టనూ లేదు. ధర్మాసుపత్రుల లాంటివి కొన్ని ఇప్పుడిప్పుడే రూపుదిద్దుకొంటున్నాయి. క్రిష్టియన్ మిషనరీస్ కొన్నిచోట్ల వయోధికులకు ఆశ్రమాలు నిర్వహిస్తున్నారు. పాశ్చాత్యదేశాలలో కూడా డబ్బిస్తే సౌకర్యాలు చూసే వసతి

గృహాలు మనకు లేవిప్పుడు. మనకు కూడా వీటి అవసరం ఇప్పుడిప్పుడే తెలుస్తున్నది.కాబట్టి స్వచ్ఛంద సేవా సంఘాలూ, సాంఘిక సంక్షేమ శాఖ వారి ద్వారా ప్రభుత్వం వారూ వృద్ధులు మానసిక వత్తిళ్ళకు గురికాకుండా పూర్తిగా వంటరితనం అనుభవిచకుండా శేషజీవితాన్ని గడిపేందుకు కొన్ని వృద్ధాశ్రమాలు నడుపు తున్నారు. ఇటువంటి వసతి గృహాలు క్రమంగా పట్టణాల్లో వెలుస్తున్నాయి. మన సమాజంలో కూడా పాశ్చాత్య నాగరకత, వ్యక్తిగత సౌఖ్యం పట్ల ఆసక్తి ప్రబలితే, ఈ వ్యామోహంవల్ల ముసలివాళ్ళకు కుటుంబజీవనంలో లభించాల్సిన ఆదరణ లభించదు. మనదేశంలో కూడా ముసలివాళ్ళు అలాంటి ఆశ్రమాలను వెతుక్కోవలసిన రోజులు దగ్గరపడ్డాయి. అందువల్ల ముసలితనానికి ముందుజాగ్రత్తలు తీసుకోవలసిన తరుణం మనదేశంలో కూడా సమీపించింది. మనం పుట్టి పెరిగిన వాతావరణంలోనే సుఖంగా గడప గలిగేందుకు ముందుజాగ్రత్త పడవలసిన అవసరం ఇప్పుడిప్పుడే కాస్త వయసు మళ్ళినవారికి అర్థమవుతున్నది. దీనికి అర్థబలం, అంగబలం, అన్నిటికీమించి ఆప్యాయత బలం అన్నీ సమకూర్చు కోవాలి. ఈ సందర్భంగా మా తాతమ్మకథ మనకు ఒక దృష్టాంతంగా పనికివస్తుందని వినిపిస్తున్నాను రామాయణ పురాణశ్రవణంలో పిట్టకథ వచ్చినట్లు మా తాతమ్మమ్మ కథలో అమ్మమ్మమ్మ కథకూడా కొంత కలిపాను. చిన్నతనంలో వీళ్ళందరినీ చూసి వాళ్ళ అనురాగ వాత్సల్యాలు ఎంతగానో అనుభవించి ఆనందం పొందాను. వాళ్ళ ఆదర్శజీవితాలు, కష్టాలనెదుర్కొనే సహనశీలత, తృప్తి, ఉన్నంతలోనే ఆనందంగా గడపగల మనోనిబ్బరం, ఈ తరం వాళ్ళు తెలుసుకొని వీలైనంతవరకు అలవరచుకొనే ప్రయత్నం చేయవలసిన అవసరం ఎంతైనా ఉంది.

మా తాతమ్మ 90 సంవత్సరాలు, అమ్మమ్మ 90 సంవత్సరాలు, మా "అమ్మమ్మ అమ్మమ్మ" అంటే "తాత అమ్మమ్మ" లేదా తాతమ్మమ్మ నూటపది సంవత్సరాలు జీవించారనీ వాళ్ళకు చివరవరకూ ఒక్క పన్ను కూడా ఊడకుండా దృఢంగా జీవించారని తలచుకొంటే నాకెంతో ఉత్తేజకరంగా ఉంటుంది. మా అమ్మవైపునుంచి దీర్ఘాయుర్దాయం నా జీవితానికి పునాదులుగా పనికి వస్తున్నందుకు సంతోషిస్తున్నాను.

ఊరికే బ్రతికి ఉండటం కాదు. అదేదో అల్లసానిపెద్దన గారి చాటువుందికదా 'బతికి ఉన్నాడ జీవచ్ఛవంబనగుచు' అన్నట్లు కాదు. అట్లా నిరుత్సాహంగా జీవించడంలో ఆనందం ఏముంది? మా ముసలితాతమ్మలలాగా తృప్తిగా సంతోషంగా దృఢంగా మన యీ తరాల వారంతా కూడా ఉండాలని కోరుకుంటున్నాను. ఈ శాస్త్ర విజ్ఞాన యుగంలో దృఢంగా జీవించటానికీ అలా జీవించాలని కోరుకోవటానికీ అనేకమైన వెసులుబాట్లు ఉన్నాయి.

ఈ రోజులలో కూడా "శతమానం భవతి శతాయుష్" అని వంద సంవత్సరాలపైన సుఖంగా జీవిస్తున్నవారి సంఖ్య కూడా వివిధదేశాలలో బాగా పెరుగుతున్నది. చిన్నపిల్లల మరణసంఖ్య తగ్గుతూ ఉండటంవల్ల, వ్యాధి నిరోధక నివారణ సౌకర్యాలు విస్తరిస్తూ ఉండటం వల్ల, సంపద సౌభాగ్యం పెరగడంవల్ల, అనేక రోగనివారణ ఔషధాలు ఉపయోగంలోకి రావడంవల్ల, మన సాముదాయిక జాతి జీవన ఆయుర్దాయ ప్రమాణం (Longivity) పూర్వపు 32 సంవత్సరాల నుంచి ఇప్పుడు 52 సంవత్సరాలకు పెరిగింది. అభివృద్ధి చెందిన దేశాలలో అయితే సగటు జీవన ఆయుర్దాయ ప్రమాణం డెబ్బై అయిదు సంవత్సరాలు దాటింది. వృద్ధుల సంఖ్య ఎక్కువ కావడంతో సాంఘిక సంక్షేమశాఖ వారికి బాధ్యత ఎక్కువైంది.

మా తాతమ్మ, తాతమ్మమ్మల గూర్చి తలచుకొన్నప్పుడు ఇన్ని సంగతులు మదిలో మెదిలాయి. అయితే మా అమ్మగారు మాత్రం తన 39వ ఏటనే టైఫాయిడ్ జ్వరంవచ్చి సన్నిపాతంలోకి దింపి జ్వరం వచ్చిన తర్వాత 15 వ రోజున అకాలమరణం పొందింది. ఇప్పటి రోజులలో 'క్లోరోమయిసిటిన్' (Chloromycetin) ఇంకా ఇతర ఔషధాలూ వచ్చిన తర్వాత చికిత్స చేసి ఈ విషజ్వరాన్ని ఎంతో సులభంగా నివారించగలుగుతున్నాం. నా వైద్య చికిత్సానుభవంలో ఎప్పుడు నేను గడ్డువ్యాధిని నయంచేసినా ఈ మందులు ఉంటే మా అమ్మను అప్పుడే బ్రతికించు కోగలిగి ఉండేవాడిని కదా అనిపిస్తుంది. ఇంతవరకు జీవించివుంటే ఆమెకు దగ్గరదగ్గర 90 సంవత్సరాలుండేవి. ఈ రోజుకుకూడా నాకు 'అమ్మా' అని పిలుచుకొనే భాగ్యం ఉండేదికదా అని మనస్సు ఆ విషయం తలచుకొన్నప్పుడల్లా బాధపడుతుంది. గొప్ప జమీందారి హోదాలోని కుటుంబంలో జన్మించి కాలగమనంలో తర్వాత పూరిపాకలోనే

కాపురం చేయవలసి వచ్చినా సహనంతో సంతృప్తితో మా కోసం సంతోషంగా కష్టాన్ని ఏమీ కష్టం అనుకోలేదు మా అమ్మ, ఇవాళ ఆమే ఉంటే జీవితంలో మేము పొందిన ఉన్నతినీ, సుఖజీవితానికి అవసరమైన భౌతిక సౌకర్యాలను ఏర్పరచుకో గలగటం చూసి ఎంతో ఆనందించేది కదా అనిపిస్తుంది. తాను కూడా ఈ సుఖాలను సౌకర్యాలను పొందగలిగి ఉండేది కదా అని మనసు పరితపిస్తుంది. అప్పుడు 'మాతృదేవోభవ' అని ఎంతో తృప్తిగా తలచుకొని ఉండేవాళ్ళం గదా అనిపిస్తుంది. అణుయుగ విజ్ఞాన ప్రగతివల్ల ఇహలోకపు జీవన సౌకర్యాలు, ఆయుఃప్రమాణం పెరిగాయి. ఇహ మళ్ళీ మా తాతమ్మ కథలోకి వద్దాం.

మా తాతమ్మ పేరు శంకరమ్మగారని ఇదివరలోనే చెప్పానుకదా! ఆ తరంవారిది ఒక విశిష్ట జీవన ప్రవృత్తి ఎందుకంటే ఎన్ని కష్టాలు వచ్చినా వారు మనశ్శాంతి పోగొట్టుకునేవాళ్ళు కారు. భగవత్ ధ్యానం చేసుకుంటూ ఆ కష్టాలను నిబ్బరంగా స్వీకరించేవాళ్ళు,లేదా ఎదుర్కొనేవారు. ఆ అవస్థలు, కష్టాలు ఖర్మ మూలంగా జరిగాయనీ జీవితంలో ఆ భగవంతుని పై భారం వేసి రోజులు గడపటం తప్ప ఏమీ చేయలేమని నమ్మేవారు.

మా అమ్మమ్మ అమ్మా పెద్ద మనుమరాలు అయిన మా అమ్మమ్మ కూడా, దాదాపు 90 సంవత్సరాలు జీవించారు. నా అధీనంలోనే మా అమ్మమ్మ పోయింది. మా అమ్మమ్మ అమ్మమ్మ 110 సంవత్సరాలు బతికి గుంటూరు జిల్లా కొలకలూరులో చనిపోయింది. మా అమ్మగారు వాళ్ళ పెద్దవాళ్ళను ముందు తరాలవాళ్ళను చూసిరావడమన్నా వారికి సేవచేయడమన్నా ఎంతో ముచ్చట పడేది మా ఇద్దరు అన్నదమ్ములనూ తీసుకొని అమ్మమ్మను చూడటానికి కొలుకలూరు వెళ్ళేది. అంటే ఇది ఇప్పటికి ఇంచుమించు 70 సంవత్సరాలనాటి మాట అని చెప్పుకోవాలి. ఇప్పటికీ లీలగా మా "అమ్మమ్మ అమ్మమ్మ" స్వరూపం మనసులో మెదులుతోంది. ఆమె తెల్లటి సైను గుడ్డ ధరించి ఉండేది. నూటపదేళ్ళపైబడ్డా పల్లు అన్నీ ముత్యాలులాగా ఉన్నట్లు నాకు గుర్తు. మా అమ్మమ్మ పిన్నిగారు కూడా ఒక ముసలావిడ చాలాకాలం వుంది. నేను విశాఖపట్టణంలో ఉన్నప్పుడు 1960లో ననుకుంటా ఆవిడంతట ఆవిడే నా అడ్రసు కనుక్కొని రైలుదిగి మా ఇంటికి ఆ మా అమ్మమ్మను, మమ్మల్నీ చూడటానికి వచ్చింది.

ఆవిడను 'తాత అమ్మమ్మ' అనేవాళ్ళం. తాతమ్మమ్మా, ఎలా వచ్చావమ్మా ఒంటరిగా అంటే రాజమండ్రీ పుష్కరాలకు వచ్చానురా. అక్కడ 'మా పెంపుడు కొడుకు వున్నాడు. వాడి దగ్గర మీ అడ్రసు కనుక్కొని రైలులో వచ్చాను. రిక్షా వాడికి మీ అడ్రసు చెబితే తిన్నగా తీసుక వచ్చాడు', అని చెప్పింది. అంత ముసలావిడ తనంతతాను వచ్చిందికదా అని ఇక అప్పటినుంచి ఎవరైనా వస్తున్నారంటే ఆహ్వానించి తీసుకురావటానికి రైలు దగ్గరకు ఎందుకు వెళ్ళాలనిపించేది. కొంతకాలం అలా వెళ్ళటం మానేశాను కూడా!

కొలకలూరు మేము వెళ్ళినప్పుడు జరిగిన సంఘటన ఒకటి మా అమ్మ చెపుతూ ఉండేవి. ఆ 'తాతమ్మమ్మ' గారి ఇంటిముందర ఆవరణలో బావి ఉండేది. మా అమ్మ నీళ్ళు తోడబోతుంటే 'అమ్మాయీ నువు తోడలేవే నేను తోడతా ఉండు అన్నదట. మా అమ్మ అప్పుడు ఫరవాలేదు, అమ్మమ్మా నేనే తోడుకుంటాను అని ఎంతో నమ్మకంగా చెప్పి ఆ ముసలావిడను చేదమీద చేయి వేయ నీయలేదట.

## బరువైన మంచం

అక్కడ రాత్రుళ్ళు బయట పడుకొనేవారు. వాకిట్లో రాత్రంతా పడుకుని ఉదయం మంచాలు లోపలకు చేర్చేవారు. అమ్మమ్మగారింట్లో ఒక మంచం ఉండేది. అది ఇంతా అంతా బరువు కాదు. మా అమ్మకూడా తరవాత చెప్పింది. ఆ మంచంలోపలపెట్టటానికి మా అమ్మ ఎత్తుతుంటే 'అమ్మాయి నువ్వూరుకో. నీవుమోయలేవే, నేను పెడతానుండు, అని ఆ నూటపది సంవత్సరాల వయసు "చిన్నావిడ" మా అమ్మకు అడ్డంరావటం మా అమ్మకు చాలా ఆశ్చర్యంవేసిందట. మా తాతమ్మ ఆ మంచం లోపలపెట్టిందని వేరే చెప్పాల్సిన పని లేదనుకుంటా. ఈ సంఘటన ఏం తెలియచేస్తున్నదంటే మా అమ్మ ముందుతరాల ముసలమ్మలకు మా అమ్మపట్ల వుండే గారాబపు భావమూ, తమ స్వశక్తిమీద ఆధారపడి జీవించటం వల్ల కలిగిన బలప్రభావమూ అని కూడా చెప్పాలి. మా అమ్మమ్మ అమ్మను చూడగలగటం నా జీవితంలో విశేషమేనని చెప్పాలి. ఆమెను ఈనాడు అభిమానంతో గర్వంతో స్మరించు కోగలుగుతున్నాను. ఇది నాకు ఒక మహద్భాగ్యమనుకుంటాను.

## భగవద్గీత కంఠస్థం

మా తాతమ్మ శంకరమ్మగారు రోజూ భగవద్గీత చదివేది. ఒకసారి పూర్తిగా కంఠస్థంగా భగవద్గీతనంతా వల్లించేదామె. అప్పుడే ఆమె దినచర్య పూర్తి అయినట్లు. మా నాన్నగారి సవతితల్లి రంగమ్మగారు కూడా రోజూ భగవద్గీత 18 అధ్యాయాలు కంఠస్థంగా అప్పచెప్పేది. అప్పుడే ఆమె మడి వదిలిపెట్టినట్లు గుర్తు. అంతవరకూ ఆవిడను ఎవరూ తాకకూడదు. ఆ మాదిరిగా వారు అంత సంస్కృతగ్రంథం పూర్తిగా వల్లించే వారంటే, ఆ సంస్కృత శ్లోకాలన్నీ నోటికి వచ్చేట్లు చేసుకొనేవారంటే వారి మేధాశక్తిని భక్తిని, జ్ఞానపిపాసను, నిష్కామ యోగాన్నీ మనం మెచ్చుకోవాల్సి వుంటుంది! మా తాతమ్మ అంటే మా తాతగారి అమ్మగారు అన్నమాట. అబ్బ! తలచుకోవటానికి ఎంతో సంతోషంగా వుంది. ఆమె అన్నాళ్ళు బతక గలిగింది అనుకోవటమే ఆనంద ప్రదంగా వుంటుంది. దీర్ఘాయుర్దాయం కల వంశ సంప్రదాయ మన్నమాట. మనకూ అలాటి అదృష్టం పట్టవచ్చుననీ సంతోషం కలుగుతుంది ఆమెను తలచుకొంటే మా మనసుల్లో. ఎంతకాలం వీలైతే అంతకాలం బతకాలని ప్రతి ఆశాజీవీ వాంఛిస్తాడు కదా! ఈసురోమని పడివుండేవాళ్ళ విషయంలో ఇది వర్తించదు. బ్రతికియుండిన సుఖములు బడయవచ్చు అనే ఆశాజీవులమాట ఇది.

## మామిడాకుతో దంతధావనం

మా తాతమ్మమ్మ ఎప్పుడూ మామిడాకుతో దంతధావనం చేసేది. దానిని సగానికి చించి ఒక భాగంతో పల్లుతోముకునేది. మరో అర్ధభాగంతో నాలిక గీసుకునేది దొడ్లో వున్న మామిడిచెట్టు ఆవిడ యీ నిత్యకార్యక్రమానికి కావలసిన మామిడాకును సంతోషంగా సరఫరాచేసేది. ఆవిడ ఏదైనా ఊరువెళితే కాసిని పచ్చి మామిడిఆకులను కోసి తన చిన్న ట్రంకుపెట్టెలో పెట్టుకుని బయలు దేరేది. ఆ మామిడాకుల్లో ఉండే మూలికల విలువ నాకు కూడా తెలియటంవల్ల నేను కూడా మా తాతమ్మ సంప్రదాయం అప్పుడప్పుడు పాటిస్తూ వుంటాను. మా దొడ్లో వున్న మామిడి ఆకులు కోసి నేను కూడా దంతధావనానికి అప్పుడప్పుడు ఉపయోగించటం కద్దు. కాబట్టి పెద్దల అలవాట్లు చిన్నవాళ్ళను ఏ విధంగా ప్రభావశీలమైన వయస్సులో ఆకట్టుకుంటాయో ఇందుమూలంగా తెలుసుకోవచ్చు.

## ముసలితనంలో సేవలు

తరవాత మేము కృష్ణాజిల్లా అవుటపల్లిలో మా నాన్నగారు ఉద్యోగరీత్యా వున్నకాలంలో మా అమ్మ వాళ్ళ నాయనమ్మగారిని, ఆమె కాకినాడలో వుండేదని ఇదివరలోనే చెప్పాను గదా, ఆ శంకరమ్మగారిని తనదగ్గరే వుంచుకుందామని తీసుకుని వచ్చింది. 'తాతమ్మమ్మ' పెద్దదయింది. ఇద్దరు కొడుకులు పోయారు. కోడళ్ళిద్దరు ఒకరు మద్రాసులోనూ మరొకరు రాజమండ్రిలోను వారి వారి బాధ్యతలతో వుండిపోయినారు. మా అమ్మమ్మకు ఎక్కువ బాధ్యతలు లేవు. మా అమ్మ, పిన్ని వాళ్ళ వాళ్ళ సంసారాలలో స్థిరపడ్డారు. కాని మా వెంకటచలం తాతయ్యగారి భార్య రమణమ్మగారు తన ఇద్దరు కొడుకులతో, వాళ్ళ హైస్కూలు చదువులు సాగటానికని రాజమండ్రిలోనే వుండిపోయింది కాబట్టి ఆ ఇద్దరు కోడళ్ళు మా తాతమ్మమ్మను దగ్గర ఉంచుకొనే అవకాశం లేకపోయింది. జీవనోపాధికి ఇంటి అద్దెలు ఆసరా అయినా, మా అమ్మకు మా తాతమ్మమ్మ ఒంటరిగా కాకినాడలో ఉండటం ఇష్టంలేక పోయింది. ఆమెకప్పటికే బాగా వయసు పండిపోయింది. మా తాతమ్మమ్మను తన దగ్గర వుంచుకుందామని కాకినాడ వెళ్ళి ఆమెను ఒప్పించి అవుటపల్లికి తీసుకొనివచ్చింది ఆమెను.

## తాతమ్మసుస్తీ – ఆనాటి చికిత్సాసౌకర్యాలు

అవుటపల్లి వచ్చిన కొద్ది నెలలకే మా తాతమ్మకు విరోచన బద్ధకం ఏర్పడింది. ఆవిడకా బాధ ఇదివరలో ఎప్పుడూ లేదు. అది ఏదో మామూలుగా ఏర్పడే మలబద్ధకం కాదనీ ప్రాణాన్నితీసే తీవ్రమైన వ్యాధి అనీ తరువాత పరిణామాలు నిరూపించాయి.

మా తాతమ్మకు ఒకరోజు, రెండు రోజులు, మూడురోజుల దాకా విరోచనం కాలేదు. మేమప్పుడున్నది కృష్ణాజిల్లా పెద్ద అవుటపల్లిలో. అక్కడ స్థానికంగా ఇద్దరు వైద్యులుండేవారు. ఆ ప్రాంతంలో ఏ వ్యాధి వచ్చినా వాళ్ళిద్దరే చికిత్స చేస్తూ ఉండేవాళ్ళు. అందులో ఒకరు దివి గోపాలాచార్యులు గారు.రెండోవారు ఫకీరుసాహెబు. గోపాలాచార్యులుగారు ఆయుర్వేద వైద్యం చేసేవారు. ఈయన ఆ రోజుల్లో లంకపల్లిలో ఎంతో ప్రసిద్ధులైన దివి

అనంతాచార్యులుగారి శిష్యులు. అనంతాచార్యులుగారంటే చాలా గొప్ప ఆయుర్వేద వైద్యులు. ఆయన అలా నాడి (pulse) చూసి ఎన్నో రోగాలు కనిపెట్టేవారు. వారు ఏ ఊరికైనా రావాలంటే వారిని మేనామీద తీసుకువచ్చేవారు. ఒక విధంగా చూస్తే అప్పటి ఘనవైద్యుల జీవితాలు రాజఠీవిగా నడిచేవి. వారి పాండిత్యప్రకర్ష వల్ల, వారి ఉదార హృదయంవల్ల సంఘం వారి నెంతో గౌరవించేది. అటువంటి మహనీయులైన అనంతాచార్యులవారి శిష్యులు గోపాలాచార్యులుగారు. రెండోవారు ఫకీరు సాహెబు. ఈయనది సంచికట్టు వైద్యం. సంచికట్టు వైద్యం అంటే వైద్యుడు తన మందులన్నీ సంచీలో వేసుకుని ఇంటికి వచ్చి రోగనిదానం అంతా చూసుకుని అక్కడికక్కడే మందు ఇచ్చిపోయే విధానం. ఆ ఇద్దరే ఆ ఊరికి అప్పుడు వైద్యులు. అందులో గోపాలాచార్యులుగారు మా కుటుంబవైద్యులు. సాధారణంగా ఆచార్యులవారు అంటే శ్రీవైష్ణవులు గ్రామాలలో దేవాలయాలలో అర్చకత్వం నిర్వహిస్తూ దానితోపాటు వైద్య వృత్తి కూడా చేస్తూ వుండేవారు. ఆ మాదిరిగా 'నైవేద్యం' 'వైద్యం' ఒకేవ్యక్తి ఒక ఊరిలో కనిపెట్టుకొని ఉండేవారు.

ఆచార్యులుగారు మా తాతమ్మకు విరేచనం సాఫీగా కావటానికి ఏవో మందులు రెండుమూడు రోజులు వాడి చూశారు. కాని ఆ సమస్య విడివడలేదు. ఇహ నేను ఉపయోగించ గలిగిందల్లా 'నేపాలం' మాత్ర ఒకటే మిగిలింది. అది ఇస్తాను కావాలంటే అని ఆయన చెప్పారు. అప్పటికే మా తాతమ్మకు కొంచెం కడుపు ఉబ్బరం, నొప్పి కూడా మొదలైన వనుకుంటాను. ప్రారంభంలో అంతనొప్పి ఉన్నట్లు లేదు. ఆచార్యులుగారు ఆ మాట చెప్పేటప్పటికి మా అమ్మ, ఇహ ఇక్కడ గాదులెండి మేము బెజవాడ (ఇప్పటి విజయవాడ) వెళతాం. అక్కడ మా డాక్టరు బాబయ్యగారు చూస్తారు అని చెప్పింది. మేమంతా బెజవాడ చేరుకున్నాం. అక్కడ మా అమ్మ పినతండ్రిగారు డాక్టరుగా ఉండేవారు. ఆ రోజుల్లో అక్కడ ఆయన చాలా ప్రసిద్ధులు. డాక్టర్ ఘంటసాల సీతారామశర్మగారు ప్రసిద్ధ ఇంగ్లీషు వైద్యులు. బెజవాడలో వైద్యులంతా పరీక్షచేసి 'ఇది ఆపరేషన్ చెయ్యాల్సిన కేసు, విజయవాడలో ఆ సౌకర్యం లేదు' అంటూ 'రాజమండ్రి మిషన్ ఆస్పత్రిలోగాని, మద్రాసు జనరల్ ఆసుపత్రిలో గాని యీ ఆపరేషన్ చేయాల్సి వుంటుందని' ఆ వైద్య బృందమంతా అభిప్రాయపడింది.

అది 1925 – 26 సంవత్సరాలమాట. అంటే దాదాపు 65 సం॥ల నాటి కిందటి సంగతి. విజయవాడలో అప్పట్లో ఎం.బి.బి.ఎస్. ప్యాసైన డాక్టరు చాగంటి సూర్యనారాయణ మూర్తిగారు ఒక్కరే ఉండేవారు. ఇప్పుడు నేను వైద్యరీత్యా ఆలోచన చేస్తే ఆనాటి మా తాతమ్మ జబ్బు (INTESTINAL OBSTRUCTION) అంటే లోపల పేగులలో ఏదో అడ్డంవుండి వుండటమై వుంటుందని భావిస్తున్నాను. దానికి కారణం ఏ కాన్సరువల్ల కలిగిన అడ్డంకో (Cancerous Infiltration) అయి వుంటుందనుకుంటాను. అవీ ఆనాటి విజయవాడలోని వైద్యసౌకర్యాలు. ఇప్పుడు చూస్తే ఎన్ని నర్సింగుహోములు ఎంతమంది అధునాతన వైద్య నిపుణులు, తలచుకుంటే ఆనాటికీ ఈనాటికీ ఎంతమార్పు అని ఆశ్చర్యవేస్తుంది.

ఇది ఆపరేషన్ కేసు కావటంవల్ల మా అమ్మ తాతమ్మమ్మను రాజమండ్రి తీసుకొని వెళ్ళింది. అక్కడ మా రెండవ తాతగారి భార్య మా ముసలమ్మగారి రెండో కోడలు రమణమ్మగారు అప్పుడు రాజమండ్రిలోనే వుండటంచేత మేమంతా అక్కడకే వెళ్ళాం. ఆ ఊళ్ళో అప్పుడు మా తాతమ్మకు ఆపరేషన్ చేశారు. కాని కొద్దిరోజులకే ఆవిడ ఆసుపత్రిలోనే మరణించింది.

ఆసుపత్రిలో ఆవిడను చేర్పించారన్నమాటే కాని ఆవిడ ఎంతో తహతహలాడి పోయింది, ఆమెకు విపరీతమైన ఆచారం. మనస్సులో తెగబాధ పడిపోయిందామె. ఆపరేషన్ ముందర రోగిని సిద్ధం చేయాలని ఆమెకు లాగులు చొక్కాలు వేశారుట. "ఏమిటే లక్ష్మడూ! నాకీ వేషమంతా" అని మనోవ్యధను, తనకు చుట్టుకుంటున్న అనాచార ఘోరాన్ని నెమ్మదిగా ఆమె బయట పెట్టిందనుకోవాలి. అంతటితో మా 'తాతమ్మకథ' ముగిసింది.

మా తాతమ్మమ్మ లీలగా నా మనసులో మిగిలిపోయింది. ఆనాటికి కూడా ఆమె పల్లు ఏమీ ఊడలేదు. చివరివరకు ఆమె పనులు ఆవిడే చేసుకునేది. చెట్టంత పెరిగిన ఇద్దరు కొడుకులూ పోయినా చివరకు తన మనుమరాలు బాధ్యత వహించి తన అవసానకాలంలో ఆదుకున్నందుకు లోపల ఎంతో సంతోషించి వుండాలి ఆమె.

ఈ సందర్భంగా ఆ రోజులలో పల్లెటూళ్ళలోనూ, విజయవాడవంటి ఒక మోస్తరు పట్టణాలలోనూ ఎటువంటి వైద్యసౌకర్యాలుండేవో తెలుసుకున్నాం.

రాజమండ్రి లాంటి చిన్నపట్టణంలో కూడా ఆసుపత్రులు పెట్టి 'ఆపరేషన్' మొదలైన ఆధునిక వైద్యసౌకర్యాలు కలిగిస్తున్న క్రిస్టియన్ మిషనరీల సేవా నిరతిని గమనించాం. ఇంతటితో తాతమ్మమ్మ కథ ముగిసింది.

# XXI

# ఆ నాటి వైద్యసౌకర్యాలు

# MEDICAL FACILITIES SIXTY YEARS AGO

Very meagre even in towns like Bezwada. For abdominal surgery we had to go to Madras or Rajahmundry to a Missionary Hospital. Many of our ailments are preventable by protected drinking water supply and environmental sanitation and descrete ablutions. Gandhiji stressed these measures all his life. But we have ended up with modern diagnostic apparatuses costing millions of Rupees!

ఆరోగ్యం, వైద్యం ఒకదానితో ఒకటి ముడిపడి వున్నాయి. వైద్యం చికిత్సకు తప్పక కావాలి. కాని ఆరోగ్యానికి మందులవైద్యం అక్కర్లేదు. ఆరోగ్యానికి కావలిసింది, ముఖ్యంగా మంచిగాలి, వెలుతురు, సక్రమమయిన జీవితవిధానం. పుష్టికరమైన ఆహారం, మనశ్శాంతితో కూడిన జీవితం, ఎన్నివున్నా ఆధునికయుగంలో, మనశ్శాంతి లేనివారికి అన్నీ రుగ్మతలే. మనోవ్యాధికి మందు లేదన్నారు అనుభవజ్ఞులు. 'మా తాతమ్మ కథలో', ఆవిడకు

వచ్చిన మస్తీ నివారణకు కృషిచేసిన సందర్భంలో ఆనాటి వైద్య సౌకర్యాలు విజయవాడ వంటి పట్టణంలోనే ఎంత తక్కువగా వుండేవో తెలుస్తుంది. ఇప్పటి విజయవాడ పౌరులకు ఆనాటి పరిస్థితులు అనూహ్యం.

ఈ పరిస్థితులు దాదాపు 60, డెబ్బయి ఏళ్ళు అంటే 1925 - 30 రోజులు నాటివి. అవి తలుచుకుంటే మేమున్న పెద ఆవుటపల్లిలో పరిస్థితులే, ఇప్పటికీ చాలా పల్లెలలో వున్న వైద్యసౌకర్యాలని చెప్పుకోవచ్చు. గుడిలో వున్న ఆచార్యులవార్లు, మాష్టర్లు, ఫకీరు సాహెబుల సంచికట్టు వైద్యాలే అందరికీ అందుబాటులో ఉండేవి. అవి కూడా లేని పల్లెలు ఆనాడు చాలా వుండేవి. ఈ నాటికి కూడా అలాంటి పల్లెలు ఉన్నాయ ంటే ఆశ్చర్య పడనక్కర్లేదు.

నేడు రక్తపరీక్షలు చేసే లేబరేటరీల వంటివి ఆనాడు లేనే లేవు. ఆ మాటకొస్తే మన విజయవాడలోనే 1934 - 37 లో అనుకుంటా, డాక్టర్ తెన్నేటి చలపతిరావుగారు ధైర్యంచేసి పెట్టారు. వారే X-Ray కూడా పెట్టారు. ఇంకో డాక్టరు శేషగిరిరావుగారు. విజయవాడలో గుడివాడలో 'రక్తపుబ్యాంకు' కూడా పెట్టారు. విజయవాడలో మొదటి M.B.B S డాక్టరుగారు, చాగంటి సూర్యనారాయణమూర్తిగారు. పట్టణంలోనే వాతావరణం కాలుష్యాలు ఏమీ లేకుండా ఉండేది. నిర్మానుష్యంగావుండి స్టేషనునుండి గవర్నరుపేట రోడ్డు వరకు ఇంటికి వెళ్ళేలోపల దొంగలు కొట్టేశారు. అంత నిర్మానుష్యమన్నమాట ఆనాటి బెజవాడ. అలాగే దానికి తగినట్టుగానే వుండేవి ఆనాడు వైద్య సౌకర్యాలు మరి ఇప్పుడో! ఎన్ని నర్సింగుహోములు, ఎన్నో ఆధునిక పరీక్ష సాధనాలు, కోట్ల కొలది ఖర్చులతో ఏర్పాటైన వైద్య సౌకర్యాలు. అవి కూడా ఒక 'పరిశ్రమ' క్రింద మారినాయి. అయితే ఏం, సౌకర్యం అంటూ వుంటే ఏదోవిధంగా జనసామాన్యం ఆధునిక వైద్య సౌకర్యాలతో బాధలు నివారణ చేసుకోవచ్చు.

ప్రపంచంలోని 'ఆరోగ్య' పథకాలన్నీ కేంద్రీకరింపబడి ప్రపంచ ఆరోగ్య సంస్థ ద్వారా (W.H.O ), 2000 సంవత్సరంనాటికి అంటే 21వ శతాబ్దంలో ప్రవేశించేనాటికి అందరికీ, అన్ని దేశాలలోవున్నా బీదా గొప్పా తేడాలేకుండా అన్ని వర్గాలవారికీ ఆరోగ్యం ప్రసాదించే పథకాలను రూపొందించారు. ఆనాడు, మశూచికి మాత్రమే టీకాలు వున్నాయి. అవికూడా, విస్తృతంగా వేయకపోవడంవల్ల మశూచి వచ్చి ఎంతోమంది ముఖాలమీద గుంటలుపడి మశూచి ముఖాలు, మన ఆరోగ్యపతాకంమీద గుర్తులుగా మిగిలిపోయినవి.

ఇప్పుడు వ్యాధి నిరోధక కార్యక్రమాలవల్ల ప్రపంచంలోనే మశూచి లేకుండా పోయి, మశూచి టీకాల అవసరమే లేకుండా పోయింది. ఇప్పుడు తట్టమ్మ (Measles) లేక తడపర, కోరింత దగ్గు, గొంతువాతం (Diphtheria) ధనుర్వాతం (Tetanus) గవద బిళ్ళలు (Mumps) మొదలైన అనేకవ్యాధులను వ్యాధినిరోధక టీకాలద్వారా నిరోధించగలుగుతున్నాం. 'పోలియో' వ్యాధి, అభివృద్ధి చెందిన దేశాలనుండి తరిమివేయబడింది. మన దేశంలో కూడా ఈ వ్యాధి నిరోధక టీకా కార్యక్రమాలు చురుకుగా సాగుతున్నాయి. అందుచేత మన సగటు జీవితకాలం 27 సంవత్సరాలనుండి 51 సంవత్సరాలవరకు పెంచుకున్నాం. ఇంత ఆధునిక చికిత్సలున్నా మన పథకాల కేంద్రీకరణ అంతా వ్యాధినిరోధక కార్యక్రమాల మీదే కేంద్రీకరిస్తున్నాం. అదే సరిఅయిన ఆధునిక వైద్యవిధానం.

ప్రతివూరికి త్రాగుటకు, మంచినీరు, పరిసర పారిశుధ్యము, ఊరు తేలికగా చేరుటకు రహదారి మార్గాలు, విచక్షణా రహితమయిన మలమూత్ర విసర్జన అలవాట్లనుండి ప్రజానీకాన్ని మళ్ళించటం, మొదలైన కార్యక్రమాలు ముఖ్యమయినవి విద్య, ఆరోగ్యసూత్రాల అనుసరణ, ముఖ్యమయిన పథకాలుగా త్వరలో అమలు పరచటానికి కోట్ల రూపాయలు ఖర్చుపెడుతున్నాం. ఈ పథకాల మూలంగానే అభివృద్ధి చెందిన పాశ్చాత్యదేశాలు ఎంతో సుఖవంతమయిన జీవిత విధానానికి అర్హత పొందాయి. మనకు అనాదిగావున్న అంతః శుద్ధి కార్యక్రమాలే కాకుండా, వివేకానందుడు 'ఈష్టు అండ్ వెస్టు' (East & West) అనే పుస్తకంలో చెప్పినట్లు, బాహ్యశుద్ధికి కూడా మనం ప్రాధాన్యం ఇవ్వవలె అప్పుడే ఈ ఆధునిక రోగ నిర్ణయ యంత్రాలకంటే, మనలో రోగనిరోధక శక్తులు పెరిగి మనకు సాముదాయికంగా ఆరోగ్యం చేకూరుతుంది.

# XXII

# కష్టజీవులకు కల్లు కావాలా ?

# IS IT NECESSARY THAT HARD WORKERS SHOULD DRINK?

'Is it necessary to drink if you are a physical labourer? No; Gandhiji lived for prohibition- In the west all drink in moderation. There are many "Tea-Totallers" even there - "Neera" and temperance are compromises;

కాయకష్టం చేసే వారికి కల్లు, సారాయి సాయంత్రం బడలిక తీరుస్తాయి. అందుకు మనం అవరోధం కలిగిస్తే ఎలాగు ? అని వాదించే వారున్నారు. కష్టజీవులకు కావలిసింది, కడుపునిండా పుష్టికరమైన ఆహారం. విజ్ఞానంకోసం పయోజన విద్య-అంతేగాని మత్తుపానీయములు కాదు.

కాయకష్టం చేసేవారిక్కి వారికి సరిఅయిన కూలీ, తిండిలేక, వారు తమ కష్టాన్ని మరచిపోవడానికి మత్తు పదార్థాలు త్రాగుతారు. అదొక అలవాటుగా అయిపోయింది కొన్ని వర్గాలలో. అంతేకాని, కష్టపడేవారికి తప్పక కల్లుసారాయీలు కావాలని, కష్టపడని వారు వాదిస్తారు. అదీతమాషా! కష్టజీవులకు కావలిసింది మనోవికాసాన్ని కలిగించే విద్య అని మళ్లీ నొక్కి చెబుతున్నా !

కష్టపడేవారందరూ త్రాగరు. పల్లెలో రైతాంగాన్ని చూస్తే, పొలం నుంచి రాగానే, వేడినీళ్ళ స్నానంచేసి, భోంచేసి, ఎవరో ఒకరు చుట్ట ముట్టిచ్చి కబుర్ల

చెప్పుకుంటూ వుంటారు. అంతా ఆ చుట్ట త్రాగరు! మరి ఏకష్టం చేయకుండా, క్లబ్బులలో కూర్చుని కాలక్షేపం చేసేవారికి , ఈ త్రాగుడు ఎందుకు? మేము మెదడుతో పనిచేస్తున్నాం,అందుకు మధుసేవ అవసరమనకండి! వ్యసనం కింద కాకుండా, ధూమపానం, కొద్దిగా మధుసేవ, మరి ఇతర భోగ విలాసాలు కోరటం మానవ సహజం. అంతేకాని, అవసరం కాదు ! అందుకని నూటికి అరవయి వంతులు తిండిలేని జనాభా, తమ ఆకలి ఇతర బాధలు మరిచి పోవడానికి,త్రాగనిస్తే, వారి సంసారాలు తిండిలేక మాడాలి ! అందుచేత మద్యపానషేధ "చట్టం అమలు చేయాలంటారు! అంతేగాని "కల్తీ సారాయి చావులు" ఆపడానికి కంకణం కట్టుకున్నట్టు, విజ్ఞానులెవరూవా ఊంచకూడదు.

'మద్యపాన నిషేధం' అనేక రకాలుగా ఆచరణలో పెట్టవచ్చు. అదొక పెద్దయజ్ఞం. సమిధలుగా పేదలు ఆహుతి అవుతున్న నరమేధయాగం ఈ విషవలయాన్నుండి బీదవారిని రక్షించటం ఆలోచనా పరుల కర్తవ్యం.

## "కల్లు విప్లవం" గాంధీజీకి నీరాజనం

'తెల్లవిప్లవం' తరువాత, ఎందుకో కాని, వెంటనే "కల్లు విప్ల"వాన్ని గురించి వ్రాయాలని పించింది. తెల్లనివన్నీ పాలు, నల్లనివన్నీ నీళ్ళు కావు" అనే సామెత వుంది. తెల్లనివి పాలుకాకపోతే "కల్లు" అయ్యే అవకాశం వుంది. మొరార్జీ దేశాయి ప్రధానిగావున్న రోజులలో (1977) ఈ మద్యపాన నిషేధాన్ని దేశమంతటా నాలుగు సంవత్సరాల్లో అమలు పరుస్తానన్నాడు. అందులో ఒక రోజున "లయన్సుక్లబ్బు" వాళ్ళు మద్యపాన నిషేధాన్ని గురించి మాట్లాడాలన్నారు. అందుచేత పత్రికలలో రాజకీయవేత్తలు చెప్పే ప్రోత్సాహకరమయిన ప్రణాళికల గురించి చర్చించుకోటం పరిపాటయింది. అందుకోసం కొన్నాళ్ళుగా మరిచిపోయిన యీ సమస్యను ఆనాడు లయన్సుక్లబ్బు వారు చర్చిద్దామనుకోటంలోన తప్పేమీలేదు. ఇప్పుడా బాధ ఏమీలేదులెండి. మరో మొరార్జీ బోటివారు గాని, గాంధీగారిలాగ మద్యపాన నిషేధాన్ని గురించి తపన పడేవారుగాని, రాష్ట్రంలో ముఖ్యమంత్రిగా కేంద్రంలో ప్రధానిగా అయ్యే అవకాశం లేదు. కాబట్టి మేధావులు ఏవిధంగా, ఆలోచనలు చెయ్యగలిగారో పూర్వాపరాలను చూద్దాం.

1915 లో మహాత్మా గాంధీ స్వదేశంలో దిగినప్పటి నుండి, 1920 లో సహాయ నిరాకరణోద్యమం ఆరంభించే వరకు, నిర్మాణ కార్యక్రమం ఒక ముఖ్య భాగం, అందులో "మద్యపాన నిషేధం", చాలా ముఖ్య మయిన అంశం. దరిద్రనారాయణుడు, తన దరిద్రాన్ని జీవన్మరణ సమస్యల్నీ మరిచిపోవటానికి త్రాగుతూ, మరీ దరిద్రుడవుతున్నాడని గాంధీజీ గ్రహించాడు. ఆయనకన్నీ, అంతర్వాణి ఇంట్యూయిషన్ చెపుతూన్నదనే అభినివేశంతో ఇలాంటి ముఖ్యమయిన కార్యక్రమంలోని అంశాలు రూపొందించాడు.

ఈ నిర్మాణాత్మకమైన కార్యక్రమాన్ని స్వరాజ్యవుద్యమ కాలంలో, కల్లు మానండోయ్ బాబూ, కళ్ళు తెరవండోయ్" అని గొంతెత్తి, ఆవేశంతో ఊగుతూ తాగుమోతులను బతిమాలుతూ కల్లు పాకల వద్ద. గ్రామ , పట్టణ వీధుల్లోనూ వాలంటీర్లు పాడుకుంటూ పోయేవారు. కల్లుపాకల దగ్గిర ముఖ్యంగా స్త్రీలు "పికెటింగు" చేసి ఎన్నో అవమానాలకు, పోలీసు వారి నుండి, కల్లు వ్యాపారస్థుల నుండి గురిఅయిన సంఘటనలున్నాయి. ఇది, ఒక దినచర్యగాను సాంఘిక దుష్టశక్తి మీద జరుపుతున్న పోరాటంగాను భావింపబడేది!

మనకు స్వరాజ్యం వచ్చిన వెంటనే రాజ్యాంగాన్ని రూపొందించు కునేటప్పుడు,గాంధీజీ శిష్యరికంలో పెరిగిన వారి సంఖ్య ఎక్కువగా వుండేది గనుక, వారు. "మద్య పాన నిషేధాన్ని"ముఖ్యమయిన అంశంగా భూమికలో (Preamble) చేర్చారు! 1937 లో ప్రథమంగా కాంగ్రెసు ప్రభుత్వాలు, బ్రిటిషు వారి యాజమాన్యం వుండగానే పరిపాలనలో ఛాయారూప అధికారం కొంత వచ్చినప్పుడు, రాష్ట్ర ప్రభుత్వాలు "మధ్యపాన నిషేధాన్ని " చాలా రాష్ట్రాల్లో చట్టరీత్యా అమలు పరిచారు. అప్పుడు మద్రాసు రాష్ట్రం మొత్తంమీద 16 కోట్ల రూపాయల ఆదాయం వుంటే, అందులో మూడోవంతు, "మధ్యపానం" మీద, కల్లు వేలం పాటల ద్వారా వచ్చే ఆదాయంగా వుండేది. అయినా, సరేనని, శ్రీ రాజగోపాలాచారి గారి వంటి వారు, "మద్యపాన నిషేధాన్ని" అమలుపరిచారు. ఆ అయిదు కోట్ల లోటు తీరటానికి "సేల్సు టాక్సు" అనగా అమ్మకాల మీద పన్ను విధించి, లోటును పూర్తి చేశారు. అయితే, తదనంతరపు ప్రభుత్వాలు, "మధ్యపాన నిషేదం" అమలు చేయకుండా రద్దు చేశారు. అయితే

సి.ఆర్. విధించిన అమ్మకపు పన్ను దేశ వ్యాప్తం అయి, పెరిగి, వినియోగదారులపై బరువుగా మిగిలింది! ఇదీ నేటి పరిస్థితి. నీతులు బోధించడమే గాని, అనుసరించే వ్యక్తిగత స్వభావం లేని వ్యక్తులు ఎక్కువమంది రాజకీయ నాయకులవటంతో, యీ కార్యక్రమం కుంటుపడటమే కాకుండా, చెత్త బుట్టలో కూడా పడింది. నెహ్రూ ప్రభుత్వంలోనే దీనికి ఆలనా, పాలనా లేకుండాపోయింది. ఇహ తదుపరి ప్రభుత్వాల అశ్రద్ధ సంగతి చెప్పనక్కర లేదు.

మహాత్మ గాంధీ మనల్ని ముప్పయి సంవత్సరాలు, అంటే ఒక తరం వారిని పుతం పెట్టి శుద్ధి చేసి, అలవరిచిన భావాలన్నీ ఆయనతోనే దహనం చేశాం! నిర్మాణ కార్యక్రమంలోని అంశాలన్నింటినీ కూడా కలిపి కూడా అస్థి నిమజ్జనంతో నీటిలో కలిపేశాం. కాని, తిరిగి, తిరిగి ఆయన పేరు చెప్పుకుని, అప్పుడప్పుడు పునరుజ్జీవులమవుదామని, జవ చచ్చిన నిర్జీవ సమయాలలో అనుకుంటున్నాం. అయినా ఆయన పేరుతో కొన్ని మంచి మాటలు చెప్పుకున్నందువలన నష్టం లేదుగా. అందుకే ఆధోరణిలో ఈ "కల్లు విప్లవాన్ని" గురించి మనలో మనం తర్కించుకుందా మనిపించింది.

ఎవరెలా వున్నా బీదజనాభా త్రాగటం వలన, ఆ పన్నుల వలన సంపన్నులకే లాభం! ఇది బీద జనాభాకు, చాలా ఆర్థిక, ఆరోగ్య దురవస్థలు కలిగిస్తోందని లెక్కల ద్వారా గాంధీజీ అందరినీ ఒప్పించాడు! అందుచేతనే అమానుషమైన అంటరాని తనం నేరం అనీ 'మద్య పాన నిషేదం అవసరమని అమోదింపబడ్డాయి. ఈ రెండూ గ్రామాలలోని బీదవారికి హృదయ శల్యంవంటి బాధలే కదా!

మద్యపాన నిషేధం ప్రపంచంలో ఎక్కడా లేదు. ఈ నిషేదాజ్ఞలవల్ల, రాజబాటనుకాక చాటు మాటుగా నాటు సారాయి త్రాగినందువల్ల ప్రాణ ప్రమాదాలు ఎక్కువవుతాయి అని అనేవారున్నారు. కాని నేడు బాహటంగా కల్లు సారాయి దుకాణాలున్నా లాభాల కోసం వ్యాపారస్థులు, కల్తీ సారాయి అమ్మి నందువల్ల వందలుగా ప్రాణాలు పోగొట్టుకొన్న వారున్నారు గదా! అందుచేత, మన బంగారం మంచిదయితే ఇంకొకళ్లనని ఏం ప్రయోజనం? ప్రతి వ్యక్తికి తగిన విద్యాబుద్ధులు నేర్పి, విజ్ఞాన వంతుణ్ణి చేసే పథకాలు అమలుపరిస్తే యీ పరిస్థితి తప్పుతుంది గదా. 'కంసాలి' తన భార్యకి నగలు చేసినా రాగి

కలపకుండా చేయలేడట! అలాగే, తాగుబోతులు తాగుతున్నంతకాలం, వ్యాపారస్థులు లాభాల కోసం యీ మోసాలు చేస్తూనే వుంటారు– దానికి తగిన శాస్తులు, శిక్ష ద్వారా చేయటానికి, మన చట్టాలలో ఎన్నెన్నో వున్నాయి. చిత్తశుద్ధి లేనప్పుడు, చట్టాలేమి చేస్తాయి!

కల్లు, సారాయి , ఇతర మత్తు పదార్థాలు, తాగటం మంచిది కాదని అందరూ ఒప్పుకునేదే ఆ అందరిలోనూ తాగే వారు కూడా ఉన్నారు. ఇది మంచి అలవాటు కాదని కూడా ఒప్పుకుంటారు కాని, సామాన్య మానవులం కాస్తో కూస్తో అప్రాచ్యపు పనులు చేయకుండా ఉండలేం అందుచేత, ఏ అలవాటైనా పరిమితంగా చేయటం చేస్తే దోషం లేదంటారు. మద్యపాన నిషేధం కూడదనే, వారందరూ మద్యం సేవించేవారు కాదు! చట్టరీత్యా వ్యక్తుల అలవాటును, నిషేదించుకూడదనే తత్త్వంకల వారు మాత్రమే అనాలి. ప్రతివ్యక్తీ మంచి చెడ్డలు, తన పరిస్థితులు కలబోసి ఆలోచించి తనంతానే కల్లు సారాలు తాగడం మానుకోవాలి. అంతే.

పాశ్చాత్యుల ఆహార విహార విధానాలను చూస్తే, వారి అలవాట్లలో ఏదో ఒక మద్య పానీయం తప్పక వుంటుంది. "విస్కీ", "బీర్", "జిన్" మొదలైన అనేక పానీలున్నాయి. దోస్తులు కలిసినప్పుడు, విందు సమయములలోను, పండుగ సమయంలోను వారు తప్పక పై పానీయములు త్రాగుతారు. మనం తాగకపోయినా వారు ఏమీ అనుకోరు. అయితే, మీరంతా కలిసి ఉత్సాహంగా మున్నప్పుడు "మీరంతా" ఏంతాగుతారు. అని ఆశ్చర్యంగా అడుగుతారు. ఏదో కాఫీ మొదలైనవి తాగుతాం అని, నేను చెప్పేవాడిని! చలిదేశమని, తప్పక తాగాలనీ, ఆరోగ్యరీత్యా అవసరం అనీ అనడానికి ఏమీ అవకాశం లేదు. అందుచేతనే అక్కడ కూడా, తాగనీ వారు కూడ చాలా మంది వున్నారు!

అతిగా తాగేవారు, అది లేకపోతే సుస్తీ చేసినట్లువుండే వారిని "ఆల్కహాలిక్సు" అంటారు – అటువంటివారికి అనేక కొత్త రకపు ఔషధాలు ఇచ్చి, తాగుడు అంటే ఏవగింపు కలిగేటట్లు చేసి, వారిని మామూలు అలవాట్లలోకి తీసుకువస్తారు. అటువంటి వారంతా ఒక సంఘంగా ఏర్పడి, ఒక రికొకరు నచ్చచెప్పుకుని, తిరిగి ఆ అలవాటు లోనికి జారకుండా చూచుకుంటారు! తాగుడులో ఎన్నోదోషాలున్నాయి. పాశ్చత్యులు ఏది చేస్తే

అది అభిమానించనక్కర లేదు. వారిలోని మంచిని మనం, మనలోని మంచిని వారు, గ్రహించి జీవిత పంథాను నిర్ణయించుకోవడం అనుసరించటం శ్రేయస్కరం! ఈ మద్యపానం, అవసరమైంది కాదనీ, ప్రమాదకరమైన వ్యసనాలలో ఒకటి అనీ అందరూ గుర్తించవలె. ఎంతో నాగరికులము అనే పాశ్చాత్యులైనా, ఈ అలవాటు మంచిదనరు. కాని చలి దేశాలవటంవలన, వారిలో ఎక్కువ మంది ఆ అలవాటులో చిక్కుకొని పోయారు. అంతే!

వెనకటికి భావకవి బసవరాజు అప్పారావుగారు
"కాలువలన్నీ కల్లే అయితే
సముద్రమంతా సారా అయితే
పడుతూ లేస్తూ త్రాగే
ఇలాయిలట్టే రాముడి కంటే
చదువుకున్నా బ్రాహ్మర్లంతా
ఎల్లా గెక్కువా? ఇంకెల్లాగెక్కువా?" అని వ్రాశారు.

ఒకే ఒక కల్లు ప్రపంచమే వుంటే ఎంతో బాగుంటుందనుకునే వారు కొంతమంది లేకపోలేదు!

సాంఘికంగా ఆమోదించక పోయినా, పౌరాణికంగా దేవతలు సురాపానం చేస్తారనీ, మందర పర్వతంతో మథనం ద్వారా సేకరించిన, అమృతాన్ని మోహినీ దేవి పక్షపాతంతో, ఆ జీవామృతాన్ని, రాక్షసులకు ఒక్క చుక్కైనా అందకుండా చేసి, దేవతలను అజేయులుగా, అమరత్వం పొందిన వారుగా చేసిందంటారు. దేవతలే తాగి అమరత్వాన్ని పొందినప్పుడు, మనం కూడా, యీ కలియుగ అమృతాన్ని అయినా కొంచెం సేవిద్దాం అని అనుకొని సంతృప్తిపడేవారు కొందరుండకపోరు!

ఏసు ప్రభువు కూడా ద్రాక్షరసాన్ని, వైన్, భక్తులకు పంచి మితంగా తాగమని చెప్పివుండవచ్చు. అలా తాగటాన్ని మరో విధంగా సమర్థించుకోవచ్చు. అయితే, మహమ్మదీయ మతంలో తాగకూడదని వున్నదిట. అయినా ఈ నిషేధాలు పాటించేదెవరులెండి! ఇది సిక్కు మతంలో కూడా నిషేదింపబడింది. మితంగా త్రాగండని – బ్రిటిషు గవర్నమెంటు వారు కూడా చేశారు!

1920లో గాంధీగారు ప్రారంభించిన సహాయ నిరాకరణోద్యమంలో, మద్యపాననిషేధం, దానికి షాపుల పికిటింగువుండేదని చెప్పాగదా. నిజంగా బ్రిటిషువారి ఔదార్యంతో కూడిన విజ్ఞతను మెచ్చుకోవాలి. వారు, గాంధీగారి మద్య నిషేధ ప్రచార ఉద్యమానికి తట్టుకోలేక, త్రాగవద్దని చెప్పే మనస్సులేక, "మితంగా తాగండి" అని, ఒక నైతిక పరమైన టెంపరెన్సు ప్రాపగాండా పెట్టారు. దానికి కొంత మంది యువకులకు ఉద్యోగాలు కల్పించి, "టెంపెరెన్సు" ప్రచారకులుగా జీతాలిచ్చి ప్రచారం చేశారు – ఇదో కట్టుకథలా లేదూ! కాని, అక్షరాలా నిజం. నిరంకుశ ప్రభువులైన బ్రిటిషువారే గాంధీగారి ఉద్యమసమయంలో ఈ విధమయిన వుద్యోగాలిచ్చారంటే, గాంధీగారి మద్యపాన నిషేధ వుద్యమం ఎంత, నీతివంతమయిందో ఎంత ఉధృతంగా జనాదరణ పొందిందో తెలుస్తూంది. ఆ జనాదరణలో కొంత భాగమయినా పంచుకొనుటకే బ్రిటిషు పాలకులు ప్రయత్నించి వుండాలి.!

మహాత్ముడు తన నిర్మాణకార్యక్రమములు ఎంత విరోధులైన పాలకులైనా వేలెత్తి చూపునట్లు చేసెడివారుకారు. ఆయనకు అలాంటి మార్గాలు తట్టేవి! ప్రభుత్వపు ఆదాయం మట్టుపెట్టేటట్లువుండేవి. అందుకే ఆయన విధానాలను ఎలా ఎదుర్కోవాలో అని బ్రిటిషు పాలకులు తడబడి పోయేవారు.

గాందీగారిని గౌరవించాలంటే కనీసం మద్యపానం చేయకుండా వుండాలి! ఒక తడవకాంగ్రెసు ప్రభుత్వంలోనే, గాంధీగారి జన్మదినోత్సవమయిన అక్టోబరు రెండవతేదీనాడు మద్యపాన నిషేధ చట్టాన్ని రద్దు చేశారు. అంటే ఎత్తి వేశారు. గాంధీజయంతి ఉదయమునాడే కాంగ్రెస్ గవర్నమెంటు ఒక రాష్ట్రంలో మద్యపాన నిషేదం రద్దు చేశారేమిటని ప్రజలు ముక్కుమీద వేలు వేసుకున్నారు. తరువాత, ఆ ముఖ్యమంత్రిగారినే కొందరు ఇదేం అన్యాయమయ్యా అని ప్రశ్నిస్తే ఆయన ఆశ్చర్యచకితుడై, అది తన అభిమతమేకాదనీ, ఆ పొరపాటు ప్రచురణను ఈ విధంగా సర్ది చెప్పాడు. అక్టోబరు ఒకటవతేదీ, గవర్నమెంటువారి 'ఆబ్కారీ సంవత్సరం" అంతమవుతుంది. అందుచేత 'నిషేధాజ్ఞను' తొలగించే ఆర్డరు ఒకటవ తేదీన వచ్చింది. దానిని రెండవ తేదీనాడు పత్రికలు ప్రకటించినాయి. అది ఖర్మవశాత్తు

అక్టోబరు రెండవ తేదీన జరిగినట్లు అర్థం వచ్చేటట్లు ఉండటం దురదృష్టకరమని, ఆ ముఖ్యమంత్రి అంగీకరించారు. మన వక్ర విధానాలు ఎలా ఉన్నాయో, ప్రకటనలు కూడా దానిని వెక్కిరించే విధానంగా ఉండటానికి ఆశ్చర్యపడనక్కర్లేదు మరి.

### తాగుడు – గాంధీజీ ఆవేదన

గాంధీ యుగంలో తాగేవారి సంఖ్యే చాలా తక్కువగాఉండేది. తాగేవారు కూడా చాటుగా తాగేవారు అదుగో ఆయన తాగుతాడుట అని, ఆశ్చర్యంగా చెప్పుకునేవారు ఎవరేనా ఎక్కువగా తాగిపడిపోతే, ఆయన తాగి పడిపోయాడుట, అని ఒక విశేషంగా చెప్పుకునేవారు. రోజూ తప్పతాగి క్లబ్బులనుండి, ఇంటికి మోసుకుపోవలసిన జనాభా ఎక్కువయిన ఈ రోజులలో, ఆ లజ్జ పూర్తిగా పోయింది. 'పొగతాగని వాడు' దున్నపోతయి పుట్టున్" అనే పద్యంలో "తాగనివాడు ఏం మనిషి" అనే 'ద్రవ్యోల్బణయుగం' అని నీతి భావ యుగం' ప్రస్తుతం నడుస్తోంది. తాగటానికీ పాపం, పుణ్యాలకూ సంబంధంలేదు. బీదలకు ధననష్టం, ఆరోగ్య విహీనత, దరిద్రానికి పునాది అయి దారి వేస్తుంది. జీవితమే ప్రమాదకరంగా తయారవుతుంది. నష్టమనేది బీదైనా గొప్పయినా ఒకే విధంగా వుంటుందనుకోండి. అయితే, బీదవాడు తాగి, గొప్పవారిని ఎలా పోషిస్తున్నాడో, మన బడ్జెట్టు లెక్కలు చూస్తే తెలుస్తుంది! స్వరాజ్యానికి పూర్వయుగం గాంధీ యుగం అందాం. అంటే 1920, 30, 50 వరకూ ఒక తరంగా భావిస్తే, ఆ తరంలో ఇన్ని కల్లు దుకాణాలు లేవు. ఎక్కడో ఒక చోటతప్ప, ఇన్ని త్రాగే బార్ లు రెస్టారెండ్ బార్ ప్రతివీధికీ పట్టణాలలో కాఫీ హోటల్సు లాగా ఎన్నోరకాల విస్కీలుమొదలైన మద్యపానీయాలు అమ్మే దుకాణాలు లేవు.

పెద్ద పెద్ద రైల్వేస్టేషనులలో 'స్పెన్సర్ కంపెనీ' వారి పానీయ శాలలుండేవి. అందులో కాఫీ బ్రెడ్డు, ఇతర మాంసాహారంతోపాటు యీ 'విస్కీ', 'జిన్ లు' కూడా అమ్మేవారు. అవి ఎక్కువగా దొరల సౌకర్యార్థం ఉండేవి.డబ్బు వున్నవాళ్ళు మన వాళ్ళుకూడా వెళ్ళేవారు. ఇవి కూడా ఉదాహరణకు, మద్రాసు నుండి కలకత్తా వెళ్ళేదోవలో ఆంధ్రదేశంలో పెద్ద స్టేషనులైన, విజయవాడ, రాజమండ్రి, విశాఖ పట్టణం మొదలైన స్టేషనులలోనే ఉండేవి. హుషారుగా

తాగతలుచుకున్నవారు స్టేషన్‌లో ఉన్న యీ 'కాఫీ శాలలకు' పోయి వస్తూవుండేవారు. విజయవాడ వంటి పట్టణాలలో ఎవరేనా పెద్దమనుష్యులు విజయవాడ ప్లాటుఫారంమీదకు వెళ్ళి వస్తున్నారంటే సాయంకాలంపూట, ఈ మధుసేవకే అని అంతా అనుకునేవారు. అలా అరుదుగా మాత్రమే తాగేవారుండేవారు.

ఇహ బాగా తాగేవారు కూడా తాగినప్పుడు పల్లెలలో కూడా పెద్దల ఎదటుపడకుండా తప్పుకుని తిరిగేవారు. తిరుణాలలోను, అమ్మవార్ల జాతర్లలోను కల్లసారాయీలు తాగి హుషారుగా గంతులు వేస్తూ పూనకాలు పూనినట్లు ఆడుతూవుండేవారు. ఇలా తాగుడనేది చాటునమాటున మాత్రమే వుండేది.

యువతరంలో తాగేవారు బహుతక్కువ మంది, పెద్దకులాలలో ఉండేవారు. మరి ఇప్పుడు స్వరాజ్యం వచ్చిన తరువాత మన గవర్నమెంట్లు వేయు ప్రణాళికల 'ఆబ్కారీ' రాబడి ఒక పెద్ద భాగమయింది. ఈ 'ఆబ్కారీ' రాబడిలేకపోతే అభివృద్ధి పథకాలే లేవనే పరిస్థితి ఏర్పడింది. ఈ 'పీనుగులమీది పిండాకూటితో' ఎంతవరకు మన ప్రణాళికలు బీదజనాభాకు ఉపయోగపడుతున్నాయో చూస్తే ఎందుకు ఇంత గుడ్డిగా మన పాలకులు, అందులో గాంధీ వారసులమని చెప్పుకునే రాజకీయ పార్టీలవారు, ఆబ్కారీ రాబడి అతి ముఖ్యం అని పరిగణిస్తున్నారని విశదమవుతుంది. స్వరాజ్యం రాకపూర్వం మనకు 'మద్యపాన నిషేదం' మీద, సత్యంమీద ఉన్నంత నమ్మకం ఉండేది. సత్యాన్ని పూర్తిగా అనుసరించక పోవచ్చు. కాని యీ తరంవారికి సత్యంమీద, ఆచరణమీద, రెండు విధాల మీదా నమ్మకంలేక, ఏదో విధంగా రాబడి హెచ్చించి ప్రణాళికల ద్వారా 'సంక్షేమ పథకా'లను అమలులోకి తీసుకు వచ్చి బీద ప్రజలకు 'శ్రేయోరాజ్యం' స్థాపిద్దామనే దృష్టితో అదీ ఒక ఆశయంగానే నడిపిస్తున్నారు. కాని, ఈ 'మద్యం' వల్ల వచ్చేరాబడి మీద ఆధారపడటం మూలంగా ఈ 'సంక్షేమపథకాలు' ఎంత 'హ్రస్వ దృష్టితో' నడుస్తున్నాయో తెలుస్తుంది. అందుకే గాంధీగారు అంత ఆవేదన పడేవారు. గాంధీగారి వేదనకు కారణం ఆయన అహర్నిశలూ బీదవారిని గురించి ఆలోచించటమే!

**మన ఆర్థిక ప్రణాళికలు – బడ్జెట్టులు – గాంధీగారి దూరదృష్టి ముందు నిలవలేవు.**

# XXIII

# మేనరికాలు - పూర్వాపరాలు

# MARRIAGE BETWEEN COUSINS: (MENARIKALU)

i.e. like father's sister's daughter or mother's brother's daughter. The modern objections genetically - How far right or wrong- But don't develop a guilt complex if you are married to your cousins - The hereditary diseases - A scientific 'back and forth' look at this custom of marrying cousins in the Hindu families.

మన హిందూ కుటుంబాలలో మేనత్త మేనమామ బిడ్డలకు పెళ్ళివరుస పుట్టుకతోనే నిర్ణయమై ఉంటుంది. అంటే తండ్రికి అప్పగారు గాని చెల్లెలుగాని ఉంటే వీళ్ళ పిల్లలతో వాళ్ళ సోదరుడి పిల్లలకు వివాహం ధర్మసమ్మతమని శాస్త్రం చెపుతుంది. మన ధర్మశాస్త్రం ఇందుకు అంగీకరిస్తున్నది. అయితే అన్నదమ్ముల బిడ్డల మధ్య ఇది నిషేధం. కాని ముస్లిముల్లో ఈ సంప్రదాయం మనకు వ్యతిరేకం. అన్నదమ్ముల బిడ్డల మధ్య వివాహసంబంధాలు వాళ్ళలో

తప్పుకాదు. అయితే మన సంప్రదాయం ఈ విధంగా ఎందుకు నిబంధిస్తున్నదో పరిశీలిద్దాం.

జీవశాస్త్రం ప్రకారం పురుషుని రేతస్సులోని 'జీన్సు'(జన్యుకణాలు) ఎక్కువ శక్తిమంతాలై సంతానంపై ఎక్కువ ప్రభావశీలం కలవిగా ఉంటాయనే నమ్మకం. ఇదే ప్రధానోద్దేశమై ఉండవచ్చు. అయితే ముస్లిములలో హిందువులకన్నా భిన్నమైన ఆచారం ఎందుకు అమలులో ఉన్నదో తెలియదు. ఆయా దేశాలవారు ఆయా మత సంప్రదాయాలవారు ఆయా పరిస్థితుల కనుగుణ్యంగా ఈ ఆచార వ్యవహారాలు సృష్టించుకున్నారేమో ననిపిస్తుంది. అందువల్లనే మన ప్రాంతంలో అత్తకూతురిని పెళ్ళాడటానికి గాని, అత్త కొడుక్కు పిల్ల నివ్వడానికి కాని అభ్యంతరం లేకుండా పోయింది. అదేవిధంగా ముస్లిములు తమ అన్నదమ్ముల బిడ్డలు పెళ్ళిచేసుకోవటంలో ఎటువంటి ఆటంకం లేకుండా చేసుకున్నారు.

ఇంకోవిషయం. దగ్గర రక్తసంబంధీకులు వివాహం చేసుకుంటే వాళ్ళ పిల్లలకు పుట్టుకతో కొన్ని లోపాలు కలగడానికి ఎక్కువగా అవకాశం ఉందనీ, అది వాంఛనీయం కాదనీ ఆధునిక శాస్త్రవేత్తలు అంటున్నారు. అంటే గుండె జబ్బులు, బుద్ధిమాంద్యం, అవయవవైకల్యం మొదలైనవి రావచ్చని వారి ఉద్దేశం. అది కాక సాధారణంగా వచ్చే ఉబ్బసం, అతిమూత్రం, రక్తపుపోటు, గుండెపోటు జబ్బులు మొదలైనవి వంశపారంపర్యా కొందరికైనా దగ్గరి వంశీకులనుండి రావడానికి అవకాశం ఉంది.

ఇంతకుముందు అధ్యాయాలలో మా నాన్నగారి తల్లికి బాగా ఉబ్బసం వుండేదని చెప్పాను. నాన్నగారి తండ్రికి మధుమేహవ్యాధి ఉండేది. ఈ ఉబ్బసమే మా పెద్ద మేనత్తను జన్మంతా వేధించింది. అయిదో మేనత్త సోమిదేవమ్మగారిని క్రుంగ దీసింది. చైనం వారికి అంటే మా చిన్నమేనత్త కుటుంబం వారికి ఉన్న ఆర్థిక పరిస్థితుల బాధలే కాకుండా ఈ ఉబ్బసం వ్యాధి బాధకూడా ఉండేది. అందరికన్నా ఆఖరివారైన మా నాన్నగారి జీవిత గమనం ఉబ్బసంతో పూర్తిగా మారిపోయింది. అట్లా ఇట్లా కాదు ఆ మార్పు. పెద్ద చదువులు చదివించి ఏ జడ్జీ పదవికో వస్తారని మా తల్లి తండ్రి రంగారావుగారు ఆశలు పెట్టుకోగా మద్రాసు చదువులో కాలేజీలో ప్రవేశించగానే మా నాన్నగారికి ఉబ్బసం ప్రారంభమైంది. సముద్రపుగాలి పడక ఈ ఉబ్బసం ప్రకోపించిందనుకున్నారు.

కాని తరవాత జన్మంతా ఎన్ని ప్రదేశాలు మార్చినా ఈ ఉబ్బసం నుంచి తప్పించుకోలేక బాధపడ్డారు నాన్నగారు. చదువు మానేసి తరువాత జీవనోపాధికి ఎలిమెంటరీ స్కూలు టీచరుగా ముప్పయి రూపాయల ఉద్యోగం చేయవలసి వచ్చింది. బతకలేక బడిపంతులనే సామెతను నిజంగా సార్థకం చేసుకున్నారు. అయితే ఇందులో ఒక విచిత్రం ఉంది. ఈ సామెత మా నాన్నగారి పట్ల వర్తించదు. ఆయన బతకలేక బడిపంతులు ఉద్యోగంలో చేరలేదు. ఈ ఉద్యోగమైతే విశ్రాంతిగా ఉంటుంది. సెలవులు ఉంటాయి ,పల్లెటూళ్ళలోనైతే బడికి కూడా ఓపిక ఉన్నప్పుడే వెళ్ళవచ్చు. సుఖంగా ఉంటుంది ఈ ఉద్యోగమైతే అని నెల్లూరులో రెండు సంవత్సరాలు 'టీచర్స్ ట్రెయినింగ్ కోర్సు' పూర్తి చేసి కృష్ణా జిల్లాలో కుగ్రామమైన ఎలుకపాడు పాఠశాలలో టీచర్‌గా చేరారు. ఆయనక్కడ ఉపాధ్యాయుడిగా చేరారనటం కంటె ఆ ఊరు వెళ్ళి అక్కడ ప్రప్రథమంగా ప్రాథమిక పాఠశాలను ప్రారంభించారు ఊరి వాళ్ళంతా ఎంతో ఉత్సాహంగా ఆదరించారు. మా కుటుంబ జీవితం అక్కడే ప్రారంభోత్సవం జరుపుకుంది. ఆ పల్లెటూళ్ళలో ఆయన ఉపాధ్యాయత్వ మంతా వేరే అధ్యాయంలో ప్రసక్తమైంది.

ఇప్పుడు చెప్పాల్సిందేమంటే ఆ తీవ్రమైన ఉబ్బసంవ్యాధి మా నాన్నగారి జీవిత గమనాన్ని,'కెరీయర్'ని ఏ విధంగా మార్చివేసిందో అదంతా ఇప్పుడు నా కళ్ళముందు మెదులుతున్నది.

వంశపారంపర్యా వ్యాధులు జీవితంలో ఏ దశలోనైనా ఏ స్థాయిలోనైనా ఏ మెట్టులోనైనా రావచ్చు. మా నాన్నగారి అక్కగార్లు ఇద్దరు తిరుమలమ్మగారు, సోమిదేవమ్మగారు, మా నాన్నగారు వంశంలో తీవ్రమైన ఉబ్బసవ్యాధితో బాధపడ్డారు. ఈ విషయం మా కుటుంబాలవారంతా గమనించారు. అందువల్లనే మా పెదనాన్నగారి కూతురిని వర్ధనమ్మక్కయ్యను మా సీతమ్మత్తయ్య కొడుకు లక్ష్మీనారాయణ బావకు ఇస్తామని ఈ సంబంధం కుదర్చటానికి మా కృష్ణయ్య మామయ్య వెళ్ళినప్పుడు వర్ధనమ్మకు కూడా ఉబ్బసం రావచ్చుననే భయంతోనే ఆ శివరామయ్య మామయ్య తిరస్కరించి ఉండవచ్చు. మా పెదనాన్న గారికి ఇందువల్ల చాలా కోపం కూడా వచ్చింది అప్పుడు మా వర్ధనమ్మక్కయ్యకు ఎనిమిది తొమ్మిదేళ్ళే. బంగారపు

బొమ్మలాగా ఉండేది. మా పెద్దనాన్న ఆ పిల్లకు ఉబ్బసం వస్తుందనీ బాధపడుతుందనీ ఎట్లా అనుకుంటారు? అయితే వర్ధనమ్మక్కయ్యకు ఉబ్బసం రాలేదు. వివాహమైన తరవాత గంపెడుమంది పిల్లలతో సుఖంగా కాలం గడిపింది. మరైతే చివరి చివరి రోజులలో కొంచెం దగ్గు ఆయాసం పొడసూపింది. అంత మాత్రమే. ఇందువల్ల ఆమె ఉబ్బసవ్యాధి బాధ అనుభవించలేదనే చెప్పాలి.

తలచుకొన్నప్పుడల్లా మా నాన్నగారి జీవితయాత్ర నన్ను బాధ పెట్టేది. ఈ విధంగా వంశపారంపర్య ఉబ్బసవ్యాధి ఆయనకు రావడం, దీనితో ఆయన జీవితగమనమే పూర్తిగా మారిపోవడం, పట్నంలో పుట్టి పట్నంలో పెరిగి పట్నవాసం చేసిన మా అమ్మ పల్లెల్లో తన జీవితమంతా గడపడం తలచుకొంటే నాకు బాధనిపించేది నాకు కూడ వంశంలో ఉన్న ఉబ్బసంవ్యాధి అప్పుడప్పుడు బయటపడేది. మెడికల్ కాలేజీలో చేరి శవాలను కోయటానికి వెళ్ళిన మొదటి రోజులలోనే తీవ్రమైన ఉబ్బసం, ఆయాసం నన్ను చుట్టుముట్టి నేను హాస్పిటల్‌లో చేరాల్సివచ్చింది. స్నేహితుడొకరు వచ్చి 'పంతులూ, చదువుతావా? ఇంటికి పోతావా? అని నన్ను అడగటం మరపురాని సంఘటన వచ్చినా ఇంటికిపోను చదివి తీరుతానని దృఢనిశ్చయంతో డాక్టర్ కోర్సు పూర్తి చేశాను. ఇక ఆ తర్వాత మళ్ళీ ఉబ్బసం కన్పించలేదు. ఆ జబ్బు కూడా నా మొండితనాన్ని చూసి భయపడిపోయి ఉంటుంది.

అయితే ఈ ఉబ్బసం విషయంలో నాకూ మా అమ్మకు ఉత్తర ప్రత్యుత్తరాలు జరిగాయి ఈ ఉబ్బసం ఎక్కడ వెంటబడుతుందో నన్న భయంతో నా వివాహం వాయిదా వేస్తూ వచ్చాను. ఆ రోజుల్లో అయితే మగపిల్లవాడికి 19, 20 సం॥లు రాగానే పెళ్ళి సంబంధాలు వస్తుండేవి నేను మాత్రం 'డాక్టరీ' చదువు పూర్తిఅయితే గాని చేసుకోనని సంకల్పించు కున్నాను. మా నాన్నగారి లాగా నాకు ఉబ్బసంవ్యాధి ప్రకోపిస్తే తన కృషి అంతా వృధా అవుతుందని మా అమ్మకు తెలియజేసేవాణ్ణి. అయితే మా అమ్మ తెలివిగా, బాబూ రాజేంద్రప్రసాదుకు ఉబ్బసం లేదా ఆయన దేశ నాయకత్వం వహించటం లేదా? అని ప్రోత్సహిస్తూ వ్రాసేది.

ఇలా కొంతకాలం గడిచింది. నేను సరేనమ్మా పెళ్ళిచేసుకుంటాను అని మా అమ్మకు చెప్పడానికి వైద్య చదువు ఆఖరు సంవత్సరంలో అమ్మ దగ్గరకు

వెళ్ళాను. అప్పుడామె జ్వరంలో ఉంది. అది క్రమంగా టైఫాయిడ్‌లోకి దింపింది. వైద్యం జరుపుతూనే ఉన్నాం. పదిహేనవరోజున ఆమె ఒక సాయంత్రం కన్నుమూసింది. మా ఇద్దరు అన్నదమ్ముల వివాహాలు చూడకుండానే ఆమె వెళ్ళిపోయింది. ఆమె మరణించిన తేది 1939 జనవరి 26వ తేది. అదే సంవత్సరం జూన్ నెల 7వ తేదిన నా వివాహం జరిగింది. నేను జైల్లో ఉన్న సమయంలో మరి మూడు సంవత్సరాలకు నా తమ్ముడి వివాహం గుంటూరులో జరిగింది. మా నాన్నగారు ఉబ్బసంవ్యాధితో బాధ పడుతూ ఉన్నా మా ఇద్దరి పెళ్ళిళ్ళు జీవితంలో సాధించిన అభివృద్ధి చూశారు. కాని జీవితంలో మేము పైకి రావటానికి ముఖ్యకారకురాలు,మా అమ్మ మా చదువులు ఆఖరు దశలో ఉండగానే తన కృషి ఫలితం చూడకుండానే పోయిందనే విచారం ఆ జన్మాంతం మా ఇద్దరు సోదరులకు మిగిలిపోయింది. ఎంతో ఆరోగ్యంగా ఉండే మా అమ్మ మరణం విధికృతమే, కాకపోతే ఏ జబ్బు ఎరగని మా అమ్మ మరణం ఆరోగ్యవంతురాలిగా ఉంటూ టైఫాయడ్ జ్వరంతో పోవడమేమిటి? ఎన్నో ఆహారనియమాలతో అదే వాతావరణంతో ఉన్న మానాన్నగారు ఏ జబ్బులేకుండా సుఖంగా ఉండడమేమిటి? మా కుటుంబాలలో వాళ్ళను గూర్చి తెలిసినవాళ్ళు అంతా 'మా సుబ్బయ్యే'ముందు 'లక్ష్మమ్మ' వెనక అనుకొనేవారు. కాని విధి సంకల్పం వేరుగా ఉంది?

ఇదీ మా కుటుంబంలోని ఉబ్బసం ఉదంతం. ఈ ఉబ్బసం ప్రభావమే నా వివాహం జరగడంలో ఆలస్యానికి కారణం. అంతేకాక నా జీవితం మీద, నా ఆలోచనల మీద కూడా ఉబ్బసం కొంతప్రభావం చూపింది.

వంశపారంపర్యా సంక్రమించే మధుమేహం మా తండ్రులలో ఎవరికీ రాలేదు. నాకూ మా తమ్ముడికీ 60 ఏళ్ళు దాటిన తర్వాత ఉన్నానని అంటూ వేధించకుండానే సుఖంగా మా జీవనంతో సహజీవనం చేస్తున్నది. అందుకు సంతోషం.

ఇదంతా ఎందుకు ప్రస్తావనలోకి వచ్చిందంటే మేనరికాలు కూడునా? కూడదా? అని ప్రశ్నవేస్తే చెప్పడం కష్టం అని చెప్పడానికే. ఏమైనా వంశపారం పర్య వ్యాధుల నుంచి తప్పించుకోవాలంటే మరీ దగ్గిర సంబంధాలు చేసుకోకుండా ఉండటమే మంచిది. చేసుకున్నా ముంచుకొనివచ్చే ప్రమాదం లేదు. అయితే ఇట్లా చేసుకొన్నవారికి ఏది వచ్చినా దీనివల్లే అనుకోవడం కూడా

పొరపాటు. ప్రతివ్యాధికీ అనేక కారణాలుంటాయి. అన్నీ అందరికీ వర్తించవు. అందువల్ల మేనరికం చేసుకోవటం వల్ల ఏదో తప్పుచేశా మనుకోకూడదు. ఇష్టపడితే, కావాలనుకుంటే, తప్పదనుకొంటే మేనరికం చేసుకుని ఆనందించండి. వీలైనంతవరకు పరాయిసంబంధాలే చేసుకోవడం మంచిది. కాని మేనరికాలలో కలిసిపోయినట్లు అల్లుళ్ళు, కోడళ్ళు ఇతర సంబంధాలలో అల్లుకోవడానికి అతుక్కోవడానికి కొంత కాలం పడుతుంది. ఒక వేళ అటువంటి సందర్భం వచ్చినప్పుడు మీది మేనరికమా? దగ్గరి సంబంధమా? అని డాక్టర్లు వేసే ప్రశ్నలను ఖాతరుచేయకండి. ఖంగారుపడకండి.

# XXIV

# వంశపారంపర్య వ్యాధులు

# HEREDITARY DISEASES

Consangaunious diseases are common among those marriages between first cousins. These marriages are known as"menarikams" and prevalent in Andhradesa. Such menarikams are very common in our families too.

మా వంశంలో ఉన్న ఉబ్బసవ్యాధి మా వర్ధనమ్మక్కయ్య మేనరికానికి అడ్డొచ్చిందని చెప్పాను. వంశంలోని సంతానంలో మనువలు, మునిమనువలవరకు యీ వ్యాధి వంశపారంపర్యా సంక్రమించవచ్చు. ఇది అందరికీ తెలిసిన విషయమే. అయితే మా వర్ధనమ్మక్కయ్యకు ఈ వ్యాధి రాలేదు.

ఈ వ్యాధి ప్రపంచంలో చాలామందికి వుందని కొన్ని లక్షలమంది దీని వల్ల బాధపడతారనీ మనకు తెలుసు. ఊపిరితిత్తుల మీద పరిశోధన చేసిన శాస్త్రజ్ఞులు ఇది మరణానికి కూడా దారితీస్తుందని చెపుతారు. అయితే ఈ వ్యాధి

కనిపించినంత తీవ్రంగా ప్రాణం తీయదనీ ఈ వ్యాధి ఉన్నవారు ఎక్కువ కాలం బతుకుతారని కూడా ఒక నమ్మకం జన సామాన్యంలో వుంది. ఇది పూర్తిగా సరి అయిన నమ్మకమని చెప్పలేము కాని, అయినా ప్రాణంతీసే వ్యాధి కాదనీ, ఇది ఉన్నా చాలాకాలం జీవించి ఉండటానికి అవకాశం ఉందనీ, జీవితానికి అవరోధం కాదనీ వైద్యులు చెపుతారు. అయితే మా వంశానికి ఈ వ్యాధి ఎంత బాధాకరంగా పరిణమించిందో చూద్దాం.

మా తాతగారి భార్య (తండ్రి తల్లి)కు ఉబ్బసం ఉండేది. వారి కుమార్తెలలో పెద్దదైన మా తిరుమలమ్మత్తయ్యకు తీవ్రమైన ఉబ్బసం. ఆవిడ వితంతువు. సంతానం లేదు. సంతానం లేకపోవడం సంసారం చేయకపోవడం, అంటే చిన్నతనంలోనే వైధవ్య దుఃఖం పై బడటంతో శారీరకంగా మానసికంగా ఆ బరువు బాధ్యతలు లేకపోయినా ఉబ్బసం ఆమెకు దూరం కాలేదు. జీవితమంతా అలా బాధపడుతూనే ఉండేది. చివరకు కాళ్ళకు నీరు వచ్చింది. అలా జరగటం గుండె బలహీనతవల్ల. తద్వారా గుండెపోటు వచ్చి మరణించింది. గుండెపోటు అనేమాటను ఇప్పుడు"హార్ట్ ఎట్టాక్"అనేదానికి వాడుతున్నాం నీరు చూపి క్రమంగా ఒళ్ళు వాచి గుండెజబ్బుగా పరిణమించే ఈ వ్యాధిని 'కంజెస్టివ్ ఫెయిల్యూర్' అంటాం. అదీ ఆవిడ జబ్బు. ఉబ్బసం వ్యాధితో చాలా కాలం బాధపడేవారు గుండెమీద ఊపిరితిత్తుల బలహీనత ప్రభావం వల్ల మార్పులు కలిగి గుండె బలహీనతవల్ల చనిపోతారు. నీరు ఆపటానికి గాని గుండెకు బలాన్ని ఇచ్చే యీనాటి ఔషధాలు కాని ఆ రోజులలో లేవు. ఆయుర్వేద వైద్య ప్రకారం ఉదయాన్నే లేచి ఆవు పంచితం ఒక చిన్న గ్లాసెడు త్రాగేది మా తిరుమలమ్మత్తయ్య. ఆవు మూత్రం కింద పడకుండా పంచిపాత్రలో పట్టుకుని తాగేది. మూత్రంలో 'యూరియా' అనే పదార్థం వుంది. అది మూత్రం ధారాళంగా వచ్చేట్లు చేస్తుంది. ఈనాటికీ 'మూత్ర చికిత్స' చాలా వ్యాధులకు అపూర్వమైన చికిత్సగా వాడతారు. ఎవరి నమ్మకాలు వారివి. అంతే కాదు. ఈ 'మూత్ర చికిత్స' వల్ల నయమైన వ్యాధులు కూడా ఉన్నవి. కొద్దికాలం కిందట మనకు ప్రధానమంత్రిగా ఉన్న శ్రీ మురార్జీ దేశాయికి యీ 'శివాంబు' చికిత్సలో మంచి నమ్మకం వుంది. ఆయన ఇప్పుడు 90వ పడి వయసులో ఉన్నారు. ఈ వయసున కూడా ఆరోగ్యంగా ఉండటానికి ఈ చికిత్సే ఎక్కువ దోహదం చేసిందని వారంటారు. వినడానికి అసహ్యంగా ఉంటుంది. అయినా ఈ చికిత్స

వల్ల లాభం పొందిన వారున్నారు ఎందరో ఏ చికిత్స అయినా కొంత అనుభవం గల వైద్యుల దగ్గర చేయించుకుంటే తగిన ఫలితాలుంటాయి ఈ చికిత్సకు సంబంధించిన గ్రంధాలు ఇంగ్లీషులో, దేశీయ భాషలలో కూడా ఉన్నాయి.

## ఉబ్బువ్యాధి

మా తిరుమలమ్మ అత్తయ్యకు వచ్చినట్లు కాళ్ళు ముఖం వాస్తే దీన్ని 'ఉబ్బువ్యాధి' అనే వారు. ఉబ్బువ్యాధికి అనేక కారణాలు. ముఖ్యంగా గుండె జబ్బు, మూత్రపిండాల వ్యాధి, రక్తహీనత, సాధారణంగా ఈ వ్యాధికి కారణాలు.

మా తిరుమలమ్మత్తయ్యకు వచ్చిన ఉబ్బురోగం గుండె బలహీనతవల్ల వచ్చింది. దీనికి మూలకారణం ఆవిడ దీర్ఘకాలపు ఉబ్బసవ్యాధి అయి ఉంటుంది కేతనకొండలో మా మేనత్తగారి ఇంటిముందర పెద్ద గొడ్లసావిడి ఉండేది. అందులో దాదాపు పాలిచ్చే ఆవులు, గేదెలు ఒక షది పదిహేను వరకూ ఉండేవి. ఎక్కువగా అవులే ఉండేవి మా అత్తయ్య తెల్లటి ముసుగుతో ఉదయమే ఆవుపంచితానికి వెళ్ళే దృశ్యం మా మనస్సులో అస్పష్టంగా మెదలుతోంది. తెల్లటి మల్లు పంచ, ముసుగుతో ఉన్న వెనుకభాగమే గాని మరీ చిన్నతనం కదా మాకప్పుడు ముఖం భాగం గుర్తురావటం లేదు. నాకప్పటికి మూడు, మూడున్నర ఏళ్ళు ఉంటాయనుకుంటాను. ఎంత చిన్నప్పటి విషయాలు జ్ఞాపకం ఉంటాయో తెలుసుకోవడానికి నా చిన్ననాటి ఊహపోహలు కూడా ఒక నిదర్శనంగా తీసుకోవచ్చు. కుటుంబంలో మా తిరుమలమ్మత్తయ్యే పెద్దావిడ ఆవిడ తరవాత ముగ్గురత్తయ్యలకూ ఏ జబ్బు లేదు. ఆఖరత్తయ్య సోమిదేవమ్మత్తయ్య మాత్రం ఉబ్బసంతోను, కొంచెం లేమితోను బాధపడ్డట్లుగా ఉంది. వాళ్ళలో ఆఖరువాడు మా నాన్నగారు మా నాన్నగారికి దాదాపు 20 సంవత్సరాల వరకూ ఏ జబ్బులేదు. ఉబ్బసం సంగతి తెలియదు. అందరి మధ్య గారాబంగా పెరిగారు. అందంగా తెలివితేటలతో చదువుసంధ్యల్లో చురుకుగా శ్రద్ధగా ఉండేవారు. అప్పట్లో ఇప్పటి ఎస్.ఎస్.ఎల్.సి. ని "స్కూలు ఫైనల్" అనేవారు అప్పట్లో మా కుటుంబంలో మొదటగా ప్యాసైన వారు మా నాన్నగారే. మా పెద్దనాన్నగారైన యజ్ఞనారాయణగారికి ఉబ్బసం రాలేదు. ఈ విధంగా ఒకే కడుపున పుట్టినవారికి వారసత్వంగా వచ్చే ఉబ్బసంలాంటి వ్యాధి

కొందరికి రావడం, కొందరికి రాకపోవడం తమాషాగా ఉంటుంది. కాని వారి శరీర నిర్మాణంలో ఇది వారి వారి 'జీన్స్' పంపకాన్ని బట్టి ఉంటుంది

## ఉబ్బసం మా నాన్నగారికి చేసిన అపకారం

మా నాన్నగారిని కాలేజీలో చేర్చి పై తరగతులు చదివించటానికి మా అమ్మ తండ్రిగారు మద్రాసు తీసుకవెళ్ళి కాలేజీలో చేర్చిన కొద్దిమాసాలకే ఆయనకు ఉబ్బసం వ్యాధి బయటపడింది. మా తాతగారికి అంటే తండ్రి తండ్రి తిరుమల రాయుడు గారికి అతిమూత్ర వ్యాధి ఉండేది మా నాన్నగారికి ఈ వ్యాధి రాలేదు గాని తల్లిగారికి ఉన్న ఉబ్బసంవ్యాధి వచ్చింది ఉబ్బసంలాగే అతిమూత్ర వ్యాధి లేక మధుమేహం కూడా చాలామటుకు వంశపారంపర్యంగా వచ్చే వ్యాధే.

1912లో కలపటపు రంగారావుగారు తమ పెద్ద కుమార్తె లక్ష్మమ్మను మా నాన్నగారికిచ్చి వివాహం చేశారు.మా తాతగారు తన ఇద్దరు కుమార్తెలకు వరులను ఏ విధంగా ఎంపికచేశారో తలచుకొంటె ఆ నాటికే ఆయన ఎంత ముందున్నారో తెలిసి ఆశ్చర్యమనిపిస్తుంది. ఆయన అప్పటికే అంత ఆధునికంగా ఆలోచించ గలిగేవారు. ఆ విషయం ముందు ముందు తెలుసుకుంటారు మీరు పెళ్లినాటికి మా నాన్నగారు దబ్బపండు ఛాయలో ఒడ్డుకు తగ్గ పొడుగుతో అందంగా ఉండేవారు అన్నదమ్ములలో తెలివితేటల్లో, చదువులో చురుకుగా ఉండేవారు. పెళ్లికాగానే వారి మామగారు అంటే మా రంగారావు తాతగారు అల్లుడికి పెద్దచదువులు చెప్పించాలని మద్రాసుకు తీసుకొనివెళ్లి అక్కడ 'అక్కడ' వెస్లీ కాలేజిలో చేర్పించారు ఎఫ్.ఏ.క్లాసులో చేరారు మా నాన్నగారు. ఈ రోజులలో దీనినే ఇంటర్మీడియెట్ అంటున్నారు. అప్పట్లో దానిని 'ఎఫ్.ఏ.' అనేవారు. ఇక ఆ కాలం నుంచి ఈ చదువు ఈ రెండేండ్ల కోర్సును అనేక మార్పులు చేసి కొంతకాలం ఇటు హైస్కూలులోను తరవాత జూనియర్ కాలేజి అని కాదు మళ్ళీ ఇంటర్ మీడియట్ అని ఒక స్థిరమైన ప్రాతిపదిక లేకుండా రకరకాల పేర్లతో పాఠ్యప్రణాళికలు, పాఠ్యవిషయాలు మార్చి పదేపదే ప్రయోగాలు చేస్తున్నారు మధ్య మధ్య అయోమయంలో పడిపోతున్నారు . సరే ఈ విద్యా ప్రణాళిక ప్రయోగాలను ఇక్కడ ఆపుదాం అప్పట్లో అంటే ఎనభై ఏళ్ళ కిందట ఉన్నత పాఠశాల తర్వాత కాలేజి మొదటి తరగతులను ఎఫ్.ఏ అంటారని

తెలుసుకుంటే చాలు. అప్పట్లో ఈ చదువే గొప్ప. ఎవరైనా ఆ రోజుల్లో ఏఫ్.ఏ గాని లేదా బి.ఏ.గాని ప్యాసైతే ఆయన ఎఫ్.ఏ గారండీ వారు బి.ఏ.గారండీ అని పిలిచేవారు చెప్పుకునేవారు. కాలేజీ చదువంటే ఆ రోజులలో అంత అరుదూ, గొప్ప అన్నమాట

అసలప్పట్లో ఆంధ్రదేశంలోనే కళాశాలలు బహుతక్కువ. మన ప్రాంతానికంతా విశ్వవిద్యాలయం ఒక్క మద్రాసులోనే ఉండేది. మద్రాసు కాక ఇక కాలేజీ చదువులు రాజమండ్రీ, విజయనగరాలలో తప్ప మరోచోట ఉండేవికావు. తరవాత కాకినాడలో పిఠాపురం రాజావారి కళాశాల నెలకొన్నది. ఇప్పుడున్నన్ని లెక్కకు మిక్కిలి కాలేజీలప్పుడెక్కడివి. ఇప్పుడు వీధివీధిన, సందుసందున కనపడతాయి చూడాలంటే. అందువల్ల ఆనాటి పరిస్థితి ఈనాటి యువతరం ఊహించనైనా లేదు. అందుచేత మా నాన్నగారిని మా మాతామహులు మద్రాసు వెస్లీ కాలేజీలో చేర్పించారంటే మహాగొప్ప అన్నమాట. ఆ రోజుల్లో మద్రాసు ప్రయాణమంటేనే ఒక గొప్పయాత్ర కింద ఉండేది. మా నాన్నగారికి ఆయన మేనల్లుళ్ళందరూ 'చిన్నాం' అని పిలిచేవాళ్ళు. (అంటే చిన్న మేనమామ అని అర్థం). అందువల్ల మా నాన్నగారేదో పెద్ద చదువులకు అమెరికా వెళుతున్నట్లు భావించారాయన మేనల్లుళ్ళు. మా నాన్నగారు అత్తగారింట్లో ఉండి చదవుకున్న కథను మా నాన్నగారికి అత్తింటి కాపురం అని చెప్పవచ్చు. ఒకరకంగా చెప్పాలంటే మా నాన్నగారే కాపురానికి వెళ్ళారన్నమాట.

దురదృష్టం ఏమంటే మద్రాసు చదువు ప్రారంభదశలోనే మ నాన్నగారికి ఉబ్బసం ఉధృతంగా పట్టుకుంది. ఎన్ని చికిత్సలు చేసినా తగ్గలేదు. అది సముద్రతీరం కావడంవల్ల ఆ గాలి పడలేదని నిశ్చయించారు. గాలిమార్పు కావాలనీ చోటు మార్పుకావాలనీ గుంటూరు మొదలైన ప్రదేశాలలో ఉంచేందుకు ప్రయత్నించారు. అవేవీ కుదరక మా తాతయ్యగారి మరణానంతరం కేతనకొండలో ఉన్న పెద్దక్క తిరుమలమ్మగారి ఆచ్ఛాదనకిందికి చేరారు. మరి పసినాటి నుంచి తల్లిలేని పిల్లవాడిలాగా ఆమే గదా పెంచింది. అందుచేత మా నాన్నగారికి కేతనకొండే పుట్టిల్లు అయింది. అందుచేతే మా అమ్మకు అనుకోకుండా 'అత్తగారి ఇల్లయింది'.

ఇలా మా నాన్నగారు ఉబ్బసంవ్యాధితో బాధపడుతూ మానసికంగా శారీరకంగా నీరసపడి ఇహ పైచదువులు చదివే అవకాశంగాని,ఆశగాని,ఓపికగాని లేని

వ్యక్తి అయినారు. నిజమైనా కాకపోయినా కొన్నిభయాలు కల్పించుకున్నారు. కాస్తోకూస్తో ఓపిక ఉన్నా నిజంగా తనకు శక్తి లేదనే భయంతో సగం దిగజారిపోయి ఉన్న ఓపిక కూడా పోగొట్టుకొని కేతనకొండలో ఉమ్మడికుటుంబంలో ఇమిడి తినికూర్చునే అలవాటు చేసుకున్నారు. కాస్త స్థైర్యం తెచ్చుకొని ధైర్యంగా నిలబడి చదువు కొనసాగిస్తే మా తాతగారి పలుకుబడి తోడై, ఆయనకు స్వతహాగా ఉన్న తెలివితేటలవల్ల కాస్త పెద్ద ఉద్యోగమే ఏ కలెక్టరో, జడ్జి హోదాకో పోవలసినవారు. కాని 'బిల్లు కలెక్టరు' హోదాకు సరిఅయిన ఎలిమెంటరీ స్కూలు ఉపాధ్యాయుడిగా జీవితమంతా పల్లెప్రాంతాలలో, కృష్ణా జిల్లాలోనే గడపవలసి వచ్చింది

నాన్నగారు మనోదౌర్బల్యం పాలైనారు అని ఎందుకన్నానంటే ఆ పల్లెటూరయిన గన్నవరంలో (కృష్ణాజిల్లా) ఎలిమెంటరీ స్కూలు పని చేస్తున్నప్పుడు కొంచెం ఆ జిల్లాలో పలుకుబడి ఉన్న మా పినతాతగారు విజయవాడ వాస్తవ్యులైన డాక్టర్ ఘంటసాల సీతారామశర్మగారు విజయవాడలో ఎలిమెంటరీ స్కూలు కంటె రెండు రెట్లు జీతం ఎక్కువగా వచ్చే హైస్కూలు ఉద్యోగం వేయిస్తానంటే, అబ్బో! హైస్కూలైతే రోజూ వేళకు వెళ్ళవలసివస్తుంది, నాకీ 35 రూపాయల జీతమే చాలునని సంతృప్తితో జీవితం గడిపారు. ఈ విధంగా పైకి రావలసినవారు, తెలివితేటలు కలవారు అయిన మా నాన్నగారు ఏమీ రాణింపు లేకుండా తృప్తితో జీవితాన్ని గడిపేట్లు ఉబ్బసం ఆయన్ను ఒక కంటకనిపెట్టి ఉంది. ఆయనమాత్రం ఈ ఉబ్బసవ్యాధితో రోజూ ఎంతో బాధపడటం నా కళ్ళకు కట్టినట్లు ఉండి చాలారోజులు నేను కూడా అలా అవుతానేమోనన్న భయం పట్టుకుంది నన్ను. అందువల్లనే నా వివాహాంగీకారం నేను మా అమ్మకు నా వైద్యవిద్య పూర్తి అయిందాకా ఇవ్వలేక పోయాను. మా అమ్మకు ఎవరో జ్యోతిష్కులు చెప్పారుట. ఆమె తన ఇద్దరు కుమారుల వివాహం చూడకుండానే చనిపోతుందని. అదొక బెంగ ఆవిడ మనస్సులో ఉండేది. అదేమిటో ఆమె భయపడినట్లుగానే దిగులుపడినట్లుగానే ఆమె ఈ లోకాన్ని వదిలిపెట్టిన ఆరునెలలకు నా వివాహం జరిగింది మా అమ్మ 1939 జనవరి 26వ తేదిన పోయింది. నా వివాహం అదే సంవత్సరం జూన్ 7వతేదిన అయింది. ఆమె ఆశలన్నీ, కన్న కలలన్నీ కొంతవరకు మా చదువుల ద్వారా తీరినా అనారోగ్యంతో బాధపడే భర్తతో జీవించి సగం దిగులుపడటమే కాక

మా ఇద్దరి వివాహాలు చూడలేకపోతానేమోనన్న వేదనతో సగం కుంగిపోయి ఉంటుంది. ఇది కూడా మా కుటుంబానికి ఉబ్బసం వ్యాధి చేసిన అపకారాలలో ప్రధానమైనది అని చెప్పాలి.

మా వర్ధనమ్మక్కయ్య పెళ్ళి మా మేనత్త సీతమ్మగారి కొడుకు లక్ష్మీనారాయణ బావతో తప్పిపోవటానికి కూడా మా కుటుంబం ఆస్తి అయిన ఉబ్బసమే కారణం. ఒకవేళ వర్ధనమ్మ క్కయ్యకు ఉబ్బసంగాని వస్తుందేమోననే గదా మా మేనత్త వాళ్ళు ఆ అమ్మాయిని కోడలుగా చేసుకోనన్నది. ఇందువల్లనే కదా మా పెద్దనాన్నగారు చాలా బాధపడింది. ఆయనకు చాలా కోపం కూడా వచ్చింది. తాను తన చెల్లెలు సీతమ్మను శివరామయ్యకు ఇచ్చేప్పుడు అతడికేముంది? తాడా? బొంగరమా? అయినా తాను పూనుకొని ఆ పెళ్ళి జరిపించాడు. ఈనాడు కొంచెం రూకలు వెనకేశానని గర్వమేమో అనుకుని మా పెదనాన్న చాలా బాధ పడ్డారు. అందువల్ల ఆ తర్వాత చాలా సంవత్సరాలు మా పెదనాన్న తన చెల్లెలు సీతమ్మగారి ఇంటి గడప తొక్కలేదు. ఇదంతా ఇలా జరిగిందా! మా వర్ధనమ్మక్కయ్య ఏమీ ఉబ్బసంతో బాధపడలేదు.

అప్పుడు మా పెదనాన్నగారు నందిగామలో రెవిన్యూ ఇన్స్పెక్టరుగా పనిచేస్తూ ఉండేవారు. ఆ దగ్గర్లో మైలవరం వైపున్న కుంటముక్కల గ్రామకరణం గారి కుమారుడైన రాఘవరావుకు మా అక్కయ్యనిచ్చి వైభవంగా విజయవాడలో వివాహం జరిపించాడు. వారి జీవితం మూడుపూలు ఆరుకాయలుగా శోభతో వర్ధిల్లింది. ఆ కుటుంబం దోసతోటలాగా కలకలలాడింది. చుట్టుపక్కల గ్రామాల వారితోనే ఇచ్చిపుచ్చుకోవడాలు జరిగినందువల్ల అది ఒక చిన్న సంస్థానంలాగా, రాజ్యంలాగా వృద్ధిపొందింది. రాఘవరావు బావ చాలా సరదామనిషి సరసుడు, సరళస్వభావుడు. ఆరుగురు ఆడపిల్లలు, ముగ్గురు మగపిల్లలతో మా వర్ధనమ్మ అక్కయ్యదీ పెద్దకుటుంబం. గంపెడు సంసారం చక్కగా నిర్వహించుకొని ఆమె పసుపూకుంకుమలతోనే వెళ్ళిపోయింది. అందువల్ల ఎవరికి ఎవరు ఎక్కడ ప్రాప్తమో ఎవరు చెప్పగలరు? అయితే మా కుటుంబానికి ఉబ్బసం వ్యాధివల్ల కలిగిన ఒక అనూహ్య పరిణామం ఇది.

మా కుటుంబానికి ఉబ్బసం వ్యాధివల్ల కలిగిన ఫలితాలు ముక్తసరిగా చెప్పాలంటే - మా నాన్నగారు కుగ్రామమైన ఎలుకపాడులో ప్రాథమిక

పాఠశాలోపాధ్యాయులుగా జీవిక వెళ్ళబుచ్చటం మహాపట్టణమైన మద్రాసులో మామగారి హోదాకు తగిన ప్రజ్ఞ, అవకాశం ఉండికూడా ఎలిమెంటరీ స్కూలు మాష్టరుగా జీవితం గడపవలసి రావడం. శివుడి తలమీద గంగ పాతాళం చేరినట్లుగా అనిపిస్తుంది ఈ సాదృశ్యం. మా నాన్నగారు ఉద్యోగంచేసి 35 రూ. ల పింఛను తీసుకున్నారు. అయితే ఆ రోజుల్లో అనేక స్థాయిలలో మేస్టర్లకు ఫించన్ ఉండేది కాదు. అయితే ఒక గొప్పవిషయం ఏమంటే మా అమ్మలో ఎక్కడా అసంతృప్తి ఛాయ కూడా ఉండేది కాదు. తాను ఏ స్థితినుంచి ఏ స్థితికి వచ్చిందో ఆమెకు తెలుసు. వివాహానంతర జీవితాన్ని ఆమె ఎంతో ఘనంగా ఊహించుకొని ఉండటంలో అసహజమేమీ లేదు. అయితే నా తల్లి ధీరచిత్త. పరమ వివేకవతి. ధర్మజ్ఞురాలు. అనురాగమయి. పూరిపాకనే దివ్యసౌధంగా భావించుకోగల స్థితప్రజ్ఞురాలు. ప్రేమస్వరూపిణి. పూరిపాకనే ఒక దివ్యకుటీరం చేసుకోగల కళాహృదయి. ఆ తాటాకు పందిరే దివ్యభవనం ఆమెకు. ఆ కుటీరానికి బంతిపూల మాలలు అలంకరించి రాజప్రాసాదంలాగా రాణింప చేసేది. ఇరుగుపొరుగులకు తలలో నాలుకయై వాళ్ళకు చేదోడువాదోడుగా ఉంటూ సహాయం చేస్తూ సలహా సంప్రదింపులందిస్తూ మహారాణిలా మన్ననలు పొందేది వాళ్ళమధ్య. గౌరవంతో, తృప్తితో, నిబ్బరంతో, భవిష్యత్తు మీద నమ్మకంతో, ఆశతో ఆమె జీవితాన్ని గడుపుకుంది. ఈ విధంగా కుటుంబంలో అందరికీ తన ప్రవర్తనతోనే జ్ఞానబోధ చేసేది. ఏమైనా ఉపదేశించాల్సి ఉంటే గోప్యంగా, రహస్యంగా ఉపదేశించేది. మా వర్ధనమ్మక్కయ్యకు 'మంత్రో' పదేశం చేసింది మా అమ్మేకదా!

మా అమ్మ సహచర్యం వల్లనే మా నాన్నగారి జీవితం కూడా ఎటువంటి ఒడిదుడుకులు లేకుండా నిత్యసంతోషిగా చీకూచింతా లేకుండా ఉల్లాసంగా నింపాదిగా గడిచిపోయింది. మేము పై చదువులు చదివి జీవితంలో ఏదో ఇంత ప్రయోజకులమయ్యామంటే, అనిపించుకో గలిగామంటే అదంతా ఆవిడ చేతి చలవ. గర్భవాసంలో పుట్టిన పుణ్యం. ఆమె దూరదృష్టి , త్యాగబలం ఉత్తమ సంస్కారం.

సిరిసంపదల హెచ్చుతగ్గుల వల్ల మానసిక దృక్పథాల మార్పు, దృష్టిదోషాలు మనం సినిమాలలో చూస్తూ ఉంటాం. పట్టుదలలు, పంతాలు, సాధింపులు, అన్నదమ్ములను, దగ్గరబంధువలను కూడా వేరుచేస్తాయి.

సంవత్సరాల తరబడి ఒకరితో ఒకరు మాట్లాడుకోరు. ఉద్రేకాలతో సతమతమవుతారు. ఏదో సామెత చెపుతారే ఈ ఇంటి మీద కాకి ఆఇంటి మీద వాలదని ఆ విధంగా ప్రవర్తిస్తారు. లోకంలో ఇటువంటి వృత్తాంతాలు, సందర్భాలు, ఉదాహరణలు ఎన్నోవున్నాయి. ఇటువంటివే కథలవుతాయి. గాథలుగా చెప్పుకుంటారు. మా పెదనాన్నగారి దుగ్ధ ఏమంటే తానుగా శివరామయ్యను ఒక ఇంటివాణ్ణి చేస్తే అతడే తనను నిర్లక్ష్యం చేస్తాడా అని? శివరామయ్య వాళ్ళకు ఆస్తిపాస్తులు లేకపోయినా తమతో సరితూగకపోయినా మా పెదనాన్న యజ్ఞనారాయణగారు తమ తండ్రి తిరుమలరాయుడుగారికి నచ్చ చెప్పి తన రెండో చెల్లెలు సీతమ్మనిచ్చి వివాహం జరిపించాడు. శివరామయ్యకు కాస్త సంచి చేరడమే తనను తృణీకరించడానికి కారణమని మా పెదనాన్న గట్టి నమ్మకం. అదే ఆయన కోపకారణం. మా లక్ష్మీనారాయణ బావ పెళ్ళికి మా అన్నయ్య ఒకడు అంటే మా పెదనాన్నగారి పెద్దబ్బాయి తప్ప మరెవరూ రాలేదుట. మేమంతా వెళ్ళాం.

కొన్నాళ్ళయిన తర్వాత కాలక్రమేణా ఈ స్పర్థలు చల్లారినాయి. నిప్పుమీద నీళ్ళు చల్లితే సెగలు, ఆవిర్లు వస్తాయి కాసేపు. ఆ తర్వాత చల్ల బడిపోతుంది నిప్పు. మనుష్యుల తత్వం కూడా ఇంతే. ఈ విధంగా మేనరికాలను కూడా ఉబ్బసం వ్యాధి ఎలా తమాషా పట్టించగలదో చూశాం. కలిమిలేముల కలహశీలతలు గమనించాం. అపార్థాలు అర్థం చేసుకున్నాం. వంశపారంపర్య వ్యాధి అనగానే అది ఎన్ని చిత్ర విచిత్రాలు సృష్టిస్తుందో 'జన్యు' శాస్త్ర బద్ధ ప్రవర్తన చూపుతుందో తెలుసుకున్నాం

# XXV

# రంగారావు తాతగారి వీలునామా

# THE FORESIGHT OF MY MATERNAL GRANDFATHER

The foresight of my maternal grandfather in selecting his sons-in-law . My mother was very intelligent and my aunt was very sub-normal and simple in her mental growth -specially in the pampering or protective situation of an upper middle class care.

The Will of my maternal grandfather - Sri Ranga Rao:
His foresight and implications to protect the rights of his two daughters from this joint property as there were no equal rights or even inheritence rights to women in those days.

### తాతగారి మొదటిరోజులు

మా అమ్మగారి పుట్టిల్లు తూర్పుగోదావరి జిల్లా కాకినాడ అని ఇదివరలో వ్రాశాను. మా తాతగారికి కాకినాడ మసీదు వెనకసందులో ఒక పెద్ద స్థలం,

పెంకుటిల్లు, మండువాలోగిలి ఉండేది. అదే వారి స్థిరాస్తి. తాతగారి చదువు కొద్దిదే. తమ్ముడు వెంకటచలంగారిని మాత్రం ఇంజనీరింగు చదివించారు. అప్పట్లో జిల్లా కేంద్రమైన కాకినాడలో ఏదో చిన్న ఉద్యోగం చేస్తూ నచ్చక రంగారావుగారు రాజధాని అయిన మద్రాసుకు తరలి వెళ్ళారు. తెలుగువారంతా అప్పుడు మద్రాసును చెన్నపట్నం అనేవారు. చెన్నప్ప అనే బెస్త నాయకుడు ఆ పట్టణానికి పునాది కారకుడనీ అందువల్ల అది చెన్నపట్నమైందనీ ఆంధ్రులు గర్వంగా చెప్పుకునేవారు. 'చెడి చెన్నపట్నం చేరడం,' అని తెలుగులో ఒక సామెత కూడా ఉంది. అంటే ఏదో ఒక విధంగా అక్కడ బతక ఎచ్చునని అర్థం. ఇక పేరు ప్రతిష్ఠలు, ఆర్జన పెంచుకోవాలనుకునేవారు చెన్నపట్నం చేరడంలో విశేషం ఏముంది? అలాంటి ఆంధ్రులలో మా తాతగారు రంగారావుగారు ఒకరు. వారికి ఇరవై ఎనిమిది ముప్పై సంవత్సరాల వయసుండగా వారు మద్రాసు చేరారనుకుంటాను.

మొదటినుంచీ వారికి జమీందార్లతో పరిచయం ఉండేది. అప్పటి తుని రాణీగారికి దివాను హోదాలో మద్రాసులో ఆ సంస్థానం వారి వ్యవహారాలు చూసిపెట్టేవారుట. మన తెలుగు జమీందార్లందరికీ మద్రాసులో ఇళ్ళు, వారి వ్యవహారాలు చూసిపెట్టే లాయరు ఏజంట్లు ఉండేవారు. జమీందార్లకు తమరైతులతో తగాదాలు, జమీందార్ల మధ్యనే వారిలో వారికి కోర్టు వ్యవహారాలూ నడుస్తూ ఉండేవి. అందువల్ల ఈ జమీందార్లకు మద్రాసులో ప్రతి నిధులుండేవారు. ఈ ప్రతినిధులకు పెద్ద పెద్ద లాయర్లకు ఆరోజులలో మంచి ఆదాయాలుఉండేవి. అలాంటి పలుకుబడిగల వ్యవహర్తగా పిఠాపురం జమీందారు, తుని రాణీ వగైరాల వ్యవహారాలు చూడటం వారి ఆదాయానికి పునాది. అందుచేత మా తాతగారి ఇంట్లో జమీందారీ హోదాలోనే వ్యవహారాలు మొదటి నుంచీ నడుస్తూ ఉండేవి.

ఇది కాకుండా కొంతకాలం ఏదో నేతి వ్యాపారమంటూ కూడా చేశారుట. మంచి నెయ్యి ఆనాటికీ ఈనాటికీ కావలసినవారికి కరువే కనుక మంచి నెయ్యి మార్కెటులోకి అందించాలని ప్రయత్నించి ఉంటారు. ఒకసారి వచ్చిన నేతి డబ్బాలో నెయ్యి బాగానే ఉంది. తూస్తే బరువు సరిపోయింది. కాని అడుగున పెద్దది గుండ్రటిరాయి ఉంది. ఇది ఆనాటి వ్యాపార నైతిక సరళి. తూకాలలో

అక్రమాలు అరికట్టే అన్వేషణ ఆనాటికీ ఈనాటికీ ఒకేవిధంగా ఉంది. అందుకే ఇంత నవనాగరకతతో కూడిన పాలనాయంత్రాంగంలో కూడా 'కమీషనర్ ఫర్ మెట్రాలజీ' అని కొలమానాలు తూకపు రాళ్ళతనిఖీ ఐ.ఏ.ఎస్.ఆఫీసర్ నియామకం అవసరమైంది. వినియోగదారుల సంక్షేమం చూడవలసిన అవసరం ఏర్పడుతోంది. ఈ గుండ్రాళ్ళు నేతిడబ్బాలలో రావడం చూసి ఆ వ్యాపారం వదిలేశారు మా తాతగారు.

దినవహి హనుమంతరావుగారు విజయవాడకు 1910 ప్రాంతంలో మునిసిపల్ ఛైర్మన్‌గా ఉండేవారు. వారికో కూతురుండేది. ఆమెను 'అమ్మన్న' అనేవారు. చాలా రూపసి ఆమె. ఎంతో అందంగా ఉండేది. పెద్ద జమీందారీ కుటుంబంలో వివాహమైనా బహు చిన్నతనంలోనే వితంతువైంది. అత్తవారు ఎంత సంపన్నులైనా ధనవంతులైనా వితంతువైన కోడలికి ఆ రోజులలో మనోవర్తి మాత్రమే ఇచ్చేవారు. అదే జీవనోపాధి.

ఆమె వివాహానికి పెద్ద 'చమ్కీ' టోపీ అదీ పెట్టి తీసిన ఆ పెళ్ళి ఫొటో చూసినట్లు గుర్తు. కొంచెం పొట్టిగా బక్కపలచగా ఆమె చాలా అందంగా ఉండేది. పచ్చని పసిమి అని ఎవరి గురించైనా చెప్పాలంటే ఆవిడదే ఆ పసిమి అని చెప్పాల్సినట్లు ఉండేది. నాకు బాగా జ్ఞానం వచ్చేవరకూ ఆమె ఉంది. ఆవిడను మేము 'కక్కీ' అనేవాళ్ళం. బహుశా ఇది కూడా తూర్పు గోదావరిలో వాడే పదం అనుకుంటాను. పిన్ని అన్నదే ఈ పదానికి కూడా అర్థం అనుకుంటాను.

ఆవిడ తరఫున మా తాతగారు కోర్టులో వ్యవహారం నడిపి ఆ రోజులలో దాదాపు లక్షరూపాయలపైన మనోవర్తి మొదలైన సౌకర్యాలు ఆమెకు కలిగించారు. ఆవిడ వజ్రాలదుద్దులు, బంగారపునగలు ధరించి ధగధగా మెరిసిపోతూ ఉండేది. వితంతువు కనుక తెల్లటి మల్లునే కట్టేది. ఈనాటి వితంతువుల మామూలు చీరలు ధరించే అలవాటు గాని, మామూలుగానే అందరిలాగానే ఉండమని చెప్పే ధైర్యంగానీ మిగతా కుటుంబీకులకు ఉండేది కాదు. అయితే ఒక సుగుణం. ఆమెకు తలవెంట్రుకలు తీయలేదు. ఆ రోజులలో అలా తల వెంటుకలు తీయకుండా ఉండటం కూడా బ్రాహ్మణ కుటుంబాలలో గొప్ప సాహసమనే చెప్పాలి. తెల్లటి మల్లు గుడ్డ [illegible] రవిక కూడా వేసుకునేది. అదీ ఆనాడు మా తాతగారు, దినవహి వారి కుటుంబం

మొదలైనవారు చూపిన ఆధునిక దృక్పథం. అప్పట్లో అది గొప్ప సాహసమే. అందులో మద్రాసు పట్టణంలాంటి పెద్ద పట్టణంలో నివాసం ఉండటంవల్ల ఈ చిన్న చిన్న వాసనలు దుర్వాసనగా తోటి సాంఘికులు పట్టించుకునేవారు కాదు. అప్పటికే కందుకూరి వీరేశలింగం గారి సంస్కరణోద్యమాలు సాగుతున్న రోజులవటంచేత కొంత వీరి సాహసానికి అది కారణమై ఉంటుంది అమ్మన్నగారు మా తాతగారి కుటుంబసభ్యురాలిగానే అక్కడే ఉండేది. ఆమెతోపాటు ఆవిడ అన్నదమ్ములు కూడా అక్కడే ఉండి అంతా ఒక ఉమ్మడి కుటుంబంవారి లాగానే ఉండేవారు. మా తాతగారికీ వారికీ అది మంచి అండగానే ఉండేది.ఆమె కూడా కొంత కుటుంబ ఖర్చులకింద ఇచ్చేదనీ అయితే ఆవిడకు ఏమీ అన్యాయం జరగకుండా ఆ డబ్బు కూడా మా తాతగారిచేతుల్లోనే మెలుగుతుండేది. అంచేత రంగారావు గారికి లక్షాధికారి హోదాగానే ఉండేది. ఈ శతాబ్ద మొదటి దశకానికి అంటే 1905, 1910 నాటికి లక్షాధికారంటే ఈనాటి కోటీశ్వరుడికి మించిన హోదా అది. ఈనాడు హోదాలేని కోటీశ్వరులు ఎందరో ఉన్నారు. కాని ఆనాడు హోదాలేని లక్షాధికార్లు లేరు.

ఈ విధంగా రంగారావుగారిది సంపన్న కుటుంబంగానే ఉండేది. ఇంతేకాక ఏదో డబ్బు పోగుచేసి మా తాతగారు మద్రాసు దగ్గర చెంగల్పట్టు ఉందికదా, ఆ గ్రామం దగ్గర 'తూత్తుకుడి' అనే జమీందారీ ఊరును కొని 'శ్రోత్రియందార్' అనే హోదాను సంపాదించుకున్నారు. ఇవన్నీ వారి సంపన్నతకు నిదర్శనాలు.

## ఆడవారికి హక్కులేదు

ఇంత సంపాదించినా ఆయన వీలునామా రాసి ఉండకపోతే ఆయన తదనంతరం అప్పటికే వివాహితులైన ఇద్దరు కుమార్తెలకు ఏమీ హక్కు ఉండి ఉండేది కాదు. ఆయన భార్యకు మనోవర్తి తప్ప మరే భాగమూ ఉండేది కాదు. ఆస్తి అంతా చట్టప్రకారం తమ్ముడి ఇద్దరు కొడుకులకు సంక్రమిస్తుంది. వారు కాకపోతే ఎంత దూరపు దాయాదులకైనా ఆ ఇంటి పేరిట మగ సంతానానికి ఆ ఆస్తి అంతా లా ప్రకారం చెందుతుంది. అదీ ఆనాటి అన్యాయపు 'హిందూ ఉమ్మడికుటుంబ చట్టపు తీరు'. అందుచేతనే తాతగారు విల్లు రాయడానికి సంకల్పించి ఉంటారు.

రంగారావుగారికి క్షయ వచ్చి మంచి గాలి కోసం చెంగల్పట్టుకు మారారు. మొన్న మొన్న 'స్ట్రెప్టోమైసిన్' మొదలైన క్షయనివారణ మందులు వచ్చేవరకు క్షయ జబ్బు వస్తే ఇక ఆ జబ్బుతోనే క్షీణించి మనిషి చావ వలసిందే. అందుకే ఆ వ్యాధిని 'క్షయ' అన్నారు. అది దీర్ఘకాలికవ్యాధి కావడంవల్ల ముందుగా ఆలోచించి ఆ వ్యవధిలో విల్లురాసే అవకాశం ఉండేది. ఆ విల్లులో ఎన్నోరకాల షరతులతో ఎవరెవరికి ఏ విధంగా ఆ డబ్బు మీద వడ్డీ చెందాలో వ్రాసిన విధానం చూస్తే ఆయన ఎంత దూరదృష్టి గల వ్యవహర్త అబ్బా! అనిపిస్తుంది. తన అన్నగారు ఈ విధంగా విల్లు వ్రాశాడని ఆయన తమ్ముడు వెంకటచలంగారు తరవాత బాధపడ్డారు. వెంకటచలంగారిది ఉదారస్వభావం. నేను నా అన్నగారి పిల్లలకు అన్యాయం చేస్తానా, వారు ఆడపిల్లలని వారిని సరిగా చూడనా ఎందుకీ విల్లు అని బాధపడ్డారట. అయితే విధి వక్రించి ఆయనకూడా అన్నగారు పోయిన ఆరునెలలకే ఏదో విషజ్వరంవచ్చి చనిపోయారు. మొదటి ప్రపంచ యుద్ధకాలంలో 1918–19లో యుద్ధానంతరం ఇన్‌ఫ్లుయంజా జ్వరాలు వచ్చి చాలా మంది చనిపోయారు. ఈ 'ఫ్లూ' జ్వరమే మా ఇద్దరితాతల మరణాన్ని త్వరితం చేసింది. అనుకోకుండా ఇద్దరు సోదరుల మరణంతో ఆడపెత్తనమై, కుటుంబవ్యవహారాలు కోర్టులకెక్కి చివరకు రంగారావుగారి వీలునామాయే ఆ ఆస్తి పంపకానికి ఆధారమైంది. అందులో దినవహి వారి కూతురు అమ్మన్న డబ్బు కూడా చాలా నమ్మకం మీద తాతగారి లెక్కలలో ఇరుక్కు పోయింది. మరి ఆ డబ్బు ఆవిడకు ఎలా దక్కుతుంది. అనేది సమస్య అయికూచుంది. ఇవన్నీ ఆనాటి వ్యవహారంలోని తమాషాలు. అమ్మన్నగారు మా తాతల కుటుంబాల తోడికోడళ్ళు ఇద్దరూ కోర్టుకు ఎక్కారు. ఇహ లాయర్లకు పండగే పండగ. అసలు ఎప్పుడైనా వాళ్ళ దండగ పడటం అంటూ ఉండదు కదా!

## ఈ చిక్కులు విడిపోయిన విధానం

మగపిల్లల తల్లికే అంతా రావాలని ఒక వాదన. విల్లులేదని ఒక వాదన. మా అమ్మ 'పాపర్‌దావా' అంటే ఏమీ డబ్బులేనివారు కోర్టుఫీజు లేకుండానే దావా వేయవచ్చు–వేసింది. ప్లీడర్లు కూడా మీకు మీ సొమ్ము వచ్చిన తర్వాతనే ఫీజు తీసుకుంటామనేవారు. ఈ విధంగా పాపం బ్రిటిషువారు ప్రసాదించిన 'లా' లో కూడా బీదవారికి కూడా సాయపడే మతలబులు ఉన్నాయి కొన్ని.

అమ్మన్నగారు తమ డబ్బు అందులో వుంది అని అడగటానికి ఏమీ హక్కు లేదు. ఆవిడకు ఎంచక్కా ఎగనామం పెట్టవచ్చని కొందరి సలహా! అయితే అదృష్టవశాత్తు 'అమ్మన్న' గారి దగ్గరవున్న ఒక డైరీలో అమ్మన్న దగ్గర తీసుకున్న రూ 18000 (పద్దెనిమిదివేలు) అని ఏదో చిత్తు వ్రాసినట్టు వ్రాసి రంగారావుగారి సంతకం వుంది. దాని ఆధారంగా ఆవిడ ఆ డైరీ కోర్టులో దాఖలు చేస్తే దాని మీద వడ్డీ అసలు ఫాయిదాలతో ఆవిడకో ఏభైవేలవరకు (50,000) వచ్చింది. ఇదీ ఒక తమాషాగా ఉందికదూ! దీనితో అమ్మన్నగారు గట్టున పడింది.

## తోడికోడళ్ళ వ్యవహారం :

మగసంతతికి చెందినవారు సొత్తు అంతా తమకే వస్తుందిగదా అని 'వీలునామా' దాచేసి లేదన్నారు. వ్యవహారం కొంతదూరం నడచిన తర్వాత ఏదో చిక్కు వచ్చి 'వీలునామా' బయట పెట్టవలసి వచ్చింది. అది ఎందుకు బయట పెట్టారంటే బహుశా అందులో రంగారావుగారు తన సగభాగం మీద వచ్చే వడ్డీకే తన భార్యకూ కూతుళ్ళకూ హక్కు ఇచ్చి వారి తదనంతరం ఆ ఆస్తి మూలధనం తమ్ముడి కొడుకులకు చెందేట్లు విల్లు వ్రాశారుట. అందుచేత ఆ వీలునామాలో ఉన్నట్లే కోర్టు వారు వ్యవహారం పరిష్కరించి పార్టీలందరికీ పంపకాలు చేశారు. అందువల్ల 1930 నాటికి మా అందరికీ కొన్ని పెద్ద మొత్తాలు వచ్చాయి. ఆ డబ్బే మా అమ్మ దూరదృష్టితో దాచి భద్రపరచి మా పెద్ద చదువులకు ఉపయోగ పడేట్లు చేసింది.

## వీలునామాలో వింతలు

1. ఆస్తిలో సగభాగం మూలధనం తమ్ముడి కుమారులకు మైనారిటీ తీరిన తర్వాత పూర్తిగా చెందేట్లు రాయడం ;
2. తన భార్య, ఇద్దరు కుమార్తెల తదనంతరం ఆ రెండో భాగం మూలధనం తమ్ముడి కుమారులకు తిరిగి దఖలు పడటం ;
3. వచ్చేవడ్డీలో భాగాలుగా తమ్ముడి కుటుంబానికి కొంత ఆదాయం ;
4. తన భాగం ఆదాయంలో సంవత్సరానికి మూడువందలు మనోవర్తి తన భార్య అయిన మా అమ్మమ్మ రాజ్యలక్ష్మికి చెందడం.

5. మూడు వందలు మా అమ్మకు, ఎందుకంటే మా నాన్నగారు ఉబ్బసవ్యాధి మూలకంగా చిన్న ఉద్యోగంలో ఉండిపోతాడని మా తాతగారు ముందే గ్రహించాడన్నమాట.
6 మా పిన్ని భర్త ఎలాగూ పెద్ద ఉద్యోగానికి వెళ్ళగలడు గనుక, మా పిన్నికి సంవత్సరానికి వందరూపాయలు ముట్టాలి. అయితే మా పిన్ని తెలివితక్కువది గనుక, ఒకవేళ భర్త వదిలివేస్తే, ఆమె అవస్థపడకుండా మా అమ్మకు ఇచ్చే మూడువందలు ఆవిడకిచ్చి, ఆమె మా పిన్నికిచ్చే సాలీనా వందరూపాయలు మా అమ్మ ఇచ్చేట్లు;
7 తన రెండో అల్లుడు రమణమూర్తి ఎంతవరకు చదువుకుంటే అంతవరకూ ఖర్చుకు వెనకాడకుండా సహాయం చేసితీరాలి.

ఈ విధంగా ఎన్నో దూరపు ఆలోచనలతో కుటుంబ సంక్షేమానికి వీలునామా రాశారు మా తాతగారు. మా బాబాయికి చదువు చెప్పించలేదు కాబట్టి దానికి ముందరగా కోర్టువారు కొంత డబ్బు ఇచ్చినట్టు గుర్తు. ఈ విధంగా కుటుంబానికి పెద్దలైనవారు హఠాత్తుగా పోతే ధనిక కుటుంబాలలో ఎన్ని చిక్కులు, బాధలు వస్తాయో, అంతవరకూ ఏ బాధ్యతా, బరువూ బాధా లేకుండాఉండే ఆ సంసారాలలోని స్త్రీలకు ప్రత్యేకంగా జీవనోపాధికి కూడా మరొకరి పంచన పడిఉండాల్సిన దుర్గతి ఏవిధంగా పడుతుందో ఇందువల్ల అర్థం చేసుకోవచ్చు. మా రంగారావు తాతగారు మంచి వ్యవహర్త కాబట్టి తన వీలునామా ద్వారా తన ప్రాపంచికానుభవాన్ని వ్యక్తీకరించాడు. వీలునామా రిజిస్టరీ కాకపోయినా కోర్టువారు అంగీకరించి అందరికీ న్యాయం చేకూర్చారు.

ఇంకా ఇప్పటికీ స్త్రీలకు పురుషులతో సమానమైన హక్కులు ఏర్పడకపోయినా చాలా పాత చట్టాలకు సవరణలు జరిగి స్త్రీలకు భర్త ఆస్తుల మీద సర్వహక్కులు ఏర్పడి కొంత సాంఘిక న్యాయాన్ని వారు పొంద గలుగుతున్నారు.

తాతగారు అనుకున్నంత జరగబోయింది. కాని,జరగలేదు. తాతగారు తమ వీలునామాలో అమాయకురాలైన తమ రెండవ కుమార్తె 'కాముడు' ను భర్త వదిలేస్తే ఆవిడకు మా అమ్మకిచ్చే మూడువందల సాలీన ఆ భరణ ధనం కాముడికి ఇవ్వాలని వ్రాశారు కదా! మా తాతగారి ఆ అనుమానం కూడా

కొంతవరకు నిజమయ్యే పరిస్థితి ఒకప్పుడు ఏర్పడ్డట్టు, మా అమ్మ వాళ్ళు అనుకునేవాళ్ళు.

మానవుని స్వభావం ఎంతో సున్నితమైనది. చంచలమైనది. లోకంలో 'ధనమూలమిదంజగత్' అని దానికోసమే తాపత్రయపడే చాలామంది ఉంటారు. కాని అదే ధ్యేయంగా త్రికరణశుద్ధిగా తాపత్రయపడేవారు కొద్దిమందే ఉంటారు. న్యాయమార్గంలోనే సంపాదించాలనీ దానిని మాత్రం బహు జాగ్రత్తగా చెప్పుకోదగిన శాతంలో ఆదా చేసుకోవాలనీ అనుకొనేవారు బహు అరుదు. అటువంటి దృక్పథం మా బాబయ్యది. మా రమణమూర్తి బాబాయిది ఎంతో ప్రేమపూరితమైన మనస్సు. మామ గారన్నా తర్వాత మా కాముడు పిన్ని అన్నా ఎంతో ప్రేమతో వ్యవహరించేవాడు. అయితే మా తాతగారు విల్లులో దూర దృష్టితో వ్రాసిన యీ మూడు వందల సాలీనా ఆదాయం మీద ఆయన దృష్టి కొంచెం దురాశ పురికొల్పి ఉండవచ్చు. మనసు చలించినట్లు అయిందేమో! కొద్ది నెలల పాటు మా పిన్ని తరఫునుంచి తనను భర్త సరిగా చూడటంలేదనీ వదిలి వేస్తానని బెదిరిస్తున్నారనీ, వాళ్ళ వాళ్ళు ఆయనకు తిరిగి మరొక వివాహం చేసే ప్రయత్నాలు చేస్తున్నారనీ, కొన్ని వదంతులు పుట్టించే ఉత్తరాలు వచ్చాయి. అంతమంచి మనస్సుకల మా బాబాయికి ఇది తాత్కాలికమైన చిత్తవైకల్యమనే ఎంచుకోవాలి. అప్పుడు మా అమ్మ వెళ్ళి ఆయనకు తగిన బోధ చేసి యీ వదంతులను ప్రయత్నాలను మా అమ్మ సాగకుండా చేసి వచ్చింది. అవసరమైతే తన ఆభరణపు సొమ్మును మా అమ్మ మరిదిగారికి ఇవ్వడానికి తన సంసిద్ధతను వ్యక్తంచేసి ఉంటుంది. దాంతో మా బాబాయి మనసు సిగ్గుతో కలవరపడి తలవంచుకొని 'అలాటి ఆలోచనలేవైనా ఉంటే అవి అన్నీ తొలగి పోయినట్లు చెప్పుకునేవారు.

ఈ వికృతమైన తలపులు మా బాబాయి విషయంలో ఎంతో తాత్కాలికమైనవే అయినా ఇందువల్ల మా తాతగారి దూరదృష్టి ఎటువంటిదో అది ఎంతదూరం ప్రసరించగలదో తెలిసిపోతున్నది. ఈ విధంగా ఆ నాటకం సుఖాంతమైంది. అందుకు అంతా సంతోషించాం.

# XXVI

# తానొకటి తలిస్తే !

# MAN PROPOSES - GOD DISPOSES

"My grandfather's efforts to educate my father at Madras - Admission in Wesly College. He developed 'Asthma' which hindered his college studies- changed his place of living and finally ended up as a school teacher in a village.

మద్రాసులో మా నాన్నగారికి ఉబ్బసం వ్యాధి ఉధృతంగా వచ్చిన మీదట ఆ ఊరు వదిలిపెట్టారు. ఇహ తర్వాత జీవితమంతా పర్వత శిఖరాన్నుంచి జారి లోయలో ప్రశాంతంగా ప్రవహించిన సెలయేరులాగానే సాగిందని చెప్పాలి. శిఖరమెక్కడ? లోయ ఎక్కడ? మా అమ్మానాన్నలు మొదట్లో జీవించిన స్థాయికి పల్లెటూరు చేరిన స్థాయికి హస్తిమశకాంతరం అని చెప్పవచ్చు.

మా రంగారావు తాతయ్యగారి కుటుంబ పరిస్థితులు ఆయన ఆలోచనలు ఉన్నతస్థాయిలో ఉండేవి. ఇక ఉమ్మడి కుటుంబాలలో మగవారి

స్థానాన్ని బట్టి వారి ఇల్లాలి స్థానం నిర్ణీత మవుతుంది. ఇక ఆ ఉమ్మడికుటుంబాల పెద్దలు పోతే మిగిలిన ఆడవాళ్ళు, తోడికోడళ్ళ మధ్య సంభవించే పొరపొచ్చాలు, మనః స్పర్థలు, తగాదాలు, మధ్య మధ్య నిప్పు ఎగసనదోసే 'శ్రేయోభిలాషులు' వీళ్ళనేవిధంగా రచ్చకెక్కిద్దామా అనే వ్యవహర్తలు, బంధుబలగం చేసే హడావుళ్ళు అన్నీ లోకంలో వింటూ ఉన్నవే కంటూ ఉన్నవే. కాస్త స్థితిమంతులైతే డబ్బూ దస్కం ఉంటే ఈ బాధలు మరింత ఎక్కువగా ఉంటాయి.

ఆడపిల్లలు, మగపిల్లలు ఆస్తులు వాటిమీద హక్కులు అంతా సక్రమంగా బాగా ఉన్నప్పుడు ప్రేమలు ఉంటాయి. తరవాత పరిస్థితులన్నీ ఒక విషవలయంలా తయారవుతాయి. నవలలోలాగా కథలో లాగా సాగుతాయి. అయితే వీటన్నిటినీ కాలం చక్కగా చదును చేస్తుంది. సమస్యలన్నిటినీ పరిష్కరిస్తుంది. సుమారు 75 సంవత్సరాలనాటి ఆ వ్యక్తుల ఆలోచనలు వాళ్ళు ఎదుర్కొన్న పరిస్థితులు ఈనాటిఅవలోకనంతోమననం చేస్తే అదంతా ఒక ఉత్కంఠాభరితమైన కథలాగే కనపడుతుంది. అందులో పెళ్ళి సంబంధాల ముందుచూపు జాగ్రత్తలలో ఎక్కువ మార్పేమీ రాలేదనిపిస్తుంది.

## – కూతుళ్ళ విషయమై మా మాతామహుడి ఆలోచనలు

ఆస్తిపాస్తుల విషయంలో మా తాతగారికి లోటు లేదు. మా మాతామహులు అన్నదమ్ములు ఇద్దరు. మా అమ్మ తండ్రి కలపటపు రంగారావుగారు. ఈయన మంచి హోదాలో మద్రాసులో ఉండేవారు. ఈయన సోదరుడు కలపటపు వెంకటచలం గారు. ఈ వెంకటచలం గారు ఆ కాలంలో ఇంజనీరింగు ప్యాసై సబ్ డివిజనల్ ఆఫీసరుగా పి.డబ్లు.డి లో పెద్ద ఉద్యోగం చేస్తుండేవారు. సోదరులలో పెద్దవారైన రంగారావుగారికి ఇద్దరు కుమార్తెలు. చిన్నవారైన వెంకటచలం గారికి ఇద్దరు కుమారులు. ఒకరికేమో ఇద్దరూ కూతుళ్ళూ మరొకరికేమో ఇద్దరూ కుమారులే కావటం చేత అంతా సొంత అన్నదమ్ములు అప్పచెల్లెళ్ళ వలెనే ఉండేవారు. అయితే అప్పటికాలంలో కుటుంబ సొత్తుమీద ఆడవాళ్ళకు ఎటువంటి హక్కు ఉండేదికాదు. 'విల్లు' రాయకుండా చనిపోతే ఆ ఆస్తి కుటుంబంలోని మగవారికే చెందుతుంది. మా

తాతగారు రంగారావుగారు గనక 'విల్లు' రాయకుండా చనిపోయి ఉన్నట్టైతే ఆస్తి అంతా తమ్ముడి కుమారులకే సంక్రమించేది. అదీ ఆనాటి ఉమ్మడి కుటుంబాల పరిస్థితి.

మా మాతామహులు రంగారావుగారు 1918 లో క్షయవ్యాధి వచ్చి చిన్న వయస్సులోనే చనిపోయారు. పోతూ మరణ సమయంలో ఆయన ఒక విల్లు వ్రాశారు. అన్నగారి పిల్లల బాధ్యతనాకులేదా? వారి విషయం నేను పట్టించుకోకుండా ఉంటానా వారి మంచిచెడ్డలు నావి కావా? అని వెంకటచలం తాతగారు తన అన్నగారు విల్లు రాశారని విన్నతర్వాత బాధపడ్డారుట. కోపం కూడా వచ్చిందట. ఆనాటి సోదరుల ప్రేమలు ఉమ్మడి కుటుంబాల ఆదరణలు అట్లా ఉండేవి. అయితే దైవం వెంకటచలం తాతగారి ఔదార్యం లోకానికి నిరూపణమయ్యే అవకాశం ఇవ్వలేదు. తన అన్నగారి పిల్లలపై ప్రేమాభిమానాలను ఆదరణను చూపడానికి గల అవకాశాలను ఆయనకు ఇవ్వలేదు భగవంతుడు. అన్నగారు పోయిన ఆరునెలల్లో హఠాత్తుగా ఏదో జ్వరానికి గురై ఆయన కూడ మరణించారు. ఇక చూడండి. మా రంగారావు తాతయ్యగారే గనక ఆ విల్లు రాసి ఉండకపోతే పరిస్థితులు ఎలా ఉండేవి. అనేది సమాధానంలేని ప్రశ్నగానే పరిణమించి ఉండేదికాదా? సాధారణంగా ఆనాటి పరిస్థితులను బట్టి ఆస్తి అంతా తమ్ముడి కొడుకులకు పోయేది. ఇక రంగారావు తాతయ్య గారి కుటుంబం వారు మనోవర్తిదారులయ్యేవారు. కాక ఇంకొక విధంగా ప్రవర్తించేవారా అనేదికూడా ప్రశ్నే! ఒకవేళ ధర్మంగానే ప్రవర్తించి ఉండేవారేమో! అయితే మా తాతగారు విల్లురాయడంలో చాలా వివేకం కనపరచారనే చెప్పాలి. ఆయన చాలా దూరదృష్టి కనపరచారని కూడా చెప్పాలి. ఇంగ్లీషులో 'విల్' అనే పదం తెలుగులో వీలునామా అయింది. ఈ వీలునామా సంగతి తర్వాత ప్రస్తావించుకుందాం.

ఇప్పుడు మా తాతగారు తన ఇద్దరు కుమార్తెలు మా అమ్మ లక్ష్మమ్మ, మా పిన్ని కామేశ్వరి (కాముడుపిన్ని) వివాహాలకు ఏ విధంగా వరులను ఎంపిక చేశాడు. ఎటువంటి జాగ్రత్తలు తీసుకున్నాడు. ఈనాటికి కూడా ఆయనలా ప్రపంచజ్ఞానం ఉన్నవారు ఎంతమంది ఉన్నారు అనే విషయం ప్రస్తావించుకుందాం. 'ధనమూల మిదం జగత్' అని ఆయనకు తెలుసు. ధనం

అండగా ఉంటే దాని ద్వారా మనుష్యులను సక్రమంగా ప్రవర్తింప చేయవచ్చునని ఆయన నమ్మారు.

మా ఇద్దరు తాతలు కాక వారి పినతండ్రో లేక పెదతండ్రో ఒకరి కుమారులు ఇంకొక సుదర్శనరావుగారు ఉండేవారు.వారు ఆ రోజులలో విద్యాశాఖలో పెద్ద ఉద్యోగం చేశారు. అప్పట్లో బదిలీలు రాష్ట్రవ్యాప్తంగా ఉండేవి. అంతే కాక ఆ రోజులలో జిల్లా అధికారులందరూ ఏ ఉద్యోగమైనా బ్రిటిషు అధికారులే ఉండేవారు. అటువంటప్పుడు అంతపెద్ద ఉద్యోగంలో మనదేశీయులు ఒకరు ఉన్నారంటే అది చాలా పెద్ద హోదా అనే అనుకోవాలి. ఈ విధంగా మా తాతలు ముగ్గురూ మంచి హోదాలో ఉండి పెద్ద ఉద్యోగం గల స్థితిమంతులుగానే పరిగణించబడేవారు. భాగ్యం ఉన్నా హోదాలేనివారు ఆ రోజులలోనూ ఈ రోజుల లోనూ ఎంతో మంది కనపడతారు. అయితే ఆ రోజుల్లో మా రంగారావు తాతగారికి ఉద్యోగహోదా లేకపోయినా మిగతా ఇద్దరు అన్నదమ్ములు ఆయన ప్రజ్ఞను చూసి పెద్దలతో సాహచర్యం చూసి గౌరవించేవారు.

1918 నాటికి మా అమ్మకూ, పిన్నికీ కూడా వివాహాలు అయినాయి. అంటే మా తాతగారు మరణించేముందే కూతుళ్ళ పెళ్ళిళ్ళు చేశారు. అయితే ఆ సంవత్సరాంతానికే ఆ ముగ్గురిలో ఏకోదరులు ఇద్దరు మరణించారు. కాని సుదర్శనరావుగారు ఇంకా రెండు సంవత్సరాలదాకా జీవించారనుకుంటాను. ఆయనే నాకు 'ఓనమాలు' దిద్దించి అక్షరాభ్యాసం చేశారు. అక్షరాభ్యాసం చేస్తూ అన్నాడుట 'పాతూరివాడా! నా పరువు నిలబెడతావో లేదో నేను అక్షరాభ్యాసం చేస్తున్నానని. ఆయన తమాషాగా ముద్దుగా ఈ మాటలన్నాడని మా అమ్మ చెపుతుండేది. ఏదో వారి ఆశీర్వచనబలం వల్ల, వారు అక్షరాభ్యాసం చేసిన ముహూర్తబల వల్ల పలకాబలపం పట్టాను అనాడు. ఇవాళ రచనా వ్యసంగానికి కూడా పూనుకో గలిగాను. ఏవో కొన్ని పుస్తకాలు కూడా రాయగలిగాను.. స్వర్గమంటూ ఒకటి ఉంటే వారు చూసి సంతోషిస్తూ ఉండవచ్చు. రెండో పినతాతగారైన సుదర్శనరావు గారికి అంటే విద్యాధికారి అయిన తాతగారికి కూడా మా అమ్మ, పిన్నిల వివాహాల విషయంలో కొంత కీలక పాత్రే ఉంది. అందుకే ఈ ముగ్గురు అన్నదమ్ముల జీవితాలు ముడిపడిన సమిష్టి

కుటుంబబాధ్యత ఇక్కడ ప్రస్తావించుకోవాల్సి వచ్చింది. ఇక మా రంగారావు తాతగారు ఏ విధంగా తమ అల్లుళ్లను గురించి నిర్ణయం తీసికున్నారో తెలుసుకుందాం.

## మా అమ్మ లక్ష్మమ్మగారి వివాహం

మా తాతగారి పెద్ద కూతురు మా అమ్మ లక్ష్మమ్మ. అయితే ఇంట్లో అంతా ముద్దుగా లక్ష్మడు అని పిలిచేవారు. ఈమె చక్కనిది. మంచి తెలివితేటలు కలది. కాబట్టి ఈమె విషయంలో ఒక ప్రత్యేక దృష్టితో తాతగారు నిర్ణయం తీసుకున్నారు. రెండవ కుమార్తె కామేశ్వరి. కాముడు అని ముద్దుగా పిలుచుకొనేవారు. మా అమ్మమ్మకు కూడా చాలా సంతానం మగ, ఆడాకూడా నష్టమై ఈ ఇద్దరు కుమార్తెలే మిగిలారు. మా కాముడు పిన్ని చాలా మేధకురాలు. తెలివితేటల్లో కొంచెం వెనకబాటుతనం చూపేది. అందువల్ల ఆమెను తక్కువ తెలివిగలది అని చెప్పవచ్చు. తెలివితక్కువ అనటంలేదు., ఎందుకంటే ఈ ప్రయోగం మన అందరికీ కూడా ఎప్పుడో ఏదో సందర్భంలో వర్తించే అవకాశం వుంది కదా. ఎప్పుడో అప్పుడు ఎవరో ఒకరు మనమీద కూడా ప్రయోగించే ఉండవచ్చు. మన అభిమానులు కూడా మనను తెలివితక్కువ అని ఉండవచ్చు. ఇటువంటి తెలివతక్కువది కాదు మా పిన్నిది. ఆవిడది బుధిమాంద్యం. చదువుసంధ్యలు సరిగా వంటబట్టని అమాయకపు తెలివితక్కువ. ప్రపంచక జ్ఞానం అసలేలేదు. అందువల్ల ఈవిడకు తగిన వరుణ్ణి నిర్ణయం చేయడంలో ఆయన వేరే పంథా తొక్కారు. మా తాతగారి ఆలోచనంతా తనకు, తన హెూదాకు, తగినట్లు తన అల్లుళ్ళను మంచి పదవులలో వృత్తులలో ప్రవేశపెట్టటం. అదే ఆయన ధ్యేయంగా ఆశయంగా కర్తవ్యంగా భావించారు. అట్లానే వ్యూహరచన చేశారు. వివేకవంతులు, స్థితిమంతులే కాక సామాన్య కుటుంబీకులు కూడా మా తాతగారిని చూసి ఈ విషయంలో చాలా నేర్చుకోవాలి.

మా అమ్మ ఆయన పెద్దకూతురు. ఈమె వివాహ సంబంధం విషయంలో మా తాతగారికి ఏమీ ప్రశ్నలు లేవు. ఈయన సంబంధాలు వెతక్కముందే కాకినాడలో ప్రసిద్ధిచెందిన లాయరు లక్కరాజు సుబ్బారావుగారి తండ్రి,

లక్కరాజు శరభయ్యగారు మా నాయనగారి సంబంధం రంగారావుగారికి చెప్పారు. ఈ శరభయ్యగారు మా తండ్రి గారికి స్వయానా పినతండ్రి. ఆయనా మా తిరుమలరావు తాతయ్యా ఏకోదరులు. అయితే ఆయన బందరు (మచిలీపట్నం) కృష్ణా జిల్లా లక్కరాజువారికి పెంపుడు వెళ్ళారు. అంచేత లక్కరాజు వారయ్యారు. అయినా సహజంగానే ఆయనకు ప్రాతూరు మీద ప్రాతూరుకు సంబంధించిన బంధువర్గం మీద ప్రీతి ఎక్కువగా ఉండేది. ఆయన కుమారుడు లక్కరాజు సుబ్బారావుగారు పెద్దలాయరుగా పేరు పొందడం, రాబడి పెరగడం, మా తాతయ్య వ్యాపారసరళిలో ఆ ధనాన్ని పెట్టుబడి పెట్టి ఇంకా బాగా ఆర్జించి వారు బాగా ధనవంతులైనారు. ఆయన కాకినాడలో స్థిరనివాసం ఏర్పరచుకొన్నారు. మా రంగారావు తాతయ్యది కూడా పుట్టిన స్థలం కాకినాడే. అందుచేత మా రంగారావు తాతయ్య కాకినాడ నుంచి మద్రాసు వలసపోయినా ఇద్దరి మధ్యా ఉత్తరప్రత్యుత్తరాలు, రాకపోకలు ఉండేవి. స్నేహ భావం బాగా పెరిగింది. అందుచేత మా అమ్మకు పెళ్ళి సంబంధం ప్రస్తావనరాగానే మా శరభయ్య తాతయ్య మా నాన్నగారి సంబంధం గురించి చెప్పాడు.

1913-14 నాటికి మా నాన్నగారు స్కూలు ఫైనలు పరీక్ష ప్యాసైనారు. తెలివిగలవారు. ఉమ్మడి కుటుంబంలో ప్రాతూరులో దాదాపు వంద ఎకరాల భూమి వుంది. అటు ఆయన పుట్టిల్లుగా పెరిగిన కేతనకొండలో కూడా ఆయన అక్కయ్యగారైన తిరుమలమ్మగారికి మంచి భూవసతి ఉంది. వాళ్ళు భాగ్యవంతులు. ఇహ మా శరభయ్య తాతయ్యకు ప్రాతూరు కుటుంబం మీద ఉన్న అపారమైన ప్రేమ మా నాన్నగారి సంబంధం రంగారావు తాతయ్యగారు నిశ్చయించేటట్లు చేశాయి. రంగారావు తాతయ్యగారికి కూడా కావల్సిందేముంది. కుర్రవాడు చురుగ్గా తెలివితేటలు కలవాడుగా ఉండాలి. వరుడికి తరవాత కావలసిన విద్యా వృద్ధి, ఉధ్యోగావకాశాలు అన్నీ తాను చూసుకోగలడు. అందుకని మంచి సంబంధం, బంగారంలాంటి కుర్రాణ్ణి చూసుకోవాలన్నదే ఆయన ఆశ. ప్రాతూరు సుబ్బారావు గారు అందుకు అన్నివిధాలా తగి ఉన్నారు. అందుచేత ఈ వరుణ్ణి నిశ్చయించి వైభవంగా కాకినాడలోనే వివాహం చేశారనుకుంటాను. అప్పటికి మా నాన్నగారి ఆరోగ్యం బాగానే వుంది. మనిషి చక్కని పొడగరి. పచ్చగా ఉండేవారు. అయితే ఆయనకు శరీరమంతా పెద్ద రోమకళ ఉండేది. చొక్కా తీస్తే శరీరం కనిపించనంత నల్లటి

రోమాలుండేవి వొత్తుగా. ఇదెందుకు చెప్పానంటే ఆయనను పెళ్ళికొడుకును చేసిన సందర్భంలో అభ్యంగన స్నానం చేయిస్తుంటే ఈ రోమకళ చూచి ఆయన అత్తగారు అంటే మా అమ్మమ్మ రాజ్యలక్ష్మమ్మ గారు చూసి అబ్బా! ఎలుగుబంటల్లే వళ్ళంతా ఈ బొచ్చేమిటి బాబూ అనుకున్నదట. అయితే అప్పుడేమనగలదు! ఈ విధంగా కాకినాడలో ఉన్న మా శరభయ్య తాతయ్య ద్వారా మద్రాసులో ఉన్న రంగారావుగారి ప్రథమకుమార్తె లక్ష్మమ్మగారికి వివాహసంబంధం కుదిరి పెళ్ళైంది.

## మరో ప్రహసనం

ఈ తూర్పు అమ్మాయి, వంకరకాళ్ళ అమ్మాయి ఎక్కడ దొరికింది? ఆ రోజుల నుంచి ఈ రోజుల వరకు ఆంధ్రులొక్కరే కాదు అన్ని భాషాప్రాంతాలవారు కూడా జిల్లాకు జిల్లా మార్తైతే సంబంధం ఇవ్వడానికి ఏదో పరదేశాలకు పిల్లనిస్తున్నట్లు భావించేవారు. అందులో కృష్ణాజిల్లావారికి ఏలూరే తూర్పు, కాకినాడ అంటే తూర్పుదేశపు అప్పలమ్మల దేశంలా భావించేవారు. ఇటు తూర్పు గోదావరి జిల్లా కాకినాడ స్వస్థలం అటు మద్రాసులో మా తాతగారు కాపురం ఉంటున్నారు. ఈ రెండూ కేతనకొండ వారికి పరదేశాలే. అందువల్ల మా మేనత్తలకు బహుశా ఇష్టం ఉండిఉండకపోవచ్చును.

కేతనకొండ కుటుంబానికంతా పెద్ద, మా పెద్ద మేనత్త తిరుమలమ్మగారు. ఆమే నాయకురాలు. మా రెండో మేనత్త రత్తమ్మత్తయ్య భర్త కొటికలపూడి కృష్ణయ్య మామయ్యది ఇంట్లో పెత్తనం. ఆయన కాకినాడ వెళ్ళి తాంబూలాలు పుచ్చుకొని వచ్చారు. ఆ రోజులలో పెద్దలు చూడటం తప్ప, వధూవరులు చూసుకొనే ఆచారం లేదుకదా! కాబట్టి మా పినతాతగారు శరభయ్యగారు మా మాతామహులు శ్రీ కలపటపు రంగారావుగార్ల సంబంధం కుదుర్చుకొని వచ్చారుట అని ఆశ్చర్యం ప్రకటించినవారే అందరూ! అందరికీ సంతోషంగానే ఉంది. అయితే పైపైకి ఏమనుకున్నా అంత పెద్ద సంబంధం అని మా అమ్మ సంబంధానికి లోలోపల అంతా మురిసిపోయినవాళ్ళే. జిల్లాలవారీగా వచ్చే అలవాట్ల వల్లనూ అందులో మరీ దూరంగా ఉన్న మద్రాసు వాస్తవ్యులు పిల్లనిస్తున్నారని మా వాళ్ళకు కొంత భయంగా ఉండటం సహజమే.

మా నాన్నగారి పెళ్ళి అయ్యేవరకూ మరి మా కుటుంబంలోని వాళ్ళెవరూ మద్రాసు ప్రయాణం చేసైనా ఎరుగరు. ఆ రోజులలో మద్రాసు ప్రయాణం అంటే ఈనాడు అమెరికా ప్రయాణం కంటే అబ్బురంగా ఉండేదనటంలో సందేహంలేదు. అందుకే అప్పట్లో చిన్నవాళ్ళైన మా మేనత్త కొడుకులందరికీ మద్రాసు ఎప్పుడెప్పుడు చూస్తామా అనే కుతూహలం ఉండేది. చిన్నమామయ్యతో మద్రాసుప్రయాణం ఎప్పుడెప్పుడు కడదామా అని ఉండేది. వాళ్ళకు మేనమామే కదా మా నాన్నగారు. మా పెదనాన్నగారిని 'పెద్దాం' అనీ మా నాన్నగారిని 'చిన్నాం' అనీ అనేవాళ్ళు మేనల్లుళ్ళు. ఏమిటో అలా వాళ్ళు అలవాటు చేసుకొన్నారు.

ఇంత బాగా ఉన్నదనుకున్న సంబంధం మా నాన్నగారి పైచదువులకు కలిసిరాలేదు అక్కడి సముద్రపుగాలి పడక వంశపారంపర్యంగా అంతర్గతంగా ఉన్న ఉబ్బసంవ్యాధి ప్రకోపించింది వారికి. అది ఇక ఆయన జీవితమంతా వెంటాడింది. లేకపోతే ఆయనకు ఏ లాయరు చదువో చెప్పించి పెద్ద ఉద్యోగంలో ప్రవేశపెట్టేవారు మా తాతగారు. కాని మా నాన్నగారి చదువు పురిట్లోనే సంధికొట్టినట్లు ఆగిపోయింది. చివరకు తాతయ్యలంతా పోయిన తర్వాత ఒక కుగ్రామంలో ఎలిమెంటరీ స్కూలు ఉపాధ్యాయుడుగా జీవితం ప్రారంభించి అందులోనే రిటైర్ అయ్యేదాకా పాతిక సంవత్సరాలు పనిచేసి మేము పెద్దవాళ్ళమై మద్రాసులో స్థిరపడ్డ తర్వాత మా దగ్గరకు చేరారు. మా నాన్నగారు చేసిన చిన్న ఉద్యోగం వల్ల కృష్ణాజిల్లాలో ఉన్న పల్లెటూళ్ళ వాతావరణం మేము బాగా చవిచూశాం. ఎలుకపాడు, ఉంగుటూరు, పెద అవటపల్లె, గన్నవరం, తరువాత ఆఖరుకు కానుమోలులో ఉండగా రిటైరు చేయించి ఆయనను మా దగ్గరకు తీసుకొనివచ్చాం. ఉద్యోగంలో చేరినప్పుడు ఆయన జీతం 20 లేదా 25 రూపాయలు. రిటైరు అయ్యేటప్పటికి 35 రూపాయలు జీతం. అయితే అప్పట్లో ఆ జీతం లోనే 5 రూపాయలు మిగిలేది. అదీ ఆనాటి ఉపాధ్యాయుల జీతాల సరళి. మా నాన్న గారిది బహు సంతృప్తికరమైన జీవితం. మా ఇంకో తాతయ్య ఆ ఊర్లోనే హైస్కూలులో పనివేయిస్తానంటే నాకు వద్దు హైస్కూలు అయితే 'టైము'కు బడికి వెళ్ళాలి. నాకు ఇక్కడే బాగున్నదని తృప్తిపడిన వ్యక్తి మా నాన్నగారు. మా అమ్మగారు

కూడా అదే తత్వంతో ఆయనను బాధపెట్టకుండా ఆయనకు ఏది సంతోషంగా ఉంటే అదే పనిచేయనీ బాబయ్యా! అని పినతండ్రిని సమాధాన పరచింది. అంచేత మనచేతిలో ఏమీలేదని కొన్ని సమయాలలో సంతృప్తిపడి ఆనందించాల్సి ఉంటుంది. మా నాన్నగారి జీవితచక్రం అనుకున్నవిధంగా తిరగలేదు. కాస్త మనో నిబ్బరం చూపించి చదువు పూర్తి చేసుకుని ఉంటే ఇంకో విధంగా ఉండేది. మా తాతయ్య జీవితకాలంలోనే మా నాన్నగారు స్థిరపడిఉంటే ఇంకో విధంగా ఉండేది. ఆదాయం చెప్పుకోదగిన విధంగా ఉండేది. కుటుంబసభ్యులకు మరింత సౌకర్యంగా ఉండేది. అందువల్ల 'నుదుటన్ వ్రాసిన వ్రాలుకన్నాగలదా' అని అనుకోవాల్సివస్తుంది. ఇది మా కలపటపు రంగారావు తాతయ్యగారి పెద్ద అల్లుడి కథ. ఇక రెండో అల్లుడి కథ వినండి.

# XXVII

# రంగారావు తాతయ్య అల్లుళ్ళు

# SELECTION OF SONS-IN-LAW

My maternal grand father's selection of sons-in-law He never looked for affluence He believed in intelligent boys whom he could educate to the maximum and settle them in good professions with status He specially applied this to his second son-in-law for his problematic daughter, my aunt who was of slightly low I Q. My uncle Ramana Murthy who is married to her, his carreer, family life and further raise in life are worth following. He made tremendous adjustments. He was frugal and not miserly, saved plenty of money

ఈ విధంగా రెండు కథలు దృష్టాంతంగా సాదృశ్యంగా చెప్పడంలో ఒక అంతరార్థం ఉంది. సాధారణంగా ఉన్నవాళ్ళు ఉన్నవాళ్ళతోనే సంబంధాలు చేస్తారు. మాకు కట్నాలు కానుకలు అక్కర్లేదని పైకి చెప్పేవారు కూడా తమ

స్తోమతుకు తూగగలవాళ్ళనే చూసుకుంటారు. కట్నాలు వద్దన్నా ఇవ్వగలిగినవాళ్ళు ఏదో రూపంలో ముట్టచెప్పకుండానూ ఉండరు. అవద్దన్న వారూ మారు మాట్లడకుండా గుంభనంగా పుచ్చుకుంటారు. ఉన్నవారు లేనివారికి ఇవ్వడం అరుదు. పిన్ని విషయంలో కూడా ఇది యధార్థం. మా తాతయ్యగారు గనిలో బంగారాన్ని, వజ్రాన్ని వెదికినట్లు వెదికి, తెలివిగల చురుకైన వ్యక్తిని ఎంపిక చేసి ఆ వరుడికి అందుబాటులో లేని ఎన్నో అవకాశాలు కల్పించి స్థిరంగా తనకాళ్ళ మీద నిలబడగలిగేట్లు చేసి వజ్రాన్ని చెక్కి మరింత ధగధగలాడేట్లు చేసినట్లుగ చేసేవారు. ఆ కాలంలోనూ ఈ కాలంలోనూ ఏ కాలంలోనూ అరుదే. ఇంకొక విషయం. ధనవంతులు కానివారు అంటే బీదవారు బీదవారికి పిల్ల నివ్వాలిగదా, అలా ఇవ్వటానికి మీనమేషాలు లెక్కపెడతారు. అంతేకాదు అదృష్టం కలిసొచ్చి బీదవారు భాగ్యవంతులైతే మళ్ళీ పాత చుట్టాలను మరచి పోతారు. ఆప్యాయతతో చేసుకుంటామనే మేనరికాలను కూడా చిన్న చూపు చూస్తారు. పెద్ద సంబంధాల కోసమే పాకులాడుతారు. "ఎక్కడైనా బావే కాని వంగతోట దగ్గర బావకాదనే " సామెత సంపన్నుల బీదవాళ్ళ మధ్యప్రవర్తనలో బాగా అనువర్తిస్తుంది. ఇదే లోకరీతి. దీన్ని గూర్చి ఆశ్చర్యపడనక్కరలేదు. ఈ ఉపోద్ఘాతం అంతా ఎందుకంటే మా అమ్మ తండ్రి రంగారావుగారు ఈ కోవలోనివారు కాదు అని చెప్పటానికే.

మా తాతయ్యకు ఇద్దరే కుమార్తెలు. మా పినతాతగారు వెంకటచలం గారికి ఇద్దరే కుమారులని ఇదివరలోనే చెప్పాను. మా తాతయ్యగారు రాసిన వీలునామా గూర్చిన ప్రస్తావనలో ఈ అంశం మళ్ళీ చెప్పవల్సి వచ్చింది.

మా పిన్ని కామేశ్వరిని కాముడు అని పిలిచేవారు. మేము కాముడు పిన్ని అనేవాళ్ళం. మా తాతగారు కాముడు పిన్ని వివాహం ఎంతో ఆలోచించి చేశారు. మా పిన్ని ఉట్టి తెలివితక్కువది. ప్రపంచజ్ఞానం ఏమీలేని అమాయకురాలు. నల్లనివన్నీ నీళ్ళు తెల్లనివన్నిపాలు అని చెపితే చూపిస్తే అట్లానటరా అబ్బాయీ అని నవ్వేసి ఆనందించే వ్యక్తి. అందువల్ల ఇంత మేధకురాలిని తెలివితక్కువ మనిషిని పెళ్ళి చేసుకొని ఏలుకోవాలంటే ఎంత ఉదారబుద్ధిగల ఉపకారం చేసినవారి పట్ల కృతజ్ఞత గలవ్యక్తి అయిఉండాలి? మా ఇంకొక తాతయ్య జిల్లా విద్యాశాఖాధికారిగా ఉండేవారని చెప్పాను. ఆయనను పిలిచి మా తాతయ్య

'ఒరేయ్ సుదర్శనం, మన కాముడికి మంచి తెలివిగలపిల్లవాడిని చూడరా మన శాఖలో. ఎంత బీదవాడైనా ఫరవాలేదు.ఎంతవరకు చదువుకుంటానంటే అంత చదువు చెప్పించగలను ఆ పిల్లవాడికి. మంచి ఉద్యోగం ఇప్పిస్తే కృతజ్ఞుడుగా ఉండి కాముడిని సుఖపెడతాడు. బాగా చూసుకుంటాడు అని వరాన్వేషణకు ఆదేశించారు. ఆ రోజులలో అన్నదమ్ములు ఒకరికొకరు ఎంతో సహాయంగా మమేకంగా ఉండేవారు అంచేత మా పినతాత అయిన సుదర్శనరావుగారు ఆ పనిలో నిమగ్నులైనారు. వాళ్ళతాతగారి పేరు వెంకట చలమేమో అందువల్ల అన్నదమ్ముల పిల్లలకు వెంకటచలం పేరు పెట్టి ఉంటారు. సాధారణంగా తాతలపేర్లు మనువలకు పెట్టటం ఆనవాయితీ. వీటివల్ల వంశవృక్షం ముందు ముందు తరాలవాళ్ళు తెలుసుకొనే అవకాశం ఉంది. మరి ఇప్పుడు ఈ ఆచారం మారి పోయిందనుకోండి! కొత్త కొత్త అతినాజూకైన చిత్రవిచిత్రపుపేర్లు అర్థం వెతుక్కోవలసినవి, నిఘంటువులలో కనపడనివి అవి చూసినా తెలియనివి ఆడ, మగ పేర్లు వస్తున్నాయి. పాత పేర్లు 'మోటు' అనుకోకపోయినా కొత్త పేర్లు 'మోజు' అనుకోవటం మొదలైంది. పాలకంపెనీవాళ్ళు, ఇతర వ్యాపారస్తులు కొత్త కొత్త పేర్లు పట్టికలు రూపొందించి బహుమానంగానూ, అమ్మకానికిగానూ అందిస్తున్నారు.

జిల్లా విద్యాధికారిగా పనిచేస్తున్న మా సుదర్శనరావు తాతయ్యగారు తన స్కూళ్ల పర్యటనలో తూర్పు గోదావరి జిల్లా కొత్తపేట హైస్కూల్లో మా వెంకటరమణమూర్తి బాబాయిని గుర్తించాడు. క్లాసులో చాలా తెలివిగల కుర్రాడు, నియోగులబ్బాయి అని చెప్పారు. వాళ్ళ స్వగ్రామం కొత్తపేట దగ్గర వానపల్లి. ఇంటిపేరు విస్సాప్రగడవారు. రమణమూర్తి బాబాయిగారి తండ్రిపేరు రామయ్యగారు. ఇంటిపేరు విస్సాప్రగడవారయినా ఆయన ఆ ప్రాంతంలో వ్యాజ్యాల రామయ్యగారుగా ప్రసిద్ధికెక్కారు. ఆయన ఆ సార్థక నామధేయం తెలిస్తే పిల్లనిచ్చేవారెవ్వారైనా వెనక్కుపోవలసిందే. అయితే మా తాతగారిదృష్టి వేరు. అబ్బాయి మంచివాడైతే తగిన పంథాలో పెట్టుకోవచ్చుననే ఆధునిక భావాలుండేవి వాళ్ళకు. వాతావరణాన్ని బట్టి మన వ్యక్తిత్వం దిద్ది తీర్చుకోవచ్చు. అందువల్ల ఆ ప్రాంతంలో వారికున్న పేరు ప్రతిష్ఠలుకాని ఆస్తి పాస్తుల గురించిగాని మా తాతలు పట్టించుకోలేదు. ఈ సంబంధం ఈ విధంగా మా పిన్నికి

కుదిరిందంటే వివాహాలు దైవనిర్ణయాలు అనే నమ్మకం కలగక మానదు. ఏమంటే కోనసీమలోని వానపల్లికి నేను ఇంటర్‌మీడియట్ చదివే 1934-35 వరకూ కూడా కాలువలో పడవ మీద మాత్రమే ప్రయాణం చేయవలసి వచ్చేది. ఆ మారుమూల ఊరెక్కడ? అటు మద్రాసులో కోమలేశ్వరన్ పేట వాస్తవ్యులు మా తాతగారు కలపటపు రంగారావు రెండో కూతురు కాముడి పిన్ని ఎక్కడ? ఈ సంబంధానికి ఉభయులు ఒప్పుకోవడమేమిటి? ఆశ్చర్యంగాలేదూ! అయితే మా రంగారావు తాతగారిది అసలు కాకినాడేకదా? అందువల్ల ఆ భేదం ఆయనకు గుర్తుకు వచ్చి ఉండదు. పిల్లవాణ్ణి అంటే వెంకటరమణమూర్తి బాబాయిని మా సుదర్శనరావు తాతయ్య చూడటం మిగతా విషయాలన్నీ మాట్లాడటం అయింది. అబ్బో! అంతదూరం పెళ్ళివారు ఎలాగ ప్రయాణం చేస్తారు? అనే సమస్య ఉత్పన్నం కాకముందే మా తాతగారు ఎంతమంది వచ్చినా సరే అందరికీ రానూ పోనూ రైలు ఖర్చు ఇస్తానన్నారు. ఇహ ఏముంది పెద్ద యాత్రకు బయలుదేరినట్లు వానపల్లిలో ఉన్న విస్సావ్రగడవారే కాక బ్రాహ్మణకుటుంబీకులంతా 'సకుటుంబ బంధుమిత్ర సమేతంగా' అని మన శుభలేఖలలో వేస్తామే దాన్ని తు.చ.తప్పకుండా మా తాతగారి ఆహ్వానాన్ని అంగీకరించి అంతా మద్రాసు నగరానికి పరమాహ్లాదకరంగా వేంచేశారు. వివాహభోజనంబులారగించారు. ఊరంతా చూశారు. అమందానంద కందళిత హృదయారవిందులై ఆ విందులే డెందాన భద్రపరచుకొంటూ వానపల్లి తిరిగి చేరుకున్నారు.

ఆ పెళ్ళిలో జరిగిన మరో తమాషా చాలా కాలం చెప్పుకునేవారు. ఆ పెళ్ళికి వచ్చిన ఒక పెద్ద మనిషి మంగలివాడిని పిలిచి తనకు మద్రాసు క్రాపింగ్ చేయవలసిందని ఎంతో మోజుగా అడిగాడు. ఇహ ఆ రోజుల క్రాపింగు రీతులు వాటి వివిధ అందచందాలు రాయాలంటే అదొక ప్రత్యేకాధ్యాయం అవుతుంది. దాని నట్లా ఉంచి ఆ రోజుల్లో ఎవరికీ క్రాపింగులుండేవి కావని చెప్పుకోవటం చాలనుకుంటాను. గోష్పాదమంత ముడి వెనకవైపు గుబురుతో ఉండేది. ఇక ముందుభాగమంతా బాగా కత్తిరింపుతో 'పసారా' లాంటి కటింగు ఉండేది. ఇక అనేక రకాలైన తలకట్టులు లేదా తలకటింగులుండేవి. పాపం ఆ వానపల్లి నుంచి

వచ్చిన పెద్దమనిషి మద్రాసు క్రాపింగు చేయరా అంటే మరి ఆ అరవమంగలికి అర్థమైందో లేదో గాని ఆయనకు నున్నగా తిరుక్షౌరం అదే లెండి తిరుపతి గుండుచేశాడు. ఇదే మద్రాసు క్రాపింగు అన్నాడుట. పాపం ఆయన పెళ్ళిలో ఈ గుండుతో తిరగలేక తలపాగా చుట్టుకొని గుండును బయటకు చూపకుండా తంటాలు పడ్డాడట. ఈ మద్రాసు క్రాపింగ్ ప్రహసనం చాలా రోజులు మా తరం వరకు కథలా పాకిందంటే అప్పట్లో ఇది ఎంత వినోదం కలిగించి ఉంటుందో ఊహించుకోండి. బహుశా మద్రాసు క్రాపింగ్ అంటూ ఈ రోజుల్లో తిరుపతి వెళ్ళి తలనీలాలు ఇవ్వటంలో ప్రాధాన్యం కలిగి ఉండకపోవచ్చు. తిరుపతి వెళ్ళి వచ్చారా? అనేవారేమో?

## పెళ్ళిలో రెండో తమాషా?

మా బాబయ్య పెళ్ళికి మద్రాసులో చాలామంది పెద్దలంతా విచ్చేసి ఉంటారు. అక్కడ సోఫాలు కుర్చీలు చూడటం వానపల్లి వాసులకు అదే మొదలై ఉండవచ్చు. పాపం మా బాబాయికి కూడా వయసప్పటికి ఏ 16,17 ఏళ్ళో ఉండవచ్చు. స్కూలు ఫైనల్ విద్యార్థిగా ఎప్పుడూ ఊళ్ళో ఈతచాపల మీదా, తుంగచాపల మీదా హాయిగా కూర్చునే పల్లెటూరి సరుకు- వారికి ఈ సోఫాల మీద అధివసించటానికి అలవాటుండాలి గదా? పెళ్ళిలో మేజువాణీ జరుగుతుండగా పెళ్ళికొడుకును పెళ్ళికూతురును ఒక సోఫాలో కూర్చో పెట్టారు. కాసేపైన తర్వాత మా బాబయ్య రెండుకాళ్ళు ఎత్తి సోఫామీద 'బాసింపెట్టు' వేసుకుని కూర్చున్నాడు. మామూలుగా పీట మీద భోజనానికి కూచున్నట్లు. చూసే వాళ్ళకు అది విడ్డూరంగా ఉంటుంది కదా? అందుకని ఎవరో ఈ సంగతి గ్రహించి వెళ్ళి మెల్లిగా మా బాబాయి చెవిలో ఈ సంగతి చెప్పారు. కాళ్ళు కిందికి దించమని. ఆయన కాసేపు ఆగి అలా కాళ్ళు కిందికి పెడితే బాగుండేది. కాని గబుక్కున బాసింపట్టు తీసి కాళ్ళు కిందికి పెట్టేటప్పటికి అందరికీ నవ్వు వచ్చింది. తమాషాగా నవ్వారు. ఈ విషయం మా అమ్మమ్మ చెపుతూ ఉండేది.

మామూలుగా కింద చాప మీద కాళ్ళు ముడుచుకొని కూర్చుండేవారికి ఈ కుర్చీల మీద కూర్చోటం కష్టంగానే ఉంటుంది. ఎప్పుడూ కుర్చీలమీద కూర్చుని డిన్నర్లు కూడా టేబిలు మీల్సుతో కానిచ్చే పాశ్చాత్యులకు ముఖ్యంగా

అమెరికన్లకు బాసీపట్టు వేసుకు కూర్చోవాలంటే ఎంతో ఆశ్చర్యంగా చూస్తారు. దానికో పెద్ద సాధన చేయాలనుకుంటారు వాళ్ళు. కాని మనకు సినిమాలో కూచున్నా, సోఫాల మీద కూచున్నా ఎత్తైన కుర్చీలో కూచున్నా కాళ్ళు పైకెత్తి బాసింపట్టు వేసుకొని కూర్చునే బుద్ధి వేస్తుంది. అయితే బాబాయి పెళ్ళి కొడుకు హెూదాలో మేజువాణీలో అలా చేశాడు కనక వాళ్ళకు నవ్వొచ్చింది. పల్లెటూరి వాళ్ళనైనా పల్లెటూరివారంటే చులకన చేసినట్లవుతుంది కదా? ఏదైనా అలవాటు వెంటనే మార్చుకోవడం కష్టం. రష్యాలో విప్లవం వచ్చిన కొత్తలో ఎంతోమంది రాజులను, జమీందార్లను కాల్చిచంపేశారు విప్లవవాదులు. వాళ్ళంతా సంఘంలో చీడపురుగులని విప్లవకారుల సిద్ధాంతం. అందుచేత చాలాకాలం రష్యాలో ఎవరినైనా తిట్టాలంటే నీవు జమిందారువి, నీవు మహారాజువి లేదా ప్రిన్సువి అని అనేవాళ్ళు. దాన్ని వాళ్ళదాక పెద్దతిట్టుగా భావించేవారు.

మనదేశంలో జరిగింది శాంతియుత విప్లవం కాబట్టి మహారాజులను కలంపోటుతో తొలగించారు. సర్దార్ వల్లభ్ భాయ్‌పటేల్ మొదలైన దేశనేతలు జనించిన గొప్ప శాంతికాముక దేశం మనది కావటంచేత నేటికీ ఇంకా జమీందారులమని గొప్పగా చెప్పుకునే ధనికజాతి దేశంలో అనేక రూపాలలో చలామణి అవుతోంది. అయితే ఇహ రానురాను పల్లెవాసులకు అత్యధిక ప్రాధాన్యాన్నీ పెంచే ప్రణాళికలను రాజకీయవేత్తలు ఆలోచిస్తున్నారు కాబట్టి ఇక మీద పల్లెటూరివ్యక్తివి, పల్లెవాసివి అనటం గౌరవ సూచకంగా పరిగణిత మవుతుందేమో! నిజంగా ఆ గౌరవంరావాలి. అయితే మన రాజకీయ నాయకులకు ఆర్భాటం ఎక్కువ! అసలు క్రియ తక్కువ. పల్లెలు ఎంత త్వరగా సమగ్రాభివృద్ధిని సాధిస్తాయా అని స్వాతంత్ర్య సమరయోధులంతా ఆకాంక్షిస్తున్నారు.

మా బాబాయి బాసింపట్టు అలవాటు నుంచి ఆలోచనలు ఎక్కడెక్కడికో పరిభ్రమించాయి. నేను అమెరికా వెళ్ళినప్పుడు ఒక జపాన్ విద్యార్థి మరో తమాషా సంగతి చెప్పాడు. జపానులో అంతా కిందే కూర్చుని విశ్రాంతిగా భోజనం చేస్తారని. అంచేత కుర్చీల షాపులు ఎక్కడా ఉండవు. ఆ సంగతి తెలియని ఒక అమెరికన్ ఒక కుర్చీల షాపు అక్కడ ప్రారంభించాడు. ఏమీ అమ్మకాలులేక ఆ షాపు ఎత్తేశాడు. అమెరికన్ నాగరికతకు భిన్నమైన

జపాన్ నాగరికతకు నేను ఆశ్చర్యపోయాను. మీరెందుకు కుర్చీలలో కూర్చోరు అంటే దానికి అతడి దగ్గర సమాధానం దొరకలేదు. అది అంతే, కూర్చోం అన్నాడు.

అయితే రెండో ప్రపంచయుద్ధం ముగిసిన నలభై సంవత్సరాలలో అమెరికన్ సంపర్కంతో జపాన్‌వారి జీవితవిధానంలోనూ ఆహార విహారాలలోనూ ఎన్నోమార్పులు వచ్చాయి. కాని ఎంత నవనాగరీకులైనా ధనవంతులైనా అమెరికన్ సంపర్కం కలిగినా ఇప్పటికీ జపాన్ వారు సంప్రాదాయ ఆచారాలను పూర్తిగా విడిచిపెట్టుకోలేదు. ఇప్పటికీ ఇంగ్లీషు సినిమాలలో జపాను నవనాగరీక సంసారంలోని కథలు చూస్తున్నప్పుడు వారు కిందే కూర్చోవటం చూస్తూఉంటాం.

ఇక మళ్ళీ మా బాబాయి రమణమూర్తి గారి కథకు వద్దాం. మా తాతగారు ఎంతో ఆలోచించి ఈ అల్లుణ్ణి ఎంపికచేసుకున్నారు. మా రమణమూర్తి బాబాయికి మామగారంటే ఎంతో భక్తి. మా పిన్నిని ఎంతో ఒద్దికగా చూసుకున్నారు. పండంటిబిడ్డలను కని పెద్ద సంపాదనపరుడై బంధువర్గానికంతా ప్రేమపాత్రుడైనాడు. ఆయనదంతా స్వయంకృషి, ఉన్నతాశయాలు.

ఇంకోవ్యక్తి అయితే మా పిన్నిని ఏలుకోవటమే కష్టమయ్యేది. మా తాతయ్య సూక్ష్మగ్రాహ్యత, దూరాలోచన మా పిన్ని సంసారానికి వర ప్రసాదాలయినాయి. మా పిన్ని ఎంత అమాయకురాలో ఈ చిన్న ఉదాహరణను బట్టి తెలుసుకోవచ్చు. ఆవిడ కాపురానికి వెళ్ళిన కొత్తలో వాళ్ళిద్దరే కదా ఇంట్లో ఉండేది. 1919–20 ప్రాంతమై ఉంటుంది ఇది. మా పిన్నికి వంట చేయటం చాతకాదని వేరేచెప్పాలా? ఏమండీ! అన్నం ఎలా వండనండీ! అని అడిగిందట. బియ్యం కడిగి పొయ్యిమీద పెట్టు, అని మా బాబాయి ఆఫీసుకు వెళ్ళిపోయినాడు. తిరిగి భోజనం సమయానికి ఆయన ఇంటికి వచ్చాడు. మా పిన్ని నిద్రపోతున్నది. అన్నం అయిందిటే అన్నాడుట. ఆ అయిఉంటుంది లెండి అని ఆమె అనగా, ఇద్దరూ చూడ బోయారు. మా పిన్ని చేసిన పనేమిటంటే పొయ్యి వెలిగించి బియ్యం కడిగి నీళ్ళు ఉన్నాయో లేదో తెలియదు, కడిగిన బియ్యంతో గిన్నె పొయ్యిమీద పెట్టి నిద్రపోయింది.

ఇదేమిటే అంటే మీరు బియ్యం కడిగి పొయ్యి మీద పెట్టమన్నారు కదుటండీ అన్నదట. తర్వాత నిద్ర వచ్చింది సుమండీ అందిట. ఆ అమాయకత్వానికి పసిపిల్ల స్వభావానికీ మా బాబాయి పక్కున నవ్వేఉంటాడు. మా తాతగారు సంపద చూడకుండా హృదయసంపద గల అల్లుణ్ణి ఎంచుకున్నాడు.

## మా రమణమూర్తి బాబయ్య నుంచి నేర్చుకోవాల్సిన సంగతులు

గృహిణి ఎంత తెలివితక్కువదైనా భర్త సహనంతో సుఖసంసారం చేయవచ్చుననేది మా బాబయ్య సంసారోదంతం నుంచి గ్రహించాం. భర్త మానసికంగా బాగా బలహీనుడైనా తన తెలివితేటలతో సహనంతో సంసారాన్ని చక్కదిద్దుకొన్న మా అమ్మ ఉదాహరణ కూడా ఇంకోవైపున గమనించాం. వీళ్ళూ వాళ్ళూ కూడా ఎంతో అన్యోన్యతతో సఖ్యంగా కాలం గడిపారు. ఇలా తమాషాగా ఇద్దరు అప్పచెల్లెళ్ళ సంసారాల సామరస్యాన్ని గురించి మనం గ్రహించాల్సింది చాలా ఉంది. సుఖసంసారానికి మానసికమైన సర్దుబాట్లు, సంస్కారమూ చాలా అవసరం. ఈ కాలంలోని దాంపత్య జీవితంలో అసంతృప్తులు, ఎగుడుదిగుళ్ళు, అప్పుడే నివారణమవుతాయి.

మామగారు, అంటారూ రంగారావు తాత చనిపోయిన తర్వాత మా బాబయ్య ఎంత తెలివికలవాడైనా చురుకైనవాడైనా ఆయన చదువు కుంటు పడింది. మా తాతయ్యగారేమనుకున్నారో, పాపం. 'రమణమూర్తి' ఎంత వరకు చదువుకుంటే, ఈ దేశంలో అతడు చదవగల ఎంతో పెద్ద చదువులైనా సరే చదివిద్దామనే ఆశించాడాయన. రమణమూర్తి బాబాయి కూడా నిజంగా చాలా సమర్థుడు. ఆయన కూచోవాలే కాని ఫ్యాసుకాని పరీక్ష అంటూ ఉండేదికాదు. కాని ఏంలాభం. 1918 నాటికే ఒక సంవత్సరం కూడా తిరగకుండానే మాతా మహుల తరపున తాతలంతా ఒకరితర్వాత ఒకరు మరణించటంతో కలపటపు వారి కుటుంబమంతా ఆడపెత్తన మైంది. సరే అందరూ కలిసి ఆలోచించి రమణమూర్తిని చదివించాలని 'బొంబాయి'లో బి.కామ్. చదవటానికి ఆయన్ను పంపారు. అప్పటికి మన ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలో కాదుకదా ముఖ్య పట్నమైన మద్రాసులోనే బి.కామ్. లేదంటే అప్పటి పరిస్థితులు ఆలోచించుకోండి. ఉన్నతవిద్య చదవటానికి అవకాశాలు ఎంత తక్కువగా ఉండేవో ఇందువల్ల తెలుసుకోవచ్చు. మా తాతగారు అనుకొన్నట్లు గానే జరిగి

ఉంటే ఆయన కృషి ఫలించిఉంటే అల్లుళ్ళు జీవితంలో ఎంత ఉన్నత స్థాయికి ఎదిగిఉండేవారో ఊహించవచ్చు. అయినా ఆయన సంకల్పం మెచ్చుకో దగింది. ఆలోచన సరిఅయినది. ఎంత ఆస్తి ఉన్నా ఉన్నత విద్యలేని వింతపశువు ఆ ఆస్తిని కొద్దికాలం లోనే కరిగించివేసి బికారి కావడానికి అవకాశం ఉంది. స్వయంశక్తి, స్వావలంబన ముఖ్యంకాని వాళ్ళ సంపద, స్థితిగతులు, ఆస్తి పాస్తులు ముఖ్యంకావు. వారి గుణగణాలు ప్రధానం కాని ధనికకుటుంబమా కాదా అన్నది ప్రధానం కాదు. ధనం కాదు, విద్యాధనం ముఖ్యం. కుటుంబ సంప్రదాయం ముఖ్యం ఇప్పుడీ విషయాలన్నీ మన కళ్ళముందే రుజువవుతున్నాయి. రోజూ వింటూ ఉన్నవే. కంటూ ఉన్నవే. అందుకే మా తాతగారి ఆలోచనను వారు కార్యరూపంలో పెట్టటానికే నిశ్చయించుకున్నారు. పరిస్థితులెట్లా ఉన్నా మా రమణమూర్తి బాబాయి చదువు ముఖ్యమని మా బంధుజాలం నిశ్చయించింది. ఆయనకు కావలసిన డబ్బు ఇచ్చి ఆయన్ను బొంబాయి పంపించింది. బొంబాయి చదువు మూన్నాళ్ళ ముచ్చటైంది.

కాలేజీ చదువుకి సంబంధించిన్నీ, సాంఘిక జీవితానికి సంబంధించిన్నీ మద్రాసు 'స్టైలు' వేరు, బొంబాయి 'స్టైలు' వేరు. అందరికీ బూట్లు, తలమీద టోపీ, మంచి దుస్తులు ఉండాలి. కాలేజీలో చేరటానికి కావలసిన డబ్బు కట్టి, తక్కిన సరంజామా అంతా కొనేటప్పటికీ మా బాబాయి తీసుకవెళ్ళిన డబ్బు మొదటి నెలలోనే అయిపోయింది. మళ్ళీ నెల తిరగకుండానే డబ్బుకోసం మద్రాసు వ్రాసేటప్పటికి ఇక్కడ ఈ ఆడపెత్తందార్లకు తలలు తిరిగిపోయాయి. అంతవరకు మగవారి పోషణలో ఉండి డబ్బు చేతిలో ఆడని కారణంగా వాళ్ళకు డబ్బుఖర్చు గురించి తెలియదు. ఈ మాదిరిగా అయితే డబ్బు మంచినీళ్ళలా అయిపోతుంది, ఈ చదువు మనమెక్కడ భరించగలం? అని చదువు మానుకొని రావల్సిందని మా బాబయ్యను వెనక్కు పిలిపించారు. పాపం ఏం చేస్తాడు మా బాబయ్య! గత్యంతరం లేక కాకినాడలో పోస్టాఫీసులో ముప్ఫైరూపాయల గుమాస్తా ఉద్యోగానికి చేరి సంసారజీవితం సాగించాడు. అదిన్నీ అమాయకురాలైన పిన్నితో అప్పటినుంచీ మా బాబాయి కష్టజీవి.

ముప్ఫై రూపాయల జీతంతో ఉద్యోగంలో ప్రవేశించిన బాబాయి ఎన్నో పరీక్షలు ప్యాసై నాగపూరులో ప్రెసిడెన్సీ పోస్టుమాస్టరుగా ఉద్యోగం చేశాడు.

ఎంత పెద్ద ఉద్యోగమైనా ఎంత పెద్దజీతమైనా ఆయన వ్యక్తిగత జీవితంలో చాలా నిరాడంబరంగా ఆ కొద్దిపాటి బట్టలతో కోరికలతో జీవితం వెళ్ళబుచ్చాడు.

ఆయన నెలకు 30 రూపాయలు సంపాదిస్తున్నప్పుడు, 110 రూపాయల జీతం తెచ్చుకుంటున్నప్పుడు 800 రూపాయలు ఆర్జిస్తున్నప్పుడు జీవితాన్ని ఒకే ఆర్థికవిధానంలో, పద్ధతిలో, సూత్రంలో ఇమిడ్చి సాగించాడు. ఏ విధమైన భేషజం లేకుండా డబ్బు నిల్వచేయడమే ఆయన లక్ష్యంగా ఉండేది. జీతం ఏ పాటిదైనా ఆ జీతంలో ఆదాచేసే శాతం ఒకటే. ఆయన జీవితం నుంచి నేర్చుకోవలసిన పాఠం ఏమంటే ఎంత సంపాదన ఉన్నా ఆదాచేసే అలవాటు లేకపోతే ఎవడూ ధనవంతుడు కాలేడు. ధనవంతుడిలా కనిపించవచ్చు. జీవించవచ్చు. కాని ఆ వ్యక్తి అవతారం చాలించేటప్పటికి ఏమీ మిగలదు. అంచేత ఎంత సంపాదించామనేది ముఖ్యంకాదు. ప్రతినెలా ఎంత శాతం ఆదా చేశామనేది ముఖ్యం. నాటికీ నేటికీ ఏనాటికీ ప్రతివ్యక్తీ ఆలోచించాల్సింది ఇది. ఆచరించాల్సింది ఇది. ఆదా చేయడమంటే ఆలోచనలతో అయ్యేదికాదు. ఆలోచన పునాది కావచ్చు కాని ఆచరణ ఆపై కట్టడం కావాలి. నూట పదిరూపాయలు జీతం వస్తే అర్వై రూపాయలే ఇంట్లో ఇచ్చేవాడు బాబాయి. దీనితోనే మీరు గడుపుకోవాలి అనేవాడు. అది అంతే. నాకు ఆవకాయ, అన్నం పెట్టండి. ఇదిలేదని అదికావాలనీ అడగను, ఇహ నన్ను డబ్బు మాత్రం అడగవద్దనేవాడు. అంటే 110 రూపాయలలో ఆయన ఆదా 50 రూపాయలన్నమాట. ఇదే శాతం ఆయన అన్ని హోదాలలోనూ పాటించేవాడు.

ఇట్లా అని ప్రేమలో కాని ఇతరులకు పెట్టిపోతలలో కాని బంధుప్రీతిలో కాని ఏమీ లోటు రానిచ్చేవాడు కాదు బాబాయి. మా చిన్నతనంలో అంటే నాకు ఎనిమిది తొమ్మిదేళ్ళుంటాయనుకుంటాను. అంటే అవి 1923, 24 సంవత్సరాలు. మా బాబాయి అప్పుడు రాజమండ్రిలో పోస్టాఫీసులో పనిచేస్తున్నప్పుడు ఆయన ముగ్గురు తమ్ముళ్ళు, ఇంట్లో ఉండి చదువుల్లోనూ ఉద్యోగాల్లోనూ ఉండేవారు. అంతా పొద్దున్నే 'తరవాణీ' అన్నం ఒక కంచంలో పెట్టుకొని ఒక ఆవకాయ బద్ద వేసుకొని చేతులలో నూనె వేసుకుని కలుపుకు తిని త్రేన్చుకుంటూ లేచి ఎవరి పనుల మీద వాళ్ళు వెళ్ళిపోయేవారు. అప్పటికి

మా బాబయ్యగారి ఇంట్లో ఇంకా కాఫీ ప్రవేశించలేదు. ఈ కాలంవారు తరవాణీ అన్నం అంటే ఏమిటో దానివల్ల వచ్చే చలవగుణం ఏమిటో ఇతర గుణాలేమిటో కాయ ఆవకాయ అంటే ఏమిటో తెలుసుకోవాలంటే మీ పెద్దలనడిగి తెలుసుకోండి. ఈ పదాలు కృష్ణా, గుంటూరు జిల్లాలవారికి అసలు తెలియవు. తూర్పు గోదావరి జిల్లా కాకినాడ, రాజమండ్రి వారిని విశాఖ జిల్లా వరకు ఉన్న వారిని అడిగి తెలుసుకోండి. వీటన్నిటిని గురించి చెప్పాలంటే అదొక చాట భారత మవుతుంది ఈ విధంగా మా బాబాయి చాలా నిరాడంబరంగా జీవితం ప్రారంభించాడు. తనకొచ్చే సంపాదనలో నుంచి ఆదాచేసేవాడు. తాను బీదవాడిననీ, అందువల్ల డబ్బులేనిలోటు ముందు ముందుతాను కాని తన పిల్లలు కాని అనుభవించకూడదనీ, తన పిల్లలకు కూడా డబ్బువిలువ తెలియాలనీ దాదాపు అందరికీ మూడు నాలుగు లక్షల విలువచేసే ఆస్తిని ఇచ్చి సంతోషంగా కన్నుమూశాడు. 'పొదుపు'ను గూర్చి ఇంగ్లీషు సాహిత్యంలో సుప్రసిద్ధమైన 'త్రిఫ్ట్' అనే వ్యాసాన్ని జ్ఞాపకం చేస్తుంది రమణమూర్తి బాబాయి జీవితం.

ఈ విధంగా మా తాతగారైన రంగారావుగారి కలను నిజంచేశాడు మా బాబాయి. అమాయకురాలైన మా పిన్నిని ఆదరాభిమానాలతో చూసుకున్నాడు. పోస్టల్ డిపార్ట్మెంటులో పెద్ద హోదా గల ఉద్యోగం చేశాడు. డబ్బు కూడబెట్టి ఆదాచేసి గొప్పవాడు, మంచివాడు, బంధుప్రీతి గలవాడు అన్న పేరు సంపాదించాడు. ఒక చిన్నజీవితంలో ఎవరైనా అహంతో ఎన్ని పనులు చేయగలం. వినయంతో ఒక ఆశయం నెరవేర్చుకున్నా ధన్య జీవులమేకదా?

# XXVIII

# బ్రతుకుతెరువు బజారులో

# LIVING BECAME A PROBLEM

> The rising prices of skyhigh when compared to my childhood days - Astounding differences- More production and equitable distribution is the only answer. A day like the elephants flying in the sky is visualised, to most of the prices.

బహుశా నేను ఇంటిసామానులు కొనటానికి కొట్టుకు వెళ్ళి కొన్ని దశాబ్దాలు దాటిఉంటుంది. అందువల్ల ఇంటిసరుకుల ధరలంటే నా మనస్సులో నా చిన్నతనం, నడివయస్సులో ధరలే కదంతొక్కడంలో ఆశ్చర్యంలేదు. సైనికవిన్యాసం లాగా అవే నా మనస్సులో మెదులుతాయి. ఇప్పటి ధరల గూర్చి వింటుంటే ఎన్నో విపరీతాలను విచిత్రాలను తుఫానులను జీవితంలో చూసిన

నాకు ఏదీ విడ్డూరంగా కన్పించదు. అందులో ఇప్పుడు రూపాయలు కంటికి కనపడుతున్నాయి. జేబులో గలగలలాడుతున్నాయి. సినిమాలు మొదలైన వినోదాలు ఉన్నవాణ్ణీ లేనివాణ్ణీ ప్రతిఒక్కరినీ ఆకర్షిస్తున్నాయి. ఈ తిండివస్తువుల ధరల గురించి ఇప్పుడెవరు పట్టించుకుంటారు? ఆ దృష్టి అడుగంటి పోయింది.

అభివృద్ధి చెందిన దేశాలలో ప్రతి వ్యక్తీ తనకు వచ్చే నెల సరి ఆదాయంలో ఆహారం నిమిత్తం పది లేక మహా అయితే పదిహేను శాతం ఖర్చు చేయవలసి ఉంటుంది. అందువల్ల ఆ దేశ ప్రజలకు మిగతా సౌకర్యాలు ఏర్పరచుకోవటానికి ఆదాయంలో ఎక్కువశాతం ఉపయోగపడుతుంది. మనలాంటి అభివృద్ధి చెందుతున్న దేశాలలో అంటే సున్నితంగా చెప్పాలంటే బీదదేశాలలో ప్రతివాడు తనకు వచ్చే సంపాదనలో 60 శాతం నుంచి 80 శాతం వరకూ తిండి తిప్పలకే ఖర్చు చేయాల్సి ఉంటున్నది. అందులోనూ మరీ బీదప్రజలు ఉన్నదంతా వెచ్చపెట్టి రోజూ బాధపడినా కడుపులు నింపుకోలేక పోతున్నారు. జొన్న రొట్టె, ఖారం లేదా కాస్త అన్నం, ఏదో ఒక కాతంతో కడుపు నింపుకోవలసి వస్తోంది వారు. కాబట్టే ఈ బజారుధరల గురించి బాధపడవలసి వస్తోంది. వీటిని అదుపులో ఉంచవలసిన అగత్యం గూర్చి తీవ్రంగా ఆలోచించవలసి వస్తోంది.

అందుకే సామ్యవాద సిద్ధాంత దేశాలు అంటే రష్యా, చైనా మొదలైన కమ్యూనిష్టు దేశాలు ముందర దేశప్రజల తిండి, గుడ్డ, గృహవసతి విషయంలో ప్రణాళికాబద్ధంగా జాగ్రత్త వహిస్తున్నాయి. ఈ కనీసావసరాలు తీర్చాలనీ సౌకర్యాలందించాలనీ ఆరాటపడుతున్నాయి. కొంతలో కొంత పేదరికాన్ని తొలగించటానికి కృతకృత్యమైనాయి. ఇందుకు కొన్ని దశాబ్దాలుగా తీవ్ర కృషి చేస్తున్నారు. ఎంత తంటాలుపడ్డా రుచిగల, పుష్టికరమైన ఆహారాన్ని అన్ని వర్గాల ప్రజలకు విరివిగా సమానంగా అందించలేకపోయామని అధికార పూర్వకంగా వారే అంగీకరిస్తున్నారు. అయితే ప్రజాస్వామ్య పంథాలో అభివృద్ధి చెందుతున్న దేశాలకు, కమ్యూనిష్టు దేశాలకు ఉన్న తేడా ఏమంటే సామ్యవాద పద్ధతులు అమలు చేసిన దేశాలు త్రికరణశుద్ధిగా ప్రయత్నించాయి. మన దేశంలో ఆ ప్రయత్నం అరకొరగా మాత్రమే సాగింది. కాబట్టి

ప్రజాసామాన్యానికి మేలుకలిగేలా మన ప్రజాస్వామ్య వ్యవస్థలో కూడా ప్రణాళికలు చిత్తశుద్ధితో అమలు జరిగేట్లు చూడాలి. ఇటువంటి ప్రకటనలైతే ప్రతి రాజకీయ పార్టీ తన ఎన్నికల ప్రణాళికలో గంభీరంగా ప్రకటిస్తుంది కాని అధికారం చేపట్టిందా చిత్తశుద్ధి మాత్రం కనిపించదు. అందువల్లనే వినియోగ దారుల చట్టాలు, ధరవరల అదుపుచట్టాలు, ఉత్పత్తి వస్తువుల ప్రమాణీకరణ చట్టాలు నేడు ఎంతగానో అవసరమైనాయి. ఈ చట్టాలను తప్పించుకొని తిరిగే వ్యాపార మేధావులు కూడా అనంతకోటి ఉపాయాలు అన్వేషిస్తునే ఉన్నారు. అందు వల్ల ప్రభుత్వం వైఫల్యాలను ఎదుర్కోవలసివస్తున్నది. దీనికి తోడు ద్రవ్యోల్బణం ఒకటి అందువల్ల పాతకాలపు ధరలు పాతాళంలోనూ వర్తమానం ధరలు తారాపథం లోనూ ఉన్నట్లు భావనగలుగుతుంది. ఏ ఆర్థిక విధానంలోనైనా ఎన్నో శక్తులు వీటిని అజమాయిషీ చేస్తాయి. మన జీవన ప్రమాణం ఆదరణీయంగా ఉండాలంటే అందరికీ ఆహారం లభించాలి. తిండి కోసం తిప్పలెవరూ పడకూడదు. బతుకు బజారులో బాధలపాలు కాకూడదు అని ఈ ప్రకరణానికి ముందుమాటలు రాస్తున్నాను.

మాతరం కథలో ఇదొక పెద్ద ప్రకరణం. <మా తరం కథ స్మరించుకోవటంలో మననం చేసుకోవటంలో ప్రధానోద్దేశం ఆనాటి గ్రామీణ జీవనవిధానం, జానపద వ్యవస్థ, మానవుడి తృప్తి, ఆనాటి నాగరికత తలచుకోవడమే.> ఏ పని చేసేవాడు ఆ పని ఒక ఆరాధనతో సేవాదృష్టితో వృత్తిధర్మంగా నిర్వహించడం జరిగేది. కమ్మరి, కుమ్మరి, పంతులు, పారిశ్రమకారుడు ఒక సాంఘిక బాధ్యతతో, ఒక నీతితో తమ మనుగడ సాగించేవారు. వారు పాటించిన విలువలను గూర్చినవివరణమే ఈ ప్రకరణం ముఖ్యాశయం.

మానవుడికి కావలసిన కనీసావసరాలు ఏమిటి? తిండి, గుడ్డ, ఒక నివాసం. ఆపైన ఐశ్వర్యాన్ని బట్టి వ్యక్తులు ఎక్కువ సౌఖ్యాలను కోరవచ్చు. అనుభవించవచ్చు. అప్పట్లో కొందరు అమిత భోగపరాయణులై కొందరు అలమటించిన వృత్తాంతాలు కూడా ఉన్నాయి. ఆ సంగతి పోనివ్వండి . కాని ఇవాళ ప్రజాస్వామ్యం కావాలంటున్నాం. స్వాతంత్ర్యం సంపాదించుకున్నాం. ఇప్పుడు మనందరి ధ్యేయం శ్రేయోరాజ్యం. సంక్షేమ పరిపాలన.

మానవీయమైన విలువలు. సర్వేజనాః సుఖినో భవంతు అనే ఆదర్శ పరిపాలనా వ్యవస్థను ఈనాడు భారతదేశం రూపొందించుకోవాలి. ఈ నేపథ్యంలో గతాన్నీ వర్తమానాన్నీ బేరీజువేసుకొందాం. ఆనాటి ఈనాటి బజారుధరలు, ఈనాడు ఈ పరిస్థితులు మనకు ఎందుకు దాపురించాయి, ఈ స్థితికి దిగజారడానికి కారణాలు, ఇప్పుడు ఏంచెయ్యాలి? అనేది ఈ ప్రకరణంలో సమీక్షించుకుందాం. అందుకే బ్రతుకుతెరువు బజారు అనటం ఈ ప్రకరణానికి సముచితంగా ఉంటుందని భావించాను. ఎన్ని విషయాలు ప్రస్తావించినా ఎన్ని చర్చలు చేసినా తికమకలు పడ్డా మన 'వెర్రిబ్రతుకు వేసారక'మునుపే కర్తవ్యాన్ని స్మరించుకుందాం.

'బతకలేక బడిపంతులు' అనేది ఒక సామెత. అయితే ఆ రోజులలో బడి పంతులు గారికి ఎంత గౌరవం, పలుకుబడీ ఉండేవో ఊళ్ళో, తలచుకొంటే ఆశ్చర్యం వేస్తుంది. పంతులుగారి సంసారానికి కావలసిన కూరలు, పెరుగుపాలు, వంటచెరకు, వీలైతే నెయ్యి కూడా ఊరికే సప్లై చేసేవాళ్ళు ఊరివాళ్ళు. పంతులుగారి కుటుంబం డబ్బిచ్చి కొనేవి చాలా అరుదుగా ఉండేవి ఊళ్ళో. ఆ రోజుల్లో వీధి బళ్ళు, వీటి తరవాత "గ్రాంట్-ఇన్- ఎయిడ్" స్కూళ్ళు ఉండేవి. ఈ స్కూళ్ళలో పనిచేసే పంతుళ్ళకు పంటకాలంలో సంవత్సరానికి సరిపడేట్లుగా కందులు, మినుములు, పెసలు, మిరపకాయలు, ఆ ప్రాంతపు ధాన్యాలను బట్టి వడ్లు కూడా పంపించేవారు ఊరివాళ్ళు.

## ఎలికపాడు నివాసం

మా నాన్నగారు ఎలుకపాడులో మొదటిసారిగా ఎలిమెంటరీ స్కూలు ఉపాధ్యాయులుగా ఉద్యోగం చేశారు. ఎలుకపాడు కృష్ణాజిల్లాలో ఉండేది. బందరులో రైలు ఎక్కి దోసపాడు స్టేషన్ లో దిగాలి. అక్కడికి దాదాపు మూడు మైలు మీటరు మైళ్ళ దూరంలో ఉండేదనుకుంటా ఎలుకపాడు. ఊరివాళ్ళు రెండెండ్ల బండీ పంపేవారు. అది వారి ధర్మంగా భావించేవారు. సాధారణంగా మునసుబుగారు ఈ బండి ఏర్పాటు చేసేవారు.

## ఆనాటి ఉపాధ్యాయులు – ఊరివారి ఆదరణ

ఆ రోజుల్లో తాలూకా బోర్డులుండేవి. తాలూకా బోర్డులు, జిల్లా బోర్డులు ఏర్పరచి బ్రిటిషు ప్రభుత్వం వారు మనకు స్థానిక స్వపరిపాలనను అంచెలవారీగా నేర్పారు. స్వరాజ్య ఉద్యమంలోని జాతీయవాదులు ఈ స్థానిక స్వపరిపాలనను దేశీయులకు బ్రిటిషువారు ఒకఎరగా ఉపయోగించు కుంటున్నారని అభిప్రాయపడేవారు. అయితే ప్రభుత్వాన్ని సమర్థిస్తూ ఏదిచ్చినా దాసోహమని పొంగిపోతూ దాన్ని తీసుకుంటూ ఉండే వర్గాలు తరంలోనూ ఉంటూనే ఉంటాయి. ముఖ్యంగా ధనికవర్గం వారు, భూస్వామ్య వర్గాలవారు ఆ రోజుల్లో అయితే జమిందారులు పరిపాలకుల కనుసన్నల్లో ఉండటానికే ఎక్కువ ఇష్టపడేవారు. బ్రిటిషు ప్రభుత్వం వారి ఆసరాతో, మద్దతుతో ఈ అధికారాన్ని చెలాయించేవారు.

ఆ ఊరివాళ్ళు మా నాన్నగారి వంటి ఉపాధ్యాయులే కావాలని కోరుకున్నారు. ముఖ్యంగా ఆ ఊరి మునసుబు బసవయ్యగారు కోరుకొని మా నాన్నగారిని మేష్టరుగా అక్కడికి తీసుకొని వెళ్ళారు. అప్పటికి నాకు ఆరేళ్ళ వయసు ఉండి ఉంటుంది. అంచేత ఆనాటి జ్ఞాపకాలు నాకు బాగానే ఉన్నాయి.

సంసారానికి కావలసిన సర్వ సదుపాయాలు ఊరివాళ్ళే చూసుకునేవా ,రు. కుటుంబం ఉండటానికి ముఖ్యమైంది ఇల్లు కదా? పల్లెటూళ్ళలో అద్దెకు ఇల్లు దొరకదు కదా? అందువల్ల కాస్త విశాలమైన ప్రదేశంలో పూరిపాక నిర్మించారు. కందికంపతో దొడ్డిచుట్టూ ఆవరణ ఏర్పాటుచేశారు. ఇంటిముందర తాటాకుల పందిరి వేశారు. మా అమ్మ సంక్రాంతి పండుగ గొబ్బిళ్ళ రోజులలో బంతిపూలతో దండలు కట్టి ఇంటిని నిలువుదండలతో అలంకరించి గొబ్బిళ్ళు కూడా పెట్టి ఊళ్ళోని ఆడపిల్లలందరినీ చేర్చి చెమ్మచెక్క పాటలు, కోలాటం పాటలు పాడుతూ ఆ పిల్లలచేత ఆడించేది. మా అమ్మపైన ఊరి వాళ్ళందరికీ ఎనలేని గౌరవం అభిమానం ఉండేవి. ఒక తుమ్మచెట్టు కొట్టి ఆరు నెలలకు సరిపోను వంటచెరకు ఒకే సారి పంపేవారు. ఎండిన తర్వాత ఇంట్లో అటకపై వాటిని పేర్చి పెట్టే వాళ్ళు ఊళ్ళో వాళ్ళే. ఆ విధంగా కుటుంబ వాహనం ఇంధన కొరత లేకుండా సాగిపోయేది. క్రమక్రమంగా ఈ ఇంధనాధారాలు కూడా పెరిగాయి. కట్టెలకు

తోడు తాటిమట్టలు, ఆ తర్వాత కిరసనాయిలు, బొగ్గులు, పిడకలు ఉపయోగించేవాళ్ళం. ఆ తర్వాత 'స్టవ్'లు వచ్చాయి. స్టవ్‌లు వచ్చిన తర్వాత వీటిని వెలిగించటానికి స్పిరిట్' ఉపయోగించేవాళ్ళు. స్టవ్‌లకు కిరసనాయిలు వాడేవాళ్ళం. కుంపటి అంటించటానికి కింద కాగితాలు మంట చేసేవాళ్ళు. చూడరా మనం ఎన్ని విధాల తగలేస్తున్నామో అనేవారు మా నాన్నగారు నవ్వుతూ. అప్పట్లో కన్వెన్షనల్ ఎనర్జీ ఇన్ని రూపాలలో లభించేది. నెయ్యి మాత్రమే మేము డబ్బిచ్చి కొనేవాళ్ళమేమో అని గుర్తు. నెయ్యి కూడా ఆ రోజుల్లో బహుచవకగా దొరికేది. పాడిపంటా వున్నా రైతులు ఎక్కువగా నెయ్యి వాడేవారు కాదు. అమ్మితే కొనేవాళ్ళు కూడా ఉండేవాళ్ళు కాదు. నెయ్యి కొనే వారు లేక పై ఊళ్ళకు పంపించే సౌకర్యాలు లేక పెద్ద పెద్ద సత్తుగిన్నెల నిండా మురిగిపోయిన నెయ్యి కథలు నాకు తెలుసు. అప్పట్లో బ్రాహ్మణులే ఎక్కువగా నెయ్యి వాడేవారు. కరిగిన కమ్మటి నెయ్యి రూపాయికి ఏడెనిమిది గిద్దలు (గిద్ద దాదాపు 8 ఔన్సులు లేదా 240 మి.లీ.) ఇచ్చేవారు. నెయ్యి సంగతి గుర్తుకు వస్తే ఒక విషయం జ్ఞాపకం వస్తున్నది. మేము అవుటపల్లి (కృష్ణా జిల్లాలో గన్నవరం దగ్గర ఉండేది)లో ఉండేటప్పుడు ఆ ఊళ్ళో బసవమ్మ అని ఒకావిడ ఉండేది. బసవమ్మ గిద్దకొలత స్టాండర్డు అందరికీ కూడా. అందుచేత బసవమ్మ గిద్దతో కొలిస్తే కాని వీల్లేదనేవాళ్ళం.

అన్నంలో నెయ్యివాడకం ఎక్కువగా ఆంధ్రులలోనే ఉంది. నేను భోజనానికి వెళ్ళినప్పుడు మా అరవ మిత్రులు తిరుమలరావు వచ్చాడు నేతి గిన్నె అక్కడ పెట్టిపో అనేవారు గృహిణితో. ఎందుకంటే తెలుగువారు ముద్ద ముద్దకీ నెయ్యి వేసుకుంటారని వాళ్ళకు తెలుసు. అరవ మిత్రులకైతే మొదట్లో ఒకసారి నెయ్యి వడ్డిస్తే చాలు, దాంతోనే చివరవరకూ సాగిస్తారు. తెలుగు మిత్రుడు నెయ్యికొనే పరిమాణం చూసి ఏమిరా మీ ఇంట్లో నెయ్యితో తలంటి పోసుకుంటారా అని వేళాకోళం చేసేవారు. అరవవాళ్ళలో కారం తినడం చాలా తక్కువ. ఆంధ్రులకు అన్నింట్లో కారం కావాలి. అందుచేత నెయ్యి వాడకం బాగా జాస్తి. అరవమిత్రుడి ఇంట్లో నెలకు సరిపడా మిరపకాయలు ఒక హార్లిక్సు సీసాడు సరిపోతాయి. ఆ మిరపకాయలు మన తెలుగువాళ్ళ ఇంట్లోనైతే ఒక పూట గోంగూరపచ్చడి చేసుకోవటానికి సరిపోవు. మంచైనా చెడైనా ఏదైనా

కానీండి. ఇది ఆంధ్రుల అలవాటు. ఈ రోజుల్లోనైతే గుండెజబ్బుల భయం వల్ల అంతా వెన్న, నెయ్యి వాడకం తగ్గించేసి మంచి నువ్వులనూనె వాడుతున్నారు. ఎందుకంటే రక్తంలో 'కొలెస్ట్రాల్' అనే కొవ్వుపదార్థం పెరగకుండా, అందుమూలంగా గుండెజబ్బు రాకుండా ఈ జాగ్రత్త తీసుకోవటం అవసరమైంది.

ఇప్పుడు సామాన్యంగా మనం వాడే నెయ్యి నెయ్యి కాదు. పచ్చిపాల మీద వెన్న తీసివేస్తారు కాబట్టి పాలకేంద్రాల ద్వారా సరఫరా అయ్యే నెయ్యి కమ్మని వాసనరాదు. దాలిలో కాచిన పాలను తోడు పెట్టి, చిలికి తీసిన వెన్నను కాచినప్పుడు ఆ రుచి వేరు. అదీకాక ఇప్పుడు వెన్నలో, నేతుల్లో ఎన్నో కల్తీలు ప్రవేశించాయి. ఈ రెంటిలో కూడా ఎన్ని ద్రవపదార్థాలు, పిండి పదార్థాలు కల్తీగా చేరుతున్నాయో తెలియదు. కొన్నప్పుడు చూడటానికి వెన్న కాచిన నెయ్యిలాగా నూకలు నూకలుగా ఉండి కమ్మని వాసన ముక్కుపుటాలకు సోకినా మూడోనాటికి దుర్వాసన వేస్తుంది ఈ నవనాగరిక నెయ్యి.

## వివిధ పదార్థ కల్తీ ప్రపంచం

ఈ కల్తీల విషయంలో మనలో చదువుకోని వాళ్ళు కూడా ఎంతో నైపుణ్యం సంపాదించారు. వారి ప్రజ్ఞ ఈ విషయంలో అనన్యసామాన్యం. ఈ విధంగా కల్తీలు చెయ్యటంలో ఉపయోగపడే తెలివితేటలు ఇందులో వెయ్యోవంతైనా మంచి పనులు చేయడానికి ఉపయోగిస్తే మనదేశం ఇప్పుడున్న దాని కంటె ఎన్నోరెట్లు ప్రగతిపథంలో వుండేది. స్వరాజ్యం వచ్చిన తర్వాత మన దేశం ముందంజవేసిన రంగాలలో ఈ కల్తీ రంగం ప్రధానమైంది. స్వరాజ్యం వచ్చిన తర్వాత జనాభా బాగా పెరిగిపోయింది. ద్రవ్యోల్బణం ఎక్కువైంది. రూపాయలు బజారులో ప్రవహించటం కూడా మొదలైంది. మన సాంఘిక విశ్వాసాలలో 'సత్యమేవజయతే' క్రమంగా నశిస్తూ వచ్చింది. ప్రతివారికీ అందులో వ్యాపారస్తులు మాత్రం ఎదుకు వెనకబడాలి. ఎంత తొందరగా పెద్ద ధనవంతులమవుదామా అనే ఆత్రుత, దురాశ ఎక్కువైనాయి. దగా తెలివి ఎంతో అభివృద్ధి చెందింది.

దళారీతనం కూడా మునుపటి కంటె హెచ్చింది. మోసం చేసైనా సరే త్వరగా ధనికులం కావాలనే కాంక్ష పెరిగిపోయింది. ధ్యేయమొక్కటే కాదు

మార్గం కూడా మంచిది కావాలన్న గాంధీజీ ప్రబోధం మీద ధ్యాస ఇప్పుడెవరికీ లేదు. గమ్యం త్వరగా చేరాలి, అందుకు డొంక తిరుగుడు మార్గమైనా ఫరవాలేదు అనే అభిప్రాయం బలం పుంజుకున్నది సంఘంలో, సామ్యవాదం కలలు కన్న కార్మికరాజ్యం, కర్షక శ్రామిక మేధావుల రాజ్యం రాకపోయినా దేశమంతా కంట్రాక్టర్ల, దళారీల రాజ్యం అయిపోయిందిరా బాబూ అనిపిస్తోంది.

## బియ్యంలో రాళ్ళా లేక రాళ్ళ బియ్యమా

ఒక్క నెయ్యి మాత్రమే దుర్వాసన వెయ్యటం కాదు. బియ్యం ఇతర పదార్థాల సంగతి తలచుకుంటే గుండె గుభేలుమనాల్సిందే. బియ్యం సైజులో తెల్లటి పలుగురాళ్ళు ఒక బస్తాకు కిలో కలిపినా లాభసాటి బేరమే కదా? దీని కోసం రాళ్ళ బియ్యం తయారుచేసేందుకు ఒక ఫ్యాక్టరీ! మన కళ్ళెదుటే మోసం జరిగి పోతోంది. బియ్యం తెల్లగా పాలిష్ కావటానికి ఒక విధమైన పలుగురాళ్ళ పొడితో కలిపి మరపడితే అవి మరీమరీ తెలుపెక్కుతాయి. అవి కావాలనుకొనే వాళ్ళకు ఈ పద్ధతిలో తయారుచేస్తారు. నిజానికి పాలిష్ తక్కువ బియ్యంగానీ దంపుడుబియ్యం గానీ తింటే మనకు ఈ నరాల బలహీనతలు, చురుకు పోట్లు కాళ్ళ పీకుళ్ళు వెన్ను తీపులు, ఇంకా రకరకాల వ్యాధుల బాధలు రావు కదా? ఎవరు వింటారు? అసలు రోగాలను ఉత్పత్తి చేయటమే మన ఇప్పటి ఆహారపదార్థాల ముఖ్య ప్రయోజనం అనుకుంటాను. అంతగా పాలిష్ చేయకూడదు బియ్యం అని ఒక చట్టం ఎందుకు చేయదో ఈ ప్రభుత్వం అనుకుంటాను. సున్నమంత తెలుపుగా అన్నం ఉండాలంటే ఇక అన్నీ రోగాలే. పిలవాల్సిన పని లేదు. వాటంతటవే వస్తాయి. ఇక తక్కిన ఆహార పదార్థాలను గురించి తలచుకుంటె గుండెలో గాభరా పుడుతుంది. తల తిరిగిపోతుంది. కల్తీ చేసేవాడికి కాదు. వాటి వినియోగదారుడికి. మినుములు, పెసలు, కారప్పొడి అన్నీ రెడీ మేడ్‌గా కావాలని కోరుకునే జనాభా పెరిగిపోతున్న కొద్దీ మినుములు, పెసలకు రంగులు, పసుపు కారాలలో గొర్రెలద్దెలు కలుపుతున్నారు. అందువల్ల గుర్రపులద్దె, గొర్రెలద్దెలకు కూడా గిరాకీ పెరుగుతోంది. ఆయా ఆహారపదార్థాలలో సులువుగా మిళితమయ్యే వీటికోసం పరిశోధనలు సాగుతున్నాయి. వెనకటికి ఒక ఇంగ్లీషు వ్యాసకర్త 'త్రిఫ్టు' అంటే పొదుపు అనే

రచన చేశాడు. దాని అర్థం ఇది కాదు. ఈ పెంటపదార్థాలను గురించి కాదు, ఈ విధంగా మానవుడు పెంటపదార్థాలను చెట్లకు వేసివాటి ద్వారా వినియోగించుకోకుండా తిన్నగా తాను తినే తినుబండారాలలోనే కలిపివేస్తున్నాడు. ఇదీ నాగరిక మానవుడి తెలివితేటల బండారం అనిపిస్తుంది.

'బ్రతుకు బజారులో' అనే శీర్షికకర్థం మనకు కావలసిన నిత్యావసర పదార్థాలు, ఆహారసామాగ్రి కలుషితమై మానవుడి మనుగడ కష్టం పాలవుతున్నది బజారు పాలైంది బతుకు అని చెప్పటమేనా ఉద్దేశం. వస్తువుల ధరలన్నీ ఇప్పుడు ఆకాశాని కంటుతున్నాయి. ఆకాశం అంటే అందుకోలేని దన్న అర్థం కాబట్టి ఇంకా అంత ఎత్తున విహరించటం లేదే యీ ధరలు, ధరమీదనే ఉన్నాయి కదా అని వ్యాఖ్యానించేవారిని నెత్తిమీద చూపు పెట్టుకున్నవారని చెప్పవచ్చు వాళ్ళదెప్పుడూ పై చూపే.

మన చిన్ననాటి రోజుల ధరలకు ఇప్పటి ధరలకు సగటు మానవుడి ఆనాటి కోరికలకు ఈనాటి కోరికలకు, అప్పటి ఇప్పటి అవసరాలకు సంబంధమే లేకుండా పోయింది. అందువల్ల ఈనాటి ధరలను గూర్చి అనుకోని ఏం ప్రయోజనం అంటారేమో! ఇంకొక సంగతి ఆనాడూ ఈనాడూ కూడా పల్లెలలోనే నూటికి ఎనభైకి మించి మన జనాభా బతుకుతోంది. బీదరికంలోనే మగ్గుతోంది. పల్లెలనుంచి పట్టణాలకు తరలివచ్చే జనాభా ఎక్కువై నగరీకరణ సమస్యలెన్నో రోజురోజుకు ఎదురవుతున్నాయి. పట్టణాలు మహా పట్టణాలవుతున్నాయి. భూమిమీద 'వత్తిడి' ఎక్కువైంది. గజం, ఇప్పుడు మీటరు అనాలి కాబోలు ఆ రోజులలో పావలా అంటే ఇప్పటి పాతిక నయాపైసల ఖరీదుండేది. ఈనాడు వందలు దాటి వేలరూపాయల ఖరీదైపోయింది. దీనిని బట్టి పట్టణాల మీద జనాభా వత్తిడి ఎంత పెరిగిపోయిందో తెలుసుకోవచ్చు. అయితే ప్రజల కొనుగోలుశక్తి కూడా ఎంత పెరిగిపోయిందో దీన్ని బట్టి అవగతం చేసుకోవచ్చు. ఈ తారతమ్యం ఆనాటి పట్టణాలనూ ఈనాటి పట్టణాలను ఇప్పటి అప్పటి జనజీవన సరళినీ చూసినవారికి బాగా తెలుస్తుంది.

ఆనాటి ధాన్యం పుట్టి అంటే పది బస్తాల లెక్కన విక్రయించేవారు. నేడు క్వింటాలు లెక్కన అమ్ముతున్నారు. పదిబస్తాల ధర నలభై రూపాయలు

మొదలుకొని మెల్లిగా నూరురూపాయలకు పెరిగేటప్పటికే అబ్బ ఎంత మంచి ధర అని రైతు అనుకున్నాడు. ధరలు మండిపోతున్నాయని వినియోగ దారుడనుకొన్నాడు. ఇప్పుడు చూస్తే బస్తా ధాన్యమే రెండు వరొదల రూపాయలకు పైగా పెరిగింది. సర్వసాధారణంగా బియ్యం ధర అయితే 2 వందల నుంచి 7 వందలపైనే ఇప్పుడు పలుకుతోంది. ధాన్యం ధర ఎంతపెరిగినా రైతుకు వ్యవసాయ ఖర్చులు గిట్టుబాటు కావటం లేదనే బాధ మాత్రం తప్పటంలేదు సామాన్య సంసారి ఎంత జీతాలు పెరిగినా ధరలు ఆకాశాన్ని అంటి అప్పుడు 50 రూపాయలకు లభించే నిత్యావసర వస్తువులు ఇప్పుడు 500 అయినా చాలక చేతిలో పైసా మిగలక గిజగిజలాడుతున్నాడు. మార్కెటులో ఉత్పత్తి ధరలకు కొనుగోలుధరలకు సమన్వయం ఎట్లా కుదర్చటమో తికమకపడుతూ మేధావుల చర్చావేదికల గంభీర సంభాషణలు, చాటింపులూ వింటూ ఉంటే నవ్వు వస్తుంది.

నా చిన్నతనంలో మా నాన్నగారికి ఎలిమెంటరీ స్కూలు మాస్టరుగా నెలకు 35 రూపాయలు వచ్చేవి. అయితే ఈ జీతంలోనే 5 రూపాయలు మిగిలేవి అంటే ఈ తరంవారికి ఆశ్చర్యం కలిగవచ్చు. అసలు ఏ దేశంలో అయినా ప్రజలకు ముందుగా కావలసింది చౌకగా లభించే నిత్యావసర వస్తువుల సరి అయిన పంపిణీ ఏర్పాట్లు. అదే శ్రేయోరాజ్యపు ప్రధానధ్యేయంగా ప్రథమ కర్తవ్యంగా ఉండాలి ఈ ధరలనెవరూ అదుపులో పెట్టలేరా? ఈ వ్యాపార రంగంలో చాలాభాగం దళారీల పాలుకావటం వల్లనే దగావ్యాపారం వృద్ధిచెంది, నల్ల ధనం వేలు, కోట్ల కొద్దీ తెల్లబజారులో మన కళ్ళముందే భయంలేకుండా స్వేచ్ఛగా చిందులు తొక్కుతున్నది. సగటు మానవుడు బతుకు వెళ్ళదీయడానికి పెనుభారంగా మీదికి విరుచుకొని పడే భూతంగా తయారైనాయి ఈ ధరలు. అందువల్ల ఈ ఉత్పత్తి – పంపకం విధానాలు రెండూ జాతీయం చేయడం అవసరమేమోననిపిస్తున్నది. అంటే ప్రతి వ్యక్తికీ కనీసం తిండీ గుడ్డా వుండటానికీ ఏదో రకమైన ఇల్లు అయినా మన ప్రణాళికలలో ధ్యేయం కావాలి. అది మొదటి మెట్టు కావాలి. లేకపోతే ప్రణాళికలు వేసే మేధావులు ఎన్నాళ్ళు శ్రమపడ్డా అదంతా వృథా అవుతుంది. ఇప్పటికే ఈ విషయంలో చాలా జాప్యం జరిగింది. మన స్వరాజ్యానికి 45 సంవత్సరాలు వచ్చాయంటే ఇంకా కనీస

సౌకర్యాలు కూడా సమకూరకపోతే ముందు ముందు కోటీశ్వరుడు మొదలు కూలి వాడి వరకూ అవస్థలపాలు గావలసిందే. ఎవడూ బంగారాన్ని అయితే మింగలేడు కదా? అందుకే లక్షాధికారైన 'లవణమన్నమెగాని మెరుగు బంగారంబు మింగబోడు' అన్నాడు శతకకర్త.

మనలో మనసులో మాలిన్యం, కాపీనం, స్వార్థపరతః తెలియకుండా పెరిగేవికావు. తెలిసి తెలిసి మనను ఆక్రమించుకొనే దోషాలే అవి. అందువల్ల ఈ దృక్పథానికి విరుగుడుగా సంఘంలో మనో పరిపక్వతకూ విజ్ఞాన వికాసానికీ ఉపకరించే విద్యా విధానం ఉండాలంటారు. అదే నేడు శూన్యం మనకు. శూన్యం నుంచి శూన్యానికా ఈ ప్రయాణం అనిపిస్తుంది, నేటి విద్యా విధానంలోని తర్కా-వితర్కాలు లొక్కిసలాటలు చూస్తుంటే. అసలు విద్యావిధానమే పెద్ద వ్యాపారంగా తయారైంది. సంఘంలో ఒడిదుడుకులు లేకుండా ఉండాలంటే నైతికవిలువలు పెంచే విద్యా విధానం కావాలి.

## ఆకాశంలో ఏనుగులు ఎగిరేకాలం

సగటుమనిషి బతుకు బజారున పడకుండా ధరలు అదుపులో పెడదామని ప్రభుత్వం ఎంతైనా ప్రయత్నిస్తున్నది. కాని దొంగ బజారులు, గుప్తధనం కూడా పెరుగుతూ ప్రభుత్వ ప్రయత్నం వృధా అవుతున్నది. మానవుడికి వక్రబుద్ధి కలగనే కూడదు కాని కలిగితే మార్చటం బహుకష్టమంటారు. కుక్కతోక వంకర సరిచేయడం లాంటిదే అది. వాళ్ళు దీర్ఘకాలిక ప్రయోజనాలను చూడలేరు. ఇదీ కాక అధికారం సాగించే కొందరు ఈ గుప్తధన యజమానులకు మద్దతుగా కూడా ఉండటంతో ఈ సమస్య మరింత జటిలమై పోతున్నది. 'కనకపు సింహాసనమున శునకమున కూర్చుండబెట్టి...' అన్నట్లవుతున్నది ఈ బడానాయకులు, అధికారుల ప్రవర్తనలు చూస్తుంటే ఇటు వంటి వక్రబుద్ధులు ఈ తరంలోనే అనిగానీ ఈ ఒక్క యుగంలోనే అని కాని పుట్టారనుకోవడానికి వీల్లేదు. వీళ్ళు ప్రతియుగంలోనూ ఉన్నారు. పురాణకాలంలో వీళ్ళనే రాక్షసులన్నారు. కుక్క కాటుకు చెప్పుదెబ్బ లాగానీ వాటిబారిన పడితే మానవులకే పిచ్చి ఎత్తి జలస్పర్శ భయం (హైడ్రోఫోబియా)తో విలవిలలాడి చనిపోతారనీ అనుభవంలో తెలుస్తూనే

ఉన్నది. కాబట్టి కుక్కలకు పిచ్చెత్తకుండా ముందు జాగ్రత్త చర్యలు తీసుకొని వాటికి ఇంజెక్షనులివ్వాలి. అప్పుడే బజారు ధరలు అదుపులో ఉంటాయంటారు పెద్దలు.

ధరలతో పాటు కల్తీల విషయంలో కూడా తగిన జాగ్రత్త వహించాలి. పూర్వకాలంలో కొనుగోలుదారులుండేవారు కారు. ఇప్పుడు ఎన్ని కల్తీలతో కొనుక్కున్నా ఇంకా నిత్యావసరవస్తువులకు లోటుగానే ఉంటూ ఉంది. సుఖం, సౌకర్యం పెరిగాయనుకోవడమే కాని దానితో మానవుడిలో సంకుచితత్వం, దానవత్వం కూడా పెరుగుతున్నాయి. ఇది సంఘానికి క్షేమమో, క్షామమో తెలియటంలేదు.

ఇద్దరు స్నేహితులు తెల్లటి చొక్కాలు వేసుకుని బజారులో పోతున్నారుట పైన ఎగురుతున్న పక్షి వాళ్ళ నెత్తిన లప్పెడు రెట్ట వేసిందట. 'ఛీ వెధవ పక్షి చూసి చూసి మన నెత్తినే రెట్టవేయాలా? అన్నాడుట అందులో ఒకరు. అప్పుడు రెండో అతడన్నాడుట. 'అంతవరకు సంతోషించు, ఇది కలికాలం. ఇంకా ఏనుగులు కూడా ఎగరటం మొదలుపెట్టలేదు. అవే ఎగురుతూ లద్దెలు వేస్తే మన నెత్తి పగిలి ఉండేది అని ఈ విధంగా ఏనుగులు ఎగిరి రెట్టలు వేయటం లేదు అని సంతోషించాల్సిన కాలంలో జీవిస్తున్నారు సామాన్య ప్రజలు ఇప్పుడు. ఆ కాలం కూడా వచ్చే సూచనలు వున్నాయి!

'ధరలు ప్రపంచమంతా పెరిగాయి. పెరుగుతున్నాయి. డాలరు విలువా పడిపోయింది. ఒకప్పుడు ప్రపంచాన్నంతా ఏలిన 'పౌండు' విలువా పడిపోయింది. అనుకోవటంలో సంతోషపడాల్సింది ఏమీలేదు. మనది శ్రేయోరాజ్యం కాబట్టి సగటు మానవుణ్ణి పట్టించుకోవాలి. నూటికి 35 మంది ఇంకా దారిద్ర్యరేఖ దిగువనే జీవిస్తున్నారు మనదేశంలో. రెండుపూటలా వాళ్ళకు తిండితిప్పలు కూడాలేవు. ఒకపూట తింటే ఒక పూట తినక వాళ్ళు జీవితాలు గుదిబండలా ఈడుస్తున్నారు. వీళ్ళ పరిస్థితి ఎప్పుడు మెరుగవుతుందంటే గుత్తదారుల, దళారీల ఆధిపత్యం వ్యాపారరంగం నుంచి తొలగినప్పుడే! ప్రతివ్యక్తికీ తిండి – గుడ్డ – గూడు సంగతి పట్టించుకోవాలి ప్రభుత్వం. అప్పుడుకాని మనది నాగరిక సమాజం అని చెప్పుకొని తలెత్తుకోలేం. ఎన్ని ప్రణాళికల గూర్చి ప్రసంగించినా, ఎన్ని వనరులు

చేకూర్చినా, ఎన్ని పథకాలు ప్రవేశపెట్టినా మన గమ్యం ఎంతో త్వరగా చేరితే కాని వీటివల్ల కలగాల్సిన ఫలితం కలగదు.

"ఆలస్యమమృతం విషం" అన్నారు పెద్దలు. మన ప్రయత్నాలన్నీ అమృతం పంచడానికి కాని విషం విస్తరించడానికి కాదు కదా? అందువల్ల మన ప్రయత్నాలు త్వరితగతిని సాగాలి. దేశంలో మేధావులు, ఆలోచించగలవాళ్ళు, దేశ హితం, ప్రజాహితంకోరేవాళ్ళు, ఇతరులను తప్పుపట్టటం, నిందించటంతో తృప్తిపడకుండా మన బాధ్యతను విస్మరించకుండా కర్తవ్యాన్ని మనం కూడా తలదాల్చి స్వశక్తి లోపంలేకుండా పయనం సాగిస్తే మనగమ్యాన్ని త్వరగా చేరగలుగుతాం.

అప్పుడే ఏనుగులు కూడా ఎగిరి రెట్టవేసి మన నెత్తిపగిలే కాలం తప్పుతుంది !

# XXIX

# మా తాతలనాటి మద్రాసు

# MADRAS OF OLDEN DAYS

The population of Madras in 1915 may be about Two to three lakhs. In 1935 it is about five lakhs. Now 1991 it is about sixty lakhs The Marina Beach, Theosophical Society of Adyar, the residential places of Washermanpet, Mint Street, Triplicane, Mylapore were famous. The peculiarity of the dress of the gentry and cheap local communication of horse Carts and buses described.

మా తాతగారి మద్రాసు నేను పుట్టిన సంవత్సరం, 1915, నాటిది. మరి నాకు తెలిసిన మద్రాసు 1935 నాటిది. అప్పుడు నేను మద్రాసులో వైద్య విద్యార్థిగా ప్రవేశించిన రోజులు. మరి 1931లో కూడా మా నాన్నగారికి ఉబ్బసం వ్యాధికి ఎవరో 'పర్మనెంటు క్యూర్" ఇస్తున్నారంటే కాపురం పెట్టి మందు పుచ్చు

కున్నప్పుడు కూడా వెళ్లాను. కాని, అది తాత్కాలికం. మరినేటి, 1991 నాటి, మద్రాసును గురించి వేరే చెప్పనక్కర్లేదు. అది నాదే అనిపించింది.

1935 నాటికే మద్రాసు జనాభా అయిదు లక్షలేమో. మద్రాసు రాష్ట్రంలో మద్రాసే పెద్ద పట్టణం. చెన్న పట్టణం, అని కూడా తెలుగు వారు వాడుకగా చెప్పేవారు. 'చెన్నప్ప' అనే పల్లెరాజు బ్రిటిషు వారికి పట్టం గట్టాడని అందుచేత మద్రాసు అసలు పేరు 'చెన్నప్ప పట్టణం" లేక చెన్నపట్టణం' అని తెలుగువారు చెబుతూ 'మద్రాసు మనదే' అనే నినాదం 1950-51 లలో, మనకు ప్రత్యేక రాష్ట్రం కావాలని ప్రదర్శనాలు చేసేటప్పుడు, అనేవారు. 'చెన్నపట్టణం', 'మద్రాసు' అనే రెండు పదాలూ వాడుకలో వుండేవి. మరి ఇప్పటి చెన్నపట్టణం జనాభా అరవయి లక్షలుదాటింది. మద్రాసులో ఎప్పుడూ అరవ వారి తరువాత తెనుగు వారిదే ఎక్కువ జనాభా వెనక్కి తిరిగి చూస్తే 1915 నాటి జనాభాఎంత వుండేదో వూహిస్తే, బహుశా 2-3 లక్షలుండేదేమో అనిపిస్తుంది.

1935 నాటికే వూరు పలచగా వుండేది. మేం 'రాయపురం మెడికల్ స్కూలు' తరువాత పేరుమారింది 'స్టాన్లీ మెడికల్ కాలేజి' (Stanley Medical College) వున్న ప్రాంతం రాయపురంలో వుండేది. పరిసరప్రాంతాలుగా 'వాషర్‌మన్ పేట' (Washer man pet) 'తొండియారు పేట' ఇటు 'మింటు స్ట్రీటు' ఉండటం చేత జన సమ్మర్దం ఎక్కువగా వుండేది. ఊరి మధ్యన హైకోర్టు, 'లా కాలేజి', క్రిష్టియన్ కాలేజీ, పచ్చయప్ప, 'పారీస్ కార్నర్ (Parry's Corner) బ్రాడ్వే (Broad way) మొదలైనవి ప్రసిద్ధ ప్రాంతాలుగా వుండేవి.

సముద్రపు ఒడ్డుగా 'ట్రిప్లికేన్' (Triplicane) తిరువల్లిక్కేణిని 'తిల్లగేణి" అని వాడుక భాషలో అనేవారు, విశాలంగా మైలాపూరు, మరి కొంచెం దూరం పోతే "శాంథోమ్' (Santhome), అటు పైన 'అడయారు' అక్కడి "తియసాఫికల్ సొసైటి" (Theosophical Society) వుండి, చూడదగ్గ ప్రదేశాలుగా వుండేవి. ఇప్పుడు జనసమ్మర్దమయి వున్న ఇప్పటి డాక్టరు రాధాకృష్ణన్ రోడ్డు చివర "ఎడ్వర్డు ఇలియట్సు బీచ్ (Edward Elliots Beach) మొదలైన ప్రదేశాలన్నీ నిర్మానుష్యంగా 1935 నాటికే వుండేవి. అడయారు దాటితే పంచవటి అనే వారు. ఆ ప్రాంతాలన్నీ "గాంధీనగర్" అని, తియసాఫికల్ సొసైటీ పక్కనే, ఆ

పైన 'లాల్ బహద్దూర్ నగర్ "ఇందిరానగర్"ల వంటి ఎన్నో కాలనీలు, ఈ పెరిగిన అరవయి లక్షల జనాభాకు, పెరిగిన పారిశ్రామిక కేంద్రాలకు, చోట్లు ఇచ్చాయి.

మళ్ళీ మనం పాత చెన్నపట్టణానికి పోదాం,, మేం 'మింటు స్ట్రీట్' పక్కనున్న వెంకట రామయ్యర్" వీధిలో వుండే వాళ్ళం, చదువుతుండే రోజులలో. తరువాత, తరువాత, స్టాన్లీ మెడికల్ కాలేజి హాస్టలులో చేరాం- "మింటు స్ట్రీటు వేశ్యా వాటిక, వేశ్యాగృహాలకు ఆలవాలమయి వుండేది-. 'మింటు స్ట్రీటుకు' సాయంత్రం వెళ్లాడంటే, ఏదో తమాషా కోసం వెళ్ళాడురోయ్ అని వెక్కిరించవచ్చు! అదంతా ఇప్పుడు సంసార పక్ష నివాసాలుగా మారి పోయింది. ఆయా వృత్తులు కూడా వృత్తిగా లేక వ్యక్తిగత వినోదాలుగా మారిపోయాయి! .

ప్రయాణ సౌకర్యాలకు మనుషులు లాగే రిక్షాలు, 'ట్రాములు' (Trams), ప్రయివేటు బస్సులు, జట్కాలు విరివిగా వుండేవి, కార్లు ధనిక వర్గానికి మాత్రం వుండేవి. అన్నీ దిగుమతి చేసుకున్న కార్లే, చిన్న చిన్నవిగా వుండే 'ఆస్టిన్', 'బేబీ ఆస్టిన్ (Baby Austin) కార్లు వాడకంలో వుండేవి. బస్సులన్నీ ప్రైవేటు రంగాల్లో వుండేవి. ఇప్పటి బస్సులకున్నట్టు పక్క తలుపులు లేవు. అన్నీ వరుసగా సీట్లు వేసి కూర్చుంటే బహి రంగంగానే వుండేవి. బస్సువాళ్లు, తిల్లగేణి మైలాపూర్ అని, కేకలు వేస్తూ, జనాభాని ఆహ్వానించేవారు, నేటికి మల్లే తొడతొక్కిడి, వేళ్లాడుతూ చేసే ప్రయాణాలు, లేవు అప్పుడు. ఎక్కడికి పోవాలన్నా కొద్ది అణాలలో (రూపాయిలో పదహారో వంతు అణా) ఎంత దూరమయినా, చేతి రిక్షావాడు, జట్కావాడు, ట్రాము వాడు తీసుకుపోయేవారు. ఈ ట్రాము కంపెనీ దొరల చేతుల్లో వుండేది. స్వరాజ్యం వచ్చిన తరువాత, దొరలు ఈ కంపెనీలు మూసేసి ఇంగ్లండు వెళ్లిపోయారు. బస్సులు విరివిగా వచ్చిన తరువాత మద్రాసు ట్రాము పట్టాలు కూడా పీకేశారు, మూసేశారు. ఒక అయిదు రూపాయలు ఇస్తే ఆ నాడు ట్రాము ప్యాసు (Pass) తోటి నెలంతా, తిరగవచ్చు. ఆఫీసులకు వచ్చే వారికి ఇది చాలా సౌకర్యంగా వుండేది. తరువాత 'ఎలక్ట్రిక్ ట్రైను' పాసులు కూడా చాలా సౌకర్యంగా వుండేవి. ఇప్పుడు, ఈ ప్రయాణ సౌకర్యాలన్నీ కొన్ని రూపాంతరాలు కూడా పొందినాయి. టాక్సీలు,

ఆటోలు, ప్రతి వారికీ కార్లు, స్కూటర్లు మొదలైన ఆధునిక సౌకర్యాలు ఏర్పడ్డయి.
అందుకే

'బస్సు పుట్టిందోయి బాబు,
బస్సు పుట్టింది. బస్సు పుట్టి,
బళ్ళ వాళ్ల కడుపు కొట్టిందోయ్
నోరు కొట్టిందోయ్ ' అని సహజకవులు ఆనాడుపాటలు వ్రాశారు

1915 నాటికి కార్లు అంతగా లేవు – గొప్పవారందరూ 'గుర్రపు సార్టు"ల మీదనే పోయేవారు. ఇంకా గొప్పవారయితే "రెండు గుర్రాల సార్టు" మీద దర్జాగా పోతూవుండేవారు. ఆ గుర్రాలు కూడా స్తోమతును బట్టి నిగనిగలాడుతూ అందంగా వుండేవి. ఇప్పుడవన్నీ అంతరించిపోయినాయి.

ఇప్పటి మద్రాసును, అప్పటి చెన్నపట్టణంతో పోలిస్తే ఒక పెద్ద పల్లెలా వుండి వుండాలి, ఒంటెద్దు బళ్లు, ఒంటరిగా తోలే 'గుర్రపు బగ్గీ' బళ్లు విరివిగా వుండి వుండాలి. చాలా మంది కాలినడకనే, నాలుగయిదు ఏడెనిమిది కిలో మీటర్లు సునాయాసంగా నడిచి పోయేవారు, 'ట్రిప్లికేన్' (Triplicane) నుండి హైకోర్టు వరకూ నాలుగు అణాలు ఇస్తే, నలుగురిని ఎక్కించుకుని గుర్రంబండీ మీద తీసుకు వచ్చేవాడు. అదీకాక, మా మిత్రులు ఖాసాసుబ్బారావుగారు, స్వరాజ్య పత్రికలో, టంగుటూరి ప్రకాశం గారి దగ్గర పని చేసే రోజులలో, ట్రిప్లికేన్ (Triplicane) నుండి, బ్రాడ్వేలో వున్న (Broadway) ఆఫీసుకు, చిన్న అన్నండబ్బా తీసుకుని, నడిచి వచ్చే వారుట ఆ రోజుల్లో, అంటే జట్కాకు ఆ అణా కూడా లేకుండా పనిచేసి, ఎంత ప్రముఖ సంపాదకులయ్యారో చూడండి. ఆనాటి వారి కష్టాలు ఈనాటి వారికి ఎలా తెలుస్తాయి. ఇదీ ఆనాటి ప్రయాణ సౌకర్యాల ముచ్చట.

## ఆనాటి పెద్దల దుస్తులు

మళ్లీ మనం 1915 నాటికి పోతే వూరిలో వ్యాపారస్తులలో పెద్దలు, ఇతర ధనిక వర్గాలవారు, వేసిన దుస్తులు పరిశీలిస్తే తమాషాగా వుంటుంది. ఇహసలే, బీదవారు, ఒక "ముండు", 'తుండు' వేసుకు తిరిగే వారని వేరే చెప్పనక్కర్లేదు.

మన తెనుగు వారైనా వైశ్య కుటుంబీకులు, వారిని 'చెట్టి' (Chetty) లేక 'శెట్టి' అనేవారు. ఇప్పుడు చాలా చోట్ల 'గుప్త' అనే మాటను ఉపయోగిస్తున్నారు. ఆ తరగతికి చెందిన వారంతా పెద్ద జరీ అంచుపంచెలు, బిళ్ల గొచీ వేసుకుని, కట్టేవారు, మరి కొంచం 'తోకగోచీ కూడా పెట్టే వారనుకుంటా, చొక్కా, లోపలకు తోసి, పంచ కట్టేవారు ఆ చొక్కాకు, ప్రత్యేక 'కాలరు' (collar) వుండి, దాంట్లో 'నెక్టై' (Neck Tie) వేసేవారు. ఆపైన జరీ మడతలతో తలపాగా, టోపీగా చుట్టి వెనకను ముడి వేసి, జరీ అంచు పైకి వచ్చేలా చుట్టి ధరించేవారు. దానిని సాయంకాలం ముడత నలగకుండా, తీసి పెట్టి మళ్లీ మరునాడు వుపయోగించేవారు. అందంగా పంగనామాలు, క్రింది పాదంతో వైష్ణవ సాంప్రదాయం సూచిస్తూ నుదుటి భాగంలో పెట్టుకునే వారు. ఓపెన్ కాలర్ కోటు, లోపల వెయిస్టుకోటు (Waist Coat) కింద మేజోళ్ళు బూట్లు, వేసి, వస్త్రా లంకరణ పూర్తి చేసేవారు. సగం, దేశీయ పద్ధతిలో పంచె, తలపాగా, రెండో భాగం పాశ్చాత్య పద్ధతిలో ఓపెన్ కాలర్, లాంగ్ కోటు, వేస్టుకోటు, టై, క్రింద 'మేజోళ్ళు, బూట్లు, వేసుకునేవారు. ఇప్పటికీ అలా వేసుకునే పెద్దలు కొంత మంది అక్కడక్కడ వున్నారు. ఇదంతా చూస్తే ఈనాటి యువతరం వారికి అదో "పగటి వేషం" అనిపించవచ్చు. ఆ రోజుల్లో లాయర్లంతా అదే మాదిరి డ్రస్సు వేసుకుని కోర్టులకు హాజరయ్యేవారు! మా తాతగారు, రంగారావుగారు, మా నాన్నగారు వారి పద్ధతిలో, తలపాగా బదులు పొడుగుటోపీ పెట్టేవారు. ఇదీ ఆ నాటి వేష భూషణలు. ఈ గంగిరెద్దు వేషంలో భాగంగా, ఒక బిళ్ళా మడతా జరీ అంచులు పైకి మెరుస్తూ వుండే పొడుగాటి ఉత్తరీయం మెడచుట్టూ వేసుకునేవారు.

మన అదృష్టమా అని, తరువాత గాంధీగారు వచ్చి, అందరికీ పంచా లాల్చీ గాంధీటోపీ ఒరవడి పెట్టారు. మరీ, రెండో యుద్ధమయిన తరువాత, అమెరికా సంపర్కంలో, ప్యాంటు, 'బుష్కోటు' ప్రసాదించి, మనవాళ్లని, బ్రిటిషు వారి దుస్తుల ఆచార వ్యవహారాల నుంచి చాలా విప్లవాత్మకంగా మార్చేశారు. ఇంగ్లండులో బ్రిటిషువారినే మార్చేశారు. ఈ దుస్తుల పట్టింపు విషయంలో ఆర్థికంగా గొప్పవారు, జమీందార్లు, శ్రోత్రియం దార్లు అయినవారు, వూళ్ల

# XXX

# ఆంధ్రుడంటే 'గోంగూరా'!

# IS GONGURA SYNONOMOUS WITH ANDHRAS

"GONGURA" is the nick name and a sarcastic appellation for Andhras 'SAMBAR' is just the same for the Tamils. I realised that Andhras like gongura (Sour spinach) very much, only after going to Madras - All of us were called "Madrasis" by the Northeners. Only after the linguistic state was fomed, Andhra has established a seperate identity

Differences in our food habits are too apparent between Andhras and Tamils Even the tastes between those of my father, who belonged to Krishna District, and my mother who belonged to kakinada, of East Godavari and Madras, there were obvious differences which have been inherited by us

నేను మద్రాసులో చదువుకోటానికి వెళ్లే వరకు, అరవవారంతా, సాధారణంగా 'గోంగూర'! అంటే "ఆంధ్రు"నకు లేక "తెలుగు" వారికి పర్యాయ

పదంగా వాడేవారని నాకు తెలియదు. అరే పోడా గోంగూరా! అరే పోడా సాంబార్! అని, ఒకరిని, ఒకరు వేళకోళంగా తేలికగా నవ్వుతూ కూడా నిందించుకునేటప్పుడు వుపయోగించే పదాలుగా వుండేవి. మద్రాసు కెళ్ళిన తర్వాత ఆంధ్రులకు "గొంగూర" అంటే అంత ఇష్టమని తెలిసింది!

ఆంధ్రులను కూడా వుత్తరాది వారందరూ"మద్రాసీ" (Madrasee) అనే పిలిచేవారు. మనమంతా ఉమ్మడి రాష్ట్రంలో వుండటంచేత, ఆంధ్రులకు ప్రత్యేకమయిన వ్యక్తిత్వల లేకుండా పోయింది! మనకు ఆంధ్ర రాష్ట్రం వచ్చిన తరువాతగాని, మనమూ ఒక వేరే భాషా ప్రాంతం వారమని ఉత్తరాది సోదరులు గుర్తించ లేదు. నిజం చెప్పాలంటే, ఆంధ్రప్రదేశ్‌లో. కాంగ్రెసు ప్రభుత్వంపోయి, ఎన్.టి.రామారావు నాయకత్వంలో "తెలుగుదేశం" ప్రభుత్వం వచ్చి, తెలుగు, తెలుగు, అని ముఖ్యమంత్రిగా రామారావు ఎలుగెత్తి మనజాతి ప్రత్యేకతను తెలుగువాడి ఆత్మగౌరవం గురించి ఢిల్లీలో ప్రచారం చేసిననాడే మన తెలుగు వ్యక్తిత్వం 'ప్రత్యేకత, ఉత్తరాది వారికి తెలిసింది. అరే ఎవడురాయీ వీరుడు, ఎంతో కాలం నుంచి పాతు కుపోయిన కాంగ్రెసును తన పార్టీని స్థాపించిన కొద్ది నెలల్లోనే (అనగా 9 నెలల్లోనే) ఓడించాడు! అని, ఉత్తరాది ప్రజలు ఆశ్చర్యంతో చూడసాగారు. "తెలుగుదేశం" గెలవడానికి అనేక కారణాలు, అందులో కాంగ్రెసు నాయకత్వం, ఆంధ్రలో నాయకత్వాన్ని చదరంగం ఆటలోని పావులులాగా అటు తీసి ఇటు, ఇటు తీసి అటు, ముఖ్యమంత్రులను మార్పు చేయడం, అది కాంగ్రెసు నాయకులు మరోదారిలేక సహించినా, సామాన్య ప్రజల హృదయంలో శూలంలా గుచ్చుకొని, ఒక కొత్త పార్టీ కనిపించగానే, దానిని, తమ ఆత్మ గౌరవాన్ని ప్రతిబించించేదిగా భావించి, ఓటు చేశారు! ఎన్నుకుని ఆనందపడ్డారు, వందేళ్ల ప్రజల హృదయాలను ఆకట్టుకుని, స్వాతంత్ర్యానంతరం, ముప్పదిఅయిదు సంవత్సరాలు ఏకఛత్రాధిపత్యంగా ఏలిన కాంగ్రెసును ఓడించగల ఘనత, (Credit) సినిమా నటుడు శ్రీ నందమూరి తారకరామారావు గారికే దక్కింది. అది, తరువాత మరో ఏడు సంవత్సరాలు తిరగగానే తిరిగి మరుగున పడిందనుకోండి . ఈ సమీక్ష ఎవరెందుకు ఓడిపోయారు ఎందుకు గెలిచారు అని నిర్ణయించటానికి కాదు. అది రాజకీయ శాస్త్ర (Political Science) వేత్తలపని. అయితే, 'ఆంధ్రస్టేట్',

ఆంధ్రప్రదేశ్ వచ్చిన తరువాత, "తెలుగు" అనే పదానికో ప్రాముఖ్యత అత్యధికంగా తెప్పించిన వాడు, శ్రీ రామారావు అనడానికి సందేహంలేదు. పార్టీ పేరే "తెలుగుదేశం" అని ఆయన పెట్టినప్పుడు, ఇదేమి పార్టీ పేరని చాలామందిమి అనుకున్నాం. అయితే ఏ పదమయినా, వుపయోగించగా, వుపయోగించగా, అదే వాడుకలోకి వచ్చి ఒక అర్థంతో మనస్సులో మిగిలిపోతుంది. ఆంధ్రుడంటే, గోంగూరేకాదు మరో కొన్ని ఇతర అభిరుచులు కూడా వున్న వారని అందరికీ తెలిసి వచ్చింది!

మరో కారణం, మన నాయకులెవరూ, జాతీయ స్థాయికి పోగల సామర్థ్యంవున్నా, అంతా రాష్ట్రనాయకులుగానే మిగిలిపోయారు – మనలో కూడా గుంటూరులో వున్న ఉన్నవ లక్ష్మీనారాయణగారు, నడింపల్లి నరసింహరావుగారు, అంతా నెహ్రూలాగ లండనులో చదివిన బారిష్టర్లే (Barristers) అయినా, వారుగాని, టంగుటూరి ప్రకాశంగారుగాని, జాతీయ రంగంలో ప్రవేశించలేదు. అందుచేత చాలాకాలం మనం 'మద్రాసీయులు (Madrasies)గా మిగిలిపోయాం ఉత్తరాది వారి దృష్టిలో!

## ఆహార విహారాలలో తేడా!

ఆంధ్రులకు పచ్చళ్లు ముఖ్యం. కారం ఎక్కువగా తింటామని, నెయ్యి పోసుకుంటామని ప్రతీతి. నిజమే ప్రతి ముద్దకూ నెయ్యి ధారాళంగా కావాలి మనకు, భోజన క్రమంలో కూడా, ముందర పప్పు, అందులో నంజుకోటానికి పులుసులు, పచ్చళ్లు, తరువాత కూర, పచ్చడి, చారు లేదా పులుసు. ఆఖరిని పెరుగు వుండాలి. ఇవన్నీ వరుసగా తినవలసి వచ్చిన ఒక అరవ మిత్రుడు 'అరే డాక్టర్! గుంటూరులో మీ ఇంట్లో భోజనానికి వెళ్లా "ఉండ" తరువాత "ఉండ" తిని తిని, తరువాత చారు, సాంబారికి వచ్చా, నా గొంతంతా మింగలేక పట్టుకుపోయిందని, మద్రాసు వచ్చిన తరువాత నాతో నవ్వుతూ ఫిర్యాదు చేశాడు. మా అరవ మిత్రుడు ఒకరు, అరే "కలుపు కోటానికి రసం ("పెసిందికిరతుకు రసం") నంచుకోటానికి అప్పడం (తొట్టుకొరతుకు అప్పలం ఇరుందా పోరుండా) వుంటే చాలురా" అని అనే వాడు. "అయితే, మీ వూరగాయి బాగుంటుంది" అని లక్ష్మీ! ఒక సీసాలో పెట్టి ఇవ్వు అని మా ఆవిడను అడిగి తీసుకు వెళ్లేవాడు!

ఒక అరవ మిత్రుడు, ఇంట్లో ఒక పెద్ద హార్లిక్సు సీసాడు ఎండు మిరపకాయలు ఒక నెలంతా సరిపోతయి' అని, చెప్పాడు. అవన్నీ మాకు, ఒక పూట గోంగూర పచ్చడి లోకి సరిపోవు' అని నేను అతనికి చెప్పా. ఇవీ మన దక్షిణం, ఉత్తరం వారి ఆహారపు అలవాట్లు!

మనంకొనే నెయ్యి చూచి ఒక మిత్రుడు, ఏంరా మీరు నెయ్యితో తలంటి పోసుకుంటారా ఏమిటి? లేకపోతే, ఇంత నెయ్యి ఎందుకురా? అని, ఆశ్చర్యాన్ని వెలిబుచ్చాడు. ఇప్పుడు 'కొలెస్టరాల్ ' (Cholesterol) భూతంతో నెయ్యి ప్రతి ఇంట్లోంచీ ఈనాడు అదృశ్యమవుతోందనే చెప్పాలి. ఇలా ఆంధ్రులు నెయ్యి, కారం, ఎక్కువగానే వాడుతారు అనటంలో సందేహంలేదు.

## గోంగూర పచ్చడి అనేక రూపాలు

గోంగూర పచ్చడి ఎంత పాతదయితే అంత ప్రాధాన్యం పొంది, పథ్యానికి పనికి వస్తుందని, వంటికి అంత మంచిదని, కొందరి వూహ. అందులోనూ కృష్ణా గుంటూరు జిల్లాల వారికి మరీను. మా కేతన కొండలో అయితే మూడు కుండలలో లేదా బానలలో మూడు సంవత్సరాలయినా మూలుగుతూ వుండేది గోంగూర, "తాళ్ళ గోంగూర" పచ్చడి, "తాళ్ళ గొంగూర" అంటే నూరక ముందు, ఆకులు తొడిమలతోటి పచ్చిమిరప పళ్ళతో సహా వూరుతూ వుంటుంది. ఒక బాన ఈ సంవత్సరానిది, దానికి ముందుది క్రిందటి సంవత్సరానిది, దానిపైది ఆ క్రిందటి సంవత్సరానిది, ఆ మాదిరిగా గోంగూర పచ్చళ్ళ పూజ జరుగుతూఉండేది. అందుచేత, అక్కడే పెరిగిన మా నాన్నగార్కి అది ఒక అధిదేవతలా వుండేది, పాతగోంగూర పచ్చడి, కొంచం పాత వాసన కొడుతూ వుంటుంది. ఆ వాసనతో కూడిన పచ్చడంటే మా నాన్నగార్కి ప్రాణం (ఇష్టం). ఈ సంగతులు ముఖ్యంగా కృష్ణా గుంటూరు జిల్లా వాసులకు, మొత్తం మీద ఆంధ్రులకు ఇవి ఎంత ముఖ్యమో తెలుస్తోంది. ఇప్పుడు స్థిర నివాసాలు తగ్గటంచేత కుటుంబాలలో యీ పాత వూరగాయలు అరుదు అయినాయి. మా నాన్నగార్కి, పాత చింతకాయ పచ్చడి, పాత గోంగూర పచ్చడి, ఉల్లిపాయ, పెసరపప్పులుసు, వుంటే, మరేమీ అక్కర్లేదు అనిపించేవి.

### రుచుల వైరుధ్యం అమ్మ నాన్నగార్లలో!

మా అమ్మగార్కి, నాన్నగార్కి రుచుల వైరుద్యం వుండటం వలన మాకు రెండు రకాల రుచులూ అలవాటయినాయి. అందుకే, తల్లిదండ్రులకు ఏ రుచులు అలవాటయితే, ఆ రుచులే పిల్లలకు కూడా అలవాటుగా వస్తాయి. అని సూత్రీకరించవచ్చు.

మా అమ్మకు బిరుసన్నం, మానాన్నగార్కి మెత్తని అన్నం. కొత్త చింతకాయ గోంగూర మా అమ్మకు అవే ఎంత పాతవయితే అంత ఎక్కువ ఇష్టం మా నాన్నగార్కి చారు అమ్మకు, పప్పులుసు నాన్నగార్కి వేపుడు కూరలు అమ్మకు, ముద్దకూరలు నాన్నగార్కి ఈ మాదిరిగా సరిగ్గా వ్యతిరేకమయిన రుచులు వున్నా, అందరికీ తృప్తి కలిగేటట్లు ఒక పూట ఆ రకం, రెండో పూట మరో రకం, వంటలు చేసి అందరినీ మెప్పించేది, మా అమ్మ. అన్నం రెండు పూటలా ఒకటే రకంగా వండినా, పై అన్నం కొంచెం బిరుసుగా వుంటుంది. అది తీసి వేరే పెట్టి, నాన్నగార్కి క్రింది భాగం అన్నం వడ్డించేది. ఈ విధంగా అన్నంలో వున్న తేడా కూడా అమ్మ సరిజేసి వంటకాలు నేర్పుగా అమర్చేది

### ఆంధ్రుల ఊరగాయలు

ఇహ ఆంధ్రులకు ఊరగాయలు ప్రాణం! ఆవకాయ, మాగాయి తొక్కుడు పచ్చడి, కాయ ఆవకాయ, బెల్లపు ఆవకాయ అనేవి అన్నీ మామిడికాయతో పెట్టే ఊరగాయలు. నిమ్మకాయ, దబ్బకాయ, ఉసిరికాయ ఊరగాయలు, పధ్యానికి పనికి వచ్చేవి. ఎంతో పుల్లగా వుండి, వైటమిన్ సి (Vitamin C) తో ఉన్న వూరగాయలు మనకు అందరికీ ముఖ్యం ఇంకా ఎన్నో రకాల ఊరగాయలు, వంకాయ, ములక్కాడలతో సహా ఊరగాయలు పెట్టే వారున్నారు.

ఈ విధంగా, ఆంధ్రులకు పచ్చళ్లంటే ప్రాణం. చిన్నప్పుడు పచ్చడి లేకపోతే ముద్ద ఎత్తేవాడిని కాదు. ఎన్ని వడ్డించినా పచ్చడి ఎక్కడ అని ప్లేటులోకాని, విస్తరిలో గాని వెతకని ఆంధ్రుడు వుండడు, నేను అమెరికా 1951 వెళ్లినప్పుడు ఎయిరోప్లేన్ లో పోతున్నా, నా లగేజి (Luggage) లో సగం పైగా ఊరగాయలే, అని చెపితే నమ్ముతారా. స్టెతోస్కోప్ Stethe Scope అయినా తీసుకు వెళ్లటం మరిచా గాని, ఊరగాయల సంచి మాత్రం ఏర్పాటు చేసుకోడం మరిచి పోలేదు. అది ఆంధ్రుల అభిరుచికీ, ఊరగాయలకూ ఉన్న అవినాభావ సంబంధం అంతటిది మరి !

# XXXI

# ఆనాటి రైతాంగం

# THE THEN FARMERS

The Economic situation of our peasantry - The land reforms, not yet completed - The absentee landlordism
- Agricultural indebtedness in 1937
- Debt Relief Act by the then Congress Government Under the leadership of Rajagopalachary (C.R)- Own experiences of collection of Rents for our Joint family - No Proper crops. Their honesty to clear their debts - The moving story of a widow who paid 20 years old debt of her late husband. The revised promisary notes including the cost of one revenue stamp.

**కౌలుదారీ చట్టాలు : భూస్వాములు**

స్వరాజ్యం వచ్చి నలభయి సంవత్సరాలుదాటినా ఇంకా భూ సంస్కరణలు పూర్తిగా జరగలేదనీ, అందుకే యీ సాంఘిక, ఆర్థిక వ్యవస్థలలో

ఇప్పుడు మనం కోరుకునే మార్పులను ఎందుకు కోరుకుంటున్నామో తెలుసుకునే ముందు, ఆనాటి రైతాంగపు వ్యవసాయ పరిస్థితులు, ఆర్థిక పరిస్థితులు నెమరేసుకోటంలో ఒక ఆనందం వుంది. అది అర్థవంతం కూడా. అందుకే, నేను ఆ రోజులలోని, పరిస్థితులలోకి మనోవేగంతో పయనమై వెడుతున్నా!

### మాది గుంటూరు జిల్లా, ప్రాతూరు!
### ఆనాటి ఆ ప్రాంతపు పరిస్థితులు

మీదేవూరంటే నాకు సమాధానం చెప్పటం కష్టంగా వుండేది. ఎందుకంటే, మా అమ్మగారిది తూర్పుగోదావరి జిల్లా కాకినాడ. మా అత్తవారు పశ్చిమ గోదావరి జిల్లాలోని ఏలూరు వారు. నేను చదువుకున్నది అంతా హైస్కూలు చదువు వరకు కృష్ణాజిల్లాలోని, ఎలుకపాడు, పెద్ద అవుటపల్లి, గన్నవరం మొదలైన అనేక పల్లెలలో చదువుకున్నా. ఆస్తిపాస్తులు వున్నది. గుంటూరు జిల్లాలో. వృత్తిరీత్యా వున్నదీ, రాజకీయపు చైతన్యంతో వ్యవహరించిందీ, ఇరవయి సంవత్సరాలు ఏకధాటిగా నవయౌవనంలో గడిపిందీ, మద్రాసు మహానగరం. ఇవి అన్నీ నా ఊళ్లే. ఒక్కొక్క దానితో ఒక్కొక్క అనుబంధం; తెగనిది, తెంపలేనిది. అందుచేత, మీదే వూరంటే జవాబు చెప్పలేక, నవ్వుకుంటూ వచ్చాను. నాదే జిల్లాయో మీరే నిశ్చయించుకోండి. అని మిత్రులకు వదిలేసేవాడిని – ఇప్పుడు మాత్రం మాది "ప్రాతూరు". ఆనాటి పరిస్థితులు, మా కుటుంబ వ్యవహారాలతో సహా ఆ ప్రాంతాలవే!

### మా పొలాలు – కౌళ్లు – వ్యవసాయ పరిస్థితులు

మాకు, దాదాపు మా తాతగారి నాటికి 150 ఎకరాలు వుండేది అందులో 1913లో ప్రాతూరుదగ్గిర కృష్ణానదికి గండిపడి మా గ్రామాలకు వరదలు, ముంపు బాధకలిగింది. తరువాత పెద్ద కట్టవేయటం జరిగింది. ఆ వరద కట్ట, ఎన్నో ఎకరాలను చీల్చి, మా పొలమే దాదాపు 70 ఎకరాలు కట్ట క్రిందకు పోయినాయి. మిగిలినది 88 ఎకరాలయినా. ప్రాతూరు వారు ఎప్పుడూ వంద ఎకరాల జమీందారులే! ఆసాములు కాదు! స్వయంగా దున్నాలేదు అజమాయిషీ జమీందారీ అజమాయిషియే.

మా తండ్రుల కాలంలో అంతా వుద్యోగాలకు దేశాల వెంబడి పోవటంచేత అన్ని పొలాలూ కౌలుకే ఇచ్చేవారు. ఉద్యోగాలు మాత్రం అంతా కృష్ణాజిల్లాలోనే అవటం చేత, విజయవాడకు సరిగ్గా అవతల ఒడ్డునే వున్న ప్రాతూరు, ప్రభుత్వ వ్యావహారిక రీత్యా కాకపోయినా జీవన స్రవంతి ననుసరించి కృష్ణా జిల్లాకు చెందినట్లుగానే వుండేది.

మా పొలాలు రైతులకు, సొంత పొలాల్లాగే వుండేవి. ఎన్నడూవారిని తొలిగించే ప్రసక్తి లేదు. రైతులు కూడా మా పొలాలు తరతరాలుగా చేస్తూ వుండేవారు. ఇప్పటికీ, మిగిలిన పొలం కొద్దిదయినా, ఈ కౌలు దారీ చట్టానికి అతీతంగా, మనస్సులు కలిసిన కౌలు దారులుగా వ్యవహరిస్తున్నారు.

నాకు తెలిసిన 1930 నాటికి మా పొలాలన్నింటిలోనూ మెట్ట వ్యవసాయమే, ఎటు చూచినా జొన్న చేలే కనిపించేవి. కొంత మంది రైతులు తమ సొంత పొలాలలో బావులు త్రవ్వి 'మోట' కట్టు నీటితో పసుపు, మిరప, పొగాకు పండించుకునేవారు. స్తోమతలేని వారు, మా బోటి భూకామందుల పొలాలన్నీ జొన్న పంటతోనే నింపేవారు. 1965లో అనుకుంటా "ఆంధ్రరత్న పంపింగు స్కీము" ద్వారా, లిఫ్టు ఇరిగేషన్ వచ్చిన తరువాత, ఆ ప్రాంతమంతా సస్యశ్యామలమయి మాగాణీ భూమి అయి రైతులు ఎంతో ఆనందంగా వున్నారు! అది మా కుటుంబ సోదరుల కృషి ఫలితమేనని ఆ ప్రాంతపు రైతాంగమంతా కృతజ్ఞతతో చెప్పుకుంటూ వుంటారు!

మా పొలాలన్నీ, ప్రాతూరు, గుండిమెడ, చిర్రావూరు, నూతక్కి, గ్రామాలలో వున్న రైతులు చాలా మంది కౌలుకు తీసుకునేవారు. సాధారణంగా అన్నీజొన్న చేలే అనిచెప్పా. భూములు సారవంతమయిన వయినా, నీటి వసతులు లేకపోవటంచేత జొన్న జాతి మెట్ట పంటలే వేసేవారు. ఆ రోజులలో ధరలు కూడా లేవు – పొలాలు సరిగా పండేవికావు – పంటలు సరిగా కాక రైతులు బాకీలు పడి, కౌలు మొత్తాలకు ప్రామిసరీ నోట్లు వ్రాసేవారు – మా తలిదండ్రులు కూడా ప్రతి సంవత్సరం వెళ్లకుండా! రెండు మూడు సంవత్సరాల కొకసారి సెలవలకు గాని, సెలవు లేనివారు సెలవు పెట్టిగాని వేసంగిలో ప్రాతూరు చేరి కౌళ్ల వసూళ్లకు కూర్చునేవారు. ఇచ్చిన వారి దగ్గర పుచ్చుకోటం, లేని వారి దగ్గిర నుండి నోట్లు వ్రాయించుకునే వారు – ఇలా వ్రాసిన నోట్లు , కొన్ని వేల రూపాయలకు, కట్టలు కట్టలుగా కట్టి,

ప్రాతూరులోనే ఒక పెట్టెలో పెట్టి, అక్కడే వదిలేసి వచ్చేవారు. అది ఒక పెద్ద చెక్కతో చేసిన పెట్టె, దానిని సందు వా పెట్టె అనేవారు – ఆ పెట్టె మళ్ళీ అంతా వచ్చినప్పుడే తెరిచేవారు. ఇల్లు ఎవరేనా మళ్లీ వచ్చేవరకూ రెండు మూడు ఏళ్ళు తాళం పెట్టి వుండేది. ఎవరూ లేని ఆ మూసిన ఇంట్లో, పాములూ, గబ్బిలాయిలు, వాసం చేస్తూ వుండేవి. గండు పిల్లికూడా వచ్చేదిట. దొడ్లోను, ఇంట్లో ఒక గదిలో మూల, పాముల పుట్టకూడా వుండేది. ఇలా దాదాపు మళ్లీ మన మెవరేనా వచ్చే వరకూ, మా తండ్రుల తరంలోనే 'పాడు బడ్డ కొంప' లాగా వుండేది. అయినా అన్ని నోట్లు వున్న పెట్టి ఆ ఇంట్లోనే వుండేది. అక్కడ ఉందని తెలిసి కూడా ఏ రైతులూ ఆ నోట్ల జోలికి పోవటం దొంగతనం చేయటం అనేది వుండేది కాదు. కాదంటే, యీనాటి వర్గ చైతన్యం గల తరానికి ఆశ్చర్యం వేస్తుంది. మరి మా రైతులకు "ఎగ్గెయ్య" గారి "నోట్లంటే అంత గౌరవం. అవి వారిని ఏ విధంగానూ బాధించేవి కావని, అవి ఏ కోర్టు ముఖమూ చూడవని వారికి నమ్మకం. మా పెదనాన్న గారి పేరు "యజ్ఞ నారాయణగారు" ఆయనను 'ఎగ్గెయ్య' గారనేవారు. ఆయనే ఇంటికి పెద్ద అవటం చేత, ఆయనదే పెత్తనం. అందుచేత వాటికి "ఎగ్గెయ్య" గారి నోట్లనే వాడుకన్యాయం!

ఒక తడవ నేను వెళ్లి తలుపులు తెరిచేటప్పటికి, నట్టింటిలో కొన్ని వందల గబ్బిలాయలు, తల్లక్రిందులా తపస్సు చేస్తున్న మహర్షి సముదాయంగా కనిపించినయి. అప్పుడు వాటిని తోలేసి, ఇంటికి రిపేర్లు చేయించిన తరువాత, అవి ఎక్కడకో పోయినాయి. అంత పెద్ద గబ్బిలాలను నేను నా జన్మలో చూడలేదు. పాపంవాటికి స్థానభ్రంశం చేసినందుకు నాకు విచారం కల్గింది కూడా!

గదిలో వున్న పాముపుట్ట తవ్వరా అంటే, మా ఇంటిని కనిపెట్టుకుని ఉన్న వెట్టివాడు, అమ్మో ఆ పుట్ట తవ్వకూడదు, అందులో మంచి నాగు వుంటుంది. అది ఎవరినీ ఏమీ చేయదు. అని, గదిలోని పాముపుట్ట" తవ్వటానికి అభ్యంతరం చెప్పాడు. అప్పుడు నూతక్కిలో వున్న 'ఉప్పరి' వాళ్లను పిలిపించి తవ్వి పారేశాం. అలా మనం లేకపోతే ఇల్లు "పాడుబడ్డదంటే" లోపల ఎలావుంటుందో మా ప్రాతూరు ఇంటి వ్యవస్థ తెలియజేస్తుంది. ఇప్పుడు ఇంట్లో విద్యుద్దీపాలు, ఫ్యానులు, ఎవరో ఒకరు కాపురం వుడటం, టెలిఫోనుతో

సహా శోభాయమానంగానే ఉన్నదని చెప్పుకోవచ్చు. అయితే మా పెద్ద అన్నయ్య తిరుమలరావు చెపుతాడు, ఎవరో చెప్పాడుట, యీతరంవారు ఎవరూ ఆ ఇంటి లో ఉండలేదు, ఉండరు అని ! పరిస్థితులు కూడా అలాగే మారినాయి. ఏదో ఉన్న ఆస్తులు అమ్మటానికి ఆ ఊరు వెళ్లటంతప్ప మరో పని అక్కడ ఈ తరంవారికి లేకపోవడం కూడా, విషాదకరమైన సంగతే!

## అణాబిళ్ళతో సహానోట్లు

ప్రతి సంవత్సరమూ ప్రాతూరు సెలవులకు వెళ్ళేటప్పుడు కొన్ని రూపాయిల "రెవిన్యూ స్టాంపు అణాబిళ్ళలు" కొనుక్కొని తీసుకు పోయేవారు. ఈ ప్రామిసరీ నోట్లకు ప్రాణంపోయటానికి "అణా" అంటే రూపాయిలో పదహారవభాగం. రైతులు తిరిగి నోట్లు వ్రాసేటప్పుడు, వడ్డీ అసలు ఫాయిదాలతోను, ఈ అణాబిళ్ళ ఖరీదు కలిపి, ఈ "అణాబిళ్ళతో సహా"యింత, అని మొత్తం వ్రాసేవారు! అణాబిళ్ళ ఖరీదు కూడా కలపడం వింతగా వుండేది మాకు. రైతు "అసలు" ఇస్తే చాలుననుకునే పరిస్థితులలో ఏదో తూచి వ్రాసినట్లు అణాబిళ్ళ విలువకూడా కలిపి నోట్లు వ్రాస్తే వింతగా వుండదా. ఆరైతులు ఎక్కడ వేలుముద్ర వేయమంటే అక్కడ నిశ్చింతగా వేసిపోయేవారు – అది ఆనాటి రైతుల ఋణబాధలకు ముఖ్య చిహ్నం.

పంటలు పండక రైతులు భూకామందులకు, వేలకు వేలు బాకీలు నోట్లుగా వ్రాసి ఇచ్చే వారు. ఆ బాకీల క్రింద, రైతుల కేమైనా పొలాలు వుంటే భూకామందులు, వారి భూములను "కబ్జా" చేసేవారు.

1935,36 సంవత్సరాలలో మేమంతా పొలాలు పంచుకునేటప్పుడు యీ నోట్లన్నీతీసి, ఎంత ఇవ్వగలిగితే అంత పుచ్చుకు, ఆనోట్లకట్లలన్నీ చించివేశాం – 1937 లో కాంగ్రెసు ప్రభుత్వాలు వచ్చినపుడు, మన ఉమ్మడి రాష్ట్రంలో, ప్రధాని అయిన శ్రీ రాజగోపాలాచారి గారు, ఋణ విముక్తి చట్టం (డెట్ రిలీఫ్) చేసి, ఈ ఋణాలలోని వడ్డీ అంతా తీసేసి, రైతులయిన వారు అసలు మొత్తాలు ఇస్తేచాలని ప్రకటించేటప్పటికి, ఎంతోమంది బీదరైతులు ఋణవిముక్తులై తమ ఆస్తులు కొంతవరకు నిలబెట్టుకో కలిగారు – ఇప్పుడు 1990లో కేంద్రప్రభుత్వం బీదరైతులకు పదివేలరూపాయల వరకు బ్యాంకు

అప్పులను 'మాఫీ' చేస్తున్నదంటే, ఈ రద్దు ఆనాడు వందలతో సమానం. ఇది ఆనాడు కాంగ్రెసు ప్రభుత్వం రైతులకు చేసిన మొదటి ఉపకారం – తరువాత చేసిన చట్టాలలో "జమీందారీ రద్దు" బిల్లు. అది తరువాత జరిగిన జమీందారీ రద్దుకు, పునాది – ఇంతలోనే 1939వ సంవత్సరం సెప్టెంబరు మూడవ తేదీన బ్రిటిషువారు జర్మనీ మీద యుద్ధం ప్రకటించడం, కాంగ్రెసు ప్రభుత్వాలు రాజీనామా చేయడం జరిగి, మిగతా కార్యక్రమాలన్నీ వెనకబడ్డయి. కాని రైతులను ఋణ విముక్తులను చేసే ఉద్యమం, నాటికీ, నేటికీ ఒకే విధంగా జరుగుతోందంటే, ఆనాడు రైతుల ఆర్థిక పరిస్థితి ఎంత దుర్భరంగా ఉండేదో ఆలోచించండి.

ఈ నోట్లు బాకీలు 1915 నుండి తిరిగి వ్రాసినవి కూడా ఉండేవి. రైతులు చెల్లించలేకపోయినా, చెల్లించే అవకాశం కూడా లేకపోయినా, ఊరికే వారి పిలక మన చేతులో ఉండనీ అని, చాలా మంది భూకామందులు నోట్లు తిరగరాయించుకుని దగ్గిర వుంచుకునే వారు. కాని 'ఎగ్గయ్య' గారు మాత్రం రాజగోపాలాచారి గారి రుణ విమోచన చట్టం రాకముందే, ఇచ్చినంతవరకు, అసలులోనే తగ్గించి పుచ్చుకుని మా బాకీదారులనందరిని ఋణవిముక్తులను చేశారు. అదీ ఆనాటి మన రైతాంగ ఆర్థిక పరిస్థితి. ఈ రోజులలోలాగా బ్యాంకులు బీద రైతులకు ఋణాలు ఇచ్చే సౌకర్యాలు లేవు. తమ వ్యవసాయానికి వ్యాపారస్తులదగ్గిర నుండి, భూమికామందుల దగ్గిర నుండి తీసుకున్నది కొద్ది అప్పు అయినా, అది వేలకు వేలుగా పెరిగి వారిని బికారీలు చేసినాయి. కొద్ది ఎకరాలున్న వారు కూడా భూమిలేని కూలీలుగా తయారయ్యారు. ఆ చట్టం పల్లెలలో ఒక విధం బానిసత్వాన్ని నిర్మూలించింది.

ఇప్పుడు మనజాతీయ బ్యాంకులు సహకార బ్యాంకులు, గిరిజన బ్యాంకులు, కార్పొరేషన్లు, హరిజన, అభివృద్ధి సంస్థలు ఏర్పాటై ఆయా వర్గాల వారికి చాలా ఆర్థిక సహాయాన్నిచేసి తోడ్పడుతున్నాయి. ఇది ఈ కాలం, అది ఆ కాలం!

# XXXII

# మజ్జిగ చుక్కలు

# DROPS OF BUTTERMILK

The moving story of Laxmi Devi - The curd vendor - Liquidating the debt of her husband to us - The coins she poured out of a small pot were stained with Butter Milk drops representing her hard savings

The sight of her payment and her gleaming smiles of satisfaction, reflected in her face when she liquidated the 20 year old debt of her husband. The incident went into a short story.

మా పెద్దలు రైతుల దగ్గిర నుండి ఋణాలు వసూలు చేసే సమయంలో ఒక దృశ్యం నాటినుంచి నేటికీ నాకళ్ల ఎదుట మెదులుతుంది. అది ఆ నాటి రైతాంగపు నిజాయితీ జీవితానికి తార్కాణంగా నా మనస్సులో మిగిలి పోయింది. "మజ్జిగ చుక్కలు" అని ఒక కథానికను కూడా వ్రాసి, దాన్ని తరువాత ప్రకటించా, అది మావూరులో పాలుపెరుగు రోజూ విజయవాడ వెళ్ళి మ్ముకుని వచ్చే ఒక పేదరాలి జీవిత గాథలో ఒక ఉదంతం – ఇది 1935 నాటికథ. అంటే, దాదాపు 55 సంవత్సరాల నాటి కథ. జీవితంలో కొన్ని కొన్ని దృశ్యాలు అలా హత్తుకుని పోతాయి. కవి అయితే కవిత్వం అల్లుతాడు,

కధకుడయితే ఒక చిన్న కథగానో, నవలగానో అల్లుతాడు. ఏదీ లేని నేను గద్యంలోనే వ్రాస్తున్నాను.

'లక్షిందేవి' అసలు పేరు "లక్ష్మీదేవి" ఊరంతా "లక్షిందేవి" అంటారు. నల్లగా నవనవలాడే దేహం, ముడతలు పడుతున్న ముఖకవళికలు, ఒక దంతమైనా ఊడని, ముత్యాల వరుసలాగా తెల్లగా నిగనిగలాడే పలువరుస, వయసుతో వచ్చిన వణుకుతో పలికే అమాయకపు పల్లెటూరి భాష. వయస్సు దాదాపు డెబ్బయి సంవత్సరాలు వుంటయనుకుంటా ఆనాటికే. దాదాపు ఏభయి సంవత్సరాలుగా. మా వూరు ప్రాతూరికీ, కృష్ణకు అవతల ఒడ్డును వున్న విజయవాడకూ మధ్య పెరుగు, పాల ముంతలు నెత్తిన గంపలో పెట్టుకుని రోజుకు, పదిహేనూ ఇరవయి కిలో మీటర్లు చకా చకా నడచి నడిచి పలుచబడిన ఊచల వంటి నిగనిగలాడే నున్నటి కాళ్ళు. 'పంచె'గా విరిచి కట్టిన నీరులేని రంగు చీరెలోంచి తమ బలాన్ని చాటుతూ వుంటయి.

అన్నయ్యగారు అంటూ, ఇంట్లో అందరినీ సంబోధిస్తూ ఇంటికి వచ్చే ఆవిడ దరహాస వదనం, చీకిపోయిన హృదయంలో పొదిగివున్న చింతలను తన మెదడుకు ప్రాకనీయకుండా, మన నవనాగరిక దోషాలేమీ సంక్రమించకుండా, ప్రశాంతంగా వచ్చేది. ఆవిడకూ మా కుటుంబానికి కూడా ఒక "చిన్న నోటు ఋణాను బంధం వుంది"!

అది 1915లోను, అంటే నేను పుట్టిన సంవత్సరంలో మరణించిన ఆవిడ భర్త రాసి ఇచ్చిన నోటు. అది కూడా ఆయన, మా పొలాలు కౌలుకు చేసి పంటలు పండక బాకీ పడి వ్రాసి ఇచ్చిన నోటు. డెబ్బయి ఎనభయి సంవత్సరాల క్రితం ఆ ప్రాంతమంతా కరువు ప్రాంతంగానే భావించాలి. శ్రీనాథుడు తన వ్యవసాయాన్ని గురించి వ్రాసినట్లు,"బిలబిలాక్షులు తినిపోయె తిలలు పెసలు, కృష్ణవేణమ్మ కొని పోయెనింత ఫలము" అన్నట్లు వ్యవసాయాల ఫలసాయాలు అలా ఉండేవి.

లక్షిందేవికి కూడా అందరితో పాటు తాను కూడా, తన భర్త ఋణాన్ని తీర్చి, ఋణ విముక్తి చెందాననే సంతృప్తి పొందాలనే భావన కలిగింది. ఆ నోటు భర్తపోయిన తరువాత, తానే తిరగ వ్రాయించుకుని, వేలు ముద్ర వేస్తూ వుండేది. అసలు మొదటి బాకీ ఇరవయి రూపాయిలు. అది 1935 నాటికే అసలు

వాయిదాలతో కొన్ని వందలయింది. అదంతా తగ్గించి ఇరువయి రూపాయిలు, అసలు మొత్తాన్ని తీర్చమని నిర్ణయించారు.

ప్రపంచమంతటా, అమెరికాతో సహా ఆర్థిక మాంద్యంలో ఉన్న రోజులవి. ఆ పరిస్థితులలో "పెరుగూ పాలు" అమ్ముకునే లక్ష్మిందేవికి రూపాయీలు ఎక్కడ నుండి వస్తాయి. ఇంత అని తీర్చిన తరువాత, "అన్నయ్యగారు" ఇది గో మీ బాకీ అని తన ధనాగారమయిన, ఒక ముంతలోంచే ఎంతో చిల్లరగా, ఆ ఇరవయి రూపాయీలు తెచ్చి, తెచ్చానని సంతోషంగా ప్రకటించింది - సరేనని అందరం కూర్చున్నాం !

## ఆ బాకీ చెల్లించిన దృశ్యం

మామూలుగా రైతులు తెచ్చే పైకం పంచకట్టు బొడ్డున, తలపాగా చివరి భాగంలో ముడివేసి తల పాగాలో దోపి తీసుకు వచ్చేవారు. ఆ డబ్బు దఫాలుగా ఒక్కొక్కటీ తీసి బయట పెడతారు. మనం ఇచ్చే వత్తిడిని బట్టి ఎంతవరకు బేరమాడాలో అంతవరకు బేరమాడి ఇంతకంటే ఇవ్వలేనంటూ పైకం బైటికి తీసేవారు, మా రైతులు. కాని, లక్ష్మిందేవి డబ్బు తెచ్చిన విధానం "న భూతో నభవిష్యతి"!

లక్ష్మిందేవి తన బాకీ ధనాన్ని ఒక ముంతలో పెట్టి తీసుకు వచ్చింది. ముంత నిండా డబ్బు వుండటం వలన ముంత చాలా బరువుగా వుంది. "ఇదిగో బాబూ! మీ పైకం" అంటూ ముంతెడు చిల్లర, ముంతకు మూతి బిగించి కట్టిన గుడ్డ తీసి గుమ్మరించింది! ఆ చిల్లర చూసేటప్పటికి, సామ్యవాద సిద్ధాంతాలతో పచన మవుతున్న నా మనసు చివుక్కుమన్నది. కళ్ళ బైరులు కమ్మినయి - నాలో రగులుతున్న సామ్యవాద సిద్ధాంతాలు ఆ చిల్లర వంక ఒక్కసారి ధనాధిక వర్గాన్ని దగ్ధంచేయాలా అనే తీవ్రతతో చూచినాయి!

లక్ష్మిందేవి గుమ్మరించిన చిల్లర, ఆనాటి రూపాయిలోని విభాగాలను పైసాలతో సహా చూపించి ఒక నవ్వు నవ్వింది! అబ్బా బాకీ తీరింది గదా అని ఒక నిట్టూర్పు విడిచింద - రెండు మూడు రాణీ రూపాయీలు, జార్జిముద్ర రూపాయిలు, అణాలు, బేడలు, పావలాలు, అర్ధరూపాయీలు. అన్నిటి కంటె ఎక్కువగా రాగితో చేసిన అర్ధణాకాసులు, కాసులు, పైసలు అన్న అమూల్య తను

గూర్చినయి – తరువాత వచ్చిన 'చిల్లికానులు' ఆకుప్పలో లేవు! ఆ చిల్లర మీద మజ్జిగ చుక్కలు ఎప్పుడోపడి, ఆ రాగి నాణాలతో తమకు గల పరిచయ కాలాన్ని, చక్కటి "కిలుముగా" మార్చి ప్రకటిస్తున్నాయి! చిల్లరంతా లెక్కపెడితే, ఇరవయి రూపాయీల మొత్తం అయింది. కొన్నాళ్లుగా, తన భర్త ఋణం ఎలాగేనా తీరుద్దామనే కృతజ్ఞతా పూర్వక ప్రయత్నంతో ఆ కనిపించే, లక్ష్మిందేవి మూలధనం! మూలధనం కాదు, లక్ష్మిందేవి "ముంత ధనం"!

తన భర్త ఋణం తీర్చి తిరిగి తీసుకున్న నోటు చూచి ఆవిడ పొందిన ఆనందానికి అంతులేదు. చెప్ప లేక ఒక్క నమస్కారం చేసింది. ఆ నోటు మీద వసూలు వేసి ఇచ్చారా లేదా అనే చింత ఆవిడకు లేదు,అలా వసూలు వేయాలని కూడా ఆవిడకు తెలియదు. ఆ నోటు కాగితం, తన చేతికి రాకపోయినా, లక్ష్మిందేవీ, నీ బాకీ తీరిందన్న 'ఎగ్గయ్య'గారి నోటి మాటే ఆవిడకు పదివేలు!

ఆ డబ్బుల మీద, చుక్కలు చుక్కలుగా పడి కిలుమెక్కిన చుక్కలు ఇప్పటికీ నక్షత్రాలాగనా కళ్లలో మిణుకు మిణుకు మంటూ మెరుస్తున్నాయి, అవి ఆనాటి పేదరైతుల దీనావస్థకు,కృతజ్ఞతా పూర్వక భావాలకు, పెద్ద ఆసాముల ఉదారతకు, దాతృత గుణానికి చిహ్నాలుగా పరిగణించవచ్చు!

కాని, యీ మారిన రోజులు చూస్తూ వుంటే కొంత మంది అతి తెలివికి, ఆశ్చర్యం వేస్తుంది. బ్యాంకు ఋణాలు తీసుకోకముందే ఇవి ఇవ్వనక్కరలేదనే ఆలోచన, ఎలా తప్పుడు లెక్కలు వ్రాసి కంపెనీలతో సహా దివాళాలు తీయిద్దాం! అడ్రసే లేకుండా పారిపోదాం. అనే ఒక కొత్త తరం వచ్చింది – ఎన్ని దివాళాలు, ఎన్ని కోర్టు కేసులు, ధనిక వర్గపు అహంకారాలు. కూలి రైతులను ఐక్యం చేస్తుంది ఈ సంఘర్షణలు అవసరం లేకుండా, కావలసిన ఆర్థిక విధానాన్ని రూపొందించుకుని "శ్రేయోరాజ్య" స్థాపనకీ తరం కృషి చేయాలి. అప్పుడే లక్ష్మిందేవి బోటి అనాథలకు ఆత్మ శాంతి. లక్ష్మిందేవి కథ మా తరం కథ నుంచి వారసత్వంగా లభించే ఒక అమూల్య మయిన సందేశంగా భావిద్దాం!

# XXXIII

# అణా బిళ్ళ మీద  సంతకమా!

# SIGNATURE ON A REVENUE STAMP!

My parents were never in debts! Always a self sufficient economy. My father cautioned me never to ask him to sign on a one anna revenue stamp. i.e., a promisory note.

They feared indebtedness, what a self respecting generation, living with in their means - never in debts! Ours is a spending and-deficit economy! Even while earning well-we sold all our lands.

మా తలిదండ్రుల తరం వారిది ఎంతో తృప్తితో కూడిన జీవితం. ఆనాటి ధరలు, కుటుంబ ఖర్చులు కూడా మితంగానే ఉండేవి. 30 మొదలు 50 రూపాయిలలో ఎంతో సుఖంగా జీవితం గడిచి పోయేది - ఇహ వారు ఋణాలు చేసే ప్రసక్తే లేదు. అణా బిళ్లలమీద రైతుల చేత సంతకాలు పెట్టించి,

పెట్టించి, వారికి మానసికంగా "అణాబిళ్ల" అంటే, ఆ జన్మాంత ఋణ బాధ అనే ఉద్దేశం వారిలో నాటుకుపోయింది. అందుచేత వారు ఎప్పుడూమమ్మల్ని అణా బిళ్ళ మీద సంతకం పెట్టమని అడగవద్దనేవారు. అందులో ప్రత్యేకంగా మా నాన్నగారు!

మా తాతలుగాని, తండ్రులుగాని, ఎప్పుడూ అణాబిళ్ల మీద సంతకం చేసి అప్పు తేవలసిన అవసరం వారికి కలుగలేదు. ఎంత జీతం వస్తే అంతలోనే కుటుంబ ఖర్చులు కుదించకుండానే సరిపోయేవి. ఇహ పొలం మీద ఎంత వచ్చినా మిగులే! కరువు రోజులలో యీవంద ఎకరాల మీద రాబడి రాకపోగా, గవర్నమెంటు శిస్తుకు కూడా కౌలు డబ్బులు రాకపోతే, వారి సొంత ఆదాయంలో వారు పొలం పన్నులుకట్టి ఆ పొలాలు నిలబెట్టారు. అవీ ఆనాటి పొలాల మీది ఆదాయపు పరిస్థితులు – అంతా పెద్దన్నయ్య మా పెదనాన్నగారు "ఎగ్గయ్య" గారికే పెత్తనం వదిలి వేసేవారు. అన్నదమ్ములంతా సంవత్సరానికి ఒకటి రెండు సార్లు, తమ తలిదండ్రుల తద్దినాలకు తప్పకుండా వచ్చి కలిసి పెట్టుకుని, తమ పితృభక్తిని చాటుకునేవారు! అన్నయ్య మాట అంటే సోదరులందరికీ వేదవాక్కు-!

అసలు ఆస్తిపంచుకుందామనే ఆలోచన అవసరంకొద్దీ మా తరంలోనే వచ్చింది. మూడో తరమయినా అమ్మగా, అమ్మగా ఇంకా కాస్తా కూస్తా ఉమ్మడి ఆస్తి, మూడో తరమైన మాకు కూడా వుంది, –పొలాల మీద వచ్చే ఆదాయం ఎవరో ఒకరు వసూలు చేసి, ఎవరి భాగం వారికి మనిఆర్డరు ద్వారా పంపేవారు. తమాషా ఏమిటంటే మని ఆర్డరు కమీషను మొత్తంలో మినహాయించి మిగతాపైకం పంపేవారు. ఆ తరం ఎంతో ఆర్థిక గుంభనతో గడిచిపోయింది. ఇహ దడబిడలు అంతా మా తరంలోనే!

మా తరంలో ఒకరు బొంబాయి, ఒకరు మద్రాసు, మూడవ వారు కలకత్తా, నాలుగోవాడు దేశమంతటా తిరిగే ఉద్యోగంలో వుండే వారు, ఇలా ఈ తరం అన్నదమ్ములమంతా, దేశంలో దశదిశలా వెలిగిన వారమే, సంపాదనలు కూడా వేలు దాటిన వారమే. అయితే ఏం, మా ఆర్థిక విధానంలో ఏదో పెద్ద లోటు ఉంది. ప్రతినెలా లోటే, వచ్చే ఆదాయానికి, మించిన ఖర్చులే, ఎంత చెట్టుకంత గాలి అయితే బాగుండేది. ఈ గాలి, చెట్టుకు మించిన గాలి అవటం

చేత, కొంచెం తట్టుకోడానికి అప్పుడప్పుడు ప్రాతూరు వెళ్ళి పొలాలు అమ్మకోవాలిసిన అవసరం వుండేది! అదీ మా రెండు తరాలలోని వ్యత్యాసం! మా నాన్నగారు తరుచు యుద్ధకాలంలో అనేవారు, జీతాలు హెచ్చేగాని, హెూదాలులేని ఉద్యోగాలురా అని హెూదాలు లేక పోగా ఎంత వచ్చినా డబ్బు చాలని జీవిత విధానాలవటం చేత మా తరంలో దశలవారీగా పొలాలన్నీ మా అన్న దమ్ములంతా, చదువులకనో, వివాహాలకనో మరో విధమయిన అప్పులకనో, తాతలు తండ్రులు జాగ్రత్త పెట్టి ఇచ్చిన ఆస్తిని పూర్తిగా అమ్మేశాం. మా ప్రాతూరు ప్రయాణం అంటే ఏదో పొలం అమ్మటానికే పనికట్టుకు వెళ్ళినట్లుగా వుండేది.

రిటైరు అయిన తరువాత మా పినతాతగారి కుమారుడు "చిన ఎగ్గయ్య బాబాయి" అక్కడ స్థిరవాసం చేసుకుని ప్రాతూరులోనే ఉండేవారు, మేము వెళ్లినప్పుడల్లా మీరంతా తలా దిక్కునా దేశంలో అడుక్కుతింటున్నారుటరా! ఇక్కడికి అమ్మకానికి మాత్రమే వస్తారని, నవ్వుతో కోప్పడే వాడు!

వారిదెప్పుడూ అణా బిళ్ల మీద సంతకం చేయని జీవితాలు. మాది అణాబిళ్ళ మీద సంతకాలు పెట్టకపోయినా, బ్యాంకులలో ఓవర్ డ్రాఫ్టుల మీద నడిచే జీవితాలు. అదీ మా రెండు తరాల మా కుటుంబీకులలోనే కాక, దేశమంతటా ఉన్న ఈ రెండు తరాలను తరుముకు వస్తున్న "సరిపోని ఆర్థిక పరిస్థితు"ల జీవన స్రవంతిలో ఎదురైన సమస్య. దీన్నే అందరితో పాటూ మేమూ ఎదుర్కొనడంలో ఒక భాగమయినాం!

మద్రాసులో ఉన్నప్పుడు ఒక మంచి ఇండ్ల స్థలం, రెండు "గ్రౌండ్సు" అమ్మకానికి వచ్చింది, నాలుగు వేల రూపాయీలకు. ఇప్పుడు అది లక్షల ఖరీదు చేస్తుంది. మనది దగ్గిర డబ్బు లేని వ్యాపారం. మా నాన్నగారితో చెపితే, "నన్ను మాత్రం ఎక్కడా అణా బిళ్ల మీద సంతకం పెట్టమనకు" అని గట్టిగా చెప్పారు – దాంతో ఆ బేరం మానేశా.

నాకు అణాబిళ్ల మీద సంతకం పెట్టడమంటే భయమే. ఈ సందర్భంలో మా లాయరు పెదనాన్నగారు మరొకరు చెప్పిన 'లీగల్' సలహా ఎప్పుడూ గుర్తుకు వస్తుంది. ఏ వ్యాపారంలోగాని, ఎవరేనా అప్పు తీసుకునే టప్పుడు గాని, వారికి హామీ సంతకం పెట్టవద్దని" పెడితే ఆ బాకీ నీవు బాధ లేకుండా తీర్చుకో గలిగితేనే పెట్టాలి! అందుచేత అసలు ఆ సంతకం పెట్టడమెందుకు, బాధపడటమెందుకు, పెద్దలు అనుభవజ్ఞుల సలహాలు పాటిస్తే, హాయి అయిన మార్గం.

# XXXIV

# తెల్ల విప్లవం

# THE WHITE REVOLUTION

We have an organised milk production and distribution system today, as an industry, Enriching the rural areas Popularity of curd and butter milk in U.S.A. and west as a preventive food for colon and gastric cancers. Innumerable varieties of curd products like ice cream products, which has more than 120 varieties today in U.S.A. All this is cow's milk only in the west! No buffallows, as in our country!

No Stagnation of milk in the villages as in our childhood days Now, what a run on supply for milk chilling centres.A city child said that the source of Milk is Bottles! She did not know that the milk comes from the animals. This startled the father at the ignorance of the child - He, planned a camp in a village and showed his children how all our food products are produced, including milk.

రైతుకు పాడిపంటా అన్నారు. పంట అయిన తరువాత పాడి, పాడి తరువాత ఇబ్బడి, ముబ్బడి పంట. పాడి సమృద్ధి గా ఉండి పాలవుత్పత్తి అందరికీ సరిపోయేటంత ఎక్కువగా దేశంలో వుండాలి. అందుచేత, ఈ పాల అభివృద్ధినే

సమృద్ధిగా చేసుకోటానికే తెల్ల విప్లవం, "వైట్ రివల్యూషన్" అవసరం! అది ఇంత వరకు విజయ పథంలోనే నడుస్తోందనే అనవచ్చు.

మన ఆహారంలో అందరికీ ప్రొటీన్లు గల ఆహారం పాలు, పెరుగు, వెన్న, నెయ్యి, మీగడ ఉండాలి. ఇవన్నీ మన ఆహారానికి అనుపానాలు, పెరిగే వయస్సులో ఉన్న అందరికీ పాల ఆహారం చాలా ముఖ్యం. పెద్దలకు కూడా అవసరమే. అందులో శాకాహారులకు పప్పు దినుసులలో ప్రొటీన్లు వున్నా పాలలో వున్న "పుష్టికరమైన ప్రొటీనులు" చాలా అవసరం. లేకపోతే, కండరాలలో బలం వుండదు. మాంసాహారులకు కొంత వరకు ఫరవాలేదు. మాంసాహారులు కూడా జంతుమాంసం మీద ఎక్కువగా ఆధారపడకూడదనీ పాలు, పెరుగుల వాడకం, వారికి కూడా మంచిదేననేది శాస్త్రీయమైన అభిప్రాయం. పరిశోధనల ఫలితంగా జంతుమాంసానికి సంబంధించిన ప్రొటీన్లు మరీ మితిమీరి అలవాటుగా తినుట వలననే పాశ్చాత్యులలో గుండె జబ్బులకు, రక్తపు పోటుకు కారణం కూడా అని అనుకుంటున్నారు. పాలు మంచి నీటి బదులుగా తాగుతారు, పిల్లలకు 16 సంవత్సరాల వరకూ కాఫీ టీలు ఇవ్వకుండా పాలుతాగే అలవాటే ఎక్కువగా చేస్తారు. అట్లాంటప్పుడు జంతుమాంసం పులగంమీద పప్పు అవుతుంది అనవచ్చు.

మన దేశంలో గడ్డ పెరుగుతినే అలవాటు ఎక్కువ. ఈ పెరుగు, దేహంలో కాన్సరు వ్యాధిని నిరోధిస్తుందని, పాశ్చాత్యులలో ఎక్కువగా కనిపించే "అల్సరేటింగ్ కొలైటిస్" ఎడమవైపు పెద్ద పేగు వాపును కూడా నిరోధించవచ్చుననే సూచనల వలన అమెరికాలో పెరుగు, మజ్జిగ వాడకం ఎక్కువయింది. చాలా విరివిగా వాడుతున్నారు కూడా.

నేను, 1952-53లో అమెరికాలో వున్నప్పుడు, పెరుగు సంబంధమయినది. "యోగర్టు" అనేది వాడేవారు. అది విరిగిన పెరుగు బిళ్లలా వుండేది. కాని, ఇప్పుడు అనేకరకాలయిన సువాసనలతో, అనేక రకాల పండ్లు చేర్చి, ఎంతో రుచికరమయిన, పెరుగులు మన 'ఐస్‌క్రీమ్' మాదిరిగా చేసి ఉపయోగిస్తున్నారు. అవి, వూరికే తినడానికి కూడా చాలా బాగా వుంటయి, వారు, వూరికేనే తింటారు, కూడా కాని, మనలాగ పెరుగు అన్నంలో వేసుకుని తినరు. విడిగానే తింటారు! మనలో మరో అలవాటు శాకాహారం అలవాటు.

అమెరికాలో అదినేడు చాలా ఎక్కువగా ప్రచారంలోకి వస్తోంది – ప్రపంచ శాకాహార సమావేశాలకు అమెరికా వారు చాలా ప్రోత్సాహమిస్తున్నారు! మన మంచి అలవాట్లను గురించి ఇతరులు శాస్త్రీయంగా పరిశీలించి, పాశ్చాత్యులు చెప్పినప్పుడే వాటి గొప్పతనం మనకు తెలుస్తుంది! అయినా వాటి మంచి చెడ్డల గురించిన వాదోపవాదాల గడబిడలకు అంతం ఉండదు.

మన సంస్కృత భాష ఔన్నత్యాన్ని మనకు జర్మను 'మాక్సుముల్లర్' గారు చెప్పారు. మనమహాత్మా గాంధీ సినిమా చిత్రాన్ని "ఆటెన్‌బరో, తీసి, గాంధీఇజము తత్వం లోని గొప్పదనాన్ని ప్రాశ్చాత్యులకు అవగాహన అయేరీతిగా చూపించాడు. మొత్తంమీద, మనలో ఉన్న మంచి విషయాలలో పాలు త్రాగటం ఒకటి, అందుచేతనే, ఎప్పుడో గంగిగోవుపాలు గరిటెడైనను చాలు, కడివడైననేమి 'ఖరముపాలు' అని, వేమన చెప్పాడు, పాశ్చాత్యులంతా ఆవుపాలే తాగుతారు. అక్కడ, మన గేదెలు లేవు, అడివి గేదెలు, అడవులలో వుంటయి. అంతేగాని ఒక గేదె కూడావారి దేశంలో పాడి బర్రెగా కనిపించదు అట్లా వేలాది సంవత్సరాలుగా మనం గోమాతను పూజిస్తూ దాని పుష్టికరమైన పాలను తాగే గొప్ప అలవాటు మన నాగరికతలో ఒక ముఖ్యమైన అంశం. అదే పాశ్చాత్యులు, ఆవులనే పెంచి, వాటిలో ఒక్కొక్క ఆవు గంగాళంనిండా పాలు ఇచ్చే విధంగా వారి పశు వంగడాలను (జాతులను) వంశాను క్రమలక్షణాల (జీన్ పరిశోధన) పరిశోధనల ఫలితంగా అభివృద్ధి చేసి, ఆడంబరంగా, మనవలె గోపూజ చేయకపోయినా, నిజమయిన శ్రద్ధతో గోపోషణ చేస్తున్నారు. దాని ఫలితం గైకొంటున్నారు. మనము చేయునది, గోప్రాణ రక్షణమాత్రమే! పాశ్చాత్యులు మాంసాహారులవటం చేత, వారుతినే ఆవులను, ఎద్దులను ప్రత్యేకంగా పోషించి, ఆ తరువాత కూడా శాస్త్రీయంగా వధించి, ఆ మాంసాన్ని బీఫ్ రుచికరమైన అంశంగా తింటారు!

ఇప్పుడు మన దేశంలోని పశు సంపద అయిన ఆవులు, గేదెలు, గురించి శ్రద్ధ వహించడం, విధానాలు పాటించడం నిర్వహిస్తూ వాటి "మంచి జాతిగా" మార్చుకుంటున్నాం, గవిడి (గొడు) గేదెలు, మంచి "బ్రాండు" ఆవులు, చాలా జాతులు తయారుచేసుకున్నాం. ఇంకా బాగా శ్రద్ధతో పశుసంపదను, గంగాళాలు నిండే పాలిచ్చే సంపదగా మార్చుకోవలసిన అవసరం ఉంది.

ఎన్నో "పాల సేకరణ కేంద్రాల"ను పల్లె పల్లెలో స్థాపించి, ఆ జిల్లాలోనే, "పాలశీతలీ కరణ కేంద్రాలను" ఏర్పరచి, పాల ఉత్పత్తి, పంపిణీలను ఒక పరిశ్రమ క్రింద ఏర్పాటు చేసుకున్నాం. ఇది మరింత విస్తృతంగా జరగాలి. ఇంకా మన సామాన్య పశువులు ఇచ్చే, సగటు పాలు, మొత్తం పాలు, జనాభా తలసరిగా వినియోగించే పాలు, ప్రజల అవసరాలు, లెక్కలు పరిశీలిస్తే వినియోగిస్తున్నది వినియోగించేది చాలా తక్కువే! ఈ రెండు అంశాలను గురించిన అభివృద్ధి ప్రజలు సహకార ఉద్యమం ద్వారాను, ప్రభుత్వ డెయిరీ డెవలెప్‌మెంటు ద్వారాను విస్తృతంగా, విరివిగా కృషిచెయ్యడం జరగాలి. అప్పుడే మన పిల్లల ఆరోగ్యం, అభివృద్ధి చెందుతుంది. "పాలు చాలినంత తాగని పిల్లలు పూచిక పుల్లలు ,పుష్కలంగా పాలు తాగే పిల్లలు ఏనుగు పిల్లలు" అనే సత్యం, ఆచరించి రుజువు చేయగల వారమవుతాం, అప్పుడే మన 'తెల్లని విప్లవం! సరి అయిన, ఉపయోగకరమైన శాంతియుత విప్లవం అవుతుంది

అభివృద్ధి చెందిన దేశాలలో నీళ్ల బదులు పాలే తాగుతారు. పాలు చౌకగా కూడా అమ్ముతారు. ఇంకా మన దేశంలో పిల్లలకు తలసరి ఒక గ్లాసెడు పాలు (200 మిల్లీ లీటర్లు) దొరకటం కష్టంగా ఉంది. ఇది, ముఖ్యంగా పాల ఉత్పత్తి లోపం వలన కాదనీ, కుటుంబాలకు కొనుగోలు శక్తి లేక పోవడంవల్లనే అనీ, చెప్పాలి. పిల్లలకు పాలకరువు తల్లిదండ్రుల పేదరికంతో పీట ముడివేసినట్లు తెగని లంకెగా ఉంది. ఆ లంకెతెంపడానికే తెల్లవిప్లవం.

మన పిల్లల పెంపకంలోను, వారి ఆరోగ్యాభివృద్ధి పథకాలలోను, ఇది ఒక భాగంగా చేర్చి "పాల వుత్పత్తిని పెంపు చేస్తే, పిల్లలందరికి (వివక్షణ లేకుండా) పాలు అందే పంపిణీ విధానం ఏర్పరిస్తే, "పెరుగుతున్న" చిరుపాపల హృదయాలలో చిరు నవ్వులు చిగిరించేటట్లు చేసిన వారమవుతాం. ప్రతి వినియోగదారుల సౌకర్యంలోను, లాభ నష్టాల వ్యాపారలక్షణం ఇమిడి ఉన్నా, సామాజిక ప్రయోజనాన్ని చూస్తే, కార్యక్రమాలు నిర్వహిస్తున్న వారికి తాము, దేశ సౌభాగ్యానికి ఎంతెంత తోడ్పడుతున్నారో కళ్లారా చూసి ఆనందిస్తారు. ఆ ఆనందమే ప్రతి మనిషీ కోరతగిన 'బ్రహ్మానందం'.

ఆరోగ్యమే మహా భాగ్యం కదా! ఆహారంలో పాల వినియోగం ముఖ్యమైన భాగంగా అందరూ పరిగణించాలి. అప్పుడే దేహపోషణ, దేశపోషణ. అది మనం పాల ద్వారా తెల్ల విప్లవం ద్వారా సాధిస్తాం! ఆ నిశ్చయంతో పని చేద్దాం.

**పాలు - జంతుజాతి**

జంతుజాతిని చూస్తే వాటికి పుట్టే సంతాన సంఖ్యను బట్టి స్తనములుంటాయి. ఆవు వంటి పశువులకు నాలుగు స్తనాలుఉంటాయి. కుక్కలకు చాలా పిల్లలు పుడతాయి కాబట్టి 8-10 స్తనాలుంటయి. లేతగా వున్నప్పుడు ఆజంతు సంతానానికి తల్లి పాలు లేకపోతే అవి మరణిస్తాయి - కాని, మానవుల తల్లితండ్రులు తమ మేధా సంపత్తిచేత, తమ శిశువులకు తల్లిపాలు లేన పుడు, ఇతర బాలింతలను, 'పాలతల్లులు' (వెట్‌నర్స్) గా ఏర్పాటు చేస్తున్నారు. ఆవుపాలు, మేకపాలు మొదలైన ఇతర జంతువులపాలను కూడా, తమ పిల్లలకు అరిగే విధంగా చేసుకుని తమ సంతానాన్ని రక్షించుకుంటున్నారు, ఈ విధంగా ఆవు, గేదె, మేక పాలను సాధారణంగా వాడుతారు ఒంటె పాలను కూడా, కొన్ని దేశాలలో వాడుతారు. ఈ శాస్త్రీయ అన్వేషణలో "గాడిదపాలు', రుచిలోను, పోషకపదార్థాలలోను సరిగ్గా తల్లిపాలకు, సరిసమానంగా వుండటం ఆశ్చర్యం. తల్లిపాలంత తీపిగా, ఈ ఒక్క జంతువు పాలు ఉంటాయంటే నమ్మలేం కదా! అయితే ఇది శాస్త్రీయమయిన నిజం! అందుచేత ఫ్రాన్సు దేశంలో ఒకప్పుడు తల్లులపాలు లేనప్పుడు ఎంతో విరివిగా "చంటి పిల్లలకు" ఆ పాలే ప్రాణాధారమయింది. ఇప్పుడు అంతా ఆవుపాలే, అనేక రకాలయిన మార్పులలో తేలికగా జీర్ణమయ్యే పద్ధతులలో ప్రపంచమంతా వాడుతున్నారు!

మరోక తమాషా. తూర్పున వున్న "తాయిలాండు" లో పాలువాడే అలవాటే లేదు. అందుచేత, వారు ఆవులను కూడా వ్యవసాయంలో మన ఎద్దులలాగ, నాగలికి కట్టి పొలం దున్నటానికి వుపయోగిస్తారు. రెండవ ప్రపంచ యుద్ధం అయిన తరువాత, వారికి అమెరికన్ సంస్కృతి సంపర్కంతో, పాలుత్రాగే అలవాటు అయింది. పాలు, మాంసం విరివిగా తినే అలవాటు, తాయ్ దేశస్థులనుంచి జపాను వారికి కూడా త్వరత్వరగా ప్రసరించింది!

**గో పూజకు కారణాలు**

హిందూ ఆర్యుల జీవితంలో ఆవు ఒక భాగమయింది. అందుకనే ఆవు 'కామధేను'వయింది. గేదెను, మనం సృష్టికి ప్రతి సృష్టి చేసిన విశ్వామిత్ర సృష్టిగానే పరిగణించాం అనిపిస్తుంది. దైవత్వం గేదెకు లభించలేదు. గోవును

"కామధేనువు"గా వర్ణించి, అది ఇవ్వలేని బలంగాని, మనకు తీర్చలేని కోరికగాని, లేదని అన్నాం! అది దాని పాలలోని మహాత్యం వల్లే.

ప్రతి పిల్లవాడు, మనిషి కనీసం రెండు మూడు గ్లాసుల పాలు, పలు విధ ఆహార పదార్థాల ద్వారా, మనం ఆస్వాదించ గలిగినప్పుడే మన ఆర్థికాభివృద్ధికి, కొనుగోలు శక్తి వచ్చినదానికి, సార్థకమైన చిహ్నం అవుతుంది.

## పాల సరఫరా దృశ్యాలు – నాడు నేడు!

మా చిన్నతనంలో ఊళ్లో పాలు ఊళ్లోనే వుండేవి. అమ్మేవారూ కొనేవారూ ఉండేవారుకాదు, వాడే అలవాటు చేసుకున్నారు. పాల అమ్మకం, పాపం అని కూడా అనుకునేవారు. పాలు ఎక్కువగా ఉన్న వారు, పాలు, పెరుగు, మజ్జిగ బీదవారికి "తప్పాలాల" నిండా ధర్మంగా పోసేవారు. లేనివారు జొన్నన్నం తినే వారు కనుక, వారు జొన్నలు దంచి, కడిగి, ఆ 'కుడితిని' తెచ్చి, వున్నవారి పశువుల వుపయోగం కోసం తెచ్చి, కుడితి తొట్టెలో పోసేవారు. ఇలా అంతా అభిరుచులను అనుసరించి పల్లెలోని పాల సంపదను పంచుకునేవారు.

తరువాత, క్రమంగా పట్టణాలలో కాఫీ హొటళ్ల వత్తిడి హెచ్చింది. తరువాత, కావిళ్లతో పాలు మోసుకునిపోయే పాలసప్లయిదారులు, బయలుదేరారు. లోకల్ రైలు పాసింజర్లనిండా ఈ కావిళ్ల వాళ్ల రద్దీ ఎక్కువగా వుండేది – ఇలా క్రమంగా పాల సప్లయి ఒక పథకం ద్వారా పల్లెల నుండి పాలు పట్టణానికి చేరుకోవటం మొదలు పెట్టింది! ఆ పాల అమ్మకం కాలంతో వ్యక్తిగతంగా మనవూళ్లో మనకే పాలు కొనుక్కోవటానికి దొరకవు. గౌరవం కొద్దీ వూరికే పొయ్యాలిసిందే! ఇది పాల పంపిణీ విధానంలో ఒక స్థాయిలో కలిగిన పరిణామం!

## పాల వాళ్ల బెడద వదిలింది!

రోజూ ఉదయాన్నే కాఫీ తాగే అలవాటు ఎక్కువ వ్యాప్తిలోకి రావటంవల్ల రోజూ పాలవాడి కోసం ఎదురుచూడ వలిసి వచ్చేది. మద్రాసు మొదలైన పట్టణాలలో తెల్లవారు ఝామున కూడా తమ పశువుతో వచ్చి పాలు పితికి పోసేవారు. అనుమానం, మోసం మన దేశంలో జరిగే వ్యాపారంలో పునాది రాళ్లు

కదా! అందుచేత పాలవాడు నీళ్లు కలపకుండా మనం చూస్తూ రెండు గుడ్లూ, అప్పచెప్పి చూస్తూ కూర్చోవాలి. పాలు పితికేవాడు, గిన్నెలలో, 'తోడుపాలు అనే' పేరుతో చీకటి చాటున ఎంతేనా నీరు (కొంత గిలకరించి పారపోసినప్పటికీ వుంచవచ్చు ఒక్కొక్కొప్పుడు హస్తలాఘవంతో తప్పాలాను తిప్పి, బోర్లించి నట్లు నటించి అందులో నీళ్లు వుండేటట్లు చేసుకోగలడు, అదే రోజు పాలవాడితో బాధ. ఈ బాధలన్నీ పోయి, క్రమక్రమంగా పాలశీతలకేంద్రాల నుండి సీసాలలోను, ప్లాస్టిక్ ప్యాకట్లలోను, స్టాండర్డు పాలువస్తూ, వార్తా పత్రికలతోపాటు, ఉదయాన్నే కాఫీ కూడా చేతికి అందే సౌకర్యం ఏర్పడింది. ఇంటి ఎదుటనే పాలు పిండే దృశ్యమూ అటువంటి పాలవాడి దర్శనమూ, ఇప్పుడు ఎక్కడోకాని కనిపించదు. ఇదీ మన 'పాలవిప్లవం' తెల్ల విప్లవంలో ఇప్పటికి సాధించిన విజయంలో ఇది ఒక చిన్న భాగం.

అయితే, ఇంకా కొంత మంది పాత అలవాటు చొప్పున, అబ్బా ! యీ ప్యాకెట్టు పాలు అంత రుచిగా లేవండీ తాజా పాల రుచి దీనికి ఎప్పుడూ రాదండీ అని తమ మాటలు సాగదీస్తూ ఆవులను, గేదెలను, ఇంటికి తేకపోయినా ఆ పాలవాడు తెచ్చే "చేతి పాలతో'నే ఆనందపడేవారు మనకి ఈనాడు కూడా అక్కడక్కడ కనిపిస్తారు. "చేతి పాలంటే" పాలవాడు, వాని ఇంటి దగ్గరే పితికి మనకు తెచ్చిపోసే పాలన్నమాట! నీళ్లు కలుపకుండా పాలవాడు, ఎంత డబ్బిచ్చినా, చిక్కనిపాలు తెచ్చాడంటే నిజంగా అవి చిక్కని (దొరకని) పాలే అనీ భగవత్ సాక్షాత్కారం అయిందంటే నమ్మవచ్చు, గాని, మరే మాటా నమ్మటానికి వీలులేదు సుమా, అని అనవచ్చు. నేను, మా పాలవానితో నీరు కలిపేటప్పుడు, "మంచి పరిశుద్ధమయిన నీరు కలపరా" అని హెచ్చరించే వాడిని పాత కాలంలో మా పాలవాడు, ఒక రోజున మా ఇంటి ముందర నా ఎదటే పంపు నీళ్లే కలిపి పోయటం నేను చూశా! పాలలో నీళ్లు కలపకుండా అమ్మితే శ్రీ కృష్ణుడి శాపం తగులుతుంది అని, చేతి పాలు పోసే ఆడ, మగ వారు నమ్ముతారుట. అదీ మన "చేతి పాల వ్యాపారుల నిజాయితీ !

## మరో తమాషా

మా మిత్రుడు, బొంబాయి పట్నం నివాసి. తమ పిల్లలను పాలు ఎక్కడ నుండి వస్తున్నాయ్యిరా? అని ప్రశ్నించాడుట. చిన్నగా వున్న పిల్లలు, ఎప్పుడూ సీసాల పాలు తప్ప, ఆ పాలు ఇచ్చే పశువులను చూడ లేదుకాబట్టి, "పాలు సీసాల లోంచి వస్తాయ్యని" తడుముకోకుండా సమాధానం చెప్పారుట. మరి

బొంబాయి మేడ మీది ఫ్లాటులలో వాసం. ఈ పాలసీసాల సరఫరాయే వాళ్లు పుట్టినప్పటి నుండి చూచింది! దానికి తండ్రి ఆశ్చర్యపడి, వారం రోజులు సెలవుపెట్టి కుటుంబంతో సహా ఒక పల్లెటూరు వెళ్లి కాపురం పెట్టి, పిల్లలందరికీ పాలు ఎక్కడ నుంచి వస్తాయో, బియ్యం ఎక్కడి నుంచి వస్తాయో, ఏ పంట పొలం ఎలా వుంటుందో, అన్నీ చూపించి వచ్చి వారికి నిజమైన జీవిత పాఠాలు బోధించి తృప్తి పడ్డానని నాతో చెప్పాడు! ఇదీ జరిగిన కథ!

## "పాల పరిశ్రమ" మన కామధేనువు

పాల పరిశ్రమ వచ్చిన తరువాత, గ్రామాలలోని రైతులకు మరో ఆదాయ మార్గం కొత్తగా ఏర్పడింది. పాలు మన పాతకాలం పద్ధతిలో 'దాలి'లో నిదానంగా కాచి, పెరుగు చేసే విధానం పోయినా, ఆధునిక పద్ధతిలో "పాశ్చరైజ్" చేసి, పాలలోని క్రిములను నశింపజేసి, శీతలీకరణం చేసి, ఎంత దూరముయినా రవాణా చేసే పద్ధతిలో పాలు చెడకుండా మనకు చేరేస్తున్నారు. మరి ఎక్కువ పాలు సమీకరిస్తే, పెరుగుగా చేసి, పాలు విరగగొట్టి 'చీజ్'గా చేసి, అమ్ముతున్నారు. పాలలో నుంచి వెన్న తీసి నెయ్యిచేసి, అమ్ముతున్నారు. త్రాగటానికి మజ్జిగలాగ అనువైన చల్లని పాలు కూడా పానీయాలుగా అమ్మి, మనల్ని 'సోడా" వాటర్ తాగే అలవాటు నుండి, తప్పించగలుగుతున్నారు!

తనకున్న దానిలో, ఎంత బీదవారయినా తమ సంపాదనలో కొంత భాగాన్ని పిల్లల పాలకు వినియోగించాలి. మరీ బీదవారయిన వారికి ప్రభుత్వం పాఠశాలలో విద్యార్థులకు, బాలవాడీలలో పిల్లలకు ఉచితంగా పాలపానీయాలు సేవా సంస్థలద్వారా పంచి, వారి ఆరోగ్యాన్ని అభివృద్ధి చేయవలసిన అవసరం ఎంతైనా వుంది. ధనవంతులు, దాతలు ఈ కార్యక్రమాలు నిర్వహించేటందుకు తమ విశ్వాసం చూరగొన్న సంస్థల ద్వారా వ్యక్తుల ద్వారా కొనసాగించవచ్చు. పాలను మించిన సామాన్య పోషకాహారం పిల్లలకు గాని, పెద్దలకుగాని మరొకటి లేదు. అందరికీ వివిధ రీతుల ఈ పాల సంతర్పణ జరిగినప్పుడే మన 'తెల్ల విప్లవం" ఫలితాలు, సామాన్య ప్రజానీకం ప్రయోజనకరంగా స్థిరపడుతాయి.

## అందరికీ పోషకాహారమే మంచి మందు!

ఎన్నో వేల సంవత్సరాల సంస్కృతికి నాగరికతకు వారసులమయిన మనం, ఈ "చిన్న పిల్లల సంక్షేమ కార్యక్రమాన్ని" త్వరలో ఆచరణలో పెట్టగలుగుతామని ఆశిద్దాం"

"మనసుంటే మార్గం కనిపించకపోదు, లేకపోదు!"

# XXXV

# వ్యవసాయం - ఫలసాయం

# AGRICULTURAL PRODUCTION

> Agriculture as a profession - Then and now The green revolution we achieved - Agriculture also must be planned like an industry. Modern irrigation projects and ecological changes-Displacement of people

ఇది 1991 సంవత్సరం - వ్యవసాయం ఒక పరిశ్రమ కింద గుర్తించి మన ప్రణాళికా సంఘం వారు తగు ప్రణాళికలు రూపొందించాలనిరైతాంగము, రాజకీనాయకులు, కోరుతున్న రోజులివి. పరిశ్రమ అంటే ఏమిటో పరిభాష తెలుసుకుంటున్న రోజులవి! పరిశ్రమ పద్దు కింద వ్యవసాయం రావాలంటే భూపరిమితి విధానం అడ్డొస్తుందని, అందుచేత, ఈ భూ పరిమితి చట్ట సవరణే అనవసరమని వాదించిన కొద్దిమంది ముఖ్యమంత్రులు వెల్లడించిన అభిప్రాయమని ఈ మధ్య ఢిల్లీ లో జరిగిన ముఖ్యమంత్రుల సమావేశాన్ని

గురించి వ్రాసిన రిపోర్టరు వ్రాశారు. వ్యవసాయ రంగానకి మన ప్రణాళికలలో యాభయి శాతం (50%) ధనం కేటాయించాలని కేంద్రమంత్రివర్గ నిర్ణయం, ఈ డబ్బంతా ఋణాల మాఫీకే వుపయోగిస్తే వ్యవసాయం కుంటుబడ్డ పరిశ్రమే అవుతుంది. అందుచేత, డబ్బుకేటాయించినా సరిఅయిన విధానంలో, వుపయోగించాలి! ఇవన్నీ లేకుండానే మనం హరిత విప్లవం (green Revolution) తీసుకువచ్చాం. ఇది చెడకుండా చూచుకోవటం ముఖ్యం.

వర్ధమాన దేశాలలో నూటికి ఎనిమిది శాతం మాత్రమే వ్యవసాయం మీద ఆధారపడి, ఆదేశంలో పండించగలిగిన మేరకు పంటలు పండిస్తూ సహకరిస్తారు. వందల ఎకరాల మీద వుంటారు కాబట్టి, సొంతదారులుగా ఆర్థికంగా బాగానే వుంటారు. మన దేశంలో నూటికి ఎనభయి మంది పల్లెవాసులేకనుక, భూమి మీదే, వ్యవసాయ కామందులుగాను, కూలీలు గాను తమ జీవనోపాధికి ఆధారపడి వున్నారు. భూమి తక్కువ, ఉత్పత్తి తక్కువ, జనాభా ఎక్కువ , అవటంవల్ల పేదరికం ప్రజలలోనూ పల్లెలలోనూ, పలువిధాలుగా వ్యాపించి వుంది. దీనికి భూసంస్కరణలు, అంటే "భూమి గరిష్ట పరిమితి" విధిగా విధించాలని, అప్పుడే ఈ "పల్లెజనాభా దారిద్ర్యం" కొంత వరకు అరికట్టగలం అనే వాదన సామ్యవాద సిద్ధాంతులది- దీనివల్ల దారిద్ర్యం పోతుందనే భావన ఆర్థిక వేత్తలకు లేదు. అయితే , ఓట్లు కావలసిన రాజకీయవాదులకు ఈ అమలుకు ఆదుర్దా మెండు. ప్రతి రాజకీయ పార్టీ, తమ ఎలక్షన్ ప్రణాళికలో ఇది తప్పకుండా 40 సంIIలుగా 'ఉచ్చరిస్తూనే ఉన్నారు'. నేటి వరకు సరియైన తీరున అమలు జరుపలేదని, దీనికి చట్టం అడ్డం వస్తోందని దానికోసం, మనరాజ్యాంగం సవరించి 9వ షెడ్యూల్ లో చేర్చాలని ఈ మధ్యనే కేంద్ర ప్రభుత్వం, మరోసారి ఆలోచిస్తున్నారు. అంతా గాంధీతత్త్వంలో పెరిగి పెద్దలయిన రాజకీయ వేత్తలే, ఎందుకింత ఆలశ్యం చేశారో తెలియదు. అయినా ఇంతవరకు జరిగిన, చట్ట సవరణలలో లోటుబాట్లను త్వరలో సవరించి మన భూసంస్కరణలకు రూపం ఇస్తారని ఆశిస్తున్నాం.

1937లో శ్రీ రాజగోపాలాచారి ప్రధానిగా (ముఖ్యమంత్రిని ఆరోజులలో ప్రధాని అనేవారు) వున్నప్పుడు భూసంస్కరణల కమిటీని వేశారు. ఆ కమిటీ కనీసం (400) నాలుగువందల ఎకరాలయినా వుండాలని గరిష్ట పరిమితి సూచించారు. విన్నవారు నవ్వారు ! ఇటీవల రెండు దశాబ్దాలలో జరిగిన

కౌలుదారీ చట్టంలో కౌలుదారును, భూకామందు తోసి పారెయ్యకుండా చట్టంతో మార్పులు తెచ్చారు. "దున్నేవాడిదే భూమి" అనే నినాదం పూర్తిగా అమలుకు రాలేదు. ఈ గరిష్ట, కనిష్ట పరిమితులతో సతమతంకాకుండా, మన బీదరికాన్ని తొలగించటానికి మన వ్యవసాయాన్ని ఎన్ని ఎకరాలుంటే, వ్యక్తిగతంగాగాని, సాముదాయికంగాకాని ఒక కుటుంభానికి సాగుబడి అవుతుందో నిర్ణయించి, దానికి తగిన వసతులు ఏర్పరచాలి. అన్ని ఆస్తులులాగే, భూమిని కూడా భయం లేకుండా ఆర్థిక స్తోమతు వున్న వారు పరిమితంగా పరిశ్రమల "షేర్ల'లో డబ్బు పెట్టుబడి పెట్టినట్లు మేధావులు ఇతర వర్గాలవారు వెచ్చించే సౌకర్యం వుండాలి. ఏది సరి అయిన పరిమితో అంతా కలిసి నిర్ణయించవచ్చు, ప్రస్తుతానికి అంతా వ్యవసాయదారుల, రైతుకూలీల,సంక్షేమ పధకాలు రూపొందించాలనే, రాజకీయ నిర్ణయానికి వచ్చారు కనుక, దాని ఫలితాలకు కాలానిదే బాధ్యత అని వదిలేసి, తిరిగి ఈనాటి, "వ్యవసాయాలు - ఫలసాయాలు గురించి ఆలోచిద్దాం.

## వ్యవసాయపు పుట్టుపూర్వోత్తరాలు

వ్యవసాయ జీవితం మానవుని నాగరిక జీవితానికి పునాది అడవులలోని ప్రకృతి ప్రసాదించే కందమూలాలు, ఫలాలు తిని, వేటాడి, మృగజాతుల మాంసాలను వండి, వండకతిని క్షుద్బాధ తీర్చుకునే పరిస్థితి మానవజాతికి మొదటి దశలో వుండేది. ఆ తరువాత స్థిరనివాసిగా వుండి, ఆహారోత్పత్తి చేయడం, ఆవులను, ఇతర జంతువులను మచ్చిక చేసి నిత్యోపయోగాలకు పెంచటం ఆరంభించటంతో మన వ్యవసాయజీవితానికి పునాది పడింది.

**భూదేవి ప్రసన్నం:** తరువాత చాలాకాలం వర్షాధారంగా పండే పంటలు వేసేవారు. తరువాత చెరువులు మీద వనరులు చేసుకున్న వాగుల నీటినుండి ఆ తరువాత మహానదులకు పెద్దపెట్టున నవీన పద్దతులలో ఆనకట్టలు కట్టి, కాలువల ద్వారా వ్యవసాయం ఏర్పాటయిన తరువాత, పంటలు నిలకడగా పండి, ప్రజలు స్థావరంగా వుండే అవకాశం దొరికింది., అలా పల్లెలు పట్టణాలు క్రమంగా ఏర్పడ్డాయి. ఈ వసతులతో పాటు, భూకామందులు, కూలీలు, స్థావర జీవితంలో భాగస్వాములుగా తయారయ్యారు. అప్పుడే భూదేవి మాతృస్థానాన్ని

అలంకరించింది. భూదేవికి విష్ణుమూర్తి హృదయంలో "లక్ష్మీదేవి'తో సమానస్థానం, పౌరాణికంగా ఏర్పరిచారు. – భూదేవి కంటే 'లక్ష్మి' లేని రోజులివి – ఈరోజులలో "లక్ష్మి"ని "కృషితో నాస్తి దుర్భిక్షం" అన్న ఆర్యోక్తిని, పక్కదారికి పట్టించి, అనేక తారుమారు మార్పుడుల ద్వారా, దళారీలు ఎంతో ధనాన్ని సృష్టించి, లక్ష్మీదేవిని చీకటిబజారులలో తిప్పుతున్నారు ! ఎంత సంపాదించినా, "కోటి విద్యలుకూటికొరకే"నని ఈ జానెడు పొట్టనింపడం కోసమేకదా! అది భూదేవి సానుభూతిలేనిదే కష్టం! దానికి తోడు, వరుణ దేవుడు, అగ్నితో కూడిన సూర్యుడు, పంటచెడకుండా వాయుదేవుడు కూడా అవసరం. ఆ విధంగా, అగ్ని వాయువు, ఆకాశం, భూమి, నీరు, మొదలైన పంచ భూతాల సహకారం, మానవ సృష్టికే మూలాధారాలు. వీటన్నిటి సహకారం మీదా ఆధారపడి వుంది మన వ్యవసాయంలో ఫలసాయం, నేటికీ!

ఈ గత వంద సంవత్సరాలలోనూ దేశంలో నదుల మీద "ఆనకట్టలు " కట్ట బడినాయి, సాగులు బాగా జరిగి ఈ నదీజలాలతో దేశం సస్యశ్యామలమయింది.. అంతకుమునుపే "సుజలాం, సుఫలాం" సస్యశ్యామలాం" అని కీర్తించిన దేశం ఇంత ఫలవంతం అయింది. వ్యవసాయంకూడా వృత్తిగా ఫలవంతమయింది. అయితే ఈ "ఫలసాయ" మంతా పెద్దభూస్వాములకు ధనిక వర్గానికి పెట్టుబడి పెట్టగల బడా ఆసాములకు మాత్రమే చెందుతోంది.–కూలీలు కూలీలుగానే మిగిలిపోయారు. అయితే ఈ అన్యాయాన్ని తొలగించటానికి పల్లెవాసుల ముఖ్యాధారమయిన వ్యవసాయరంగంలో అనేక మార్పులు వచ్చి, శ్రమ జీవులకు కొంతవరకు న్యాయం జరుగుతూనే వుంది – దానికి ముఖ్యంగా ఆంధ్రప్రాంతమంతా ఇంగ్లీషు ఇంజనీరయిన "సర్ ఆర్థర్ కాటన్" (SIR ARTHUR COTTON) దొరగారికి రుణపడివుంది. కరువుప్రాంతాలన్నీ కలకలలాడే పచ్చటి తివాచీ పరిచినట్లు కనిపించే పంట భూములై, జొన్నన్నము తినీ, జొన్నంబలి తాగీ బతికేది జనాభా అంతా. ఈనాడు వరి అన్నం గర్వంగా, బీదా గొప్పా తేడాలేకుండా తింటున్నారు – అదంతా 'కాటన్'' దొర గారి చలవే. ఈ బంజరు భూములే "బంగారు పంట పండుతాయి" అనినిరూపించాడు. అదే శంకరంబాడి సుందరాచారి "మా తెలుగుతల్లి" గాత్రంలో భాగమయింది!

## ప్రాజెక్టుల వలన ముంపు – ముందు ప్రమాదాల సూచన

మానవుడు తన సుఖం కోసం పంటకు వనరులు, త్రాగుటకు మంచి నీటి వసతులు అన్నీ తప్పకుండా ఏర్పాటు చేసుకోవాలి. కాని, కొంచెం ముందు చూపుతో ఈ " ఆనకట్టలు" కట్టవలెననే దృక్పధం ఇప్పుడిప్పుడే ప్రచారంలోకి వస్తున్నది.

ప్రకృతి సిద్ధంగా ప్రవహించే నదీవేగాన్ని ఆపి, నీరు నిలవ చేయట వలన ఆక్కడ కొద్ది స్థలంలోనే నీటి మట్టం పెరుగుటవలన, భూమి మోయవలసిన బరువు తాకిడి ఎక్కువవుతుంది. అడుగున ఒకవిధమయిన "నెర్రెలు" వుంటే భూకంపం కలిగే అవకాశం ఉందని నేటి భూగర్భశాస్త్రజ్ఞులు సూచిస్తున్నారు ప్రకృతిలో, ప్రతిసౌఖ్యానికి పక్కనే ఒక ప్రమాదం, ప్రతి సుఖానికి, ప్రక్కనే ఒక కష్టం వుంటాయనే వేదాంతపరమైన వాక్యం మనకు తెలిసిందే, – అందుచేత, ఈ ప్రమాద సూచనని కూడా ముందే కనిపెట్టి వుంటే, పరిగణిస్తే, నష్టంకంటె, లాభమే ఎక్కువగా వుండేది.

## వాతావరణంలో మార్పు – అడవులకు నష్టం

మన నవనాగరిక జీవనంలో, వూరికే వూపిరిపీల్చి విడిచినా, వాతావరణం విషపూరితమవుతోంది. ఆ విషవాయువులను, మన ప్రక్కనేవున్న పచ్చని చెట్లు శుభ్రపరచి, తిరిగి, ప్రాణవాయువును ప్రసాదిస్తుంది–ఈ 'ప్రకృతి తులాభారం'లో చెట్లు కొట్టేస్తే, అడవులు హరిస్తే విషవాయువులు ఎక్కువయి భూమి మీద జీవజాతి సృష్టికే ప్రమాదం, ప్రళయంలా వచ్చే అవకాశం వుందని, నేటి వాతావరణ శాస్త్రజులు ప్రపంచమంతటా ఎలుగెత్తి వాపోతున్నారు. వారి మాటకూడా అందరూ ఆలకించి మన వాతావరణాన్ని కలుషితం చేయకుండా ముందు జాగ్రత్త, తీసుకోవలసిన అవసరం, బాధ్యత అందరిమీద వుంది! ఈ ప్రమాదం రాకుండా, ప్రళయంలో, 'భూమి' అగ్నిగోళమై మండిపోకుండా అనేక ముందుచర్యలతో ఈ నీటి వనరులను ఏర్పరచుకుందాం – "వినదగు నెవ్వరు చెప్పిన, వినినంతనె వేగపడక వివరింపదగున్" అనే వాక్యాన్ని అనుసరించటం శ్రేయోదాయకం, ప్రమాదాలకు సంబంధించిన ప్రశ్నలను, సమస్యలను, కార్యక్రమాలను రాజకీయాలల్లో లాగ ప్రశాంతంగా ఆలోచించి నిర్ణయించాలి అంతే కాని, పంతాలకుపోయి శాస్త్ర విరుద్ధంగా ఉద్రేకాలతో రాజకీయ నిర్ణయాలు తీసుకోరాదు,

దేశంలో హిమాలయాల దగ్గిరనుండి అడవులుపోయి, కొండలు బోడులయినాయి. అడవులు నశించి వాతావరణ కాలుష్యం పెరిగే ప్రమాదం ఏర్పడింది. వర్షాధారంపోయి, భూమి ఉష్ణోగ్రత, పెరిగే ప్రమాదం ఏర్పడింది. అందుచేత, ఏ విధమయిన వనరులు ముందు ముందు వ్యవసాయానికి తోడ్పడుతాయో ఆ మాదిరి ప్రమాదాన్ని పెంచని వనరులతో, మనకు కావలసిన "ఇంధనం" వగైరాలను పెంచుకోవాలి – చిన్న పథకాలతో, ప్రకృతిని వికృతి చేయని విధానంలో నీటివనరులనుకూడా ఏర్పరుచుకోవాలని శాస్త్రజ్ఞులు నిజపరిస్థితులను విశదీకరిస్తున్నారు ! ఆ ప్రకారం ఇహపోదాం ! – ఇది ప్రపంచాన్నే ఆవహించిన ప్రశ్నగా తయారయింది

## పాతకాలపు పరిస్థితులు

ఈపై ఊహాగానం నుండి, మళ్ళీ ఆ నాటి మా ప్రాతూరు ప్రాంతపు వ్యవసాయ పరిస్థితుల మీదకి, పంటల మీదికి మన ఆలోచనలను పోనిద్దాం! ఆనాడు మా ప్రాంతంలో అంతా వర్షాధారమే, అందుచేత కరువు కాటకాలు ఎక్కువగా వుండేవి. రైతులకు ఋణభారం, బకాయీలు మెండుగావుండేవి. ఈనాటి వరిపంట, ఆనాడు మా ప్రాంతంలో, పంపింగు ప్రాజెక్టు ముప్పయి సంవత్సరాలకు ముందు అంటే వచ్చేవరకు అది లేదు! జొన్నలు, రాగులు, సజ్జలు, ముఖ్యమయిన పంటలు. బావిద్వారా నీటి వసతులు వున్నవారు పసుపు, మిరప, కూరగాయలు, పండించే వారు. మావూరు బెజవాడకు 5 కి.మీ దూరంలో వుండటం చేత ఈ గట్టువైపు వారంతా నాటికీ నేటికీ, కూరగాయలు, ఆకుకూరలు విరివిగా పండించి విజయవాడ వినియోగదారులకు అమ్మేవారు – నేటికీ అమ్ముతున్నారు.

కరువు ప్రాంతాలలో వేసంగులలో అసలు పచ్చికూరలే దొరికేవి కావు.అందుచేత వేసంగులలోచారులు, పప్పుచారులు, అనేక రకాలయిన కారపు పొడులు, ముందు జాగ్రత్త తో ఎండపెట్టిన దోస వరుగులు వంగ వరుగులు మొదలైనవి వంటలలో ఉపయోగించేవారు. ఇప్పుడు, నీటి వసతులు పుష్కలంగా వుండటంవలన అన్ని కాలాలలోనూ, ఎన్నో కాయగూరలు పండించి, వూళ్లతో సహా రైతులు వుభయతారకంగా సరఫరా చేయగలుగుతున్నారు. నీరు, విద్యుత్ శక్తి, రెండూ వుండటంవలన మోటబావులు మూలపడి, 'విద్యుత్ శక్తి మోటారు' ఎద్దులుబదులు బావిలో నీటిని బయటికి అహర్నిశలు తోడుతోంది.ఇదే మన నేటి హరితవిప్లవానికి లేక "పచ్చవిప్లవానికి" (Green Revolution) కి పునాది. ఇదే మన వ్యవసాయ రంగంలో వచ్చిన "హరిత విప్లవం". తరువాత వచ్చింది 'తెల్ల విప్లవం' ఈ రెండు విప్లవాలు నేటి మన ఆరోగ్యానికి ఆర్థికాభివృద్ధికి రెండు కళ్ళుగా నిలిచాయి.

## శ్రేయోరాజ్యం - అబ్కారీ రాబడి - గాంధీజీ దూరదృష్టి

మన జనాభా పెరుగుదల స్వరాజ్యం నాటి నుంచి నేటికి రెండు రెట్లయితే ద్రవ్యోల్బణం పది నుంచి ఇరవయి రెట్లయింది. అందుచేత, ప్రతిదానికి జనాభాను నిందించి లాభం లేదు. ఇంతవరకు బీద వారికి కావలసిన విద్య, ఆరోగ్యరక్షణ, కనీస అవసరాలు కల్పించకపోగా, మంచి పరిసరాలు కూడా ఇవ్వలేక పోతున్నాం. పరిసరాలు ఎలా వుండాలో నేర్పే విజ్ఞానంగాని ఇవ్వలేకపోయినా కనీసం అవి తెలుసుకోవాలనే జిజ్ఞాస కూడా కల్పించలేదు. గాంధీజీ, ప్రతి క్షణం ప్రజలలో యీ 'జిజ్ఞాస' కలిగించటానికే తాను, వారి పరిసరాలలో నివసించి చూపించాడు.

## 1937 నాటి ఉమ్మడి మద్రాసు రాష్ట్రబడ్జెట్టు

ఉమ్మడి మద్రాసు రాష్ట్ర బడ్జెట్టు మొదటి కాంగ్రెసు గవర్నమెంటులో, సాలుకు 15 కోట్ల రూపాయలు అంటే నమ్ముతారా? నేడు మన 'ఆంధ్రప్రదేశ్' సాలీనా బడ్జెట్టు 1990లో 5,600 కోట్లు. అంటే ఎన్నిరెట్లు? దాదాపు 375 రెట్లు. ఆనాటి 15 కోట్లకు ఎంతో విలువ, ఆ పదిహేను కోట్ల ఆదాయంలో మూడవవంతు అబ్కారీ ద్వారా అయిదు కోట్లు. అంటే, 30వ శాతం,ప్రజల తాగుడు ద్వారా. 1990లో 5600 కోట్ల బడ్జెట్టులో అబ్కారీ రాబడి దాదాపు 700 కోట్లు. అంటే శాతం ప్రకారం 12 శాతం, వంతుల ప్రకారం ఎనిమిదోవంతు ఆదాయం.

ఆనాడు, మద్యపానం తప్పకుండా నిషేధించటం మొదటి అంశం. అందుకోసం రాజగోపాలాచారిగారు "అమ్మకం పన్ను" (Sales Tax) విధించి, ఆ లోటు వెంటనే తీసివేశారు. బడ్జెట్టు యధావిధిగా నడిచింది. ఆ 15 హేను కోట్లలో, రెండవ అయిదు కోట్లు గవర్నమెంటు నౌకర్ల జీతాల క్రింద, మూడవ అయిదు కోట్లు, రోడ్లు వగైరాల అభివృద్ధి పధకాల క్రింద (Maintainance) అయ్యేది. 1946 - 48 వరకు మన రాష్ట్ర బడ్జెట్టు ప్రకాశంగారు, ఓమందూరు రామస్వామిగారు, కుమారస్వామిరాజాల వారి "ప్రధాని" మంత్రిత్వాలలో కూడా అలాగే ఉండేది. ఇహ క్రమంగా బడ్జెట్లు పెరుగుతూ అంతై ఇంతై కొండంతై మనకు వేలకోట్లలో ప్రసన్నమవుతోంది! అయితే ఈ ప్రణాళికల వల్ల ఉపయోగం,

బీదవారికి కొండను తవ్వి ఎలుకను పట్టినట్లుగా ఉద్దేశానికి, ఆశయాలకు, ఆచరణలో అనుభవంలో ఎక్కడా పొంతన లేకుండా పోయింది!

## పథకాల పొట్టలో బీదవారికి పురుగులు, పెద్దలకు లాభాలలో పరుగులు

ఈ మద్యం వల్ల వచ్చే ప్రతి ఒక్క రూపాయి ఆదాయం, క్రిందవున్న బీదజనాభా, మూడు రూపాయలు తమ మత్తుకోసం ఖర్చు పెడతారు. గవర్నమెంటుకు వచ్చేది ఒక రూపాయి. మధ్య దళారీలకు ఒక రూపాయి తాగేవారికి ముట్టేవిలువ ఒక రూపాయి. అంటే 1990 బడ్జెట్టులోని 700 కోట్ల ఆదాయంలో ఎన్ని కోట్లు బీద ప్రజల జేబులలోంచి అంటే ఆర్జనలోంచి వస్తోందో తెలుసుకోటానికి మరికొంత లోతుగా పరిశీలించి, ఆలోచించాలి. ఇది మనకు కనువిప్పు కలిగించే ఉదాహరణ వంటి లెక్కలు.

ఈ ఆదాయాన్ని, మొత్తం 'ఆబ్కారీ', ఆదాయమంటారు. ఈ 700 కోట్లలో

| | | | |
|---|---|---|---|
| 1. | కల్లుమీద పన్ను | 41 కోట్లు | |
| 2. | అరక్ (Arrak) అంటే నాటు సారా | 569 కోట్లు | –610 కోట్లు |
| 3. | పై తరగతి వారిపానీయాలు, విస్కీ మొదలైనవి | 67 కోట్లు | |
| 4. | బార్ లు మొదలైనవి | 16 కోట్లు | |
| 5. | త్రాగుడు పదార్థాల మీద వచ్చేది | 693 కోట్లు | |

ఇందులో 67+16 = 83 కోట్లుపై తరగతుల వారు త్రాగుతారు కాబట్టి అలా వదిలేద్దాం ! ఈ మత్తు పదార్థాలు, లేక ఇతర ఆబ్కారీ సరుకుల మీద వచ్చేది ఏడు కోట్లు మాత్రమే కనుక, దానిని కూడా అలా వదిలేద్దాం.

## 610 కోట్లుసారాల నుంచి వచ్చే రాబడి ఎక్కడనుండి వస్తుంది?

ఈ రెండు పద్దులు పూర్తిగా పల్లెలోను పట్టణాలలోని చేరీల లోను వుండే బీద జనాభా ద్వారా వస్తుంది. మరి కల్లు సారాయిలు తాగేవారు వారేగా! ఒక రూపాయికి మూడు రూపాయిలు కిందివారు ఖర్చు చేయాలని చెప్పాంగదా. అందుచేత 610 × 3 = 1830 కోట్ల రూపాయిలు విలువగల కల్లు సారాయిలు" బీదవారు తాగుతున్నారన్నమాట. వారిచేత త్రాగించి, ఆ ఆదాయం లేకపోతే,

అభివృద్ధి పథకాలు కుంటుపడతాయనీ, పథకాలే లేకుండా పోతాయనీ, పాలకులు భయపడిపోతున్నారు. కాని, ఈ విష వలయం నుండి మన ప్రణాళికలను బీద ప్రజలను రక్షిద్దామనే జిజ్ఞాసలేని, ప్రయత్నమే లేని, ప్రభుత్వాలు దేశంలో ఏర్పడ్డాయి. అందుకే ఈ ఆలోచన, ఈ విశదీకరణ.

**"ప్రోహిబిషన్" ఫలితాలు – 1800 కోట్లు బీదజనుల జేబులో నుంచి**

మద్యపాన నిషేదం వల్ల ముందర బీదజనుల జేబులో ఈ 1800 కోట్ల రూపాయిలు మూలగడం మొదలెడుతుంది. ఎదురుగుండా తాగే షాపులేక పోతే అదొక నిరోధకంగా అవరోధకంగా తయారవుతుంది. మళ్ళీ ఈ డబ్బు పెత్తందారుల చేతుల్లోకి వస్తుంది.

'గ్రామస్వరాజ్యం' స్థాపిద్దామను కుంటున్నాం. అక్కడికక్కడే ప్రజలదగ్గిరనుండి ప్రభుత్వ "పొదుపు పథకాలద్వారా" (Small savings Certificates) సేవింగ్సు పత్రాల ద్వారా తిరిగిరాబట్టి, గృహిణులను ఈ ఉద్యమానికి నాయకురాళ్ళను చేయించవచ్చు. ఆ డబ్బు అక్కడక్కడే ఖర్చు పెడుతూ బీద ప్రజల సంక్షేమ కార్యక్రమాలను రూపొందించి, ఇదిగో యీ డబ్బుతో మీరే అభివృద్ధి పథకాలు ఏ విధంగా ఉండాలో ఆ విధంగా అమలు పరుచుకోండి అని చెప్పండి. అదే సరిఅయిన అభివృద్ధి.

**బీదలది డబ్బు పెద్దలకు లాభాలు.**

ఒక చేత్తో ఇవ్వడం – మూడు చేతులతో పన్నులుగా జార్రటం :

తెలంగాణా ప్రాంతంలో 'ఆదర్శ జిల్లా' గా రూపొందింప బడుతున్న అదిలాబాద్ జిల్లాలో కిలో బియ్యం 'రెండు రూపాయిల' పథకం సరిగా అమలు పరుచుటకు కావలసిన "చౌకధరల దుకాణాల" సంఖ్యకంటే "కల్లుసారా దుకాణాల" సంఖ్యకు 'దేశవాళీగా తయారు చేసిన విస్కీ మొదలైనవి అమ్మే దుకాణాలు సంఖ్యను కలిపితే బియ్యం దుకాణాలకంటె ఎక్కువగా వున్నాయి : ఈ హైక్లాసు దుకాణాలను (Indian Made Foreign Liquors (IMFL) అంటారు. అందుచేత త్రాగుడు అలవాటయినవారికి మిగతా వారికున్న సామాన్య నీటికొరత లేదు. తమ దాహాన్ని తాగుడుద్వారా తీర్చుకునే అవకాశం గవర్నమెంటు కల్పించినందుకు వారు ఎంతో కృతజ్ఞులై వుండాలి. ఈ కంట్రాక్టర్ల తృప్తి కూడా కలిసివుంది. యీ "దైవసంబంధమయిన ఆనందంలో"

1. కల్లు దుకాణాలు 540
2. అరకు (Arrak) 860
3. ఈ దుకాణాలు మొత్తం 1600

చౌక దుకాణాల సంఖ్య మాత్రం 1098

గొప్పవారిలో కల్లు త్రాగేవారి సంఖ్య తక్కువే. కల్లు అమ్మకం కూడా తక్కువే. ఇహ (IMFL విదేశీయులు త్రాగుడు గొప్పవారివంతే కనుక మనకు ఆర్థికపరమైన ఆర్ద్రత అక్కర్లేదు!

జనాభా అంతా, ఎక్కువ 'కిక్కు' (Kick) నిచ్చే సారాయి తాగుతున్నట్లు లెక్కలు తేలుతున్నాయి.

సారాయి విక్రయం 62.75 లక్షల 'లీటర్లు' (Litres) ప్రతి సంవత్సరం ఏమీ మిగిలిపోకుండా పూర్తిగా ఖర్చయిపోతున్నది. ఇది క్రమంగా పెరుగుతోంది కూడా.

అబ్కారీ డిపార్టుమెంటుకు 1979-80లో 4 కోట్లు
1988-89లో 23 కోట్లు వచ్చాయి

ఈ లెక్కల ప్రకారం పెరుగుతూనే పోతుంది అయితే సివిల్ సప్లయి డిపార్టుమెంటు లెక్కల ప్రకారం

1098 చౌకదుకాణాలు

1600 సారా దుకాణాలు వున్నాయి.

ఈ జిల్లాలో జరుగుతున్న పథకంలోని ఇతర వివరాలు

ఒక జిల్లాలో

జనాభా 17 లక్షలు

పల్లెలు 1748

గ్రీన్ కార్డు హోల్డర్సు 3,41,000. మంచి చౌకదుకాణాలలో ఖాళీలు 120.

కిలో బియ్యం రెండు రూపాయిలు పథకం ప్రకారం తలసరి ఒక కిలో మొత్తం 5 కిలోలు బియ్యం మించకుండా ఇవ్వవలసినవారే.

బియ్యం కావలసినవి 71 టన్నులు. ఇస్తున్నది 5500 టన్నులు.

1990 జూన్ నెలలో ఇచ్చినది 5056 టన్నులు మాత్రమే.

(ఇవన్నీ ఉదాహరణకే)

"మద్దతు బియ్యం" ద్వారా
గవర్నమెంటుకు ఖర్చు నెలకు రూ.60 లక్షలు
కాని, ఆబ్కారి పన్ను ద్వారా వచ్చే ఆదాయం నెలకు 2 కోట్లు
మరి, ఈ రెండు కోట్లు వారి జేబుల్లోనే ఉంటే మనం మద్దతు బియ్యం ఇవ్వనక్కర్లేదు కదా!
అందుకే ఒక చేతితో ఇవ్వటం మూడు చేతులతో ప్రభుత్వం తిరిగి "గుంజుకొని జార్రుకోటం" చేస్తోంది అనే మాట సార్థకమవుతున్నది.

మరి గాంధీగారి సూత్రాలలోని సుళువులను ప్రభుత్వాలు గ్రహించి చర్యలు తీసుకుంటే సంక్షేమ పథకాలు అపకార పథకాలు కాకుండా ప్రజలకు ఉపకారం చేయగలుగుతాయి.

**కల్తీ విషపూరిత సారాతో చస్తారు. మద్య నిషేధం ఉంటే!**
**అట్లా చచ్చేవారిని ఆపగలమా! చావనీ అనుకోవాలి.**

కల్లు సారాలు తాగటం అలవాటు ఎలాంటిదో సారాలలో కల్తీ కలిపే అలవాటు కూడా అంతే. క్రమక్రమంగా కల్తీలు కలపటం, కల్తీ చావులు తగ్గటం తప్పక జరుగుతుంది. జన జాగృతి, జాగ్రత్త, అన్ని పథకాలకూ అవసరమే. ఇప్పుడైనా ఈ మద్యపాన నిషేధాన్ని గూర్చి చొరవతో అయినా ఒక చర్య ప్రారంభించటం మంచిది ఇది గాంధీ మార్గం అని మాత్రమే కాదు. అసలు సిసలైన సన్మార్గం అని. అందుచేతనే ఇంత వివరంగా చర్చించడం అవసరం అనిపించింది.

*"అసతోమా సద్గమయ*
*తమసోమా జ్యోతిర్గమయ*
*మృత్యోమా అమృతంగమయ"*
*ఓం శాంతి శ్శాంతిః"* అని ప్రార్థిద్దాం.
సరి అయిన మనశ్శాంతిని ఇచ్చేదీ, సన్మార్గంలో నడిపించేదీ ఏది? చీకటి ఏది? వెలుగు ఏది? అని, మన గమనానికి దారి చూపే విధానంలో విహరిద్దాం. అని ఆ ఉపనిషద్వాక్యంలోని భావం. ఆలోచించదలుచుకున్నవారికి ఈ వివరణచాలు.

ఆబ్కారీ పన్ను వద్దనటంలేదు. ఆబ్కారీ పన్ను ద్వారానే ఈ సంక్షేమ పథకాలు జరపాలనుకోవటం పొరపాటు. ఆయుధాల ఉత్పత్తిమీదే జనాభా భద్రంగా బ్రతుకుతోందని, నిరాయుధీకరణ సాగితే చాలామంది నిరుద్యోగులవుతారని, అందుకు మారణాయుధాల ఉత్పత్తి తప్పక జరగాలనీ, అమెరికను ఆయుధ వ్యాపారస్తులు చేస్తున్న వాదన, నిజం అనిపించేది భ్రమే. అదే 'మద్యపాన నిషేధ చట్ట వ్యతిరేక శక్తుల వాదనలో వుందని ఒకరికొకరం నచ్చ చెప్పుకుందాం. అప్పుడు మొత్తం అందరి అభిప్రాయమూ అదే అవుతుంది.

### నీరా (Neera)

'నీరా'అంటే పులవని కల్లు. అది తియ్యగా ఉండి, మత్తు కలిగించకుండా ఉంటుంది. అందులో 'బి-కాంప్లెక్సు' (B-Complex) విటమిన్‌లు మొదలైన పోషక పదార్థాలు కూడా వుంటాయని యోజనతో గాంధీగారు నీరా తాగవచ్చుననీ, అది కుటీర పరిశ్రమ కింద పరిగణించమని, 'ఖాదీ భండారము" ద్వారా విక్రయించవచ్చునని అనుమతి ఇచ్చారు. గాంధీగారి ముద్ర కూడా ఉన్నది కాబట్టి తాగనివారు కూడా దాన్ని ప్రసాదంగా రుచి చూచి వదిలిన రోజులవి.

ఈ నీరాను చల్లగాచేసి వేసంగిలో మనం చల్లని పానీయాలు తాగినట్లే సీసాలలో కొన్నాళ్ళు సరఫరా చేసారు. దీని వలన గీత కార్మికులకు పని వుంటుంది. మామూలు జనాభాకూడా పానీయంగా అలవాటు చేసుకోవచ్చు. ఖద్దరు ధారణతో సహా ఈ 'నీరా పానీయం' సేవించటం ఒక భాగంగా రూపొందుతూ ఎందుకో కాని ఆగిపోయింది.

ఈ 'నీరా' కు లభించిన ప్రోత్సాహం చూస్తే నాకు ఒక సంగతి తట్టింది. గాంధీగారి ప్రబోధ రాపిడి బాధ పడలేక, బ్రిటిషు పాలకులు 'మితంగా త్రాగండని టెంపరెన్సు ప్రచారం ప్రారంభించినట్లే ఈ మధుసేవాసక్తులైన అనుచరుల బాధపడలేక గాంధీగారు ఆలోచించి ఆలోచించి అంతర్వాణిని సంప్రదించి చివరకు ఈ 'నీరా' నయినా ప్రజలను తాగనిద్దామని సమ్మతించినట్లు అనిపిస్తుంది. కాని, ఈ 'నీరా' ఎవరి ఆదరణ పొందకుండా నిష్క్రమించటంచేత, ఈ కల్లు విషయంలో ఒక కనువిప్పుగా వచ్చిన 'నీరా' తిరిగి మబ్బు చీకటిలోకి పోయింది. ఈ 'నీరా' ప్రచారం 'మఖలో పుట్టి పుబ్బలో మాయమయి" నట్లు అయింది. కనుక, దాని ప్రసక్తితో ఏమీ పని లేదు. ఇప్పుడు అందరూ వదిలించుకోవలసిన బాధ, చుట్టంలా వచ్చి దెయ్యంగా జాతిని పీక్కు తింటున్న 'మద్యపాన' సమస్యే.

# XXXVI

# చదువులు నాడు - నేడు

# OUR EDUCATION THEN AND NOW

My elementary education in Peda Avutapalli, High School Education in Gannavaram both in Krishna District. College Education in Kakinada, East Godavary - Medical studies in Madras, our State capital then. Agitational activities as a student in the pre-independence days.

నాకు మూడు సంవత్సరాలప్పుడు, మా తమ్ముడు 1918లో పుట్టాడు. అదే సంవత్సరంలో మాతామహుడు మా రంగారావు తాతయ్య, ఆయన తమ్ముడు వెంకటచలంగార్లు, ఇద్దరూ ఆరునెలలు తిరగకుండా పోవటంతో మాకు మద్రాసు ఋణం అప్పటికి తీరిపోయింది. అప్పటినుండి మా నాన్నగారి పెంపుడు ఊరయిన కేతనకొండ, ఆ తరువాత ఆయన మాష్టరీ

ఉద్యోగ రీత్యా ఉన్న ఊళ్ళో కృష్ణాజిల్లాలోని ఎలుకపాడు, ఆవుటపల్లి, గన్నవరం, కానుమోలు మొదలైన పల్లెల నివాసమయింది. అందుచేత మా చదువుతీరులన్నీ పల్లెటూరి చదువులే, అదీ చిన్న క్లాసులలో గడిచిన తీరుహైస్కూలుకు తాలుకా కేంద్రమయిన గన్నవరం రంగస్థలం అయింది. ఇంటర్ మీడియటు చదువుకు కాకినాడ. ఆ తరువాత మెడిసిన్ (Medicine) చదవటానికి మద్రాసు వెళ్ళడమయింది. అందుచేత, ఈ వూళ్ళ వాతావరణ ప్రభావమంతా మా చదువుల మీద, మామీద, పడింది. మావి పల్లెటూరి చదువులైనా "వానాకాలం చదువులు" కాకుండా మా అమ్మ, నాన్నగార్ల దృక్పథం ఎంతేనా తోడ్పడింది.

'ఎలుకపాడు' గన్నవరం తాలూకాలో చాలా చిన్నవూరు. అక్కడ రెండవ క్లాసు చదివా. మా తమ్ముడు కృష్ణుడు ఇంకా చిన్నతనం. కృష్ణలీలలు చేస్తూ వుండేవాడు. కృష్ణలీలలని ఎందుకన్నానంటే, రెండోవాడు చిన్నవాడు కాబట్టి అల్లరెక్కువ కనక ఎలుకపాడులో వుండగా, మా అమ్మ ఉట్టిమీద నెయ్యి పెరుగు పెట్టేది. వారం పదిరోజులు రావలసిన నెయ్యి అయిదారు రోజులే వచ్చేది. ఏమిటిరా ఇది అని చూస్తే మా అమ్మ చెరువుకు, మంచి నీళ్ళు తీసుకురావడానికి వెళ్ళినప్పుడు, ఒక చిన్న ఎత్తుపీట వేసుకుని మా కృష్ణుడు ఆ నేతి గిన్నిలో నెయ్యి కొద్దికొద్దిగా తినేస్తుండేవాడు! ఒక రోజున ఆమె వచ్చి తలుపు తీసేటప్పటికి, మా కృష్ణుడు నోటినిండా నెయ్యి, మూతినిండా పైన నెయ్యి చూసి అమ్మదొంగా! అని, మా అమ్మ నవ్వేసింది. అందుచేత, అదీ వాడి వయస్సు. అప్పటికి, వాడికి నాలుగు సంవత్సరాలుంటాయనుకుంటా. ఈ తరంలో లాగా మేం పట్టణంలో వుంటే ఏ కిండర్ గార్టెన్ (కే.జి)కో తోలి, వాడి వీపునిండా ఒక మూట పుస్తకాలున్న సంచీ తగిలించేవాళ్ళం. అదృష్టవశాత్తు ఆనాడు మేం పల్లెల్లో వుండటంచేత, ఏ గోచీయో లాగో వేసుకుని తిరిగే అదృష్టంలో పెరిగాము.

ఎలుకపాడులో రెండో క్లాసయిన తరువాత, ఆవుటపల్లిలో నాలుగో క్లాసులో వేశారు. అక్కడ నుండి అయిదవ క్లాసులో వుండగా 7వ క్లాసుకు "డబుల్ ప్రమోషన్ ( Double Promotion) ఇచ్చారు. రెండవ క్లాసులో వుండగానే, ఎ.బి.సి.డిలు, ఇంగ్లీషు మొదలు పెట్టి cat, rat, మొదలైన పదాలతో ఇంగ్లీషు అయింది. తరువాత ఆవటపల్లి 'మిడిల్‌స్కూల్' హెడ్ మాష్టరు గా

వున్న "లక్ష్మీ నారాయణ మాష్టారు గారు మాకు వారి వీధి అరుగు మీద కూర్చోపెట్టి, ఇంగ్లీషు నేర్పారు. అప్పుడే "చొప్పదంటు ప్రశ్న" అంటే ఏమిటో నేర్చుకున్నా! ఎంతో నెమ్మదిగా చెప్పే వారు మేము ముగ్గురం ఉండేవాళ్లం. ఆవటపల్లి రామచంద్రరావు, గాలిబాల సుందరరావు, నేను- మా ముగ్గురినీ , మూడవ ఫారంలో హైస్కూల్లో చేరేటట్లు తయారు చేశారు. మా ఇద్దరు మిత్రులు, గన్నవరం హైస్కూలులో చేరాము. మా నాన్న గారు ఇంకా పెద అవట పల్లిలోనే వుండటంచేత నన్ను మానాన్నగారు, బందరు తీసుకువెళ్లి అక్కడ మా పెదనాన్నగారు 'పెద ఎగ్గయ్య'గారి ఇంట్లో వుంచి, అక్కడ శ్రీ రామా హైస్కూలులో నన్ను మూడవ ఫారంలో చేర్పారు. శ్రీ రామా హైస్కూలుగురించి, నా ప్రవేశాన్ని గురించి, రెండు మాటలు చెపుతాను. దాదాపు నూట యాభయి సంవత్సరాల క్రితం ప్రసిద్ధికెక్కిన "బందరు ఉప్పెనకు" తట్టుకున్న మేడలో చదువుకున్నాం. ఆమేడలో మా శ్రీ రామా హైస్కూలుంది కనుక!

మా నాన్న గారి సహా ధ్యాయుడు, అక్కడ మాష్టరుగారు ఆయన నన్ను పరీక్ష (Test) చేశాడు. మూడవ ఫారంలో చేర్చమన్నాడు. అయితే మా నాన్నగారు మాష్టరు గారు కదా; అలాకాదు. రెండవ ఫారంలోనే చేర్చు, పునాది గట్టిగా వుంటుందని నొక్కి చెప్పారు. అయితే టెస్టు' చేసి ఆయన పట్టుబట్టి నన్ను మూడవ ఫారంలోచేర్చాడు. ఆయన ఇచ్చిన 'టెస్టు' ఇంకా జ్ఞాపకం ఉంది "Love begets love" ఈ ఇంగ్లీషు వాక్యంలో కర్త,కర్మ, క్రియలు, చెప్పమన్నాడు. సరిగ్గా చెప్పాను. దాంతో ఆయన సంతోషించి మూడవ ఫారంలో చేర్చాడు. ఈ 'Love begets love' అనే వాక్యంమీద ఇప్పుడయితే పుస్తకాలు రాయవచ్చు, ఈ రెండు 'లవ్ ల' (Love) మధ్య, ఎన్నోనా పురాణాలు, ఇతిహాసాలు, నాటకాలు, ప్రపంచంలో దాని ఎత్తున రాయబడ్డయని చెప్పేవాడిని. అందుచేత ఈ వాక్యం "Love begets love" అలా మా మనస్సులకు హత్తుకు పోయింది. అయితే, నాలుగవ నెలలోనే నాకు బందరునీళ్లతో సన్నిపాతం (Typhoid fever) వచ్చింది.

దాంతో అక్కడ చదువు మానేసి బెజవాడలో వున్న మా పినతాతగారు, డాక్టరు ఘంటసాల సీతారామ శర్మ (Dr G S Sarma) గారి ఇంటికి వచ్చి,

ఆరోగ్యం చేకూరేవరకు, అక్కడే వున్నాం. తరువాత, ఆ సంవత్సరమంతా ఆరోగ్యానికి, మానాన్నగారికోరిక ప్రకారం, బెజవాడలో ధీశక్తికి పునాదులు గట్టిగా వేసుకుని, గన్నవరం హైస్కూలులో తిరిగి మూడవ ఫారంలో చేరి, హైస్కూలు విద్య అక్కడే పూర్తి చేశా! అప్పటికి మానాన్నగారు, అప్పటి 'తాలూకా బోర్డు' ప్రెసిడెంటుగా వున్న ఆశ్వారావుపేట జమిందారుగారిని పట్టుకుని పిల్లల చదువుకోసమని గన్నవరం బదిలీ చేయించుకునిస్థిర పడ్డాడు. అలా గన్నవరంలో 8,9 సంవత్సరాలు వుండిపోయారు. ఇహ మా తమ్ముడి హైస్కూలు చదువు కూడా అయిన తరువాత, మేము మద్రాసు పై చదువులకు వెళ్లిన తరువాత నాన్నగారికి కానుమోలు, ట్రాన్స్ఫర్ అయింది. ఇహ ఆ ఊరిలో పని అయిపోవటం చేత, మా అమ్మ నాన్నగారు ఈ స్థిరవాసంనుంచి మరో వూరిలో వున్న పెద్ద పాకలోకి కాపురం మార్చారు మా అమ్మకు మాత్రం పాకలో నివాసం తప్పలా!

అయితే, మేము గన్నవరంలో వున్నది చిన్న పాక. నెలకు ఒక రూపాయి అద్దె, అది గన్నవరంలోని విష్ణ్వాలయానికి ఆనుకుని వున్నది. ఆ గుడి, పూజారులదే. అందుచేత, ఇల్లును ఆనుకుని పెద్ద దేవాలయం, ఆవరణ వుండేది అందుచేత, మాకు ఇల్లు ఇరుకు అనిపించలేదు. కొన్ని సంవత్సరాలయిన తరువాత, ఆపక్కనే మూడు రూపాయలకు , ఒక పెద్ద పెంకుటింటిలోకి అద్దెకు వెళ్లాం. అదంతా మా అమ్మ ప్రోత్సాహమే, లేకపోతే అద్దె, ఒక రూపాయినుండి, మూడు రూపాయలకు, అంటే మూడురెట్లు, ఖర్చు పెంచడమే! ఈ తరం వారికి ఇదంతా ఆశ్చర్యంగా వుంటుంది కదూ! అందుకే ఈ మాతరం కథ.

మా నాన్నగారికి కానుమోలు ట్రాన్స్ఫర్ అయ్యేటప్పటికి, మేం పై చదువులకు మద్రాసు వెళ్లాం. కానుమోలులో కూడా మొదట పెద్ద ఆవరణ, తడికెల దడి, వున్న పెద్ద పాక ఇంట్లోకి వెళ్లాం. తరువాత కొన్ని సంవత్సరాలకు మా అమ్మ ఆ ఇంటిలో చనిపోయిన తరువాత వేరే పెంకుటింట్లోకి ఎక్కువ అద్దె ఇచ్చి, మారాం,పాపం, మా అమ్మ మాత్రం, ఆ పాకలోనే అతి తీవ్రమయిన "టైఫాయిడ్" జ్వరంతోటే "పాక జీవితానికి" ఆహుతి అయింది. అయితే, ఎప్పుడూ ఆమెకు, పాకలో వున్నాననే విచారం లేదు. అబ్బాయిలు పై

చదువులకి వెళ్లారు, ముందు ముందు మమ్ములను సుఖ పెడతారనే ఆశ, ఆశయం తప్ప!. అమ్మా ! ఎంత గొప్పమనస్సే నీది. అమ్మ అంటే మా అమ్మే 'అమ్మ' అనిపిస్తుంది. ప్రతి వారికి, ఫారి వారి అమ్మ, అంతే. రష్యన్ విప్లవ గాధలలో, 'గోర్కీ' వ్రాసిన 'మదర్' పుస్తకం జ్ఞాపకం చేస్తుంది మా అమ్మ. నేనుకూడా ఆ అమ్మలాగే మన స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొన్నానుకదా ?

## కాకినాడ చదువులు

గన్నవరంలో హైస్కూలు చదువు అవగానే, నేను, కాకినాడ, పిఠాపురం రాజావారి కాలేజీ (P R College) లో ఇంటర్‌మీడియట్ చదవటానికి వెళ్లా. అక్కడికి వెళ్లటానికి, అక్కడ మా కాముడు పిన్ని, రమణమూర్తి బాబాయి వుండటమే. బాబాయి గారి ఇంట్లోవుండి, రెండేళ్లు చదువుకున్నా. కాకినాడ కాలేజి, ఆనాటి ఆ పట్టణ వాతావరణం, నన్ను ఎంతో ప్రభావితం చేసినయి !

పి.ఆర్. కాలేజి విద్యార్థి దశ వర్ణిస్తే ఆనాటి కాలేజి చదువుల సంగతి తెలుస్తుంది ! అంటే, 1933–35 నాటి మాట. అంటే, దాదాపు 55 సంవత్సరాలు, అంటే, ఒక అర్ధ శతాబ్దాన్ని అధిగమించిన మాట. అంటే, అంటే అని, పదే పదే అన్నానని అనుకోబోకండి అది అలా తెలియాలనే అన్నా.

అప్పటకి, విజయవాడ, తెనాలి, ఏలూరు, మొదలైన పట్టణాలలో కాలేజీలు లేవు! ఇంటర్‌లో సైన్సు గ్రూపు తీసుకోవాలంటే, కాకినాడ, విజయనగరం, విశాఖపట్టణం, రాజమండ్రి కాలేజీలకు వెళ్ల వలసిందే. మా బాబయ్యగారు విస్సా ప్రగడ వెంకటరమణ మూర్తి గారు, కాకినాడలో పోస్టల్ ఇన్‌స్పెక్టరుగా వుండటం చేత, నేను కాకినాడలో వారిదగ్గరనుండి చదువుకునే అవకాశం కలిగింది. చుట్టాల ఇళ్లలో వుండి చదువుకోవటం ఆ రోజులలో అలవాటుగానే వుండేది. ఆరోజులలో చుట్టాల ఆదరణ కూడా అలాగే సొంత కుటుబం అనిపించేలా వుండేది.. పొరుగూళ్లలో కాపురాలు పెట్టి చదవటానికిగాని హాస్టల్సులో వుండటానికి గాని చాలామందికి ఆర్థికస్థోమతు వుండేదికాదు. అందులో నేను కూడా ఒకణ్ణే అని చెప్పుకోటానికి నాకేమీ మొగమోటం చిన్నతనం లేవు.

పి.ఆర్.కాలేజిని కాకినాడలో పిఠాపురం రాజా వారు స్థాపించారు. ఆయన చాలా విద్యాసంస్థలను స్థాపించారు. అక్కడే అనాధ శరణాలయంకూడా

స్థాపించారు. కాకినాడలో రాజావారు "బ్రహ్మ సమాజస్థులవటంచేత, ఆ వర్గానికి చెందినవారు చాలా మంది ఆ కాలేజీలో "లెక్చరర్లు" (Lecturers) గా వుండేవారే. కాలేజి దగ్గర, పెద్ద "బ్రహ్మసమాజ" మందిరం వుండేది. ఆరోజులలో, మన హిందూమతాన్ని సంస్కరించి సర్వమత సమాన దృష్టితో, బెంగాలలో రాజారామ మోహనరాయ్ బ్రహ్మసమాజం, స్థాపించి, మద్రాసునుండి ఆనిబిసెంటు (Anne Besant) ప్రచారం లోకి తెచ్చిన 'థియోసాఫికల్" (Theosophical Society) సొసైటీవారి ఆలోచనలు, యువతరాన్ని ఆకర్షిస్తూ వుండేవి.

మా కాలేజికి అప్పుడు శ్రీ వేమూరి రామకృష్ణారావుగారు ప్రిన్సిపాలుగా వుండేవారు, పెద్దాడ రామస్వామి గారు, వైస్‌ప్రిన్సిపాలు. 'రక్షిత్' అనే బెంగాలీ యువకులు ఇంగ్లీషు చెప్పేవారు. వీరంతా బ్రహ్మసమాజానికి చెందినవారే. 'సర్వమత సమానత్వం, సర్వకుల సమానత్వమే బ్రహ్మసమాజం వారి ముఖ్య ఆశయాలు. విగ్రహారాధన కూడదని, మనసే దైవమందిరమని బ్రహ్మ సమాజం భావన. ఆ సమాజపు పాటలు కూడా వ్రాసి ప్రార్థనలు చేసేవారు! అందుచేత, దాని ప్రభావం మా విద్యార్థుల మీద వుండేది. నా మీద కూడా అవి చెరగని ముద్రలు వేశాయి.

వేమూరి రామకృష్ణరావు గారు ఇంగ్లీషులో చాలా పండితులు. బ్రహ్మచారి. విద్యార్థులందరూ చాలా కట్టుదైన శిక్షణలో వుండాలనే దీక్షకలవారు. రాత్రిపూట లాంతరు (విద్యుద్దీపాలు ఇంకాలేవు) పుచ్చుకుని హాస్టలు చుట్టూ తిరిగి, విద్యార్థులంతా తమతమ గదులలో వుండి చదువుతున్నారో లేదో చూచి వెళ్ళేవారు. గస్తీ తిరిగికూడా చూచేవారు. వారికి, విద్యార్థులయందు గల ప్రేమ, శ్రద్ధ మెచ్చుకో తగినవి. గురువుని దేవుడిలా పూజించే రోజులవి. 'సినీమా'కు వెళ్ళటమంటే కాలేజీ రోజులలో కూడా ఏదో తప్పుపనిగా భావించ బడేది.దాదాపు అవే రోజులలో మెడికల్ కాలేజీ హాస్టలు తలుపులు 9 గంటలకల్లా తాళాలు వేసేవారు. సినిమాకు వెళ్ళాలంటే గోడలు దూకి పారిపోవలిసిందే.

అవి, మహాత్మాగాంధీ స్వాతంత్ర్యోద్యమం నడుపుతున్న రోజులు. భయం తగ్గాలనే రోజులవి.విద్యార్థులలో ఎవరేం చేస్తున్నారో ప్రిన్సిపాలుగారికి రహస్య సమాచారం అందచేసే విద్యార్థులు, గూఢచారులు కొందరుండేవారు. మరి ఇవన్నీ హీనంగా భావించబడే రోజులు ఇప్పుడు వచ్చాయి. ఈ భావాలు

మాలో అప్పటికే వచ్చినాయి. పాశ్చాత్య దేశాలలో విద్యార్థులు అనుభవించుచున్న స్వేచ్ఛను, అక్కడ విద్యార్థులే ఇక్కడకు వచ్చిన కొందరు పెద్దలలో వుండి నందున వారు మా అందరికీ ఆదర్శ ప్రాయులుగా వుండేవారు.

ఆ సంవత్సరం 1934-35లో ఒక సారి 'పాత విద్యార్థి సమావేశం ఏర్పాటు చేశారు. అందులో పాల్గొన్న పెద్దలందరూ 'పి.ఆర్.కాలేజీ' లో చదువులు బాగావున్నా, ఈ గూఢచార వ్యవహారాన్ని విమర్శించారు. అదే పాతవిద్యార్థి సంఘంవారి మొదటి సమావేశం. చాలా సంవత్సరాల వరకూ ఆఖరు సారిగా అయిన సమావేశం కూడా.

కాకినాడ కాలేజీలో విద్యార్థులు అస్వతంత్రులుగా వున్న మాట నిజం. ఆ రోజులలో ఇంటర్‌మీడియట్ వారికి కూడా 'సెలెక్షన్' (Selection Examination) పరీక్షలు పెట్టి చాలామంది విద్యార్థులను యూనివర్సిటీ పరీక్షకు పంపకుండా వుండేవారు. ఇది హైస్కూళ్లలో కూడా ఎక్కువగా వుండేది. నేను మద్రాసులో వైద్య విద్యార్థి దశలో వుండగా మొట్టమొదటి కాంగ్రెసు పార్టీ గవర్నమెంటు 1937లో వచ్చింది. ఈ డిటెన్షన్ (Detention) పద్ధతి తీసివేయాలని,ఆందోళన చేసి కృతకృత్యులమయ్యాం. ఇవన్నీ ఇప్పటి విద్యార్థులకు వింతగా తోచవచ్చు. పరీక్షలలో 'కాపీ' చేస్తూ పట్టుబడితే వాడు ఆ సంవత్సరం కాలేజీ వదిలి పోవలసిందే. దేశమంతటావున్న 'డిటెన్షన్' విధానం, కాకినాడ కాలేజిలో మేము చదివే రోజులలో అందులో 'వేమూరి'వారి రోజులలో మరీ కటువుగా ఉండేది. బయట, ప్రభుత్వం కూడా కొంచెం ఖద్దరు వేసుకుని స్వతంత్ర భావాలు ప్రచారం చేసే మా బోటి వారిమీద, పోలీసు గూఢచారి నిఘా వేసేవారు. అందుచేత కాలేజీలో విద్యార్థులనే, విద్యార్థులమీద నిఘా వేసి వుంచడం నీచమైన పద్ధతిగా ఆ మొదటి సమావేశంలోనే ఆ కాలేజీ పాత విద్యార్థి అయిన డాక్టర్ 'కెప్టెన్' పైడా రమణమూర్తిగారు బాహాటంగా ఖండించారు. అంతే, అప్పటితో పాత విద్యార్థి సంఘానికి పురిటిలోనే సంధి కొట్టింది.

ఏది ఎలా వున్నా కాకినాడ కాలేజీలో చదివిన రెండు సంవత్సరాల కాలమూ మమ్ములనెంతో ప్రతిభావంతులను చేసిందనే చెప్పాలి. కాకినాడలో అంతకు ముందే 1930 నుండీ జరిగిన స్వాతంత్రోద్యమం వల్లా ఆ తరువాత మేం చదివే రోజుల్లో కాకినాడ బాంబుకుట్ర కేసు (Kakinada Conspiracy Case)

లో శ్రీ భయంకరాచారి మొదలైన వారినందరిని అరెస్టు చేసి కొన్ని నెలలు విచారణ జరపటం, విద్యార్థులందరూ స్వాతంత్ర్యోద్యమంవైపు దృష్టి మళ్ళించునట్లు చేసింది. అదీ నా కాకినాడ కాలేజీ విద్యార్థి దశ. గర్వంగా జ్ఞాపకం చేసుకోదగ్గది.ఆ తరువాత కాలంలో మన దేశంలో విజయవాడ నుండి 'నాస్తికమత' ప్రచారం చేసిన గోరాజీ (గోపరాజు రామచంద్రరావు) మాకు మా కాలజీలో 'బాటనీ' లెక్చరరుగా వుండేవారు. వారి ఖద్దరు పైజామా లాల్చీ 'భగతసింగ్' హాట్ లను మేమంతా అనుకరించి వేసుకునేవారం.

అలా రెండేళ్ళ కాలేజీ జీవితం చాలా సంతోషంగాను , దేశభక్తితో ఉగ్రూతలూగుతూ ఉత్తేజంతో గడిపినకాలంగా ఉండేది. కాలేజీకి నడిచిగాని, సైకిలు మీదగాని వెడుతోంటే దారిలో, ఇప్పుడు శిథిలమైన, 'యూరోపియన్ క్లబ్బు' చాలా కలకలలాడుతూ వుండేది. సత్యాగ్రహోద్యమం ఉధృతంగా ఉన్న రోజులలో, 1930-31 సంవత్సరాలలో అక్కడే రిజర్వుపోలీసులు గోడమీదకూర్చుని ఖద్దరు వేసుకున్నారా? అని, కొట్టేవారని కూడా చెప్పుకునేవాళ్ళం. నేను ఖద్దరు వేసుకుని తిరిగినా ఆ రోజులలో కూడా దెబ్బలు తినకుండానే తప్పిపోయిందని కూడా చెప్పుకునేవారం. అలా గడిచింది, మా కాకినాడ విద్యార్థి దశ. అదీ ఒక దిశ చూపించిన దశ.

## మద్రాసులో వైద్యవిద్యార్థిగా, స్టాన్లీ మెడికల్ కాలేజీ విద్యార్థి దశ. (Stanley Medical College Days)

1935 మొదలు 1940 వరకు అయిదు సంవత్సరాలు, 'స్టాన్లీ మెడికల్ కాలేజీ విద్యార్థిగా చదివి, డాక్టరయ్యాను. ఆ అయిదు సంవత్సరాలు జాతీయ చరిత్రలో ముఖ్యమయిన దినాలు. అప్పటినుండీ మనకు 1947 ఆగస్టు 14వ తేదీనాడు అర్ధరాత్రివేళ స్వాతంత్ర్యం లభించేవరకు దేశ చరిత్రలోను, ప్రపంచ చరిత్రలోను జీవించివున్న ఆ తరంవారి అనుభవాలు చరిత్రాత్మకమైనవి. చదువుకుంటూనే విద్యార్థి వుద్యమంలో పాల్గొనే అదృష్టం కలిగింది. కమ్యూనిష్టులని, సోషలిస్టులని, కాంగ్రెసు వాదులనీ భేదాలు లేకుండా అంతా కలిసి విద్యార్థి వుద్యమం నడిపాం. విద్యార్థి నాయకత్వంకూడా 'మద్రాసు విద్యార్థి సంఘానికి (Madras Students Organisation (M.S.O.)) సెక్రటరీగా పనిచేసి

స్వరాజ్యం వచ్చేవరకూ పోలీసు నిఘాకు గురి అయ్యే అదృష్టం కూడా పట్టింది. అప్పుడు నా వెంట ఒక ముస్లిమ్ సి.ఐ.డి. తిరుగుతూ వుండేవాడు. స్వరాజ్యం వచ్చిన తరువాత కనబడితే ఇప్పుడు ఏం చేస్తున్నావంటే కమ్యూనిష్టుల మీద నిఘాగా వేశారండీ అని, నిట్టూర్పుతో, అన్నాడు. పాపం పోలీసులదేముంది ప్రభుత్వం ఏమి చేయమంటే అది చేయటమే వారి విధి.

స్టాన్లీ మెడికల్ కాలేజీ హాస్టలులో 86 రూము నంబరులో నేనూ మా మిత్రుడు డాక్టర్ గాలి బాల సుందరరావు కలిసి వుండేవాళ్ళం. మా ఇద్దరి స్వభావాలు వేరు. నాది 'రాజకీయం' వాడిది 'ప్రేమకీయం'. విభిన్న తత్వాలలో నడిచేవి. మా గది ఒక సత్రంగా వుండేది. మా తత్వాలు చూచారుగదా. అందుచేత, అన్నిరకాల అతిథులు మా గదిలో రాత్రులు గడిపి మా ఖాతాల్లో హాస్టలులో భోంచేసి పోయేవారు.

ఈ రాజకీయ ఉద్యమాలలో పాల్గొనటంవల్ల, మా కాలేజీ ప్రిన్సిపాల్‌కు మాతోనూ పోలీసులతోనూ వేగడం కష్టంగా ఉండేది. అయినా, నేను ఏమి చేసినా ఒక ఆదర్శం కోసం చేస్తాననీ, ఎక్కడా విద్యార్థుల వల్ల అల్లర్లు లేకుండా చేస్తాననీ ఆయనకు నమ్మకంవుండేది. అందుచేత, వారికి నా యందు అపారమయిన ప్రేమ కూడా వుండేది.

నన్ను పోలీసులు ఆఖరు సంవత్సరం పరీక్షలో వ్రాత పరీక్షలు అయిన తరువాత 'ప్రాక్టికల్' పరీక్షల ముందు అరెస్టు చేసి తీసుకువెళ్ళారు. అయితే మా ప్రిన్సిపాలు డాక్టర్ టి.యస్ తిరుమూర్తిగారు నన్ను విడిపించి పరీక్షకు హాజరయ్యేటట్లు చేశారు. ఆ కేసు ఏదో ఆ తరువాత దాని నడక అది నడిచింది. ఏదో హామీ తీసుకుని కేసు ముగించారు. ఇదీ 1939లో నా ఆఖరి పరీక్ష మధ్య జరిగిన సంఘటన.

## కాంగ్రెసు పాలన - విద్యార్థి ఉద్యమంలో

1935 రాజ్యాంగ చట్టం ప్రకారం 1937వ సంవత్సరంలో మన దేశానికి సుమారు పావలా వంతు (1/4) స్వరాజ్యం వచ్చింది. దేశంలో అప్పుడు వున్న పదకొండు రాష్ట్రాలలో ఏడు రాష్ట్రాలలో కాంగ్రెసుప్రభుత్వాలు వచ్చిపాయి. దేశంలో స్వాతంత్ర్య పోరాటంలో ఒక విరామ దశ లభించింది. లభించిన

స్వపరిపాలన అతి తక్కువే అనేది నిజమయినా కొంతపెద్ద ఎత్తున ఎన్నికల సంరంభం, రాజకీయ అధికారం మన దేశప్రజలు రుచిచూశారు. మన కాంగ్రెసు నాయకులకు కూడా స్వపరిపాలనలో కొంత అనుభవం కలిగింది. బ్రిటిషు అధికారులు, గవర్నర్లు కూడా పరిపాలనలో ఏమీ అడ్డంకులు పెట్టరని మాట హామీ ఇచ్చినందున కాంగ్రెసు స్వపరిపాలన చేపట్టిన రోజులవి. విద్యార్థులు కూడా చాలా ఉత్సాహంగా తమ వుద్యమాలు నడిపిన రోజులు.

## విద్యార్థులుగా మేం మా ఉద్యమాల ద్వారా సాధించదలచినవి

1. హైస్కూళ్లలో 'డిటెన్షన్' పరీక్షల రద్దు.
2. ఆంధ్రరాష్ట్రం (ప్రావిన్సు) కావాలని పెద్ద వుద్యమం.
3. మద్రాసులో పరశువాకంలోని సి.యప్.టి విద్యార్థులకు, అప్పుడు మద్రాసులో వున్న మద్రాసు స్కూల్ ఆఫ్ టెక్నాలజీ విద్యార్థులతో పాటు వారికి డిప్లొమాలను ప్రసాదించవలసిన హక్కు గుర్తించునట్లు చేయుట.
4. ఎప్పుడు ఎక్కడ విద్యార్థులమీద పోలీసు దౌర్జన్యం జరిగినా దానికి 'నిరసన దినం' నిర్ణయించి, ప్రదర్శనల ద్వారా తీవ్ర నిరసన తెలియజేయడం.

## ప్రత్యేక ఆంధ్రరాష్ట్రం కావాలి

మేము 1937 లో మద్రాసులో ఆంధ్రరాష్ట్రం కావాలని జరిపిన విద్యార్థుల ఊరేగింపు మరపురానిది. దాదాపు 5 కి.మీ పొడుగున బారుతీరి వీధులలో 'ఆంధ్రరాష్ట్రం కావాలి' అనే నినాదాలతో నడిచాం. రాయపేటలోని కాంగ్రెసు భవనంలో పెద్ద సభ జరిపాం. డాక్టర్ పట్టాభి సీతారామయ్యగారు అధ్యక్షత వహించారు. అంతకు ముందు విజయవాడలో జరిగిన 'రాష్ట్ర రాజకీయ మహా సభాసంగతులు "హిందూ", పత్రికలో ఒక 'సింగిల్' కాలంలో 25 సెం.మీ: పొడుగున మాత్రమే (అప్రధాన విషయంగా) వేశారని 'హిందూ' పత్రికను ఆంధ్రదేశమంతటా తగులబెట్టారు. ఏ పత్రికా ఆ బెజవాడ మీటింగుకు ప్రాముఖ్యత ఇవ్వలేదు. అందుచేత, ప్రతి వార్తాపత్రిక ఆఫీసుముందూ 'డౌన్ డౌన్' అంటూ నినాదాలు చేశాం.ఆ పత్రికలూ ఒక పూర్తి పేజీ నిండా నాటి రాయపేట కాంగ్రెసు భవనంలో జరిగిన సభా కార్యక్రమంలోని వుపన్యాసాలు

ప్రకటించారు. అన్నింటిలోనూ ఒక 25 సెం.మీ నిడివిగల ఒక కాలంనుండి పూర్తి పేజీ వరకూ ప్రకటించారంటే విద్యార్థులు రాష్ట్రంకావాలనే ఆంధ్రుల తీవ్రమైన కోర్కెను ఎంత ప్రచారంలోకి తెచ్చారో స్పష్టమవుతుంది.

ఈ విధంగా ఆనాటి విద్యార్థి రాజకీయ జీవితం, విద్యార్థుల సమస్యలను పురస్కరించుకుని పనిచేయడం,రాజకీయ చైతన్యానికి కూడా తోడ్పడింది. ఆ ఉద్యమంలో పాలుపంచుకున్నందుకు నేను గర్విస్తున్నా. అదృష్టంగా భావిస్తున్నా. ఇదీ నా జీవిత తపస్సులో ఒక భాగమే కదా, అనే భావనతో.

## స్టాన్లీ మెడికల్ కాలేజీ - మద్రాసు

విద్యార్థులుగా వుండే, కాంగ్రెసు గవర్నమెంటులో స్టాన్లీ మెడికల్ స్కూలును స్టాన్లీ మెడికల్ కాలేజీగా మార్పించాం. ఇదొక పెద్ద విజయమనే చెప్పాలి. దేశం అంతటా వైద్య విద్యా విధానంలో ఒకేరకం డిగ్రీ ఎమ్.బి.బి.ఎస్. ఇచ్చేటట్లు ప్రభుత్వం చట్టరీత్యా చర్య తీసుకురావడానికి మన దేశంలో మొట్టమొదటి ఉద్యమం జరిపింది మేము. ఆ తరువాతనే కొద్ది సంవత్సరాలకు దేశంలో వున్న 'మెడికల్ స్కూల్సు' అన్నింటిని మెడికల్ కాలేజెస్‌గా మన రాష్ట్ర ప్రభుత్వాలు మార్చాయి. ఇది చాలా పెద్ద సంస్కరణే. ఈనాటి వైద్య విద్యార్థులంతా ఆ తరంవారికి ఋణపడివున్నామని భావించడానికి తగిన సంస్కారం. ఈ ముఖ్యమయిన సంస్కరణ రావటం మా 'ప్రిన్సిపాలు' మొదలైన వారందరూ ఎంతో ఎదురుచూచిన సంస్కరణ. అందుచేత, దానికి పునాదులు వేసిన మా బోటి వారందరిమీదా చాలా అభిమానంగా వుండేవారు. అదీ గురుశిష్యుల మధ్య సత్‌సంబంధాలు వుండటం వలన కలిగిన సంతోషకరమైన మార్పు.

ఈ మాదిరిగా ఆనాడు కొనసాగిన విద్యార్థి దశ ఎంతో చైతన్యవంతంగా గడిచింది. సాధారణంగా జీవితంలో వచ్చే వివిధ దశలలో 'విద్యార్థిదశ' చాలా అమృతతుల్యమయినదని, అందరూ అనుకుంటారు. అది నిజమే అయినా, జీవితంలో 'ఏదశ' గొప్పతనం, ఆ దశది! బాల్యం, యౌవనం, వృద్ధాప్యం అనే దశలలో మానవుడు ఆయా దశలలో తగిన విజ్ఞానం పొందుతూ వుంటాడు. అన్ని దశలలోనూ 'వృద్ధాప్యం' కూడా గొప్పదే. అయితే ఏ వ్యాధి చేతా

పీడింపబడకుండా చురుకుగా పనిచేయగలిగి వుండాలి. వృద్ధులైన మేధావులు, తమ జీవిత ఆశయాలను అనుభవాలను తరువాతి తరంవారికి రిలేరేస్‌లో మాదిరిగా అందించి అన్ని దశలలోనూ కూడా కొంత తృప్తిని అదనంగా పొందవచ్చు. అయినా, తిరిగి విద్యార్థి దశే అన్నింటిలోనూ ఉత్తమమయినదని ప్రస్తుతానికి ఒప్పుకుందాం.

ఇలా నా విద్యార్థిదశ నాలో ఎన్నో రకాల స్ఫూర్తిని కలిగించిందనడానికి సంతోషిస్తున్నా. ఇట్లా మొత్తం అనేకమంది గురువులు నాకు ఆదర్శ మూర్తులైనారు. వారిని గురించి కూడా చెప్పుకుందాం.

# XXXVII

# మా గురువులు

# OUR TEACHERS

Our teachers are equivalent to our presiding Gods. I always remember Mr. Sarangapani Ayyangar our Head Master at Gannavaram High School and Captain Dr. P.Krishna Swamy our Professor of Medicine in Stanley Medical School. They used to say that I am destined to be great, I carry their love and blessings in my memory.

Some teachers used to give punishing knocks with fingers on our heads - Very painful indeed. Today, no such corporal punishments are allowed

I was a student leader of a strike in the Stanley Medical College in 1939 - Our teachers appreciated my bold, firm and just stand and we got our recognition for the course - I was prepared to face complete dismissal on the occassion- That brought the admiration of my teachers and also of my follow students towards me.

గుర్బ్రహ్మ, గురుర్విష్ణుః, గురుర్దేవో మహేశ్వరః
గురుస్సాక్షాత్ః పరబ్రహ్మ, తస్మై శ్రీ గురవేనమః

మన జీవితంలో, తలిదండ్రుల తరువాత, మన మనస్సుమీద చెరగని ముద్ర వేయగలిగిన వారు మనకు వివిధ దశలలో 'విద్యాబుద్ధు'లు గరపెడివారు మన

గురువులు! వాళ్ళనే, మాష్టర్లు, లెక్చరర్లు, ప్రొఫెసర్లు అంటాం. పాతకాలంలో ఎనిమిదో సంవత్సరం నిండగానే గురుకులంలో ప్రవేశించి 18 లేక 20 సంవత్సరాల వరకు గురు శుశ్రూష చేసి శిష్యులు పండితులయ్యేవారు. ఆ కాలంలో కూడా పాతిక సంవత్సరాలకు 'పరిపూర్ణ పండితులయ్యేవారు.' పరిపూర్ణత అనేది ఎన్ని జన్మలెత్తినా, సాధించటం కష్టంకాబట్టి, ఊరికే పండితులయ్యేవారు. విద్య పూర్తి అయినదని తమ వృత్తులలో ప్రవేశించేవారు. అలాగే ఈ నాడు కూడా దాదాపు 25 సంవత్సరాలకుగాని, మనం చదివేకోర్సు పూర్తయి డాక్టరుగానో, ఇంజనీరుగానో మనం అనుసరించ దలచుకున్న మరో వృత్తి విద్యగాని పూర్తయి ఆధునిక కాలపు పండితుల మవుతున్నాం. అందుచేత, మనం మన జీవితాన్ని ప్రభావితం చేసిన గురువులను గూర్చి తలచుకొని, దానికి మనసులో ప్రణామము లాచరించటం మన విధి. పెద ఆవటపల్లిలో ఏడవక్లాసు చదివేటప్పుడు మాకు వారి వీధి అరుగుమీద కూర్చో పెట్టి ఇంగ్లీషు నేర్పిన సాత్విక స్వభావులు, శ్రీ లక్ష్మీనారాయణగారు. ఆయన వేసిన పునాదితోనే మూడో ఫారంలో నిరాఘాటంగా చేరగలిగా.

### సారంగపాణి అయ్యంగారు.

గన్నవరం హైస్కూలో చదివేటప్పుడు హెడ్‌మాష్టరుగారు సారంగపాణి అయ్యంగారు. ఆయన మద్రాసునుండి గన్నవరంలో పనిచేయడానికి వచ్చారు. ఆ రోజులలో పెద్ద హైస్కూళ్ళలోను, కాలేజీలలోను, ప్రిన్సిపాల్సుగా లెక్చరర్సు గా పనిచేయడానికి పండితులు అరవప్రాంతాలనుండి కూడా వచ్చేవారు. తెలుగువారిలో చదువుకుని ఉద్యోగాలు చేయాలనే జిజ్ఞాస కలవారు చాలినంతమంది ఉండేవారు కారు. అందుచేత అక్కడినుండి వచ్చినా అర్హులైన వారిని మన ప్రాంతానికి రండని ఆహ్వానించేవారు. అటువంటివారిలో సారంగపాణి అయ్యంగారు ఒకరు. ఆయనను నేను మద్రాసులో ప్రాక్టీసు చేస్తున్న రోజులలో తిరిగి కలుసుకునే భాగ్యం కలిగింది.

సారంగపాణి అయ్యంగారు ఎన్నో మంచి క్రమశిక్షణా ప్రవర్తనా నియమావళులు అమలు చేసే మనీషి. ఇంగ్లీషు బాగా చెప్పేవారు. రోజూ స్కూలు ఫైనల్‌లో ఒక అర తావు నిండా పూర్తిగా చూచివ్రాత, ఇంగ్లీషులోని ఒక పాసేజి (passage) ఏదైనా సరే వ్రాసుకు రావాలి అనే నియమం చేశారు. దాంతో దస్తూరి, కొంత ఇంగ్లీషు మనసునుంచి చదవటం, వస్తాయి. ఏంవ్రాశాము అనే ప్రశ్నే లేదు. ఏదైనా

సరే ఒకటి వ్రాశావా లేదా అనేదే ఆయన ప్రతిరోజూ వేసే ప్రశ్న, రుజావు చేసే అంశమూ.

ఆయన జేబులో ఎప్పుడూ ఒక చేతిరుమాలు ఉండేది. ఎక్కడబడితే అక్కడ చీదకూడదని, ఉమ్మి వేయకూడదని ఆయన బోధన. చేతిరుమాలులోకి చీది మడిచి జేబులో పెట్టుకునేవాడు. ఒకవేళ దగ్గుతో బాధపడుతుంటే, దగ్గు వచ్చి కళ్ళె వస్తే అది కూడా కర్చీఫ్‌లోనే ఉమ్ముకుని జేబులో పెట్టుకోవాలనేవాడు. ఇహ ఇవే అంత శుభ్రమయితే, లఘు శంక, గురుశంకల గురించి చెప్పనక్కర్లేదుకదా!

మాకు 'జనరల్ నాలెడ్జి' బాగా ఉండాలనేవాడు. అందుచేత, ఇంగ్లీషు రెండో పేపరులో పుస్తకాలలో లేని ఏదో ప్రశ్న మన ప్రపంచ జ్ఞానంతో వ్రాయవలసిన అభ్యాసంగా ఇచ్చేవాడు. ఆ మాదిరిగా ఆయన మాకు ప్రపంచ జ్ఞానం కలగాలని పరిసరాలు పరిశుభ్రంగా ఉంచాలని బోధించేవాడు. నాటికీ నేటికీ ఎక్కడబడితే అక్కడ 'ఖాండ్రించి' ఉమ్మేవారిని చూస్తోంటే నాకు ఒళ్ళు గగుర్పొడుస్తుంది. వారిని మాటలతో (కనీసం) పొడవాలనిపిస్తుంది. మనకు వ్యక్తిగత శుభ్రం ఎంత ఉన్నా సామాజిక సాముదాయిక, శుచి శుభ్రతలు చాలా తక్కువ, అసలు మన దేశ ప్రజలు, ఉమ్మి వేయకుండా ఉండటం మలమూత్రాదుల విసర్జనకు మరుగుదొడ్లలోకి వెడితే దేశంలో సగం రోగాలు ఉండవు, వ్యాప్తి చెందవు. ఈ సూత్రాలు సూక్ష్మమయినవే. అయితే అవి పాటించడానికి కొంతకాలం సాధన అవసరం. ఆ తీరుగా మనం మన జాతినే తర్ఫీదు చేయవలసిన అవసరం ఎంతేనా వున్నది

ఆ రోజులలో మాష్టర్లందరూ, పంచె, బూటు 'లాంగుకోటు' పైన తలపాగా, మెడచుట్టూ వచ్చేలా బిళ్ళ మడతలో ఉత్తరీయం వేసుకుని హుందాగా ఉండేవారు. ఇప్పుడు ఉపాధ్యాయులు, విద్యార్థులు ఒకే రకంగా ప్యాంటులు బుష్‌కోట్లు వేస్తోంటే ఎవరు చెప్పేవారో, ఎవరు వినేవారో తెలియటం లేదు. అయితే, పాఠాలుగాని సలహాలుగాని చెప్పితే వినేవారి సంఖ్య తగ్గిపోవటం చేత ఎవరు ఎవరో తెలియని దుస్తుల దుస్థితిని గూర్చి ఆలోచించడం అక్కర్లేదు.

నేనెవరిదగ్గిరా నడవడి, శీలమును గురించిన ప్రవర్తనా పత్రము (Conduct and Character Certificate) తీసుకోలేదు. అయితే, కాలేజీకి, కావాలి

గనక మా సారంగపాణి గారి దగ్గర నుండే తీసుకున్నా. అది, చాలాకాలం నా స్కూలు ఫైనల్ సర్టిఫికేట్లతో పాటు ఉండేది. మళ్ళీ నేను ఇరవయి రెండు సంవత్సరాల తరువాత మద్రాసునుండి విశాఖపట్టణంలో 'పీడియాట్రిక్సు ప్రొఫెసర్'గా చేరేవరకూ మరి సర్టిఫికెట్టు తీసుకోవలసిన అవసరం కలగలేదు. అప్పుడు మా గురువుగా డిపార్టుమెంటు అధిపతి అయిన డాక్టర్ ఎస్.టి. ఆచారిగారి దగ్గర మరో సారి సర్టిఫికెట్టు తీసుకున్నా.

సారంగపాణి గారికి నేనంటే ఎంతో వాత్సల్యమూ అభిమానమూ. నీవు తప్పకుండా గొప్పవాడివి అవుతావు అని ఆశీర్వచన పూర్వకవాక్కులు పలికేవాడు.

మా లెక్కల మాష్టారు కొంతి సీతారామయ్యగారు ఎప్పుడూ నవ్వుతూ చక్కగా లెక్కలు చెప్పేవాడు మా మిత్రుడు ఒకడు లెక్కలలో కాపీ కొట్టి నూటికి ఎనభయి తెచ్చుకున్నాడు. అయిదవఫారం నుంచి పదవక్లాసులోకి (S.S.L.C ) వచ్చాడు. మామూలుగా 'సింగిల్ డిజిట్' మార్కులు వచ్చేవాడికి అన్ని మార్కులు రావడంతో 'ఏరోయ్, వెంకటేశ్వరరావు చాలా మార్కులు వచ్చినయి,సంతోషం. అయితే 'ఆధీరం' (Theorem) చెప్పు అని నవ్వుతూ అన్నాడు. అప్పుడు బట్టీ పట్టానండీ, ఇప్పుడు చెప్పలేనండీ అని వాడు తడుముకోకుండా జవాబు చెప్పాడు. క్లాసంతా నవ్వుకున్నారు. వాడు ఎలా కాపీ కొట్టాడో చెపితే అదో పెద్ద కథ అవుతుంది. అయితే మా వెంకటేశ్వరరావు చాలా ప్రపంచ జ్ఞానం కలవాడు, చదువులో తెలివి తేటలకీ, ఆ తరువాత జీవితంలో అనుసరించబోయే వృత్తిలో పైకి రావడానికీ ఏమీ ఎక్కువ సంబంధం లేదు. తరువాత, మా వెంకటేశ్వరరావు, విజయవాడలో యుద్ధకాలంలో 'నేతాజీ హొటలు' పెట్టి చాలా డబ్బు సంపాదించాడు. వాళ్ల అమ్మగారు కూడా మేంచదువుకుండే రోజులలో 'పూటకూళ్ళు' పెట్టేది. నెలకు 10 రూపాయలలో మూడు పూటలా కడుపునిండా భోజనం పెట్టేది. ఆవిడపేరు రోశమ్మగారు. 'రోశమ్మగారి పూటకూళ్ళు' (హొటల్‌కాదు) అంటే ప్రసిద్ధిగా ఉండేది. ఆ రోజులలో ఇప్పుడు ఎంతో పెద్దదయిన గన్నవరం (కృష్ణాజిల్లా) లో ఒక మిఠాయి నర్సయ్యగారి కొట్లోనే "ఇడ్లీ" కాఫీ ఇచ్చేవారు. ఇప్పుడు ఉన్నన్ని కాఫీ హొటళ్ళు అప్పుడు లేవు. ఇప్పుడు బస్సు రూట్లు హెచ్చిన తరువాత, జనాభా పెరిగిన తరువాత, ఎన్నో ఆధునిక ఫలహారశాలలు వెలిసినాయి.

మాకు ఒక సైన్సు మాష్టరు గారు ఉండేవారు. ఆయన పేరు జ్ఞాపకం రావటంలేదు. కాని ఆయనను ఎందుకో 'బ్యూరెట్టు' గారని హేళన పేరుతో పిలిచేవారు. వినిపించీ వినిపించనట్టుగా ఎక్కడి నుండో 'బ్యూరెట్టు' అని వినిపిస్తే ఆయన కుత కుత ఉడుక్కుని కొంత ఉగ్రుడయ్యేవాడు.

మూడవఫారంలో ఉండగా నాగభూషణం మాష్టరుగారు మాకు జాగ్రఫీ చెప్పేవారు. ఆయన నెత్తిమీద 'మొట్టికాయ' మొట్టేవారు. 'ఒరేయ్' ఇలా రా అని 'తన కుడిచేతి మధ్యపొడుగువేలును మడిచి చూపిస్తూ 'ఒరేయ్ ఈ వేలుకొన్ని వేల తలకాయలను గట్టిగా తట్టి రుచి చూచిందిరా!' అని మొట్టికాయ మొట్టితే తల చిల్లు పడేటట్టు 'టక టక' మనేది. అప్పుడప్పుడు బెత్తంతో కూడా ఎందుకో కాని కొట్టేవాడు. ఒక రోజున మా క్లాసులో ఒక వయసు వచ్చి పొడుగుగా ఉన్న లక్ష్మణరావు అనే కుర్రవాడిని చెయ్యి పట్టమని కొట్ట బోయాడు. వాడు ధైర్యంచేసి ఆయన చేతిలోని బెత్తం లాక్కుని కొట్టటాన్ని గురించి తన నిరసన తెలిపాడు. ఆ రోజులలో హైస్కూలు మాష్టర్లకు పిల్లలను కొట్టే అలవాటు ఉండేది. ఇహ ఎలిమెంటరీ స్కూలులో అయితే చేతిలో బెత్తం లేందే మాష్టరు కాదన్నట్లు ఉండేది. ఇప్పుడు అవన్నీ అదృశ్యమయినాయి. కాస్త కూస్తో క్రమశిక్షణపేర భయపెడతారే కాని కొట్టే అలవాటు పోయింది. తరువాత, తరువాత నేనెక్కడైన ఏ మాష్టరు గారి చేతిలోనైనా బెత్తం కనిపిస్తే అది ముందర పారెయ్యండని చెప్పేవాడిని. ప్రతి హెడ్‌మాష్టరు గారి దగ్గర పెద్ద 'పేముబెత్తం' (Cane) వుండేది. ఇదీ ఆనాటి 'క్రమశిక్షణ'. శిక్షించే అనాగరిక క్రూర విధానము శోచనీయము.

డెబ్బయి ఎనభయి సంవత్సరాలముందు గోడకుర్చీలు, కోదండం మొదలైన శిక్షలు రాటుదేరిన అల్లరి చేసే పిల్లలకు విధించేవారు. 'కోదండం' అంటే కుర్రవాడిని ఒక దూలాన్ని పట్టుకుని వేలాడమని, కింద మంటలుగాని ముళ్ళుగాని పెట్టేవారుట. అది వదలటానికి కుర్రవాడికి ప్రాణభయంకదా. అవి అతి క్రూరమయిన శిక్షలుగా చిన్నవారి మనస్సుమీద భయంతోపాటు, తిరుగుబాటు మనోభావాలు కూడా ఏర్పడి పెద్దవారయ్యేటప్పటికి వారికి నేరాలుచేసే మానసిక స్థితి కలుగుతుందనటంలో సందేహం లేదు.

మా వెంకటాచారి మాష్టారుగారు, హిస్టరీ చెప్పేవారు. చాలా శాంతంగా దయగా వుండేవారు. వారు 'వాచ్‌మార్కు' సిగరెట్టు పీల్చేవారు. ఆ రోజులలో

పెద్దలు సిగరెట్టు తాగటం అందులో మాస్టరుగా ఉన్నవారు తాగటం ఆదర్శప్రాయంకాదనుకునేవారు. మా వెంకటాచారి మాస్టారు సిగరెట్టు తాగుతారంటే మాకు ఆశ్చర్యంగా ఉండేది. ఆయన సిగరెట్టు చేతికి లోపలవైపుగా పట్టుకుని పైకి కనిపించకుండా ఉంచి పొగపీల్చేవారు. అందుచేత ఆ పొగ వదులుతున్నప్పుడు చూస్తేగాని, ఆయన చేతిలో సిగరెట్టు ఉన్నట్టు ఎవరికీ తెలిసేది కాదు.

ఆ రోజావచ్చే సిగరెట్లలో వాచ్‌మార్కు సిగరెట్టు అన్నిటికంటే చౌవకగా ఉండేది. ఇతర బ్రాండ్సు 'బీయర్స్' (Bears - ఎలుగుబంటి మార్కు) 'సిజర్సు' 'కాప్టెన్', 'విల్సు' మొదలైన ఖరీదయిన సిగరెట్సు కూడా ఉండేవి. ఈ వాచ్‌మార్కు సిగరెట్సు ఒక 'కానీ'కి అయిదువున్న పెట్టె వచ్చేది. ఈ సిగరెట్టు ఎక్కువ 'కిక్కు' ఇస్తుందనేవారు. చిన్న ఫారాలలో మేంకూడా ఒకటిరెండు సిగరెట్లు కొనుక్కుని మిత్రులం కలిసి ఊరి బయటకు పోయి చాటుగా కాలుస్తూ ఉండేవాళ్ళం. అదీ ఆనాటి సిగరెట్టు చరిత్ర. ఇంకా ఎంతో వ్రాయవచ్చుకాని మళ్ళీ మన గురువుల సంగతికి వెళదాం.

### తోలేటి సుందరరామయ్యగారు

అప్పుడున్న మాస్టార్లలో కొంతమంది పార్టీలుపడి సారంగపాణి గారితో విరోధంగా ప్రవర్తించటం వల్ల, సారంగ పాణిగార్ని ట్రాన్సుఫరుచేసి అప్పటికి నర్సపూరు 'టైలర్' హైస్కూలులో పనిచేసి పేరు పొందిన వారిని హెడ్‌మాస్టరుగా తీసుకు వచ్చారు. ఆయన పొడుగ్గా బొద్రవాలుడు మీసాలతో గంభీరంగా ఉండేవాడు. ఆయన బూట్లు వేసి టకటక మనే శబ్దంతో ఆయన హైస్కూలు వరండా అంతా ఒకటి రెండు సార్లు గస్తీ తిరిగి విద్యార్థులంతా ఏం చేస్తున్నారో తనిఖీ చేసేవారు. వచ్చిన రోజునే స్కూలు ఫైనలు కుర్రవాడు ఒకడు పాఠంచెపుతూ బోర్డు వైపు తిర్గి లెక్కలు చేస్తున్న మా నిడమర్తి సత్యనారాయణ మాష్టారు తెల్లటి ఖద్దరు కోటు మీద పెన్ను విసిరి ఇంకు చల్లడమనే నేరం జరిగింది. ఎవరు చల్లారో సాక్ష్యం ఆధారం ఏమీ లేదు. అయినా, ఆ ముందు బెంచీలో ఉన్న ఇద్దరు ముగ్గురిని పిలిచి స్కూలులో ఉన్న పిల్లలనందరిని సభచేశారు. ఆ సభ మధ్య రెండు ఎత్తైన బెంచీలు ఎదురుబొదురుగా వేసుకుని

ఒకదానిమీద కుర్రవాడు రెండవదానిమీద గంభీరవేషధారి అయిన సుందరరామయ్య మాష్టరు గారు నుంచున్నారు. ఈ దుష్ప్రవర్తనను సహించేది లేదనీ, ఒక్కొక్కరి జాతకంలో అల్లరిచేసినప్పుడల్లా ఒక బ్లాక్ మార్కు (Black Mark) పడుతుందనీ మూడు బ్లాకు మార్కులు పడ్డవారికి స్కూలు నుండి ఉద్వాసనే అనీ ఉపన్యాసం ఇచ్చారు. తరువాత ప్రతి చేతిమీద మూడేసి దెబ్బలు కొట్టి సభ ముగించారు.

ఆ రోజులలో 'స్కూలు ఫైనల్' క్లాసులో కొంత పెద్ద వయసు వాళ్ళు అంటే 18, 20 సంవత్సరాలవాళ్ళు కూడా ఉండేవారు.14, 15 సంవత్సరాలున్న మేము వారి ముందు చాలా చిన్నగా కనిపించే వాళ్ళం. అలా ఆనాటి సభ ముగిసిన తరువాత పిల్లలకు ఆయనను చూస్తే హడలుగా ఉండేది.

అయినా పదవక్లాసుకు వచ్చేటప్పటికి మాస్టార్ల భయం కొంత తగ్గేది. ఎందుకంటే ఆఖరి పరీక్షల ఫలితాలు వారిచేతులలో లేవు కాబట్టి. గూడకట్టు ఎవరూ కట్టుకో కూడదు ఎందుకో నేను పదవ క్లాసులోకి వచ్చిన కొత్తలో ఒక రోజున గూడకట్టుతో తలకేదో తువ్వాల చుట్టి చూడటానికి రౌడీవేషంలో కనిపిస్తూ వచ్చా. అయినా పదవక్లాసులోకి వచ్చేశాననే 'గోరోజనం' కూడా కొంత కారణం అయివుండవచ్చు. ఆయన వరండాలో చూశారు. నన్ను చూచి 'ఏరోయ్'పదవక్లాసులోకి వచ్చానని ఏమన్నా పొగరెక్కిందా అని అరిచారు. అంతే. ఆ గూడకట్టు ఊడిపోయి బట్ట తడవలేదు గాని, మరి అలా ఎప్పుడూ గూడకట్టు కట్టుకున్నట్లు గుర్తులేదు. ఆ రోజుల్లో పెద్దమనుష్యులు ఎవరూ గూడకట్టుకట్టేవారు కాదు. సుఖరోగాలు తగిలిన వారు మాత్రమే గూడకట్టు కట్టేవారని ప్రతీతి. అందుచేత గూడకట్టు కట్టి బయటకు వచ్చాడంటే రౌడీ అని భావించే రోజులవి. అందుచేత మా సుందరరామయ్య మాస్టారు కోప్పడటంలో తప్పులేదు.

సారంగపాణిగారి వలె కాకుండా, సుందరరామయ్య మాస్టారు బాగా 'కారా కిల్లీ' అంటే పొగాకు కిల్లీ' వేసేవారు. 'కారాకిల్లీ' వేసేవారికి నోటినిండా 'ఉమ్మి' వస్తుంది. దానిని నోటిలోనేఉంచి, ఉంచి, బయటకు ఉమ్మేస్తారు. సుందరరామయ్యగారు, మాకు 'బి గ్రూపు' సబ్జెక్టు చెప్పేవారు. పాఠాలు చెపుతూ 'కారా కిల్లీ' నములుతూ ఉండేవారు. కొంతసేపయిన తరువాత, నోటిలో చేరిన ఎర్రటి లాలాజలాన్ని కిటికీలోంచి అవతలకు ఒక ఉమ్మే

గొట్టంలోంచి కొట్టినట్లు పెద్ద ధారగా ఉమ్మేశేవారు. ఆ దృశ్యం ఇంకా నా కళ్ళలో మెదులుతూనే వుంది.

'బి.గ్రూప్' సబ్జక్ట్సును గురించి ఒక మాట చెప్పాలి. ఆ రోజులలో పదవక్లాసుకు 'బి.గ్రూపు సబ్జెక్ట్సు' అని వూరికే జ్ఞానం కోసం చెప్పేవారు. పరీక్షలు ఉండేవి కావు. అవి బ్రిటిషు హిస్టరీ రెండవది 'ఫిజియాలజీ' సుందరరామయ్య గారు చెపుతున్నారు కాబట్టి శ్రద్ధగా కదలకుండా కూర్చుండేవారు. అంతేకాని సబ్జక్టుమీద భక్తి రక్తి అనేవి ఎవరికీ ఉండేవి కావు.

సంవత్సరాంతంలో బడి తెరవగానే, ఐదవక్లాసు ఫలితాలు మొదటు అయిదవ ఫారం వరకు స్కూలు పరీక్షలే కాబట్టి ఫలితాల పట్టా తెచ్చి 'పాస్' (Pass) 'ఫెయిలు'(Fail) లిస్టు చదివేవారు. అది హెడ్‌మాస్టరుగారే చదివేవారు. దాదాపు నూటికి 90 శాతం ప్యాసు అయ్యేవారు. అంతా చదవటమయిన తరువాత సుందరరామయ్యగారు, ఒక చిన్న గంభీరోపన్యాసం ఈ విధంగా దంచేవారు.

"మీరంతా మీ స్వశక్తివల్ల ప్యాసు అయ్యారనుకునేరు, ఈ పాసయిన వారిలో నూటికి ముప్పయి వంతులు మందే తమంతట తాము ప్యాసయ్యారు. మరో ముప్పయివంతుల మందిని పూతత్రోశాం. మిగతావారిని పైకితన్ని పంపాం. అంటే పై క్లాసులోకి 'ఫుట్' బాలును తన్నినట్లు తన్నితే పోయారు. అందుచేత మీ అంతటమీరు ప్యాసయ్యారనుకో బోకండి," అని హెచ్చరించి, హాలులోంచి ఆయన వాణి ప్రతిధ్వనులు సమయకముందే నిష్క్రమించేవారు. బాగా చదవండి. ఇహముందు వెధవల్లారా అనకుండా మరో భాషలో ఆయన ధోరణిలో చెప్పారని ఇప్పుడు నవ్వు వస్తోంది. అయితే, ఎంత కొట్టినా తిట్టినా, ఆనాటి మాష్టర్లకి తమ శిష్యులు పైకిరావాలనే అభిలాషా ప్రేమే కారణం. మరి ఒక్కొక్కరిది ఒక్కొక పద్ధతి. ఈ రోజులు వేరు. మా తరం రోజులువేరు. వేటికి అవే మంచవీ ఆ కాలానుగుణము ను కోకపోతే మనశ్శాంతిఉండదు. విద్య అనేది మనో వికాసానికి కదా! ఆ మనస్సు కలకాలం వికసిస్తూ ఉండాలని ఆశిద్దాం.

కాకినాడ కాలేజి విశేషాలు ఇదివరకే వ్రాశాను. ఇహ మెడికల్ కాలేజీలో మమ్ముల ప్రభావితులను చేసిన గురువుల గురించి చెప్పుకుందాం. కాలేజీ విశేషాలు కూడా అనుబంధంగా చెప్పుకుందాంలెండి!

## మెడికల్ కాలేజీ దశ

మెడికల్ కోర్సులో మొదటి రెండు సంవత్సరాలు అనాటమీ ఫిజియాలజీ ముఖ్యంగా చెబుతారు. 'అనాటమీకి కృష్ణయ్య గారని మా లెక్చరర్. చాలా చక్కగా చెప్పారు. ఆయన కూడా 'సూటు' మీద తలపాగా పెట్టుకునేవారు. కన్నడ ప్రాంతానికి చెందినవారు. అప్పుడు మద్రాసురాష్ట్రం ఉమ్మడి రాష్ట్రంగా ఉండేది. 'మలయాళీలూ, కన్నడులు, తమిళులు, తెలుగువారు అంతా కలిసివుండేవారు. పెద్ద పట్టణంలో చదివితే మనకు కూడా చదువుతోపాటు ఒక విధమైన విశాల దృక్పథం ఏర్పడుతుంది. ఇతర ప్రాంతీయ భాషల వారితో పరిచయం ఏర్పడుతుంది. మద్రాసువెళ్ళిన కొత్తలో నా ఒక్కడికే 'తమిళం' రాదని అనుకునేవాడిని. మిగతా ప్రాంతీయులను చూచిన తరువాత, మనతో పాటు 'తమిళం' రానివారు మిగతా 'కన్నడులు', 'మలయాళీ'లను చూచి, నాతో ఇతరులు కూడా ఉన్నారని సంతోషించా!

రోజూ క్లాసులకు వెళ్లేవాడినిగాని, ఏయే పుస్తకాలు, చదవాలో సరి అయిన సలహాలు ఇచ్చేవారు కూడా ఉండాలి అనిపించింది. నేనేదో బడికి పోవటం వారు చెప్పిన 'నోట్సు' చదవటంతప్ప ముఖ్యంగా 'ఫిజియాలజీ' టెక్స్టు (Physiology Text Book) అంటే పాఠ్య పుస్తకంలేదు. పరీక్ష ఇంకా రెండు మూడు నెలలు వుంది. అప్పుడు ఒక సంఘటన జరిగింది.

మా 'ఫిజియాలజీ' లెక్చరర్ డాక్టర్ అళహసింగరి మాష్టరుగారు ఉండేవారు. ఆయన ఎప్పుడూ, ఆ రోజులలో కూడా ఖద్దరే వేసేవారు. ఖద్దరుసూటు, తలపాగా ధరించి బహు నెమ్మదిగా ఉండేవారు. ఆంధ్రా సంఘానికి అధ్యక్షులుగా ఉండి మా అందరి చేతా నాటకాలు వేయించేవారు. అవన్నీ బాగానే ఉన్నా చదువులు కూడా సరిగా ఉండాలికదా. రెండేళ్ళయినా ఇంకా నేను పుస్తకం కొనలేదు. పరీక్షలు దగ్గిరకొచ్చినయి. "ఫిజియాలజీ ప్రాక్టికల్' క్లాసు నడుస్తోంది. మా అళహసింగరి మాస్టారు అందరినీ ప్రశ్నలు వేస్తూ వారు ఎంతవరకు 'సబ్జెక్టు' లో ప్రవీణులయ్యారో అని పరీక్ష చేసుకుంటూ పోతున్నారు. నా దగ్గరకు వచ్చారు. ఆ ప్రయోగం మనం తినే అన్నం కడుపులో పొందేమార్పులను గురించిన ప్రయోగం. ఆయన మెల్లిగా కాసేపు నిలబడి నన్ను కొన్ని ప్రశ్నలు వేశారు. నేను సరిఅయిన సమాధానాలు చెప్పలేకపోయినా ఆయన ఏమీ

అనలేదు. మెల్లిగా నిన్ను బాధపెట్టి ప్రయోజనం లేదు.(There is no use worrying with you) అని మెల్లిగా అని నా తరువాత ఉన్న విద్యార్థి దగ్గరకు వెళ్ళారు. ఆయన మెల్లిగా అన్నా ఆ వాక్యం నాకు ఒక రామబాణం తగిలినంత బాధను కలిగించింది. నేను సరిగా చదవక పోబట్టేగదా అలా అన్నారని నాలో ఒక జ్యోతిని వెలిగించినట్లయింది. అందులో మా 'అళహసింగరి మాస్టారు' వల్ల మాట పడటమంటే అందులో అంత మార్దవంగా ఆయన నాలోని అవివేకాన్ని సంబోధించారంటే ఎంతో బాధ కలిగింది. వెంటనే బ్యాంకుకు పోయి డబ్బు తీసుకుని రిక్షా ఎక్కి బ్రాడ్వేకిపోయి పుస్తకాల షాపులో ఫిజియాలజీ టెక్స్టుబుక్ పదకొండు రూపాయిలకు కొని రాత్రంబవళ్ళు చదివి పరీక్షలో కృతార్థుడ్ని అయ్యాను. ఆయన అన్న వాక్యం యీ నాటికీ నాకు జ్ఞాపకం ఉన్నదంటే అది ఆయనయందు మాకున్న అపార గౌరవం. ఆయనకు విద్యార్థుల యందు వున్న శ్రద్ధ, ప్రేమలు కారణం. మా అళహసింగరి మాష్టారు ఖద్దరు ధారణతో మాకెంతో ఆదర్శప్రాయులుగా కన్పించేవారు, బ్రిటిషువారి పరిపాలనా కాలంలో గవర్నమెంటు ఉద్యోగస్థులు అందులోనూ ఉన్నత ఉద్యోగాలలో ఉండేవారు, ఖద్దరు వేయటంచాలా అరుదు. ఆ అరుదైన వారిలో మా అళహసింగరి మాస్టారుగారు ఒకరు. అందుకే ఆయన మాటలంటే మా అందరికీ అపార గౌరవం.'మంచి గొడ్డుకో దెబ్బ, మంచి మనిషికో మాట' అనే ఆర్యోక్తి ఆనాడు మా మాస్టారు వాక్కు నాలో కలిగించిన చైతన్యానికి కారణమైంది.

'అనాటమీలో' ట్యూటర్సుగా ఉండే వారిలో, అప్పలనాయుడుగారుండే వారు. బొమికెలను గూర్చి శ్రద్ధగా చెప్పేవారు. మరొకరు, డాక్టర్ మొదలియారుగారు. ఆయన అల్లూరి సీతారామ రాజును బంధించుటకు వెళ్ళిన రిజర్వు కాన్‌స్టేబుల్స్ మలబారు రెజిమెంటుతో డాక్టరుగా వెళ్ళారుట. అది ఆయనే చెప్పారు. అల్లూరి సీతారామరాజును కాల్చి చంపారని ఆయనను తాను చూచానని సీతారామరాజుగారు ప్రజలు అందరూ అనుకుంటున్నట్లుగా జీవించిలేరని చెప్పారు. అదీ ఆయన నాకు కలిగించిన అదనపు విజ్ఞానం.

## స్టాన్లీ కాలేజీలో వైద్య విద్యార్థిగా

వైద్య విద్యలో మూడవ సంవత్సరం వచ్చేటప్పటికి చేతిలోకి డాక్టర్ చిహ్నమయిన 'స్టెతాస్కోపు' వస్తుంది. పేషంట్లుగా ఉన్న వారికి సేవజేసే

నర్సులు వగైరాలు నాతో కలిసి టీమ్‌గా పనిచేసే అవకాశంతో సంతోషంగా కాలం గడుస్తుంది వైద్య విద్య శిక్షణలో ఎంత విరామం ఉన్నా ఎప్పుడూ డాక్టర్లు కష్టపడవలసిందే. ఊళ్ళో ఉన్న కాలేజీలన్నిటిలోకి మెడికల్ కాలేజీ విద్యార్థులే చాలామంచి దుస్తులు వేసుకుంటారని ప్రతీతి 'ది బెస్టు డ్రెస్‌డు పీపుల్' అనే ప్రఖ్యాతి ఉండేది. పైనుంచి చూచేవారికి 'అబ్బా ఎంత అదృష్టవంతులురా' అనిపించినా వారికి ఈ చదువులో బాధలు మెండు. ఉపోద్ఘాతంగా ఈ ఒక్కమాట చాలు. ఇంక అక్కడ మాకు ఆదర్శప్రాయంగా కృషిచేసిన గురువులను గురించి వ్రాసుకుంటా.

అక్కడ డా॥కె.సి.పాల్ అని, మాకు మూడవ సంవత్సరంలో పాఠాలు మొదలు పెట్టారు. ఆయన, ఇక్కడ మన ఆంధ్ర రాష్ట్రానికి 1976 సంవత్సరంలో గవర్నరుగా ఉన్న కె.సి అబ్రహమ్ గారి జ్యేష్ఠ సోదరుడు. ఆయనకు నేనంటే ఎంతో అభిమానం. ఆయన "డయాబిటిస్" నిపుణులు అంటే అతిమూత్రవ్యాధి, (మధుమేహం) అనే ఆ వ్యాధిచికిత్సలో నిపుణుడు. చాలా రోజులు లండన్ లోని "గైస్" హాస్పిటలులో తర్ఫీదుపొంది వచ్చారేగాని డిగ్రీలేమీ సంపాదించ లేదు. అయినా, అప్పటిలో 'డయాబిటిస్' వ్యాధి స్పెషలిస్టుగా ఆయననే ఊరివారంతా సంప్రదించేవారు. మనకు 1937లో కాంగ్రెసు ప్రభుత్వాలు వచ్చిన తరువాత, శ్రీ బులుసు సాంబమూర్తిగారు అసెంబ్లీ స్పీకరు అయ్యారు. ఆయనకు 'డయాబిటిస్' వ్యాధి ఉండేది. సాంబమూర్తిగారు 'డాక్టర్ పాల్' గారి సలహాప్రకారం ఆహారంలో అన్ని పదార్థాలూ ఒక ముద్దగా గిన్నెలో కలిపి, చెంచాతో తింటూ వుండేవారు అది 'డయాబిటిస్' చికిత్సలో ముఖ్యమయిన పరిమిత ఆహారం అనే చికిత్సా విధానం. తరువాత 'ఇన్సులిన్' ఇంజెక్షన్సు. ఈ రెండిసీ ఆయన అనుసంధానంచేసి వాడేవారు. ఈ సంఘటన 'డా॥పాల్' గారు కాంగ్రెసు వాదులకు, అందుమూలంగా నాకు, సన్నిహితులుగా ఉండేవారు.

కాంగ్రెసు గవర్నమెంటు వచ్చింది కదా! అందుకని, విద్యార్థులలో జాతీయ భావాలు ఎక్కువగా పొంగుతూ ఉండేవి. అంతవరకు మెడికల్ కాలేజి ప్రిన్సిపాల్స్ గా ఇంగ్లీషు దొరలే ఉండేవారు. 1939లో మొదటి సారి మా కాలేజీకి డా॥ టి.యస్. తిరుమూర్తి (Dr T S Tirumurthi) గారు మద్రాసు మెడికల్

కాలేజీకి, డాక్టర్, లక్ష్మణస్వామి మొదలియారును సర్ నియమించారు. క్రమంగా దొరలు అన్ని ఉన్నత పదవులలోనుండి నిష్క్రమించారు. మా గురువులు, ప్రిన్సిపాలు, డాక్టర్ తిరుమూర్తి కూడా ప్రథమ భారతీయ ప్రిన్సిపాలని చెప్పానుగదా! ఆయనకూడా జాతీయ వాదిగానే ఉండేవారు. ఆయన వచ్చిన కొద్దిరోజులకే ఒక గొప్ప సంచలనం మా కాలేజీలో జరిగింది. దానికి నేనే సారథ్యం వహించా, మాకు అప్పుడు అయిదేళ్ళు చదివిన, స్టాన్లీ మెడికల్ స్కూలువారికి, కొత్తరకం 'డిప్లమో' (Diploma) ఇవ్వాలని అందోళన చేస్తున్నాం. అంతకు ముందు ఆకోర్సు నాలుగు సంవత్సరాలు చదివిన పాత వారికిచ్చినట్లు L.M.P. (Licenciate Medical Practitioner) వద్దని సరిఅయిన కోరికే కోరాం. దానికి మా ప్రిన్సిపాలు మద్దతు కూడా వుంది. అయితే, మా ఆందోళన మాత్రం సాగుతూనే వుంది. అప్పటికింకా బ్రిటిషు ప్రభుత్వం బలంగానే ఉంది. ఆ తరువాతనే 1939 కాంగ్రెసు గవర్నమెంట్ రాజీనామా ఇచ్చింది. బ్రిటిష్ ప్రభుత్వానికి జీవన్మరణ సమస్య అయిన రెండవ ప్రపంచయుద్ధం తీవ్రంగా జరుగుతున్న రోజులలో.

### వార్షికోత్సవం

మా కాలేజి డే (వార్షికోత్సవం) జరుతులోంది దానికి ఇంగ్లీషు దొరగారైన సర్జన్ జనరల్ (Surgeon general) ఈ రోజులలో డైరెక్టర్ ఆఫ్ మెడికల్ సర్వీసెస్ (D.M S) అంటున్నాం. ముఖ్య అతిధిగా ఉండటానికి వస్తున్నారు. అయితే, విద్యార్థులంతా సభకు వెళ్లకుండా బహిష్కరించటానికి నిశ్చయించుకున్నాం ! ఆ సందర్భంగా బహుమతులు ఉంచ్చుకునే వారు తప్పకుండా బహిష్కరించేటట్లు చేశాం. ఇహ ముఖ్యఅతిథి బహుమతులు ఉంచ్చుకునే వారు ఎవరూ లేకపోతే, ఆ సభ అవమానంగా ముగిసినట్లువుతుంది కదా! సభ జయప్రదంగా జరపటానికి అల్లర్లు లేకుండానూ మధ్య మధ్య సి.ఐ.డి లను కూర్చోపెడుతున్నామని ఒక సి.ఐ.డి వచ్చి మా వార్డెన్‌తో చెప్పి వెళ్లాడు. నేనక్కడే కూర్చున్నా. అయితే, ఆ పోలీసు వాడికి నేనెవరో తెలియదు. అందుచేత ఆ రహస్యం నా చెవులో పడింది. ఆ సంగతి మనస్సులోనే పెట్టుకుని, విద్యార్థులను మాత్రం వెళ్ళవద్దని చెప్పి, ఆనాడు రహస్యంగా జరిగిన సభలో కూడా చెప్పి ఆ సభ ముగించా!

మరునాడు సాయంత్రం మీటింగు! ఆ క్రిందటి రోజు మా "లెక్చెరర్లు" అంతా మా హాస్టలుకు వచ్చారు. వారంతా మాకు పరీక్షలు చేసేవారే (Examiners) మధ్యమధ్యలో మన టీచర్లంతా పరీక్షాధిపతులు అందులో ఆరోజులలో ఎవరేనా దురదృష్టవశాత్తు వారితో దెబ్బలాడితే ఇహ మెడికల్ కాలేజీకి స్వస్తి చెప్పి, వెళ్ళిపోయి మరోవృత్తి చూసుకోవలసిందే. అంతమంది ఎగ్జామినర్సు అంతా మా పరీక్షాధిపతులు హాస్టలుకు సరాసరి వచ్చారంటే హాస్టలు చరిత్రలో అదివరలో ఎప్పుడూ జరగని పని. వారికి కుర్చీలువేసి చుట్టూతా విద్యార్థులంతా చేరారు మా మాస్టార్లలో కేప్టన్ కృష్ణస్వామి, కె సి.పాల్ మొదలైన మా మెడిసిన్ ఎగ్జామినర్లు ఉన్నారు. వారు అందరూ విద్యార్థులను ఉద్దేశించి మీ బాధ ఏమిటి? ఎందుకు రేపు సభ బహిష్కరిస్తున్నారు? అని అడిగారు కాని, ఎవ్వరూ జవాబు చెప్పలేదు. కొద్దిరోజులలోనే పెద్దపరీక్షలు ఉండటంచేత నేను లైబ్రెరీలో చదువుకుంటూ కూర్చున్నా. ఇక్కడ హాస్టలులో జరుగుతున్న భాగోతం నాకు తెలియదు. ఎవరు ముందుకు వచ్చినా వారికి పరీక్షలలో హాని జరగుతుందనే భయంతో మాట్లాడకుండా నుంచున్నారు. అయితే అందరూ తిరుమల రావు ఎక్కడ ఉన్నాడో చూడండని నన్ను లైబ్రరీలో పట్టుకుని అక్కడికి తీసుకువెళ్ళి నన్ను మా లెక్చెరర్ల ముందుకు తోశారు.

నేను అన్నింటికీ సిద్ధమేనని, అందరికీ తెలుసు. అందుచేత, మా మాస్టార్లను ఉద్దేశించి మాకు కావలసింది మా 'డిప్లొమా' L.M P నుండి (D.M.S (Diploma in Medicine & Surgery) అని మార్చవలసిందని. అయితే, వీరంతా మీరు వారిని పరీక్షలలో తప్పిస్తారనే భయం వలన ముందుకు రావటంలేదు, అందుకే 'సర్జన్ జనరల్' సభను బహిష్కరించటానికి నిర్ణయించాం. అయితే వద్దామనుకుంటే ఆ సభలో సి.ఐ.డి లు కూర్చుంటారని నాకు రూఢి అయిన సమాచారం ఉంది. అది మీకు తెలియక పోవచ్చు. అందుచేత ఈ పరిస్థితి ఏర్పడిన సందర్భంలో ఎలా రమ్మంటారు? అని అడిగాను. నాకు, మీరు పరీక్ష తప్పిస్తారనే భయంలేదు. తప్పిస్తే వెళ్ళి నా భూమి దున్నుకుని బ్రతకటానికి నిశ్చయించుకున్నాను. కాబట్టే, మీముందర అందరి మనస్సుల్లో ఉన్న సంగతి చెపుతున్నానన్నా. దాంతో మా మాస్టార్లు ఆశ్చర్యపోయి, అలా ఎన్నటికీ జరగదు. అయితే, పోలీసులు వస్తారని మాకు తెలియదు. ఒకవేళ అలాంటి

ప్రయత్నం ఉంటే వారు రాకుండా మేం హామీ ఇస్తున్నాం. అని డాక్టర్ కె.సి.పాల్ గారు, ఇతరులు హామీ ఇచ్చారు. ఆ హామీ నేనంగీకరించి, ఆ మధ్యాహ్నం విద్యార్థుల మీటింగు కాలేజీలో ఏర్పాటుచేశా. అక్కడ మా ప్రిన్సిపాలు, డాక్టర్. టి.ఎస్.తిరుమూర్తిగారు, మాకు కొత్త డిప్లొమా ఇచ్చే ప్రయత్నానికి నా పూర్తి సహకారం ఉంటుందని హామీ ఇచ్చారు. అప్పుడు వారిచ్చిన హామీని పురస్కరించుకొని వారి సలహా సహాయం మనకు తప్పక ఉండాలి కనుక, మనం సభకు హాజరు కావాలని ఉద్బోధించి, ఏ సమ్మెనయినా ఆరంభించటం తేలిక. కాని, ఒక విధంగా ముగించాలంటే అంత సులభం కాదు. అందులో సమ్మెకు కావలసిన కోర్కెలు ముందు తీరుస్తారనే హామీతో తృప్తి చెంది ముగించటం మరీ కష్టం. అదే పరిస్థితి వచ్చింది అప్పుడు. ఒకడు లేచి సమ్మె జరగాలిసిందే అని గంభీరంగా చెప్పేటప్పటికి నాయకుణ్ణి నేనయినా వాడి ఉపన్యాసంతో అంగీకరించి చప్పట్లతో సమ్మె కొనసాగాలనే కేకలు వేశారు.

అప్పుడు మా ప్రిన్సిపాలుగారు చేయునదిలేక సరే అయితే బ్రిటిషువారిని భారతీయుడైన ప్రధానోపాధ్యాయుడు వాని జాతివారినే అదుపులో పెట్టలేకపోయారని చెప్పనివ్వండి. (Let the Europeans say that an Indian Principal is not able to control his own students)అని చెప్పి వినుగుతో కాకపోయినా, చేయునది కనిపించక నిరుత్సాహంతో వెళ్ళబోతున్నారు. అప్పుడు నాకు మా విద్యార్థులమీద కోపం వచ్చి, ఆయన చెయ్యి పట్టుకుని నుంచో పెట్టి (Let it not be said that an Indian Principal is not able to control his students. It is for the first time that an Indian Principal is appointed. so Let us all go.ఇష్టం లేనివారు ఏ ప్రదర్శన లేకుండా సినిమాకు పొండని హెచ్చరించా. దాంతోటి సభ ముగిసింది. సగం మంది సినిమాకు పోయారు. సగంమంది మీటింగుకు వచ్చారు. బహుమతులు పుచ్చుకోవలసిన వారంతా రావడంతో సభ జయప్రదంగా ముగిసింది. అప్పటినుండీ, మా తిరుమూర్తిగారికి నేనంటే మంచి అభిప్రాయం. ఒక కారణం కోసం ఎంతైనా ఆందోళన చేస్తాడు. ఎంత త్యాగానికయినా సిద్ధపడే వ్యక్తి, అల్లరిపిల్లవాడు కాదు అనే ఉద్దేశం ఆయనకుకలిగింది. మాకు 'మెడిసిన్' లెక్చరర్ అయిన కేప్టన్ పి.కె. కృష్ణస్వామి గార్కి నేనంటే ఎంతేనా అభిమానం. "He is our leader', అని అనేవాడు. ముందు ముందు నీవు గొప్పవాడవుతావు, అని

ఆశీర్వదించాడు. డాక్టర్ భోగరాజు పట్టాభి సీతారామయ్యగారు, తోనూ మెడికల్ కాలేజీలో 'క్లాసుమేట్సు' (Classmates) గా ఉన్నాం అని చెప్పేవాడు. అలా మా గురువులందరికీ వైద్య విద్యార్థిగా ఉన్నప్పుడే చాలా సన్నిహితుడ నయ్యాను. చదువుకూడా చదివినంత సేపు శ్రద్ధగానే చదివేవాడిని. కనక, పరీక్షలను గురించి భయం ఎప్పుడూ కలగలేదు. అదీ ఆనాటి మా గురుశిష్య సంబంధం, సంపర్కం. మరి ఇప్పుడో మీరు పోల్చి చూసుకోండి.

# XXXVIII

# నా రాజకీయ గురువులు

# MY POLITICAL "GURUS"

The first leader and Guru who inspired the whole Nation during freedom struggle is, Mahatma Gandhi is my first 'Guru'. Sri Kamaraja Nadar was my second political guru His simple dictums of political readings have always impressed me From a simple volunteer in Congress, he rose to a position as a National leader, who was behind three Prime Ministers of India, I

స్వాతంత్ర్య సమరం రోజులలో యువతరానికి రాజకీయ గురువంటే దేశంలో, మహాత్మాగాంధీయే అందరికీ గురువు. అలాగే నాకు కూడా ఆయనే ప్రథమ గురువు. నేటికీ ఆయన భోధనలనే ఈ తరం వారికి తెలిసేటట్లుగా అన్వయించి వ్రాద్దామనే తపన. గాంధీజీ ఆధునికే సౌకర్యాలకు పారిశ్రామిక యుగానికి, అనటంకంటె, యంత్రయుగానికి వ్యతిరేకులని చాలా మంది భావన. ఆయన యంత్రానికి దాసులు అవవద్దాన్నాడేగాని, యంత్రమే పనికిరాదన లేదు. ఇప్పుడు నేను 'గాంధీఇజాన్ని" గురించి వ్రాయటం లేదు. ఆయన చెప్పిన వన్నీనేటికి కూడా సత్యాల్లాగే భావించే వాడిని కనుక, ఆయనే నా ప్రథమ రాజకీయ గురువు.

అయితే, 1935-40 మధ్య కాలంలో ఒక తమాషా. రాజకీయ

నాయకత్వంలో యువతరం, అంటే మా తరం, నడిచింది. గాంధీగారు ఉద్యమాన్ని దశలవారీగా నడుపుకుంటూ శాంతియుతంగా విప్లవాన్ని నడుపుతున్న రోజులవి. అయితే, ఒక పక్కన జయప్రకాష్ నారాయణ, సోషలిస్టుల మంటూ కాంగ్రెసులో వుంటూనే, ఒక ప్రచారం సోషలిస్టుల ముసుగులో కాంగ్రెసులో వుండి, కమ్యూనిష్టులు, కాంగ్రెసులోనూ బయటా వుద్యమాన్ని వుద్రిక్తపరిచిన దానికంటే, విప్లవం లేవదీసే నవశక్తిగా రూపొందుతున్నామన్న భ్రమలో ప్రచ్ఛన్నంగా పనిచేస్తున్న రోజులవి. మా బోటి యువకులకు, కమ్యునిష్టులకు, 1942 "క్విట్ ఇండియా" వుద్యమం నాటికి విడాకులు వచ్చినయి. అయితే ఉద్యమంలో సోషలిస్టు నాయకులైన, జయప్రకాష్, అచ్యుత పట్వర్థన్, అరుణా అసఫ్ ఆలీ మొదలైన సోషలిష్టులు వుద్యమానికి నాయకత్వం వహించటంతో మేం సోషలిష్టులతోనే వుండిపోయాం. ఈ "రాడికల్" దృక్పథం వల్ల గాంధీగారి, శాంతి మార్గమేకాకుండా, దౌర్జన్యం ఎక్కడైనా కలిస్తే దానిని విడనాడనక్కర్లేదనే వాదనలోని వారం. అలా 1935 నుండి, 1942 వరకు మా యౌవనమంతా గడవటంచేత, నేను స్వయంగా, గాంధీ గారి ఆశ్రమంలో కొంత కాలం గడపాలనే కోరిక పెరగలేదు. అందుచేత, వారి ఆశ్రమంలో కొంత కాలమయినా గడిపే భాగ్యం నాకు కలుగలేదు. అయితే, వారు చెప్పిన, పల్లెలలో నిర్మాణ కార్యక్రమంగా, వూరు ఊడ్పులు, పాకీ దొడ్లు శుభ్రపరుచుట, మొదలైన కార్యక్రమాలను అసహ్యం పడకుండా, గాంధీ గారి ఆజ్ఞతోనే శిరసా వహించాం. అయితే తరువాత, తరువాత, ఈ 'రాడికల్' దృక్పథంతో ఆయన ఆశ్రమ వాపానికి వెళ్ళ లేదు.

అయితే, 1946 డిశంబరులో గాంధీజీ స్వాతంత్ర్యం వస్తుందన్న దృఢమైన నమ్మకంలో వున్న రోజులలో ఆయన మద్రాసులోని దక్షిణ భారత హిందీ ప్రచారసభ "రజతోత్సవా"నికి వచ్చి, 15 రోజులు మకాం వేశారు. అప్పుడు దాదాపు వెయ్యి మంది వలంటీర్లను తయారు చేసి, దానికి, నాయకత్వం వహించి, ఆయన "బాడీగార్డుగా" (Body Guard) గా వుండి, కార్యక్రమం నడిపే అదృష్టం కలిగింది. దాంతో ఆలోటు తీరింది. అప్పటి

హిందీ ప్రచార సభకు సెక్రటరీగా వున్న , మోటూరు సత్యనారాయణ గారు మాకు 'గురూజీ'! రాజకీయంగా కాదు, గాని, ఈ గాంధీగారి కార్యక్రమంలో బాధ్యత నిచ్చింది వారు. వారు, అదివరకు 1942 వుద్యమంలో మా అందరితో అరెస్టయి జైలులో మాతో వున్నారు. మంచి తెలివిగల వారు హిందీ పండితులు మాకు హిందీ నేర్పేవారు గనుక 'గురుజీ' అని, అనేవారం. హిందీ సులువుగా నేర్చుకుని వుపన్యాసాలు ఇచ్చేవరకూ నేర్పారు. తరువాత, కేంద్రప్రభుత్వంలో, రాజ్యసభ మెంబరుగా, అయి రాజేంద్రప్రసాదుగారిక్కి, శ్రీ రాజగోపాలాచారి గారిక్కి సన్నిహితంగా వుండేవారు! మాకు కూడా కార్యక్రమాలలో చేదోడువాదోడుగా వుండేవారు. మేము విద్యార్థి దశలో వుండగా కూడా, వారు మా "స్టాన్లీ హాస్టల్" (Stanley Hostel)కు వచ్చినట్లు గుర్తు. -జైలు సహవాసం మమ్ములను ఎక్కువ సన్నిహితులను చేసింది. ఆ అనుభవాలను పురస్కరించుకొని, గాంధీజీతో పరిచయం" అని ఒక పుస్తకం "గాంధీఇజాన్ని' ఈతరానికి అన్వయిస్తూ వ్రాసి ప్రకటించానంటే నేను గాంధీ శిష్యుడనని, గాంధీ వాదినని నమ్ముతారు గదా!

## కామరాజనాడార్ నా రెండవ గురువు

కామరాజనాడార్, మద్రాసు రాష్ట్రంలోను అఖిలభారత దేశంలోను నాయకులుగా వుండి ప్రసిద్ధి కెక్కినవారు. కాంగ్రెసులో వలంటీరుగా ప్రవేశించి, ఎస్. సత్యమూర్తి మొదలైన నాయకుల శిక్షణలో రాజకీయాలలో తర్ఫీదయి, గాంధీజీ వలె, ఏ కోరికా లేని, నాయకులయ్యారు. త్యాగానికి అతనితో కూడిన సామాన్య వలంటీరులంటే ఆయనకు ఎంతో అభిమానం. ఆయన ప్రపంచజ్ఞానం అపారం! ఆయన కృషివల్లనే, నెహ్రూ ఎప్పుడూ ప్రశాంతంగా తన ప్రధాని పదవిని నడుపుకోగలిగాడు. నెహ్రూజీ తరువాత, కామరాజు పట్టుదల వలననే శ్రీ లాల్‌బహద్దూర్ శాస్త్రి భారత ప్రధాని అయ్యాడు. ఆయన కృషివల్లనే, మూలకూర్చున్న ఇందిరాగాంధీని, లాల్ బహద్దూర్ శాస్త్రి మంత్రివర్గంలో, నెహ్రూ సంతతి వారు ఎవరైనా ఒకరు తప్పక మంత్రి వర్గంలో వుండాలనే ఆలోచనతో, ఆవిడను "బ్రాడ్ కాస్టింగు మినిష్టరుగా" తీసుకు వచ్చారు. తద్వారా ఆవిడ భావిరాజకీయ జీవితానికి వూపిరిపోశారు.

లాల్‌బహద్దూర్ మరణానంతరం, "ఇందిరాగాంధీని" మొరార్జీకి వ్యతిరేకంగా, నిలబెట్టి, ప్రధానిని చేశారు. అలా ఇద్దరు ప్రధానులను ప్రసాదించిన ఘనత ఆయనకు దక్కుతుంది. అందుకే ఆయనంటే నాకు అంత అపార గౌరవం.

తరువాత, జయప్రకాష్ నారాయణ్, ఇందిరాగాంధీకి వ్యతిరేకంగా వుద్యమం లేవదీసి, దేశంలో 'ఎమర్జెన్సీ' తెచ్చినప్పుడు, జయప్రకాష్ వచ్చి, కామరాజనాడారును తన ఉద్యమంలో చేరమంటే నేను చేరనని నిరాకరించాడు. ఈ విధంగా ఆయనకు జవాబు కూడా చెప్పాడు, "శ్రీ రాజగోపాలాచారి, డి.ఎం.కె. వారితో చేతులు కలిపి మద్రాసు రాష్ట్రంలో కాంగ్రెసును నాశనం చేశాడు ఇహ నీతో చేతులు కలిపి, దేశంలోనే "కాంగ్రెసును" నాశనం చేసే ఉద్యమంలో నే చేరను, అని చెప్పి పంపాడు. అది ఎంతో సాటిలేని కాంగ్రెసు అభిమానంతో చేసిన పని అనవలసి ఉంటుంది! అయితే, తరువాత ఇందిరా గాంధీ కూడా ఆయనను సరిగా అర్థం చేసుకున్నట్లు కనిపించలేదు. ఆయనతో రాజీ మాటలు జరిపారు. అన్నిటికి అంగీకారం కుదిరినా ఆవిడ ఆయనను తిరిగిపిలవలేదు. నేను, ఆయనను కలుసుకున్నప్పుడు, మీ బోటి వారు ఇందిరతో చేరితే మంచిది గదా, మాటలన్నీ అయినవి గదా అంటే, "ఆవిడ నన్ను తిరిగి పిలిస్తే గదా!" అని, భావపూరితమయిన ఆవేదనను ఒక్క వాక్యంలో చెప్పాడు. ఇంతలోనే ఆయన హఠాత్తుగా మరణించటంతో, దాదాపు 10 లక్షలమంది ఆయనకు మద్రాసులో నీరాజనం సమర్పించారు. ఆ సందర్భంలో శ్రీమతి ఇందిరాగాంధీ కూడా మద్రాసు, హుటా హుటిన వెళ్ళి ఆ నీరాజన సమర్పణలో పాల్గొని వచ్చారు. కామరాజ్, ఎంతో ఆవేదనతో మరణించారు.

ఇంకా ఆయన చెప్పిన ప్రపంచజ్ఞాన, రాజకీయ సూక్తులు ఎన్నో నా మనస్సులో మెదులుతున్నాయి ఒక తడవ, తన మీద పోటీ చేసి ఓడిపోయిన వ్యక్తికి వెంటనే మంత్రి పదవి ఇస్తానన్నాడు. అరే! నిన్ననే కదా మీ మీద పోటీ చేసి వోడిపోయాడు. మంత్రిపదవి ఇస్తానంటున్నారు, ఇస్తే వస్తాడా అని, నేనన్నా! 'మంత్రిపదవి ఇస్తానంటే రానివాడు ఎవడు! అని, నిజమైన రాజకీయ ప్రవక్తగా ఆత్మ విశ్వాసంతో చెప్పాడు. నాటికీ నేటికీ ఇంక ముందుకూడా అదే నిజం అనిపించే సత్యం కదా! ఏ కాలంలోనైనా "మంత్రిత్వానికి

పెనుగులాడేవారిలో కొంతమంది మంచి వారిని చూచి నియమిస్తే 'అసమ్మతి వర్గం వెంటనే సమసిపోతుంది'- అలా ప్రకాశం గారు తనను వ్యతిరేకించిన 'మాధవ మీనన్' (Madhava Menon) ఒక్కనికి మంత్రిపదవి ఇచ్చివుంటే ఆయన మంత్రివర్గం 1946 సంవత్సరాంతంలో పడిపోయేదికాదు! అది కామరాజ్ రాజనీతి, ఇది ప్రకాశంగారి మొండి పట్టు అనాలి!!

ఇంకో సందర్భంలో చెప్పారు. "మనం బీద జనాభాకు చేయవలసింది ఏముంది, తిండి, గుడ్డ, తలదాచుకోడానికి ఒక గూడు, ఈ మూడూ ఇస్తాం ఇస్తాంఅని, మనం ఒక పక్క నుండి, కమ్యూనిస్టులు మరొక పక్క నుండి, అనటం, వినటం తప్ప జరిగిందేముంది? మనం ఇవ్వలేదు కమ్యూనిస్టులు ఇవ్వబోయేది లేదు" అని వ్యంగ్యంగా ఆవేదనతో అన్నారు. నాటికీ నేటికీ మనబోటి అభివృద్ధి చెందుతున్న దేశాలలో, కావలిసినవి యీ మూడే గదా, "రొట్టీ, కపడా, మకాన్" సినిమాలు తీసుకొని చూసుకొని పొంగిపోతున్నామే కాని, ఆచరణలోకి తేవడానికి దేశాన్ని, అన్ని ఆర్థిక వర్గాల వారిని ఆయత్తం చేయనేలేదు – వాడులంచగొండి, వీడు లంచగొండి అని, నాయకులు వాగ్వివాదాలలో పడికొట్టుకుంటున్నారే గాని, ఎవరెంత తిన్నా, ముందు లేనివారికి ఈ మూడూ సమకూర్చలేని దౌర్భాగ్య స్థితిలో వున్నామన్న జిజ్ఞాస అన్ని పార్టీల నాయకులలో కూడా కావలసినంత లేకపోవడం – విచారకరం, అదే, గాంధీజీ కోరిక, ఈ నాటి స్వాతంత్ర్యంలో మనం వుత్పత్తి ఫలితాలను, ప్రగతి ఫలాలను, "దరిద్ర నారాయణుడికి అందించే నాయకత్వం ఎప్పుడు వస్తుందా అని, ఆవేదనతో ఎదురుచూస్తున్నారు వారంతా"

"ఆలస్యం అమృతం విషం" అని చెప్పిన ఆర్యోక్తే నేటి మన సాంఘిక సమస్యలకూ, యువకుల సాయుధ తిరుగుబాటుకూ కారణమవుతోంది. చిత్తశుద్ధితో ఈ ప్రణాళికలను అమలుచేసే రోజు, త్వరలోనే వస్తుందని ఆశిద్దాం"

ఎప్పుడూ ఆ ఆవేదనతో వుండేవాడు కనుకనే, శ్రీ కామరాజనాడార్‌ను నేను గాంధీగారి తరువాత రెండవ గురువుగా భావించాను – ఇప్పటికీ ఆయన వచనాలే గురువాక్యాలుగా భావిస్తున్నా!!

మన రాష్ట్రంలో వున్నా నాయకులతో మాత్రమే పరిచయం నాకు. ఎందుకంటే నేను, 1949 తరువాత అధికార, ఎలక్షన్, రాజకీయాల నుండి విరమించుకొని, వైద్య వృత్తిలో నిమగ్నుడనయ్యాను. రాజకీయాలు వృత్తిగా తీసుకోలేదు. వృత్తిగా తీసుకోకపోతే రాజకీయాలలో వుండలేం . అయినా నా సేవకు పనికి వచ్చేటంత వరకు, రాజకీయ పరిచయాలు వదులుకోకుండా, నేటివరకూ నా కార్యక్రమాలను, నేను ఆచరిస్తున్నా!

కాస్తోకూస్తో 15 సంవత్సరాలుగా స్వాతంత్ర్య సమర యోధులకు సహాయం అందించి, శిశు సంక్షేమ కార్యక్రమాలలో పాల్గొంటున్నా! తోచిన మటుకు ఏదో రచనలు చేస్తూ కాలక్షేపం చేస్తున్నా. గాంధీజీ నేర్పిన ఒక తృప్తితో జీవిస్తున్నా. రాజకీయ పదవులు రాలేదని బాధ లేదు. ఆ రంగంలో ఉండిన వారు పడే బాధలు చూస్తున్నా, అందుచేత, నేను ఎన్నుకున్న జీవిత పంథా నాకెంతో నాడూనేడూ కూడా సంతోషకరంగానే ఉంది. ఆనాటి నాయకత్వం మీద నాకున్న గౌరవాన్ని, కాపాడుకుంటూ గర్వంతో ప్రకటిస్తున్నా!!

## రాజకీయ పతనం లేని ప్రకాశంగారూ నాకు గురుతుల్యులే!

గురువంటే, ఆయన ఆశయాలు మనకి నచ్చిన వారన్న మాట. అలాగ ప్రకాశంగారి జీవితానుభవాలు ఎన్నో మనకు, ఆదర్శ ప్రాయంగా ఉంటయి. ఆయన, తన జీవిత చరిత్రలో వ్రాసిన కొన్ని అనుభవాలు చిరస్మరణీయం. ఎన్ని తరాలు గడిచినా మాసిపోనివి. లక్షలు సంపాదించాడు. ఆ లక్షలను, మంచినీళ్లలా ప్రజాసేవలో ఖర్చుపెట్టాడు. స్వరాజ్యం కోసం వెదజల్లాడంటే బాగుంటుంది! "లక్ష్మి వచ్చే టప్పుడు రెక్కలు కట్టుకు వస్తుంది! పోయేటప్పుడు రెక్కలు కట్టుకుపోతుందని ఆయన వ్రాసింది జీవిత సత్యం.

ఆయన 1946-47లో మన వుమ్మడి మద్రాసు రాష్ట్రానికి ప్రధాని (ప్రీమియర్) గా వున్నారు. ఆయనకు వ్యతిరేకంగా రెండవ సారి "లీడర్" ఎలక్షనులో కామరాజ్ నాడారు పనిగట్టుకుని పడగొట్టారు - ప్రకాశంగారు, గాంధీజీని, సర్దార్ వల్లబాయ్ పటేల్‌ని కూడా ఎదిరించి పని చేశారు. సాహసి. మంచి పనులే చేశారు. దేశంలో ఆనాటికీ ఈనాటికీ ఎవరూ చేయని గాంధీ మార్గాన్నే పరిపాలనలో కొంతవరకు అనుసరించారు. కాని, అదంతా

ఎవరికివారి రాజకీయాలలో, వారు మనకు అనుకూలురూ విధేయులూ అవునా కాదా అనేదే, నాటికీ, నేటికీ, కాంగ్రెసులోగాని, మరి మరో ఇతర రాజకీయ పార్టీలలో వున్ననాయకులకుగాని, ఆలోచన ధోరణి ! అందుచేత, ఆయనను పదవిలో నుంచి దింపటానికి, ఇక్కడ వున్న అసమ్మతి వర్గీయుల ప్రాబల్యం ఆధారంగా తీసుకుని, వున్న వారిని పదవి నుంచి దించేసి మరొకరిని పెడతారు-

అయితే, ప్రకాశంగారు పదవీచ్యుతుడవడానికి ఆయన "ధిక్కార ధృక్పధమే" కారణం. "ధిక్కారమును సైతునా" అనే పైవారి, మనస్తత్వం! పదవి పోయినా, వున్నా ప్రకాశంగారు, ప్రకాశంగారే! ఆయనే ప్రజ, ప్రజే ఆయన, అనుకునేవారు! ఆ గర్వం, ప్రజాస్వామ్యంలో అధికార నిర్వహణకు పనికి రాదని, ఇప్పటి వరకూ జరిగిన రాజకీయాలు బోధిస్తూనేవున్నాయి.

ప్రకాశంగారు, తన ప్రధాని పదవీకాలంలో, 'కమ్యూనిటీ ప్రాజెక్టులు, గ్రామ స్వరాజ్య పధకాలు, మిల్లు నూలు తగ్గించి, ఆ మేరకు ముతక నూలును, చేనేత వారికి కేటాయించటం ఉత్పత్తి వినియోగదార్ల సంహకార సంఘాలు మొదలైన ఎన్నో గాంధీ గారి నిర్మాణ కార్యక్రమాలను విజయవంతంగా ఆచరణలో పెట్టాడు. ఆ పనులు సాగనిస్తే ఇప్పుడు ఈ ఆర్థిక విధానంలో సందిగ్ధావస్థ వుండేది కాదు. ఈ సంగతి గ్రహించిన కామరాజనాడార్, రెండు దశాబ్దాలయిన తరువాత, ఎంతో విచార పడ్డాడు! అప్పుడు, ఆ (కళవను) ముసలి వాడిని మనందించేసి వుండకపోతే, నేటికి వున్న దిక్కుతోచని పద్ధతి, మన ఆర్థిక విధానంలో వుండేది కాదు. చాలా పొరపాటు చేశామని, విచారించాడు - కామరాజ్ నిజంగా ప్రజల మనిషి, నాయకుడు, గనుకనే, ఆత్మవిమర్శ చేసుకొని జరిగి పోయిన దానికి ఇప్పుడు నలభయి మూడు సంవత్సరాలయిన తరువాత, రూరల్ ఓరియంటెడ్ అంటే పల్లె ప్రాంతపు అభివృద్ధి పథకాలకు సగం ఖర్చుపెట్టాలనే జ్ఞానం (అనుసరణ తరువాత అభినందిద్దాం) ఇప్పటికి కలిగింది! ఆ పధకాలన్నింటినీ 1946-47లో జరగనిస్తే, పల్లె ప్రజల జీవిత విధానంలో ఎంతో ప్రగతి సాధించే వాళ్లం!

అందుచేత, ప్రకాశంగారన్నా అభిమానమే నాకు. ఆయన పతనానికి ప్రయత్నాలు జరిగిన రోజులలో చందాలు వసూలు చేసి, కరపత్రాలు వేసి; ప్రచారం చేశాం. అయితే 'మిల్లు ఓనర్లు' లక్షలు వసూలు చేసి, శాసనసభ్యులను

తమ వైపు ఉండేటట్లు లొంగదీసుకోటం, కాంగ్రెసు వర్కింగు కమిటీ వారు. ఆయన "ధిక్కారమును" సైపజాలమని, ఆయన కార్యక్రమాలను, గమనించకుండా, పదవీచ్యుతుని చేయడానికి సిద్ధపడటం, ఒకే సమయంలో సమకూడి దానవీరకర్ణుని వలె, ప్రకాశం 1947 లో పదవీచ్యుతుడయ్యాడు!

ఏమండీ పంతులుగారూ! మనకు, ఒక్క ఇల్లుకూడాలేదంటే, అరే! ఈ బజారంతా 'ప్రకాశం స్ట్రీట్' అని పేరుంటే, మనకు వేరే ఇల్లెందుకురా? అన్న మహోన్నత ఆశయపరుడు.

ప్రయాణంలో పెట్రోలు లేక కారులో పెట్రోలు నింపుకుని, ఆ బంకు వాడి దగ్గరే కొన్ని వందలు చేతులోకి డబ్బు తీసుకుని, ఆ వూరిలోనే వున్న ఒక కాంగ్రెసు వాదిని గురించి విచారించి వాడు మంచంలో వున్నాడంటే ఆ డబ్బును అలాగే ఆయన కొడుకుకు ఇచ్చి, తన కారును ముందు తోలమని ఆదేశించిన త్యాగశీలి. డబ్బెందుకు, నేనడిగితే ఎక్కడ లేదు డబ్బు? అనుకునేవాడు – ఉంది ఆ ధీమా అధికారాన్ని నిలబెట్టకొనడానికి పనికిరాక, ఎవడురా నాకు వ్యతిరేకంగా చేతులెత్తేది? అనే ధైర్యంతో వెళితే, అంతా చేతులెత్తిన వారే! అధికార దాహంతో ఈయనలోని అధికార ఛాయలలో, విజయం సాధించారు, అసమ్మతి వర్గీయులు, సీజరును పొడిచిన బ్రూటస్‌ల వలె. అదీ ప్రకాశంగారు, తలవంచని అకళంక రాజకీయ నాయకుడు ,మా తరంలో! ఎవరి దగ్గిర నుండి మనం ఒక కొత్త సంగతిని నేర్చుకుంటే, వారు గురువులు కాకూడదా! ఏకలవ్యుడు ద్రోణునకు శిష్యుడు. అలాంటి ఏకలవ్యులు ప్రకాశంగారికి ,మా బోటి వారు చాలా మంది వుండేవారు, శ్రీ ఆంధ్రకేసరి టంగుటూరి ప్రకాశం గారు అంతటి మహాగురువులు అందరికీ !!

# XXXIX

# మనలో మాట

# BETWEEN OURSELVES

I started writing about "The story of My generation" in 1971 - Glad I am able to publish it in 1991, after two decades! This is just to show the contrasting situations and comforts in which we lived and are living. The effort is for my satisfaction. I will be happy if you enjoy reading it; Just drop a few lines of your reactions on the story of my generation.

## మా తరం – ఈతరం

మాతరం కథ వ్రాయడం ప్రారంభించిన తేదీ, సంవత్సరమూ చూస్తే అది 1971లో ప్రారంభించినట్లు కనిపిస్తుంది. దాదాపు ఇర్వై సంవత్సరాలూ ఆ కాగితాలు నావంక మూలుగుతూ, నా అశ్రద్ధకు కోపంతో నమలలేక, మింగలేక చూస్తూ వుండి వుంటయి. ఈ మారిన కాగితాల రంగు చూస్తే నాకే జాలివేసింది. పోషణ లేని దేహం చీకిపోయినట్లు, కాగితాలు జీర్ణావస్థలో వున్నాయి. దేనికయినా సమయం రావాలి కదా! ఈ సంవత్సరంలో దానిని తిరగ రాద్దామని బుద్ధిపుట్టి అన్ని అధ్యాయాలూ తిరగ వ్రాశాను. ఇప్పటికి సెలవు తీసుకొంటూ మనలో మాట వ్రాయగలుగుతున్నాననే సంతోషం. ఎందుకంటే, ఈ 'మా తరం కథ' అంతుపంతు లేకుండా సాగుతూవుంటుంది. మహా సముద్రల నుంచి మథించిన కొద్దీ భావతరంగాలు మనస్సులో నుంచి అనేక రంగాలలో పెల్లుబుకుతున్నాయి. /ఈ కథలో ఎక్కువగా సాంఘిక పరిస్థితులు, ఉమ్మడి

కుటుంబాల జీవిత సౌఖ్యాలు, పల్లెజీవితాలు, వాటి మంచి చెడులు, పెరిగిన పట్టణ నివాసాలు, బంధు ప్రేమలు, ఈతరం ఊహించలేనంత తక్కువగా వుండిన వినియోగదారీ సరుకుల ధరలు, వగైరా, వగైరాలు ఎన్నో వ్రాశాను. కలం ఎలా నడిపితే అలా నడిచా! అందులోని తప్పొప్పులను, చాదస్తాలను పాఠకులు సహనంతో మన్నింతురుగాక!

ఈ తరం వారిలో ఈ "మా తరం కథ" ఎందుకు? ఈ ముసలాళ్లకు ఇదో చాదస్తమని అనుకునే వారూ, వున్నారు. అయితే, ఆ తరం వారి అనుభవాలను ఈ తరం వారికి బేటన్ (Baton) అందించటం మానవ జీవితం అనే రిలే రేసులో పాల్గొన్న మనవిధి అని, ఈ తారతమ్యాలు చూచయినా. ఈతరంవారు, మేమెంత అదృష్టవంతులం అనే సంతోషానికి తృప్తికి, దోహదం చేయటమే ఈ రచనకు వారివ్వగలిగిన ప్రోత్సాహం.

మా చిన్నతనంలో వారానికి రెండుసార్లు పోస్టుమాను, మేమున్న వూరికి వచ్చేవాడు. అట్టిది ఇప్పుడు రోజుకు రెండు 'పోష్టు'లకు ఎదురు చూసే కాలంగా మారింది – రైలు ఎక్కి ఒంటరిగా ప్రయాణంచేస్తే అదొక పెద్ద సాహసమయిన సంఘటన. ఇప్పుడు ముసలి వాళ్లను కూడా విమానంలో ఈవేళ కూర్చోపెడితే రేపు వుదయానికే అమెరికా ఒంటరిగా ప్రయాణంచేసేస్తున్నారు. సముద్రాలు దాటితే ఆ రోజులలో సంఘంలో 'వెలి' వేసేవారు. అంటే బంతి భోజనానికి తోటి కులస్తులే బహిష్కరించే వారు. మరి ఇప్పుడు, కుటుంబాలు కుటుంబాలే ఇతర దేశాలకు వలస పోతున్నారు. అన్ని కుటుంబాలలోనూ పరదేశంలో వున్న కుటుంబ సభ్యులున్నారు! మరి ఇహ ఎవరు ఎవరిని వెలివేస్తారు. వెయ్యగలరు? ఇవీ మారిన సాంఘిక పరిస్థితులు –

ఇలా ఎన్ని, ఎంతని వ్రాసేది. ఈ మధ్య సినీ, టి.వి. నిర్మాత బి.ఆర్. చోప్రా 'మహాభారత్'ను 93 భాగాలుగా రెండు సంవత్సరాలు ఊపిరాడకుండా జనాకర్షణీయకంగా చూపించాడు. అయితే, ఇంకా 'మహాభారత' కథ పూర్తి కాలేదు. ధర్మరాజు యమలోకానికి వెళ్లే వరకు చూపించాలని ఒకరూ, పరీక్షిత్ మహారాజు ఒంటిస్తంభంమీద సర్పదష్టుడయిన వరకు, చూపించాలనే వారు ఉన్నారు. ఏదో సుఖాంతంగా ధర్మరాజు పట్టాభిషేకంతో చోప్రాగారు, 'మహాభారత్' ఆదివారం 9-7-1990 తేదీన ముగించారు! అలాగే నేను 'మా తరం కథను' గురుపూజతోను, గురుస్మరణతోనూ సోమవారం 10-7-1991 తేదీన ముగించే భాగ్యం కలిగినందుకు సంతోషించా!

మీరంతా చదివి ఆనందిస్తే, ఆశీర్వదిస్తే సంతోషిస్తా! మీ అభిమానం కొత్త ఆలోచనలను రేకెత్తిస్తే మరో గ్రంథం మీరు కోరిన రంగంలో వ్రాస్తా! సెలవు.

# మాతరం—ఈతరం—తరం తరం!

మాతరంలోని ఆర్థిక సాంఘిక, జీవిత సౌకర్య పరిస్థితులను వీలైనంతరకు కుదించి చెప్పుకున్నాం. ఈతరపు జీవిత సౌఖ్యాలను అనుభవిస్తూనే వున్నాం. నేటి తరపు మానవతాదృక్పథంలేని ధనార్జనా పూరితమైన ఆశయాలను గూర్చి, పాశ్చాత్యదేశపు ఆర్థిక సాంఘిక శాస్త్రవేత్తలు, చాలాకలత చెందుతూ, "భావితరం" అంటూ ఎన్నో గ్రంధాలు వ్రాస్తున్నారు: (Futurologists) ఈ శతాబ్దంలో "యంత్రయుగం" గాను, ధనిక వర్గయుగం" గాను, (Capitalism)ఈతరం ఎన్నో భౌతిక సుఖాలు అనుభవిస్తున్నా, తృప్తిలేని దురాశా పూరిత జీవులవుతున్నారని ఆదుర్దా పడుతున్నారు, అందులో మరీ ముఖ్యంగా, సామ్యవాద సిద్ధాంతాలతో తగిన ప్రగతిని, శాంతిని, సాధించలేక, సోవియట్ యూనియన్‌లో (USSR) వచ్చిన నేటి పరిస్థితులలో, వారుకూడా, పాశ్చాత్య రాజకీయవేత్తలు, ఆర్థిక వేత్తలు నేడు ఆచరణలో పెట్టుకున్న "మార్కెటు ఎకానమీ" (Market Economy) సిద్ధాంతాలను అనుసరించవలసి వచ్చినందున,అన్ని సిద్ధాం తాల మధ్య నలుగుతున్న మన భారతదేశం, దూరదృష్టితో ప్రస్తుత పాశ్చాత్యదేశాల అడుగుజాడలలో నడువకుండా, మననాగరికతకు అను గుణంగా, మన నాయకులు విచక్షణతో ప్రణాళికలను రూపొందించాలి.

ఈ " మార్కెట్టు విధానం", "ఎకనమిక్‌మాన్" యొక్క ఆశయాలు, సిద్ధాంతాలు, ఏమిటో తెలుసుకుంటే,ముందు తసుకోవలసిన జాగ్రత్తలు వేరే చెప్పనక్కర లేదు. "యంత్రయుగం" పోయి, "కంప్యూటర్ యుగం" లో, ఉత్పత్తి అంతులేకుండా చేయాలి. ఎంత వుత్పత్తి చేసినా, వినియోగదారు, తృప్తి పడకుండా తాను తన భౌతిక సౌఖ్యానికి వుపయోగిస్తూ తనకున్న ఒకకోటి రూపాయలలో, మొదటి రూపాయిని ఎంత అవుసరంతో అనుభవిస్తాడో, ఆఖరిరూపాయిని కూడా అంత ఆతురత కూడిన అవుసరంతోనే అనుభవించాలట! తృప్తి అంటూ వుండకూడదట ! అదీ నేటి "బజారు విధానంలోని ప్రబోధం"!

ఇహ "ఆర్థిక మానవుడు (Economic Man) డబ్బునే పూజించాలిట. 'డబ్బంటే, అది మనంపూజిస్తే ("Mammon") 'ధనపిశాచి" అవుతుందని మన వేదాంతులు చెప్పినా, దానినే పూజించే తత్వంగలవారమవాలిట. మన వేదాంతులు కూడపెట్టే ధనాన్ని, "కరడుకట్టిన సౌఖ్యం" (Coagulated Happiness) అన్నారు. అనుభవంలో మనకు ఆనందాన్ని, తృప్తిని, ఇవ్వలేని ఈ 'ధనపిశాచిని' గురించి పైవిధంగా శాంతాయానాచార్యుడు (Santayana Acharya) చెప్పాడు- ఈ 'పిశాచిని' పూజించే ఆశయం కలవాడే "ఆర్థిక మానవుడు" గా వర్ణించబడ్డాడు. "మార్కెటు ఆర్థిక విధానం, అధిక వృత్తితో మానవుని భౌతిక సౌఖ్యానికి ఎంతో తోడుపడ్డా, అది ఒక మానవుని, అంతులేని ఆశాపరునిగా, అదే నిజమయిన నైతిక సిద్ధాంతంగా ఒప్పుకునే తత్వంలో మునిగి వుండే వ్యక్తినిగా తయారు చేయకూడదు!

నేడు అభివృద్ధిచెందిన పాశ్చాత్య ఆర్థిక వేదాంతంతో కూడిన ఆర్థిక సహాయాన్ని అందుకుని, మన అవసరాలను తీర్చుకుని, కొత్త ప్రణాళిక లను రూపొందించుకునేముందు, వివేకంతో మన నాయకులు, మన ప్రణాళికలను, మన నాగరిక వేదాంతంతో కొత్త పంథాను తొక్కితే ప్రపంచానికే మార్గ దర్శకులవుతారు- గాంధిజీ మనకు తన జీవిత మంతా, మానవజాతి సుఖపడాలంటే, తృప్తి, నిష్కామకర్మ, అనే రెండే రెండు సుస్థిరమయిన మార్గాలని, చేసిన బోధనలను, తిరిగి ఆచరణలోకి తీసుకుని వచ్చిన ధన్యజీవులమవుతాం - తరతరం దీనిలోని అంతరాలను, అవాంతరాలను మెరుగు పరచి, భావితరాలవారికి, సుస్థిరసౌఖ్యాలను పొందే మానసికతత్వాన్ని పెంచుటకే ఈ "మాతరంకధ" లక్ష్యం.

# EPILOGUE

I read recently the Telugu edition of the auto-biography of Sri Vennelakanti Subba Rao (1784-1839) an important translation from English by Dr Akkiraju Rama Pathi Rao Mr Subba Rao was a resident of Nellore Town This is a situation of "Company days", one hundred and fifty years ago That book reveals the social conditions, absolute lack of communications, sparseness of population, proverty and a social contentment with the political situation of the rule of "East India Company", with many of its Military establishments spread all over the countrry It is only after 1857 War of Independence or "Sepoy Mutiny", that we have become a part of British Empire through the declaration of Queen Victoria, after that event

The lack of communication is appalling and apparant People had to go by walk to Benaras, travelling nearly 2,000 k m Out of his own experience, Mr Subba Rao states in his "A life journey of V Subbarao" in English (1784-1839), that it took five days to go from Nellore to Madras, and one month to go from Madras to Rameswaram One has to go to Benaras, our Holy city only by walk He did it ! To complete his "Religious Yatra", he went by various conveyanes for taking the `Ganga Water' (Holy Water) to worship the Gods in Rameswaram These are all unbelievable, to-day when we fly to U S A (18,000 k m ) away from India in a day !

I began to write this `Story of my generation' in 1971 Though finished within a few months, it could not be published Now I am glad that I am able to publish the same and offer it to my readers

I wish, the present generation to appreciate the conditions before independence and the struggle which our generation had passed through, to give better opportunities and higher living standards to the posterity, inheriting the culture and ideals of the Freedom Fighters

JAI HIND

**Prof Dr P. Tirumala Rao**